# కార్యవర్గం

అధ్యక్షుడు :

శ్రీ మోటూరి సత్యనారాయణగారు

ఉపాధ్యక్షుడు :

శ్రీ తాపీ ధర్మారావుగారు

కోశాధికారి :

శ్రీ పర్వతనేని బ్రహ్మయ్యగారు

కార్యదర్శి :

శ్రీ పందిరి మల్లికార్జునరావుగారు

సభ్యులు :

శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు
శ్రీ దరిశి చెంచయ్యగారు
విద్వాన్ విశ్వంగారు
శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు
డాక్టర్ వి. యన్. శర్మగారు
శ్రీమతి దరిశి సుభద్రమ్మగారు

సంపాదక వర్గం:

విద్వాన్ విశ్వం (ప్రధాన సంపాదకుడు)

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

శ్రీ తాపీ ధర్మారావు

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

# రానున్న సంక్షోభం

## ఫ్రిట్జు స్టెరంబర్గు

అనువాదం:

విద్వాన్ విశ్వం

ఇంటింటి విజ్ఞానమాల

16, జోన్సువీధి, మదరాసు

V.H.

# విజ్ఞప్తి

భారతదేశం స్వతంత్రమైనది. పరప్రభుత్వం అంతరించినది. ఇందుతో మన పౌరులపై గొప్ప బాధ్యత పడినది. ఇతర స్వతంత్రదేశ ప్రజల పురోగతిని మన మందుకొనవలసి వున్నది. ఇంతకాలం నిలిచిన మడుగులావున్న మన విజ్ఞానాన్ని కొత్త నీటితో నింపుకొనవలసి పున్నది.

ప్రపంచం శరవేగంతో ముందుకు పరువులిడుతున్నది. సంస్కృతి బహుముఖాలా వికసిస్తున్నది. ప్రపంచ ప్రముఖదేశాలతో సమానసాయినందుకొనుటకు మనమెంతో కృషిచేయవలసివున్నది. ఇంతవరకు లోకంలో విజ్ఞాన సంస్కృతి రంగాలలో వచ్చిన అభివృద్ధిని మనదిగా చేసుకొనవలసిఉన్నది. దానిని గ్రామీణప్రజలకు అందుబాటులోనికి తేవలసిఉన్నది.

ప్రతి పౌరునికి ప్రజాతంత్ర పరిపాలనలో భాగమున్నది. అతను నిర్వర్తింపవలసిన విధులున్నవి. గుర్తించవలసిన బాధ్యత

లున్నవి. చదువుకున్న ఏ కొలుగురి పెత్తనమో కాదు. ప్రజా సామాన్య పరిపాలనకు మనం సమాయత్తులం కావాలి.

దురదృష్టవశాత్తు, మన దాస్యస్థితిమూలంగా చాల కాలం వరకు మన పరిశ్రమలలోవలెనే సాహిత్యంలోను, విజ్ఞానంలోను కూడ స్తబ్ధత ఏర్పడినది. రెండు మూడు శతాబ్దులుగా ప్రపంచంలో వచ్చిన విజ్ఞానమంతా మన ప్రజలకు చొర వీలులేని కంచుకోటలా నిలిచిపోయినది. పారిశ్రామిక విప్లవం తర్వాత యూరోపులో వచ్చిన భావవిప్లవం మనదేశంలోని జనసామాన్యానికి తెలిసే భాషలో రాలేదు. నూతనభావాలు నాగరికప్రపంచంలో వ్యాపిస్తున్నవి, నూతనసత్యాలు కనుగొనబడుతున్నవి, కొత్త శాస్త్రశాఖలే బయలుదేరుతున్నవి.

ఇతర స్వతంత్రదేశా లీ రెండు మూడు శతాబ్దులుగా సాధించిన విజానాన్ని, సంస్కృతిని మనం కొన్నియేళ్ళలో సాధించి వారిని కలుసుకొనాలి. ప్రపంచ పురోగతి నందుకొనలేకపోతే మనం చాల వెనుకబడి పోగలము.

మన తెలుగుభాష కవిత్వంలో చాల పెంపొందినది. కాని, మిగత శాఖలలో చాల వెనుకబడివున్నది. ప్రజల విజ్ఞానాన్ని, దేశభాషద్వారా తప్ప మరొకవిధంగా పెంపొందించలేము. కాబట్టి మన భాషను ముందుగా, సమగ్రంగా స్వయంసంపూర్ణంగా చేసుకొనవల

సిన బాధ్యత మనపైనున్నది. ఇదిమనం నిర్వర్తించవలసిన తక్షణ కర్తవ్యమని గుర్తించక తప్పదు.

ప్రపంచ విజ్ఞానాన్ని, సంస్కృతిని తమదిగా చేసుకొనుటకు వివిధ దేశీయులు చేస్తున్నపని ఒక్కటే: ఏ దేశంలో ఏ భాషలో ఏ గొప్పరచన వెలువడినప్పటికీ, దానిని తమభాషలో వెంటనే అనువదించుకుంటారు. ఇంగ్లీషులో ప్రపంచ వాఙ్మయంలో ప్రధానమైన రచనలన్నిటిని మనం నేడు చూడవచ్చును. నేటికీ లోకంలో ఏమూల కాస్త సత్వమున్న పుస్తకం వెలువడినా ఇంగ్లీషువారు దానిని తమదిగా చేసుకుంటారు. అలాగే ఇతర దేశాలవారున్నూ.

అలాగే మనమింతదాకా వచ్చిన విజ్ఞానాన్నంతటిని తెలుగు చేసుకొనాలి. వానిని మన ప్రజలలో చదువువచ్చిన ప్రతివారికీ బోధపడే తేటతెలుగులో వ్రాయాలి.

దేశంలోని ప్రతివారినీ కళాశాలలకు వెళ్ళమని చెప్పలేము. మనవంటి దరిద్రదేశంలో అది తలకుమించిన పని. అదికాక కళాశాలల చదువే ప్రపంచ విజ్ఞానాన్ని అందిస్తుందని చెప్పలేము. ప్రాతకాలంనుంచి నేటిదాకా, ప్రముఖులలో చాలమంది విశ్వవిద్యాలయాల మొగమెఱుగనివారే. తగిన పుస్తకాలను ప్రజల కందించి, వారు తమకు తాము చదువుకొని విజ్ఞానవంతులయేలా చూడాలి. ప్రతి

ఇల్లూ విశ్వవిద్యాలయం కావాలి. ప్రతిమనిషీ తనకుతాను బోధకుడు కావాలి. మన భాష స్వయంసంపూర్ణం కావాలి.

ప్రపంచంలో వెలువడిన ప్రధాన రచనలను—ముఖ్యంగా నూతన యుగాలకు, శకాలకు కారణమైన ప్రముఖ రచనలను—తెలుగుచేసి, ఆయా ప్రముఖుల వివరణలను ప్రజలే స్వయంగా చదువుకొనే అవకాశం కల్పించాలి.

ఒకవిధమైన భావాలకుకాని, పద్ధతులకుకాని మాత్రమే ఇందులో తావుండదు. వివిధ దృక్పథాలకుచెందిన ఉద్గ్రంథాలన్నిటిని ప్లేటోనుంచి మావ్ సే-టుంగ్ వరకు-రాజ్యాంగనీతిలో-తెలుగువారికి అందించాలి. అలాగే స్మిత్తునుంచి మార్క్స్‌వరకు అర్థనీతిలో వచ్చిన నూతన దృక్పథాలను వివరించాలి. తత్త్వశాస్త్రంలో, మనస్తత్వవిచారణలో, సాంఘికదర్శనాలలో ప్రతిశకకర్త దృక్పథాన్ని తెలియజెయ్యాలి. ఇక విజ్ఞానశాఖలలో అనంతమైన మార్పులు, చేర్పులు, తీర్పులు వస్తున్నవి. కొత్త కొత్తశాఖలే ఏర్పడుతున్నవి. వీని నన్నిటిని తెలుగులోనికి తెప్పించాలి.

సాశ్వతంలో ప్రపంచవాఙ్మయంలో స్థానం సంపాదించుకున్న ప్రసిద్ధరచనలను ఆంధ్రీకరించాలి. హ్యూగో, జోలా, రోమా రోలా మొదలు ప్రతిదేశంలోను, ప్రతి సాహిత్యశాఖలోను

వెలువడిన రచనలను ప్రచురించాలి. ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క ఘట్టాన్ని సూచించేవానినైనా ఖచ్చితంగా తెలుగువారి కివ్వాలి.

ఆయాశాఖలలో ఆరితేరిన సమకాలీన శాస్త్రవేత్తల ప్రముఖ రచనలను కొనిరావాలి.

ఈ ఉద్దేశంతోనే ఇంటింటి విజ్ఞానమాల అనేసంస్థను స్థాపించాము. తెలుగును స్వయం సంపూర్ణ భాషగా చెయ్యాలన్నదే మా ఏకైకలక్ష్యం; ఆంధ్రసంస్కృతిని పెంపొందించాలన్నదే మా పరమాశయం.

2

ఇది మా మొదటిపుస్తకం. ప్రపంచాన్ని నేడు కలవరపెడుతున్న ఆర్థిక సంక్షోభాన్నిగూర్చి అతి సమర్థంగా, సమగ్రంగా, సూక్ష్మంగా పరిశీలించి వ్రాసిన పుస్తక మిది. దీనిని వ్రాసింది ప్రఖ్యాత అర్థశాస్త్రవేత్త ఫ్రిట్జు స్టెరన్‌బర్గు. దీని అనువాద, ప్రచురణలకు మేము వ్రాయగానే అంగీకరించి, ఏ ప్రతిఫలం కోరకనే మా కృషికి దోహదంచేసిన రచయితకు కృతజ్ఞులము.

ఆంధ్రంలో రాజనీతి, అర్థనీతి మొదలు సారస్వత వివిధ శాఖలలో ప్రసిద్ధ రచయిత అయిన విద్వాన్ విశ్వంగారుదీన్ని అనువదించారు. ఎంతో క్లిష్టమైన మూలగ్రంథాన్ని సులభగ్రాహ్యంగా

చేసేందుకై వారెంతో శ్రమించి, అత్యుత్తమమైన అనువాదాన్ని మాకు చేకూర్చిపెట్టారు. ఇందుతోపాటు పాఠకులు స్వయంగా చదువుకోడానికి వీలుగా వివరంగా వున్న భూమికను, చివర కొన్ని పదాలకు వివరణను తయారుచేశారు. వాని నిందులో చేర్చాము. ఇవి పాఠకులకు చాల సాయపడగలవని విశ్వసిస్తున్నాము. వారికి మా అభివందనాలు. ఇలాంటి సమర్థులు మా ప్రధాన సంపాదకులగుట గ్రంథమాల అదృష్టం.

ప్రచురణకు అవసరమైన పుస్తకాల నిర్ణయంలోను, వాటి ప్రచురణలోను తమ అమూల్యమైన సలహాలనిస్తూ, మాకు తోడ్పడుతున్న సంపాదకవర్గసభ్యులకు కృతజ్ఞత వెల్లడిస్తున్నాను.

ఈ మహోద్యమానికి తమశక్తి సామర్థ్యాలను వినియోగిస్తూ సర్వవిధాలా తోడ్పడుతున్న కార్యవర్గసభ్యులను అభినందించుట నా ప్రథమ కర్తవ్యమని భావిస్తున్నాను.

ప్రారంభంలోనే అవసరమైన ధనసహాయంకోసం అభ్యర్థించగనే ఉదారంగా విరాళాలిచ్చిన పోషకులకు, శాశ్వత సభ్యులకు, సభ్యులకు నమోవాకములు. వారి ఆదరాభిమానాలు మఱువరానివి.

ఈ పుస్తకంమీది ముఖచిత్ర చిత్రాన్ని తయారుచేసిన చిత్రకారులు శ్రీ మాధవపెద్ది గోఖలేగారు మాకెంతో సాయపడినారు. వారికి మా ధన్యవాదాలు.

వివిధ సమస్యలపైన ఇలాంటి పరిశీలన గ్రంథాలను త్వరలో మేము ప్రచురించ నున్నాము. కొన్నిటి జాబితా గ్రంథం చివర మీరు చూడవచ్చును.

ఈ మహా ప్రయత్నంలో ఆంధ్రప్రజలందరి సహకార సద్భావాలుండగలవని విశ్వసిస్తున్నాను.

ఈ ఉత్తమగ్రంథాన్ని ఇంత శ్రమతో తయారుచేసి మీ చేతులలో వుంచుతున్నాము. మా గ్రంథమాలకు మీ సహకార సంపత్తి లభింపగలదని ఆశిస్తున్నాము.

మదరాసు
5-11-51

పందిరి మల్లికార్జునరావు.
కార్యదర్శి

విషయసూచిక



మొదటి భాగం

# సంక్షోభమూ - రెండు ప్రపంచ యుద్ధాలూ

1 వ అధ్యాయం



2 వ అధ్యాయం

## రెండో భాగం

# రానున్న సంక్షోభ ధిక్కారం

5 వ అధ్యాయం

6 వ అధ్యాయం

7 వ అధ్యాయం



8 వ అధ్యాయం

---

# సంపాదక భూమిక

ఏ నిమిషం ప్రపంచం యుద్ధంలో మునిగిపోతుందో అన్న భయంతో ప్రజల గుండెలు గుబగుబ మంటున్నవి. ఏరోజు పత్రిక విప్పినా ప్రత్యక్షంగానో పరోక్షంగానో యుద్ధంగూర్చిన వార్తలే ప్రముఖంగా కనిపిస్తాయి. అవి మారణాస్త్రాలనుగూర్చి కావచ్చు; రక్షణవ్యయమంటూ కోట్లకొలది డబ్బును వెచ్చించడం గూర్చి కావచ్చు; నాగరికత రక్షణోపాయంగూర్చి కావచ్చు; ఆసియా పునరుద్ధరణకై దీక్ష బూనడం గూర్చి కావచ్చు. వీటన్నిటి వెనకాలా యుద్ధపిశాచి భయంకర రూపం చూచాయగానో, నీలి నీడగానో తొంగిచూస్తూనే ఉంటున్నది.

ప్రజాసామాన్య మీవార్తలు విని భయభ్రాంతమవుతున్నది. ఎప్పటికీ మారణహోమం ముగుస్తుంది ? ఎన్నడు మానవ శాంతి సౌభాగ్యాలే పరమావధిగా ప్రపంచగతి పరిక్రమిస్తుంది? ఎన్నటికీ అరకడుపు నిండుతుంది? ఎప్పటికి జనం ఆదమరచి నిద్రపోగలరు?—ఈ ప్రశ్నలు కాస్త పరిజ్ఞానమున్న ప్రతివానినీ కలవరపరుస్తున్నవి.

వీరి ప్రశ్నలకు సమాధానాలను సమకూర్చుకోవడంలో సాయపడుతుందీ పుస్తకం. దీనిని ఫ్రిట్జ్ స్టెరంబర్గ అనే ఆర్థిక శాస్త్రవేత్త వ్రాశాడు. అతి వివరంగా శాస్త్రీయంగా వాస్తవాంశాల, లెక్కల సాయంతో ఆయన నేటి ఆర్థికస్థితిని పరిశీలించాడు.

ఈ గ్రంథం 1946 లో వ్రాయబడినందువల్లను, అమెరికాలోని అభ్యుదయశక్తుల కర్తవ్యాన్ని ఉద్బోధించేదృష్టి ప్రధానంగాఉంచుకొన్నందువల్లను మన పాఠకులు తెలుసుకొనవలసిన మరికొన్ని వివరాలను, మన

మిప్పుడీ భూమికలో సమాలోచించు కొంటున్నాము. ఈ దృష్టితోనే ఈ గ్రంధకర్తే వ్రాసిన "సంక్షోభంలో జీవితం" అనే తర్వాతి పుస్తకంలోని ఒక అధ్యాయాన్ని అనుబంధంగాకూడ ఇచ్చాము. కొన్నిపదాలకు వివరణ కూడ ఆఖరున చేర్చాము.

# నేటి దుస్థితి

నేడుసామాన్య ప్రజలను కలవరపెడుతున్న సమస్యలేమిటి? వారి నెదుర్కొంటున్న ప్రశ్నలు చాలఉన్నవి.

యుద్ధాలను అంతమొందించేందుకే కొనసాగినదన్న మొదటి ప్రపంచ యుద్ధమింకా గతచరిత్రలో కలిసిపోలేదు. స్వతంత్ర సౌభాగ్యాల కోసం నడిచిన రెండవ యుద్ధమింకా నిన్నటి మాటగనే ఉన్నది. మరి అంతలోనే మరో యుద్ధపు కారుమబ్బులు ప్రపంచాన్నలముకొంటున్నవి. ఏమిటీ దారుణం? ఇందులోని కిటుకేమిటి?—అని ప్రతివారూ ప్రశ్నించు కుంటున్నారు.

ఎవరో రాజ్యాంగవేత్తలు ప్రకటించగా ఏ వీరశిఖామణులో కత్తి దూయగా, ఏ కురుక్షేత్రమో రణరంగంకాగా, ప్రజలంతట ప్రజలు, తమ నిత్యకృత్యాలతో నిమగ్నులయిపోవీలైన పూర్వపురోజులు కావివి.

కాబట్టే రాజ్యాంగవేత్తలూ, సేనానాయకులూకాక అబాల గోపాలం నేడు ఆలోచనలో పడుతున్నారు.

## యుద్ధభయం

యుద్ధమంటే వారికేమిటో తెలుసు. అదెలాంటి పరిణామాలకు దారితీస్తుందో వారు రుచిచూచారు. రోజురోజుకూ తమస్థితెలా దిగనాడుతూ

వస్తున్నదో వారు గమస్తున్నారు. రేపింకో దారుణ యుద్ధమేవస్తే, లోక మెంత భీభత్సమయిపోతుందో వారూహించుకోగలరు?

యుద్ధంతో అన్ని బాధలూ తొలగిపోతాయన్న మాటలలో వారికి నమ్మకం లేదు. కాబట్టే వారు మరింత దీర్ఘంగా, లోతుకుదిగి ఆలోచిం చేందుకు వెనుదీయరు,

ఎన్నడో ఎక్కడో రావచ్చుననే స్థితిగూడ దాటిపోయినదని వారు గ్రహించారు. కొరియాలో యుద్ధం భయంకరరూపం తాల్చినది. దారుణ మైన విధ్వంసన మక్కడ కొనసాగినది. సంధి సంప్రతింపులతోపాటది కొనసాగుతునే ఉన్నదికూడ.

వియత్నాంలో యుద్ధం సాగుతున్నది.

మలయాలో మరోరూపంతో నడుస్తున్నది.

బర్మాలో ఇంకోరూపంలో కనిపిస్తున్నది.

ఇరానులో ఎపుడేమి మూడుతుందో చెప్పలేనిస్థితిలో నున్నది పరి స్థితి, ఈజిప్టులో ఊగిసలాడుతున్నది స్థితి.

యూరోపులో రక్షణ సంధులపేర యుద్ధమండలులప్పుడే ఏర్పడు తున్నవి. ఆయుధోత్పత్తి పందెపు పరుగులలో ప్రధమ తాంబూలం తమ దంటే తమదని పాలకవర్గాలు రొమ్ము విరుచుకుంటున్నవి.

గ్రామాన్ని ధ్వంసం చేయగలవీ, పట్టణాలను ధ్వంసం చేయగలవీ పోయి. ప్రాంతాలనే దేశాలనే ధ్వంసం చేయగలవంటూ క్రొత్త మారణా స్త్రాలు బయలుదేరుతున్నవి.

ప్రపంచంలో, ఏదేశంలో, ఏమూలలో ఎవరు దేహీఅన్నా అభయ హస్త మిస్తానంటూ అమెరికా కోటానుకోట్ల డాలర్లను యుద్ధపరికరాల ఉత్పత్తికి వినియోగిస్తున్నది.

ఇదంతా నాగరికత, సభ్యత, స్వేచ్ఛ, స్వతంత్రం, సమానత, శాంతి ఇలాంటి వానిరక్షణకే నని ఉపన్యాసాలపై ఉపన్యాసాలు, ప్రకనటలపై ప్రకటనలు మనకు వినబడుతున్నవి.

ఆత్మరక్షణకై ఆయుధోత్పత్తిలో సోవియట్ పాల్గొనవలసి వస్తున్నది.

కాబట్టే ఏమిటిది అని మానవమాత్రుడు పరకాయించి చూస్తున్నాడు. అతను పెద్ద తలకాయలవలె ఆకసంవేపు చూచి ఊహించడు. అతని చూపెప్పుడూ క్రిందికే చూస్తుంది. తన చుట్టుప్రక్కలకే ప్రాకుతుంది.

తనకు కనిపిస్తున్న దేమిటి?

దాస్యపీడన

1914 లో దాదాపు 100 కోట్ల ప్రజలు—ప్రపంచ జనసంఖ్యలో సగానికి సగం—అస్వతంత్రులుగా ఉన్నారు. మరి రెండు ప్రపంచ యుద్ధాలతర్వాత, 1951కి కూడా, 25 కోట్లదాకా దాస్యం అనుభవిస్తున్నారు. "ఉత్తమ జాతుల" మనుకునేవారిక్రింద నలిగిపోతున్నారు.

దక్షిణాఫ్రికాలో మాలపల్లి బిల్లును సమర్థిస్తూ కార్మికమంత్రి షూమన్ అన్నమాట లివి:

> "యూరపియన్లు కానివారికి యూరపియన్లతో సమానమైన హక్కులెన్నటికీ ఉండవు; సాంఘిక సమానత ఎన్నటికీ ఏర్పడదు; దక్షిణాఫ్రికాలో యూరపియన్లు సర్వదా యజమానులుగా ఉంటారు."

రెవరెండు మైకేల్ స్కాట్ మిత్రమండలికి సమర్పించిన నివేదికలో ఉన్న మాటలివి:

"దక్షిణాఫ్రికా యూనియన్లో, భూములపై అధికారమంతా తెల్ల పార్లమెంటుదే. దేశీయులు జనాభాలో మూడువంతులున్నప్పటికీ, వారిక్రింద ఉన్న భూమి కేవలం నూటికి 13 వంతులు మాత్రమే."

(జొహానస్‌బర్గు స్టార్, 2 మార్చి, 1949)

దక్షిణాఫ్రికా పార్లమెంటు సభ్యుడు డొనాల్డు మాల్టెరోన్ వ్రాసిన మాట లివి :

"దరిద్రంతో బాధలతో నిండిన జీవితం గడుపుతున్న దేశీయులెంత దుస్థితికి వచ్చారంటే, చట్టబద్ధంగా తా మడుగుపెట్టేందుకు తమ దేశంలో కనీసం ఒక చదరపుటంగుళం భూమికూడా లేదు".
(స్కాట్, మిత్రరాజ్యసమితి కిచ్చిన నివేదికలో ఉదాహృతం)

ఆగ్నేయాఫ్రికా స్థితేమిటి? అక్కడి భూమిలో 1949 ఆఖరునాటికి ధర్మకర్త యూనియన్ ప్రభుత్వం నూటికి 58 వంతులు తెల్లవారి కిచ్చివేసినది. వీరి జనాభా నూటికి 10 వంతులు మాత్రమే.

యఫ్. ఇ. టి. క్రాస్-దక్షిణాఫ్రికా హైకోర్టు జడ్జి ఇలా అన్నాడు:

"తన జన్మభూమిలోనే ఆఫ్రికన్ ఎల్లప్పుడూ బందీగా ఉన్నాడు—జైలు గోడలమధ్య లేకపోవచ్చు-అంతే. తన రిజర్వు వదిలినప్పటినుండీ అతి నిర్బంధయుతమైన పాసు పద్ధతికి తను లోబడాలి, తాను చదువుకోలేకపోయినా ఎల్లప్పుడూ తనతోపాటు 12 పత్రాలు తీసుకెళ్ళాలి. అందులో ఒకటి లేకపోయినా అరెస్టు, జరిమానా, శిక్ష తప్పవు. లేదా పొలం వలసలో నిర్బంధంగా పని చేయాలి...." (అందులోనిదే)

శ్వేతజాతుల యజమానులు స్వయంగా ఇలాంటివారికోసం జైళ్లు కట్టుకొని వారితో నిర్బంధంగా పనిచేసుకునేందుకు కూడ, 1950 లో న్యాయశాఖా మంత్రి అధికార మిచ్చాడు.

ఇందుకున్న ఆర్థిక కారణాలనుగూర్చి బ్రైల్స్ఫర్డు వివరించాడు:

"ఎగుమతులకోసం వ్యాపారపు పంటలను పెంచడం కోసమే వలసల ఆర్థిక వ్యవస్థ ఏర్పడినది. ఎక్కడో ఉన్న పాలక జాతుల కోసం వలసదేశాల ప్రకృతి సంపద నంతటిని ఉపయోగించడం జరుగుతున్నది."

(ఫేబియన్ వలసలపై వ్యాసాలు, 1945)

అంతేకాదు సైనిక కారణాలూ ఉన్నవి. ధర్మ కర్తృత్వంగూర్చి మిత్రరాజ్య సమితి చర్చలసారాంశంలో—అధికార రీత్యా ప్రకటించినది—ఉన్న సంగతి:

"సోవియట్ యూనియన్ భారతదేశ ప్రతినిధులు చేసిన రెండు సమానమైన ప్రతిపాదనలను నాల్గవ కమిటీ త్రోసివేసింది. తమ ధర్మ కర్తృత్వం క్రింద ఉన్న దేశాలలో పాలకులు యుద్ధ స్థావరాలను నిర్మించరాదనీ, కోటలు కట్టకూడదనీ, సైన్యాల నుంచుకోరాదనీ—అటాంటివి భద్రతాసమితి విధుల ప్రాతిపదికపైనే జరగాలనీ ఆ ప్రతిపాదనలు తెలుపుతున్నవి....సోవియట్ ప్రతిపాదన 18-14 వోట్లతో ఓడిపోయింది, 6 రు తటస్థులు. భారత ప్రతిపాదన 18-16 తో ఓడిపోయింది. 4 రు తటస్థులుగా ఉన్నారు."

(మిత్రరాజ్య సమితి ఇయర్ బుక్కు 1946-47)

అంటే అక్కడ తమ యుద్ధ స్థావరాల నేర్పరచుకొనేందుకు పాలకులకు అధికారం చిక్కిందన్నమాట.

వలసలలోని దాస్యప్రజల నిప్పుడు మరో కొత్తపేరుతో పిలుస్తున్నారు."స్వయంపాలనలేనీ ప్రజలు (నాన్ సెల్ఫు గవర్నింగు)" అధికార రీత్యా స్వపరిపాలన లేనివారని నిర్ణయించినవారిలో రెండు వర్గాలున్నవి, ధర్మకర్తృత్వ పద్ధతిక్రింద ఉన్నవారు 150 లక్షలు. అలా లేనివారు 20 కోట్లు. వీరంతా బానిసలే.

వీరుకాక మరీ దారుణస్థితిలో ఉన్న మరోవర్గం దక్షిణాఫ్రికాలాగా పరజాతి పీడనలో అణగిపోతున్న దేశీయప్రజ. ఇలాంటివారి కే రక్షణా లేదు. మిత్రరాజ్యమండలి, భద్రతా సమితి చర్చించడం తప్ప వీరినిగూర్చి చేసిన దేమీలేదు.

ఆర్థిక సామ్రాజ్య పీడన

మరో నాలుగో వర్గంకూడా ఉన్నది. వీరు నామకః స్వతంత్ర దేశాలలో ఉన్నప్పటికి, వలస పీడనా విధానానికి గురి అవుతున్నవారు. వీరినిగూర్చి జాన్ మక్లారిన్ ఇలా వ్రాశాడు:

"ఈవిధమైన వలస విధానంలో పతాకాలు, మాపులో రంగులు వగైరా సామ్రాజ్య చిహ్నాలుండవు. శ్వేతజాతి ఆధిక్యంపై ఇది నడవదు. రాజకీయ స్వతంత్రంగూర్చి శుష్కోపచార వాక్యాలు పలకడంకూడ జరుగుతుంటుంది. కాని వాస్తవస్థితితో రాజకీయాధికారమూ,ఆర్థికాధికారమూ పరరాజ్యాల చేతిలోనే ఉంటుంది. ఇలాంటిచోట సైనిక స్థావరాలనుకూడ పాలకు లేర్పరచుకుంటారు. ఇలాంటి అమెరికా స్థావరాలు వందలకొలది నేడు కనిపిస్తున్నవి. అయినా ఇది ఆర్థిక రూపమైన వలస విధానం."

"ఇలాంటి స్థితికి ఉదాహరణలు ఫిలిప్పైన్సు, క్యూబా, మధ్యప్రాచ్యంలోని కొన్ని దేశాలు."

(మిత్రరాజ్య సమితి-అధికార రాజకీయాలు, పుట 330-1)

ఇండొనేషియాలో నేటి ప్రభుత్వం పోటుపడుతున్నది, ఇలాంటి స్థితిని తొలగించుకొవేందుకే. ఇప్పటికీ డచ్చివారు న్యూగినీ వగైరాల నెలా దొరకబుచ్చుకున్నారో మనం చూస్తూనే ఉన్నాము.

ఇండోచైనా (వియత్నాం) లో నామకః స్వతంత్ర ప్రభుత్వ మంటూ ఏర్పరచి ఫ్రెంచి సామ్రాజ్య వాదులాడుతున్న నాటకం బండారం, హోచిమన్ నాయకత్వంతో జరుగుతున్న స్వతంత్ర సంగ్రామం బయట పెడుతునే ఉన్నది.

ఇక మలయాలాంటి వలసదేశంలో పరప్రభుత్వం స్వతంత్రకాముక ప్రజల నెలా వేటాడుతున్నదీ మనం రోజూ వింటున్నదే. గ్రామాలకు గ్రామాలు నిర్మూలింప బడుతున్నవి. భస్మీపటలం చేయబడుతున్నవి.

వీటన్నిటి మూలంగా ఆయా దేశాలలో స్వతంత్ర వాంఛాప్రేరితులై, ప్రజలు ధిక్కరించి నేడు నిలబడ్డారు. వారి నణచేందుకు సామ్రాజ్య ప్రభుత్వాలు నానాబాధా పడుతున్నవి.

ఇరాను సంగతి మనకు వెంటనే ఈ సందర్భంలో జ్ఞాపకానికి వస్తుంది. ఆ దేశంలోని నూనె గనులు యుద్ధతంత్ర రీత్యాను, ఇతర రీత్యాను ప్రధానమైనవి. వీని నింతవరకూ ఆంగ్లో ఇరానియన్ కంపెనీ నడుపుకుంటున్నది. కోట్లకొలది లాభాలను దోచుకొంటున్నది. ఈ కంపెనీ పెత్తనం పోవాలని, తమ నూనె గనులను తమ ప్రభుత్వమే నడుపుకోవాలని వీరు నిశ్చయించుకున్నారు. శాసనసభ వానిని జాతీయం చేయాలని తీర్మానించుకున్నది. వెంటనే బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధ నౌకలను పంపినది. ఈ బెదరింపులకు ఇరాన్ లొంగలేదు. సంధి సంప్రతింపులు సాగినవి. నేను మధ్యవర్తి నంపుతానంటూ ట్రూమన్ హారిమన్ను పంపాడు.

తమ అధికారం కొనసాగాలన్న దురాశ, దురాక్రమణవాంఛ బ్రిటన్ కున్నంతదాకా సంధి ఎలా కుదురుతుంది?

మరి వెంటనే తమకు అధిక సంఖ్యగల భద్రతాసమితిలో బ్రిటన్ ఫిర్యాదు పడవేసింది. తమ దేశంలో తమ సహజ సంపద నెలా నడుపు కోవాలో తామే నిర్ణయించుకున్న ఇరాన్ ప్రజల నిర్ణయం ప్రపంచశాంతికి భంగకరమట! మరి ఎవరిసొత్తునో తమకోసం నడుపుకోవాలనుకోవడం ప్రపంచ స్వేచ్ఛా స్వతంత్ర రక్షాదీక్ష అట.

అట్లే ఇంతవరకూ ఈజిప్టు స్వతంత్ర మంటూనే వారి సుడానుపై బ్రిటన్ పెత్తనం చలాయిస్తున్నది. సూయెజ్‌వద్ద సైనిక స్థావరాలనుంచు కున్నది. ఇదంతా 1936 సంధి ప్రకారమే నడిచిన తతంగం. ఏదో సూత్రప్రకారమేకాని, బ్రిటిషువారు ఏ పనీచేయరని బెర్నార్డు షా ఏనాడో అన్నాడుకదా.

ఈ సంధి తమజాతికి అపకారం చేస్తున్నదని ఈజిప్టు ప్రజలు చాల కాలంనుంచి ప్రకటిస్తూవచ్చారు. రెండో యుద్ధం ముగుస్తూనే ఇదీ అంతమవుతుందని ఆశించారు. సంప్రతింపులపై సంప్రతింపులు సాగినవి. కాని బ్రిటన్ తనఅధికారాన్ని వదులుకొనేందుకు అంగీకరించలేదు.

ఈ సంధిని రద్దుచేస్తున్నామని అక్టోబరు 8, 1951 న ఈజిప్టు ప్రభుత్వం, పార్లమెంటులో ఒక డిక్రీని ప్రకటించింది. దీనిని సెనేటు ఆమోదించింది. సూడాన్ తమ అధికారంక్రిందికి వస్తుందని మరొక డిక్రీకూడ ప్రకటితమైనది. కాని మరోరక్షణ సంధిరూపంలో ఏదో తతంగం నడిపించేందుకు బ్రిటిషు, అమెరికన్ రాయబారులు ప్రయత్ని స్తూనేఉన్నారు, ఇలా ఈజిప్టుఒక్కటే తన అనుమతిలేకుండా సంధిని రద్దు చేయడం అక్రమమంటూ బ్రిటిషు రాయబార కార్యాలయం ప్రకటించింది.

ఏది క్రమం—ఏది అక్రమం?

ఇక చైనాప్రజలు వందలయేళ్ల దాస్యదరిద్ర దుర్భరస్థితి ననుభవిం. చారు. తమదేశ స్వతంత్రంకోసం, సౌభాగ్యంకోసం పోరాడుతూవచ్చారు. తరతరాలుగా అమెరికా, బ్రిటన్ వగైరా సామ్రాజ్యవాదులక్రింద పడి నలిగిపోయినదికాక మొట్టమొదట మొన్నటి రెండో ప్రపంచ యుద్ధ జ్వాలకు ప్రధమ కబళమైనది వీరే. మంచూరియా ఆక్రమణతో జపాన్ తూర్పున తన విశాల సామ్రాజ్య స్థాపనకు బీజావాపనం చేసింది.

రెండో యుద్ధంలో వారు జపానును ఓడించారు. మిత్రరాజ్యాలు చైనాను అగ్రరాజ్యంగా పరిగణించినా తమకు బానిసగా ఉంచుకోవాలని అమెరికా ఉబలాటపడింది. ప్రజావిశ్వాసదూరుడైన జంగ్ కై షేకుకు కోట్లకొలది డాలర్లను, ఆయుధ సామగ్రిని అందించి మావ్ సే టుంగ్ సేనలపై కవ్వించింది. కాని చైనా భూభాగమంతా పూర్తిగా నేడు నూతన ప్రజాతంత్రాధికారంకల ప్రభుత్వమని బ్రిటన్‌వంటి సామ్రాజ్యదేశంకూడ అంగీకరించినది.

కాని ఆ ప్రభుత్వాన్ని మిత్రరాజ్యసమితి అంగీకరించలేదు. అమెరికా ఫార్మోసా చుట్టూ తన నౌకాబలాన్నుంచి, జంగ్ కై షేక్ పేరు నుపయోగిస్తూ. అక్కడ తన యుద్ధశిబిరా న్నేర్పరుచుకున్నది. ఫార్మోసా చైనాకు చెందినదన్న సత్యాన్ని భారత ప్రభుత్వంలాంటివేకాక ఇతర ప్రభుత్వా లెన్నిచెప్పినా, అగ్రరాజ్య ప్రతినిధులే యాల్టాలో అంగీకరించినా, నేడు చైనాభూమి ఫార్మోసాపై అమెరికా, దురాక్రమణ తతంగం సాగిస్తున్నది.

కొరియాలోని రెండు ప్రాంతాలూ తగాదా పడుతుండగా యధావిధిగా సిగ్మన్ రీ కీలుబొమ్మప్రభుత్వం చాటున దాని నపహరించి. మంచూరియాపై కన్ను వేసి చైనా స్వతంత్రాన్ని తిరిగీ అపహరించాలని అమె:

రికా యెత్తువేసినది. చైనాస్వచ్ఛందసేనలు ఉత్తరకొరియా సేనలతో చేరి నిరోధించసాగినవి. ఎంత దారుణ హత్యాకాండ నడిచిన దిక్కడ ! న్యూయార్కు టైమ్సు లాంటి పత్రికలు ప్రకటించిన బొమ్మలేచూచినా, ఈ స్వతంత్ర ప్రదాతలేమిచేశారో మనకు తెలియవస్తుంది.

38వ పారలల్ ప్రాతిపదికగా ఎటువారటు ఉపసంహరించుకొని సంధి చేసుకోవచ్చునని రష్యా ప్రతినిధి మాలిక్ ప్రకటించాడు. ఆ ప్రాతి పదికపైనే ఆతర్వాత యుద్ధవిరమణ సంప్రతింపు లారంభమైనవి. కాని ఆ పారలల్ సరిహద్దుకారాదని, ఇంకా ముందుదాకా ఆగీత వెళ్లాలని అమె రికా ప్రతినిధులు పట్టుపట్టారు. ఈ సంప్రతింపులు ఆగడం, ఆరంభం కావడం ఇలా కొనసాగుతునే ఉన్నవి.

ఇలా ఎటుచూచినా స్వతంత్రస్థాపనకుకాక, స్వతంత్రాపహరణకై జరిగే ప్రయత్నా లేమాత్రం పూర్వంకన్న తక్కువకాలేదు.

ఈ నేటి రాజకీయస్థితి కూడ యుద్ధభయాన్ని ఇనుమడింపజేస్తునే ఉన్నది.

ఇలా ఎక్కడోకాదు మన ప్రక్కనేఉన్న కాశ్మీరుసమస్య ఎలా రాజుకుంటున్నదో మనం చూస్తూనేఉన్నాము.

భారత ప్రజలతోపాటు స్వతంత్ర ప్రజాతంత్ర ప్రభుత్వంకోసం కాశ్మీర్ ప్రజానీకం షేక్అబ్దుల్లా నాయకత్వంక్రింద పనిచేస్తూ వచ్చింది. బ్రహ్మాండమైన ఉద్యమం నిర్మితమైనది. స్వయంకృషి మూలంగానే షేక్ అబ్దుల్లా ప్రభుత్వం ఏర్పడింది. ఆ ప్రభుత్వం భారత ప్రభుత్వంతో చేరినది.

పాకిస్తాన్ సరిహద్దు పఠానులను ఉసికొల్పి వారికి కావలసిన మందుగుండుసామాను ఆఫీసర్లు ప్రయాణ సౌకర్యాలు అన్నిటినీ కల్పించి

కాశ్మీరుపై తోలినది. విపరీతమైన ధనజన విధ్వంసనం జరిగినది. భారత ప్రభుత్వం తన సేనలను పంపి దురాక్రమణను నిరోధించినది. మిత్ర రాజ్యసమితికి ఈ దురాక్రమణ నాపమని ఫిర్యాదు చేసినది.

ఏళ్ల కాలది చర్చలు, తీర్మానాలు, పరిష్కర్తల నివేదికలు, ఉపన్యాసాలు ఒకటేమిటి—మిత్రరాజ్యసమితికి వేల కాగితాలను ఖర్చుపెట్టింది. కాని ఎందుకు? ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని కాశ్మీరులో తమ సైనిక కీలకస్థానాల నేర్పరుచుకోవాలని కొందరు, పాకిస్తానును బలపరచి వారితో లావాదేవీలు పెంచుకోవాలని కొందరు ఎగబడ్డారు—అసలు సమస్యేమిటిఅన్నదే కడకు అమెరికా బ్రిటిషుప్రతినిధుల రాజనీతి నిపుణతకు బలియై గందరగోళ మేర్పడినది.

అమెరికా ప్రతినిధికి భారత ప్రతినిధి (అయ్యంగారు) ఇలా చెప్పుకున్నాడు:

"తగాదాఏమిటి? రాజు స్వతంత్రంకాదు, దుష్పరిపాలన గూర్చికాదు. పాకిస్తాన్ ప్రభుత్వం మద్దతుతో పఠానులు దాడిచేశారు—ఇదే సమస్య"

(అయ్యంగారు—3 ఫిబ్రవరి 1948)

కాని వారన్‌ఆస్టిన్ (అమెరికా) అన్నదేమిటి?

"పఠానులనెలా మీరు తిరిగి వెళ్ళమనగలరు? నడుమంతరపు ప్రభుత్వమొకటి ఏర్పడి న్యాయంగా ప్లెబిసైట్ జరుగుతుందని వారు సంతృప్తి చెందితేకదా"

(టైమ్సు ఆఫ్ ఇండియా, 4, 1948)

ఆఖరుకు భారత దేశంలాగే కాశ్మీరును విభజించాలని వీరు చూచారు,

మాంచెస్టర్ గార్డియన్ బహిరంగంగా ఇలా వ్రాసింది:

"కాశ్మీర్ తగాదాలవంటి తగాదాలను పరిశీలించిన చాలమంది, విభజనతప్ప మరొక పరిష్కార మార్గమున్నదా అని అనుమానిస్తున్నారు."

(మాంచెస్టర్ గార్డియన్ మే 3, 50)

"ఆంగ్లో అమెరికన్ ప్రతినిధులు అనధికారరీత్యా సర్ ఓవన్ డిక్సన్‌కు ఒక కొత్త సమాధాన పథకం సూచించారు. అది కాశ్మీర్ విభజన...."

(భారత్, మే 30, 50)

లండన్ టైమ్సు గట్టిగా అన్నదేమిటి?

"విభేదాలను పరిష్కర్తకు వదలాలని—ఇండియా ఇష్టపడినా పడకపోయినా నొక్కిచెప్పాలి. లేదా రెండువేపుల సేనలను తొలగించి అంతర్జాతీయ పోలీసుదళాన్ని అక్కడ ఉంచాలి."

(లండన్ టైమ్సు 28, ఫిబ్రవరి, 1950)

అంతర్జాతీయ పోలీసుదళమంటే ఏమిటి? అమెరికా ఇంగ్లీషు సేనలను తెచ్చి పరిపాలిస్తామన్న మాటేకదా.

"అమెరికా ప్రభుత్వం కాశ్మీర్ తగాదాలో తటస్థ వైఖరినే అవలంబిస్తున్నది....అయినప్పటికి కొందరు అధికారులు వ్యక్తిగతంగా సంస్థాన విభజనఒక్కటే పరిష్కారమార్గమని అభిప్రాయపడుతున్నారు.

(యు. పి. ఎ. వార్త, హిందూ—ఆగస్టు 31, 1950)

షేక్ అబ్దుల్లా ఇలా ప్రకటించాడు:

"మిత్రరాజ్యమండలి సద్భావంతో పరిష్కారం కుదురుతుం దన్న ఆశలను కాశ్మీర్ ప్రజలు తుదిసారిగా వదిలివేసుకున్నారు."

(షేక్ అబ్దుల్లా, ఫిబ్రవరి 19, 1951)

తిరిగి పాకిస్తాన్ పరప్రభుత్వప్రాపకంతో దాడిచేయగలదంటూ భారత సేనలను సరిహద్దు కంపడంతో మరొక గాలిదుమారం లేచినది. యుద్ధం తప్పదేమోననిపించింది. ఇంత జరుగుతున్నా ఆంగ్లో అమెరికన్ పెద్దలెలా మరింత తగాదాలను రెచ్చగొడుతున్నారో తెలుస్తూనే ఉన్నది.

ఇలా రాజకీయ వాతావరణం స్వతంత్ర భంజకమైన యెత్తులతో నిండిపోయినది.

ప్రజల జీవనస్థితి

జీవనస్థితి చెప్పతరముగాని దుర్భర దీనావస్థకు దిగిపోయినది.

అన్నిటికన్న సంపత్సమృద్ధమనుకొనే అమెరికా మొదలు. నిరు పేదలమైన మనవరకూ సామాన్యప్రజల జీవితవ్యయప్రమాణం విపరీతంగా హెచ్చినది. ఆదాయాలు తగ్గిపోయినవి. అనుదిన జీవితావసరాలు కొనలేనిదశలో అధికసంఖ్యాకు లల్లలాడుతున్నారు.

"తక్కువఆదాయాలు, సుమారు జీతాలుగల లక్షలకొలది కుటుంబాలు నోట్లముమ్మరం బారిపడినారు. ఉన్న డబ్బు ఖర్చయి పోయినది. అప్పులు పెరిగినవి. కావలసిన వస్తువులు లేవు.

"జీవితవ్యయప్రమాణం పెరుగుదలతోపాటు, ముందుకువెళ్లని జీతాలుకల వారిబాధలు నేనెఱుగుదును. తిండికీ, బట్టలకూ, అద్దెలకూ వచ్చే ఆదాయాన్ని పంచలేక ఇల్లాలు బాధపడుతున్నది."

అని ప్రసిడెంటు ట్రూమన్ ప్రత్యేక కాంగ్రెస్ సమావేశావసరాన్ని తెలుపుతూ ప్రకటించాడు.

"సంతృప్తికరమైన స్థాయిలో బతక వీలులేకపోవడం, ఇంతతోపాటు మరింత అప్పుల్లో మునిగిపోవడం—ఈ భౌతిక, మానసిక సమస్యలతో వారు (ప్రజలు) తన్నుకుంటున్నారు. 1947లో 1000 డాలర్ల ఆదాయంకల కుటుంబాలలో నూటికి 57 వంతులున్నూ, 1000-2000 ఆదాయంకల కుటుంబాలలో నూటికి 41 వంతులున్నూ తాముసంపాదించుకున్నదానికంటె ఎక్కువ ఖర్చుపెట్టారు—లేదా దివాలాతీశారు."

(ప్రసిడెంటు ఆర్థిక నివేదికలు)

ఇక మనదేశం సంగతి చెప్పవలసిన అవసరం లేదు. నానాటికీ పొట్టనింపుకోవడమే గండంగా, బట్టకప్పుకోవడమే పండుగగా, తల దాచుకోవడమే బ్రహ్మాండంగా అధికసంఖ్యాకులు జీవితాన్ని కలగా గడుపుతూ చావలేక బతుకుతున్నారు.

మరి ప్రతివారూ ఇలాగే బాధపడుతున్నారా అదీలేదు. ఒకవేపు లక్షాధికారులు కోటీశ్వరు లవుతున్నారు. పేదలు నిరుపేదలవుతున్నారు.

భారతదేశ దరిద్రస్థితి ప్రపంచంలోకల్లా పేరుమోసినది.

అంతర్జాతీయ ప్రమాణం ప్రకారం కోలిన్ క్లార్కు లెక్కలిచ్చాడు.

(ఇంటర్నేషనల్ యూనిట్లలో—వివరణ చూడు)

| | |
|---|---|
| అమెరికాలో తలకు సాలుసరి ఆదాయం | 1300—1400 |
| కనడా | 1200—1900 |
| బ్రిటన్ | 1000—1100 |

ఇండియా వగైరాలు 200 యూనిట్లకంటె తక్కువ ఆదాయం కలవని ఆయన నిరూపించాడు.

మరింత దీనస్థితిలో ప్రపంచ ప్రజలలో అధిక సంఖ్యాకులు ప్రతి దేశంలోనూ బాధపడుతుండగా కోట్లకొలది రూపాయలు రక్షణవ్యయం క్రిందను, సైనికుల ఖర్చులక్రిందను, మారణాస్త్రాల నిర్మాణంక్రిందను ఖర్చు చేయబడుతున్నవి. అమెరికా రక్షణవ్యయం 1500 కోట్ల డాలర్లు (ఇదే పుస్తకం) ఒక దేశ భయంతో మరొకదేశం ఈ పందెంలో పాల్గొంటున్నది.

ఆటంబాంబుల నిర్మాణం, హైడ్రోజన్‌బాంబుల నిర్మాణానికి పరిశోధనలు, రాడర్ విమానాలు, జెట్ ఫైటర్లు ఓ కొల్లలుగా తయారయి పోతున్నవి.

ఇవన్నీ స్వేఛ్ఛాస్వతంత్ర ప్రజాజీవన సంరక్షణకే నట.

సామాన్య మానవుడు నమ్మలేకపోతున్నాడు. ఇంతటికీ మూల కారణమేమిటో తెలుసుకోవాలని ఉబలాటపడుతున్నాడు.

ఈ విచికిత్సలో అతనికి సాయపడేందుకే ఈ పుస్తకం ఉద్దేశింపబడినది.

## మూలకారణాలు

ఇంతకూ మన సమాజవ్యవస్థలోనే ఈ దుస్థితికి మూలకందం ఉన్నదని, మన ఆర్థిక విధానంలోనే ఈ సంక్షోభం అంతర్గర్భితమై ఉన్నదని అర్థశాస్త్రవేత్తలు చెబుతారు. ఈ ఆర్థిక దృక్పథంతోనే ఈ రచయిత ప్రపంచ స్థితిగతులను వివరించాడు.

### గత సంక్షోభం

ఇది నేడేకాదు ఇలా 1929లో అమెరికాలో గొప్ప ఆర్థిక సంక్షోభం ఆరంభమై అది ప్రపంచం నలుమూలలకూ వ్యాపించింది, మన

దేశంలో 1932-33లలో ఈ సంక్షోభతీవ్రత కనిపించినది. ఈ సంక్షోభం వచ్చే ముందటి సంవత్సరం (1928—29) మొత్తం ధాన్యం పంటల విలువ, సగటున కోతకాలం ధరలప్రకారం 10,34 కోట్లు. ఇది 1933-34ల నాటికి 4730కోట్లు. అంటే నూటికి 55వంతులు ఒక్కసారిగా తగ్గిపోయినది. మరి 1928-29లో 33కోట్లా 10లక్షల రూపాయలుగనేడున్న పన్ను మొత్తంమాత్రం తగ్గలేదు. ఇక బొత్తిగా ఇవ్వలేక రైతులు భూమినే ప్రభుత్వానికి వదిలివేయడంద్వారా 1933—34లో మటుకు 30 కోట్లకు తగ్గింది. అంటే నూటికి 9 వంతులు మాత్రమే అదీ.

1934 బెంగాల్ జనప విచారణకమిటీ నివేదిక అంచనాలప్రకారం 1920—21కీ 1932—33కు మధ్య కొనుగోలుశక్తి బాగా పడిపోయింది. బెంగాలురాష్ట్రంలో మొత్తం అమ్మకానికి తగిన పంటలవెల 1920-21 నాడు 82కోట్ల 70లక్షల రూపాయలు. ఆ మొత్తం 32-33నాటికి 72కోట్ల 40లక్షలకు తగ్గింది. మరి రైతుఖర్చులేమో 27 కోట్ల 90 లక్షలనుండి, 28కోట్ల 30 లక్షలకు పెరిగినవి, అంటే రైతుల స్వంత కొనుగోలుశక్తి 44 కోట్ల 50 లక్షల రూ॥ నుండి 4 కోట్ల 40 లక్షలకు పడిపోయింది. కలకత్తా ధరల సూచీసంఖ్య 223నుండి 126కు పడిపోయింది. కొనుగోలుశక్తేమో నూటికి 90వంతులు తగ్గింది.

ఆ సమయంలోనే రైతుల బంగారమంతా ఇంగ్లాండుకు పయనించింది. 1931-37ల మధ్య ఇండియానుండి 96,400 లక్షల తులాల బంగారం విదేశాలకు వెళ్లింది.

(ఎకానమిస్టు ఏప్రిల్ 2, 1938)

"సంయుక్త పరగణాలలో (యు.పి., ఉత్తరప్రదేశ్)పన్నులివ్వ లేక, భూమిని వదిలివేసిన కౌలుదార్ల సంఖ్య 1931లో 71,430 దాకా పెరిగింది. బలవంతంగా భూమి పన్ను వసూలు చెయ్యమని

ఇచ్చిన ఉత్తర్వుల సంఖ్య 256,184. 'భూమి సాగుచేయబడక బీడుపడుతున్నది' అని ఇరిగేషన్ కమిటి (1930) వ్రాసినది."

(దత్తు—నేటి భారతదేశం, పుట 255)

రైతుఆదాయం సగం తగ్గిపోవడంవల్ల ఋణం రెట్టింపయింది. 1921లో రైతులఅప్పు 4000లక్షల పౌనులని అంచనావేశారు. (యం. యల్. డార్లింగు, పంజాబురైతు ఆస్తి-అప్పు) 1931లో సెంట్రల్ బాంకింగు విచారణకమిటీ రైతుల అప్పును 900 కోట్ల రూపాయలని (6759 లక్షలపౌన్లు) అంచనావేసింది.

కేవలం ముడిసరుకుల ఉత్పత్తే ప్రధానంగా ఉన్నందువల్ల భారతదేశంపై ఈ ఆర్థిక సంక్షోభం మరీ గట్టిదెబ్బతీసింది. 1928-29లో ఎగుమతుల విలువ 339కోట్ల రూపాయలు. 1932—33నాటికి ఈవిలువ 135 కోట్ల రూపాయలకు పడిపోయింది.

ఈ సంక్షోభం ఎంత దారుణఫలితాలను కలిగించినదో ఈ రచయిత కావలసినన్ని లెక్కలు, అధికార ప్రకటనలు మొదలైనవాని ఆధారంతో వివరించాడు. అలాంటిది తిరిగీ రావచ్చునని అసలా 1929నాటి సంక్షోభం పోలేదని, యుద్ధంమూలంగా, ఆయుధోత్పత్తిమూలంగా మాత్రమే అది కనిపించక అంతర్వాహినిగా ఉన్నదని ఆయన అంటున్నాడు.

అసలీ సంక్షోభాలెందుకు వస్తాయి?

సంక్షోభాల మూలం

ధనికవిధానం పుట్టుకనుంచీ ఆర్థిక సంక్షోభంతో బాధపడుతున్నది. దీనికి కారణం రెండు వర్గాలవారూ రెండు విధాలుగా వివరిస్తారు. ముఖ్యంగా మామూలు ఆర్థికవేత్తలు ప్రతి సంక్షోభం ఒక "ఆటంకం" గందరగోళంలాంటిదిమాత్రమేనని, చక్రనేమిక్రమంగా ఒకసారి హీనదశ,

తిరిగి అభ్యుదయదశ ఇలా వ్యాపారచక్రం పరిభ్రమిస్తూ ఉంటుందని వీరం టారు. మరి సోషలిస్టు దృక్పథంకల ఆర్థికశాస్త్రవేత్తలలాకాదు. సంక్షోభం ధనికవిధానంలో విడదీయరాని భాగం, ఆ సమాజవ్యవస్థలో అది తప్పని సరి—ఆ సంక్షోభం ఆఖరుకు ధనికవ్యవస్థ పునాదులనే కదిల్చివేస్తుంది. దాని అస్తిత్వానికే ప్రమాదం కలిగిస్తుంది అని వివరిస్తారు.

ఈ గ్రంధకర్త రెండవ దృక్పథానికే ఎక్కువ విలువయిచ్చి ఆ దృష్టితోనే సంక్షోభకారణాలను వివరించాడు. కాని వీని నివారణోపాయం గూర్చిమటుకు ఈయన ఉదారవాదులైన ఆర్థశాస్త్రవేత్తలతోనే ఎక్కువగా ఏకీభవించి, ప్రభుత్వం ఆర్థికగతిని కంట్రోలుచేస్తూ రావాలంటాడు. అది తర్వాత విచారింతాము.

సంక్షోభం—ధనికవ్యవస్థ

ధనికవ్యవస్థలో వస్తూత్పత్తి లాభంకోసమే జరుగుతుంది. ఉత్పత్తి సాధనాలు యజమానులచేతిలో ఉంటవి. కార్మికులలో శ్రమతప్ప మరొక టుండదు. ఆ శ్రమశక్తితో వారు ఉత్పత్తిచేసిన వస్తువులను, వారికిచ్చే జీతంకంటెఎక్కువకు యజమానులమ్ముతారు. ఆ అదనపుడబ్బుకేఅదనపు విలువఅని మార్క్సు నిర్వచించాడు. ఈ లాభాలుపెరిగేకొద్దీ, ఆ డబ్బును తిరిగీ ఉత్పత్తిసాధనాల పెంపుకు పెట్టుబడిగా యజమాని ఉపయోగిస్తాడు. ఇలా క్రమంగా పోటీలమూలంగా ధనం కొందరిచేతిలో కేంద్రీకృతం కావడం జరుగుతుంది.

ఇలా వస్తువులఉత్పత్తి ఒక ప్రణాళికనుబట్టికాక అరాచకంగా జరుగుతుంది. ఏదిఎంత ఉత్పత్తిచేయాలి? ఉత్పత్తినెంత అధికంచేయాలి? ఏ ఫాక్టరీ కొత్తగాపెట్టాలి? ఏది మూసివెయ్యాలి ఇవన్నీ ఏ యజమాని కా యజమాని నిర్ధరిస్తాడు.

ధనికఆర్థికవ్యవస్థకుఆయువుపట్టుఉత్పత్తి.అది,అవిచ్ఛిన్నంగాసాగాలి-పెట్టుబడి తిరుగుతూరావాలి. మొదట పెట్టుబడితో (1)ఉత్పత్తిసాధనాలను, బిల్డింగులను, యంత్రాలను, ముడిసరుకులు వగైరాలను (2) శ్రమశక్తిని యజమాని కొంటాడు-తర్వాత ఉత్పత్తి కొనసాగుతుంది. పైవానిలోఏది లేకున్నా ఉత్పత్తిసాగదు. ఇలా ఉత్పత్తిఅయ్యాక మొదటపెట్టిన మొత్తం వస్తురూపంలో నిలిచినప్పుడు, అవి తిరిగీ అమ్ముడుపోతేనేకాని డబ్బు రాదు. ఇందుకు వస్తువులను లాభసాటి ధరలకు కొనుక్కొనేవార్నుండాలి. ఇలా విక్రయంకాకపోతే పెట్టుబడి తిరగదు. అప్పుడుగాని తిరిగీ ఈ అదనపు విలువను పెట్టుబడిగా మార్చడం సాగదు.

(1) ధనరూపంలోని పెట్టుబడి ఉత్పాదక-మూలధనంగా (యంత్రాలు, ముడిసరుకులు, శ్రమశక్తి-రూపంలో) మారాలి. (2) ఈపెట్టుబడి ఉత్పత్తి క్రమంద్వారా పెట్టినడబ్బుకంటె ఎక్కువ విలువగల వస్తువుల రూపంలోకి మారాలి. (3)ఈవస్తువులు తిరిగీ డబ్బురూపంలోకి మారాలి, ఇలా తిరుగుతూఉంటేనే తప్ప లేకపోతే పెట్టుబడి మూలబడుతుంది.

పోటీమూలంగా వస్తూత్పత్తి అధికంగా సాగుతుంది. ఈ వస్తువులు ఖర్చుకావాలంటే గిరాకీఉండాలి, ఈగిరాకీదేనిమీద ఆధారపడుతుంది? ధనికవిధానంక్రిందఉన్న దేశంలో ఇది పూర్తిగా కార్మికులకిచ్చే జీతాలమీద ఆధారపడుతుంది. వారి డబ్బుబట్టేకదా వారి కొనుగోలుశక్తి ఉండబోతుంది. ఇందుతోపాటు ధనికుల ఆదాయంమీదను కొంతఆధారపడినా, వారి సంఖ్య తక్కువకాబట్టి ఎంత విలాసమయ జీవితం గడిపినా వారు కొనగల వస్తువులు తక్కువే. ఈ కార్మికుల జీతాలు, ఉత్పత్తి ఎంతవేగంతో అభివృద్ధి అవుతుందో అంతవేగంగా పెరగవు.

ఇలా స్వదేశంలో అమ్మకం తగ్గగానే కొత్త మార్కెట్టులకోసం ధనికు లెగబడతారు. అభివృద్ధిచెందని దేశాలనాక్రమిస్తారు. అదేసామ్రాజ్య

వాదానికి మూలమవుతుంది. అలా ప్రపంచం పంపకం పూర్తికాగానే తిరిగి మార్కెట్టులకోసం వేట, యుద్ధాలకు కారణమవుతుంది.

ఉత్పత్తిచేసిన వస్తువులన్నీ అమ్ముడు పోకపోయినప్పుడు పౌరుల కొనుగోలుశక్తి పడిపోయినప్పుడు ఆర్థికసంక్షోభం ఏర్పడుతుంది.

ఇలాంటి హీనదశా, తిరిగి అభ్యుదయదశా ఇలాక్రమంగా వస్తూనే ఉంటాయని సంక్షోభంరాగానే భయపడపనిలేదని పాత ఆర్థికవేత్త లనే వారు. నిరుద్యోగం హీనదశలో పెరిగినా, తిరిగి తగ్గిపోతుందని వారంటూ వచ్చారు.

## ఆర్థికవేత్తల దృక్పథాలు

ఈ బూర్జువా అర్ధశాస్త్రజ్ఞులలోను ఒకొక్కరొకొక్కవిధంగా ఆర్థిక సంక్షోభాన్ని వివరిస్తారు. అతిసంగ్రహంగామాత్రమే మనమిక్కడ వారి సిద్ధాంతాలను చూడగలము.

అభ్యుదయదశలో పరపతి పెరుగుతుంది, బాంకు డిపాజిట్లు అధిక మవుతాయి. ఈ డబ్బు విడుదలను అరికట్టితే అభ్యుదయదశ ఒకహద్దులో ఉంటుందని, సంక్షోభాన్నిలా అరికట్టవచ్చునని హాట్రే, ఇర్వింగ్ ఫిషర్ మొదలైన వారంటారు—ఈ సిద్ధాంతాన్నే ద్రవ్య సిద్ధాంతం అంటారు.

మరొకవాదం: ధనికుల వద్దనున్న డబ్బంతా ఉత్పాదక వస్తువుల విస్తరణకుపయోగిస్తారు. అందువల్ల సంక్షోభం వచ్చినప్పుడు ఇవి పూర్తి కాక ఆగిపోతాయి. సంక్షోభం "పెట్టుబడి ఆధిక్యం" వల్ల ఏర్పడుతుంది. విస్తరీకరణ ప్రణాళికలు మరీ అత్యాశతోకూడినవని. దాచుకున్నడబ్బు ఈ విస్తారోత్పత్తికి తగినంతగా ఉండదు. కాబట్టి ఈ సంక్షోభాన్ని తప్పు కునేందుకు వడ్డీరేటు పెంచడం, జీతాలు తగ్గించడం ఒక్కటే మార్గం

అని పిలుస్తారు. ఈ వర్గానికి చెందినవారు ప్రొఫెసర్ హైక్సు, రోబిన్సు.

మరికొందరనేదేమిటంటే అభ్యుదయదశలో పెట్టుబడిదారులు మరీ ఆశకుపోతారు. అధిక ధరలకు మరిన్ని వస్తువులు అమ్ముకుంటామనుకుంటారు. మరి గిరాకీలేక అమ్మకం పడిపోగానే గుండె పగిలిపోయి, ఇక ఎన్నటికీ పరిశ్రమలు లాభకారి కావనుకుంటారు. కాబట్టి సంక్షోభతీవ్రత మానసికమైనది. ఒకదశలో భవిష్యత్తును మరీ స్వర్ణారుణంగా చూడ్డం, మరొకదశలో అంధకార బంధురంగా చూడ్డం అనే ధనికుల మానసిక రోగమే ఇందుకు కారణమంటారు వీరు.

అమ్మకం పడిపోయినప్పుడు ఫాక్టరీలలో నిలవ ఎక్కువవుతుంది. వ్యాపారం ఆగిపోతుంది. ఉత్పత్తి అయినవన్నీ ఎవరూ కొనలేకపోతారు. కాబట్టి సంక్షోభానికి కారణం వస్తువినియోగం తక్కువ కావడమే. అందుకు కొనుగోలుశక్తి తగ్గడం కారణం. ప్రజలకు ఖర్చు పెట్టేందుకు కావలసినంత డబ్బుంటే సంక్షోభంరాదు అనే వాదం జె. ఎ. హాబ్సన్ మొదలైన వారిది. కేన్సుకూడా వీరితో కొద్దోగొప్పో ఏకీభవిస్తున్నాడు. ఈయన చెప్పే నివారణోపాయం ప్రభుత్వం పెట్టుబడి పెట్టాలి అన్నది.

ఇక ప్రొఫెసర్ డబ్ల్యు. జి. మిచ్చెల్ చెప్పేకారణం వేరు. అభ్యుదయదశలో ధరలు విపరీతమవుతూ వస్తాయి. అలాగే జీతాలూ ఎక్కువ కావలసి వస్తుంది. ఆ ఎక్కువంతా లాభాలలోనుంచీ ఇవ్వవలసివస్తుంది. ఇందుతో విస్తరణ ఆగిపోతుంది. ఇది సంక్షోభానికి దారితీస్తుంది.

పంటలు పండకపోయినప్పుడు, వ్యవసాయదారుల కొనుగోలు శక్తి తగ్గుతుంది. ఇందుతో సంక్షోభం వస్తుంది అనేవారు కొందరు. దీనినుంచే జేవన్సు "సూర్యుని మచ్చల సిద్ధాంతం" లేవదీశాడు. ప్రతి పదేళ్ళకూ సూర్యునిలో మచ్చలు కనిపిస్తాయి. ఇవి పంటలు పాడైపోయేందుకు

కారణం—ఆ పంటలు పోవడం ఆర్థికమాంద్యానికి మూలం అనేది ఈ వాదం సారాంశం

ఇవి పరస్పర విరుద్ధమైనా అన్నిటికీ సమానమైన అంశం ఒక టున్నది: ధనికవిధానంలో సంక్షోభమనేది తప్పకుండా వస్తుంది.

పెట్టుబడి ఎక్కువయినందువల్ల సంక్షోభం వస్తుందనేవారు వడ్డీ రేటు పెంచాలని జీతాలు తగ్గించాలని అంటారనుకొండి. ఉత్పాదకశక్తి విస్తరణను తగ్గించాలనే వీరు, అందుతోపాటు ప్రజలు కొనుగోలుశక్తినీ తగ్గించాలంటున్నారు. ఇందుతో అమ్మకం పడిపోవడం తప్పదుకదా.

మరి వస్తువినియోగం తగ్గడంవల్ల సంక్షోభం వస్తుందనే ఆర్థిక వేత్తలు జీతాల కోతలుకూడదని, వడ్డీరేటు మరింత తగ్గించాలనీ అంటారు. కొనుగోలుశక్తి తగ్గకుండా చూడాలనేదే వీరి ఆశయం. కాని వాస్తవ స్థితిలో ఆర్థికమాంద్యం వచ్చేముందు జీతాలు హెచ్చుగానే ఉంటాయి. అయినా మాంద్యం వస్తుంది, కారణం లాభాలు; వస్తూత్పాదకశక్తికూడ జీతాలకంటె వేగంగా పెరుగుతూనే ఉంటుందిగనుక. ధనిక వ్యవస్థలో ఉత్పత్తి లాభంకోసమే జరుగుతుందిఅన్న మూలసూత్రం వీరు మరచి పోతున్నారు.

## మార్క్సిస్టు దృక్పథం

ఈ సిద్ధాంతాలన్నిటిని ప్రతిఘటించే మార్క్సిస్టుల దృక్పథం వేరు-

"ఉత్పత్తి సాంఘిక స్వభావంకలది. ఆ ఉత్పత్తి ఫలితాల స్వీకరణేమో ధనికవిధానానికి చెందినది, ఈ రెంటికీఉన్న వైరుధ్యమే సంక్షోభానికి మూలం. లాభాలు అత్యుచ్ఛస్థితికి పోవాలని ధనికుల వాంఛ, అందుకోసం ఉత్పాదకశక్తిని వారు మహోన్నతంగా హెచ్చిస్తారు. మరి లక్షలాది పాటకజనుల జీవనస్థాయిని

సాధ్యమైనంత నీచస్థితిలో ఉంచేందుకు ప్రయత్నిస్తారు. ఇందువల్ల ఉత్పాదకశక్తితో పోలిస్తే, కొనుగోలుశక్తి చాల అధమస్థితిలో ఉంటుంది. ఇతరులతో పోటీలో గెలిచేందుకు, లాభాలు మరింత తీసుకునేందుకు ధనికులు తప్పనిసరిగా టెక్నిక్కును మరింత ఉత్తమ స్థాయికి కొనిపోతారు. తక్కువమంది కార్మికులతో ఎక్కువ ఉత్పత్తిఅయ్యే పద్ధతులను (రాషనలైజేషన్) అనుసరిస్తారు. కార్మికుల పీడనను తీవ్రతరంచేస్తారు. తమ ఉత్పాదకశక్తిని పరాకాష్ఠకు కొనిపోతారు. ఒకరివెనుక నొకరు, వెనుకపడిపోరాదని ప్రతి పెట్టుబడిదారూ ఈ మార్గం అనుసరించవలసి వస్తుంది. కాని స్వదేశీ మార్కెట్టులు, విదేశీ మార్కెట్టులు కోట్లకొలది కార్మికుల రైతుల కొనుగోలుశక్తి—వీరేకదా అసలు వస్తువులు కొనేవారు—అత్యుత్తమస్థాయిలో ఉంటుంది. కాబట్టి అధికోత్పత్తివల్ల సంక్షోభం ఏర్పడుతుంది."

(స్టాలిన్, లెనినిజం. సంపుటి 11. అలెన్ అండ్ అన్విన్ 1933, పుట 312—3)

"సంక్షోభ సమయంలో విపరీతంగా ఉత్పత్తిచేసిన వస్తువుల విధ్వసనం, దండుగ, చాల జరుగుతుంది. కార్మికులకు జీతాల కోతలు, నిరుద్యోగం ప్రబలుతుంది. మధ్యతరగతులు, చిన్న వర్తకులు, ఉద్యోగులు దివాలాతీస్తారు. నిరాశా నిస్పృహలు పెరుగుతాయి. వలసలలోని ప్రజలు ఆకలితో మాడిపోతారు, సామ్రాజ్యవాదులు మరింత పీడనను తీవ్రంచేస్తారు,

"ఇంతేకాదు సంక్షోభం ధనికవర్గంపైనా గట్టి దెబ్బతీస్తుంది. సంక్షోభంలో ధనికులు రెచ్చిపోయి కార్మికులపై పడతారు. పెద్ద పెట్టుబడిదారీ సంస్థల ప్రయోజనాలను రక్షించుకోవడం కోసం ప్రభుత్వ బలాన్నంతటిని స్వేచ్ఛగా ఉపయోగిస్తారు. ప్రతి సంక్షో

షంలోనూ ధనికవ్యవస్థలో మార్పువస్తుంది. ప్రతి సంక్షోభమూ ధనికవ్యవస్థ అవసానకాలాన్ని సన్నిహితం చేస్తుంది. ఎందుకంటే తమలాభాల రక్షణకై ధనికులను తీవ్రచర్యలకు ప్రోత్సహించినట్టే సంక్షోభం ధనికవిధాన పీడనకు గురియయిన పాటకజనులనూ గట్టిపరుస్తుంది. ధనికవిధాన విచ్ఛిన్నతకై తుదిపోరాటం జరిపేలా వారిని పురోగమింపజేస్తుంది."

(జాన్ ఈటన్—అర్థశాస్త్రం, పుట 133-4 లారెన్స్ అండ్ విషార్ట్, లండన్, 1949)

## స్టెరంబర్గు దృక్పథం

ఈ గ్రంధకర్త సంక్షోభ వివరణలో మార్క్సిస్టు దృక్పథంతో స్థూలంగా ఏకీభవిస్తూ ఇలా అంటున్నాడు:

సోషలిస్టు దృక్పథం ప్రకారం ఈ అధికోత్పత్తి ధనికసమాజ వ్యవస్థలోని ప్రముఖ లక్షణంవల్ల ఏర్పడుతుంది. ఈ సంఘంలో ఉత్పత్తి సాధనాల యజమానులైన అత్యల్ప సంఖ్యాకవర్గం ఒకవేపు—కోట్లకొలది కార్మికులొకవేపు ఉంటారు. కొంత పెరగడానికి వీలున్నప్పటికీ, ఈ కార్మికుల జీతాలుగాని, వినియోగశక్తిగాని ఉత్పత్తితో సమానంగా పెరగవు.

నేటి సోషలిస్టు సిద్ధాంతాలలో పెక్కింటికి పితామహుడైన కరల్ మార్క్సు విశ్వాసమేమిటంటే కార్మికులయొక్క, ప్రజా సామాన్యంయొక్క వినియోగశక్తిని తప్పక పరిమితంచేసే ధనిక సమాజ వ్యవస్థే ఈ సంక్షోభాలకు కారణం—అధిక సంఖ్యాకులైన సామాన్యప్రజల కొనుగోలుశక్తి ఏకాసంత బేదంతోనో అతి పరిమితమైపోతుంది. ఇందుకు కారణం పంపకంలోని పరస్పర

విరుద్ధపరిస్థితులే. ఇందువల్లనే ధనికవిధానం క్రింద వస్తువుల విడుదల పరిమితమైపోతుంది——అని ఆయన చెప్పాడు.

"ధనికవ్యవస్థ తనఉత్పత్తిని క్రమావృద్ధి చెందిస్తూ, విస్తరింప జేసి తీరవలసివస్తుంది. మరి అంచుతోపాటు అందుకు తగినట్లు విశాల ప్రజానీకపు వినియోజనశక్తి పెరగడానికి వీల్లుండదు. దానికి కారణం ధనికవ్యవస్థలోని వర్గపీడనమూలంగా వారి వినియోజనశక్తి అతి సంకుచితమైన హద్దులలో పరిమితమైపోతుంది. మార్క్సు సోషలిస్టు సిద్ధాంతాల ప్రకారం ప్రజల వస్తువినియోగ శక్తి సన్నగిలడం సంక్షోభానికి కారణమని చెప్పవచ్చును. ఈ కారణాన్ని ధనికవ్యవస్థ పరిధిలోనే తొలగించడం సాధ్యం కాదు.——ఈవాదం సమర్థనీయమైనదని చెప్పక తప్పదు."

(రానున్న సంక్షోభల——14-15 పుటలు)

అయితే, మార్క్సిస్టులవలె కాక, సంక్షోభ నివారణకు ఈయన మరొకమార్గం సూచిస్తాడు. ప్రభుత్వం ఆర్థికస్థితిలో ప్రవేశించి, తానే ఎక్కువభాగం పెట్టుబడి పెట్టాలంటాడు. అంతేకాక 1929 సంక్షోభాన్ని, నేటి సంక్షోభాన్ని వివరించడంలో కూడ ఈయన వేరేమార్గం అనుసరించాడు.

ఆధునిక ధనికవ్యవస్థ

ధనికవిధానంలో క్రమంగా పారిశ్రామికోత్పత్తి కొద్దిమంది చేతులలోకి వెడుతుందనుకున్నాము. దీనినే గుత్తవ్యాపార విధానం అంటారు. కేవలం స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతంతో బయలుదేరిన ఈ ఆర్థికవ్యవస్థ, పై సంక్షోభాదుల కారణంగా స్వతస్సిద్ధమైన వైరుధ్యాల కారణంగా మార్పులుచెందుతూ వస్తున్నది.

ఈ సంక్షోభాల నెదుర్కొనేందుకు అనేకవిధాలా ప్రయత్నాలు జరుగుతూవస్తున్నవి. కాని సంక్షోభంనుండి ధనికవిధానం తప్పించుకోలేక పోతున్నది. ధనికవిధానం క్రమంగా తనదేశం మార్కెట్టులు చాలకపోతే విదేశీ మార్కెట్టుకోసం దండయాత్ర బయలుదేరింది, అలా కొన్నిదేశాలు సామ్రాజ్యాలైనవి. ఇక వలసలుకూడ అయిపోయినవి. తిరిగీ భూమినీ పంపకంచేసి వలసలులేని వారికివ్వాలన్న నినాదం వెలువడినది. తమ దేశంలో పీడనకు గురియైన ప్రజలు కొనుగోలుశక్తి కోల్పోగా, మరొక దేశప్రజలు వీరికి బలిపిల్లలు కావలసి వచ్చారు. ఈ బలిపిల్లల కోసం యుద్ధాలు బయలుదేరాయి.

ధనిక విధానం సామ్రాజ్యవాద దశ నందుకున్నప్పటి లక్షణాలను లెనిన్ యిలా నిర్వచించాడు:

1. పెట్టుబడి, ఉత్పత్తి కేంద్రీకృత మవుతుంది. గుత్తవ్యాపార సంస్థ లేర్పడుతాయి. అవి ఆర్థిక జీవితాన్ని తమగుప్పిట పెట్టుకుంటాయి.

2. బాంకు పెట్టుబడి, పారిశ్రామిక పెట్టుబడితో కలిసిపోయి ఈ ఫైనాన్సు కాపిటల్ ప్రాతిపదికపై, ద్రవ్యం కొందరిచేతులలో కేంద్రీకృతమవుతుంది.

3. వస్తువుల ఎగుమతిలాగే, పెట్టుబడి ఎగుమతి కూడ అతి ప్రధానమవుతుంది.

4. అంతర్జాతీయ గుత్త వ్యాపారసంస్థలేర్పడి ప్రపంచాన్ని తమలో తాము పంచుకుంటాయి,

5. యావత్ ప్రపంచాన్నీ అగ్రేసరములైన ధనికరాజ్యాలు పంచుకుంటాయి.

"పాత పెట్టుబడిదారీ విధానంక్రింద స్వేచ్ఛావ్యాపారం సాగుతున్నప్పుడు, వస్తువుల ఎగుమతి ప్రధాన లక్షణంగా ఉండేది. నేటి ధనికవిధానంక్రిందీ—గుత్త వ్యాపారసంస్థలు వెలసినప్పుడు, పెట్టుబడి ఎగుమతి ప్రధాన లక్షణంగా మారినది."

(సామ్రాజ్యవాదం—లెనిన్, సంపుటి 1, పుట 68)

ఒక్క బ్రిటన్ పెట్టుబడి ఎగుమతిని చూస్తే మనకీవిషయం బోధపడుతుంది.

విదేశాలలో బ్రిటన్ పెట్టుబడి

| | |
|---|---|
| 1850 | 20 కోట్లు |
| 1880 | 100 ,, |
| 1913 | 400 ,, |

బ్రిటిష్ ధనికవర్గం యావత్తు పెట్టుబడిలో, ఇది దాదాపు మూడోవంతు.

(మారిస్ హెచ్. దోబ్—ధనికవిధానగతి పరిశీలన. పుట 315)

1933లో భారతదేశంలో మాత్రమేఉన్న బ్రిటిషు పెట్టుబడి 100 కోట్లు అని బ్రిటిష్ సంయుక్త వాణిజ్యమండలివారు అంచనావేశారు.

ఈ సామ్రాజ్యవిధానదశే యుద్ధాలకు దారితీస్తుంది.

మొదటి ప్రపంచ యుద్ధంతర్వాత గుత్త వ్యాపారసంస్థలు మరింత బలపడినవి. బ్రిటన్‌లో లివర్‌బ్రదర్సు అనే గుత్త వ్యాపారసంస్థ 1913లో 40 కంపెనీలపై యాజమాన్యం వహించేది. 1921కల్లా 160 కంపెనీలు దీనిక్రిందికి వచ్చాయి. పెట్టుబడి 120 లక్షల పౌనులనుండి 510 లక్షల పౌనులకు పెరిగింది.

కొన్నాళ్లవరకూ తిరిగీ ధనికవిధానం కోలుకున్నదనిపించింది. కాని 1929 సంక్షోభంతో ఆ భ్రమలన్నీ తొలగిపొయ్యాయి. ఈ సంక్షోభ వివరణం వివరంగా ఈ పుస్తకం మొదటిభాగంలో నున్నది.

తిరిగీ 1937లో అమెరికాలో సంక్షోభం ఆరంభమై బ్రిటనుకు వ్యాపించినది. యుద్ధ ఆర్థికవిధానంమూలంగా కృత్రిమమైన అభ్యుదయదశ జర్మనీలో కనిపించింది.

ఈ సంక్షోభాలు రెండోయుద్ధానికి దారి సరిచేశాయి.

గుత్త వ్యాపారసంస్థల సర్వాధిపత్యానికి చోటుచాలక, ప్రజాతంత్ర పద్ధతులనుండి ధనికవర్గం ఫాసిజంవేపు మ్రొగ్గుచూపింది. జర్మనీ ఇటలీలలో అధికారం చేపట్టింది.

రెండవ యుద్ధంతో ఫాసిజం తల పగిలిపోయింది.

నేడు తిరిగీ అమెరికాలో గుత్తపెట్టుబడిదారీ విధానం బలపడుతున్నది. తిరిగీ సంక్షోభం వాతపడకుండా తప్పించుకునేందుకై, జర్మనీలోలాగే యుద్ధావసర వస్తునిర్మాణాన్ని బ్రహ్మాండంగా కొనసాగిస్తూపోతున్నది. ఇది మరొక మహాసంక్షోభానికి తప్పక దారితీయగలదని ఈ గ్రంథకర్త చూపుతున్నాడు.

## సోషలిస్టువ్యవస్థ ప్రాదుర్భావం

మొదటి యుద్ధంతర్వాత ప్రపంచ వ్యవస్థలో మరొక క్రొత్త లక్షణం ఏర్పడింది. సోవియట్ రష్యాలో సోషలిస్టు ఆర్థికవ్యవస్థ ఏర్పడినది. అంతదాకా ప్రపంచంలోని అధిక భాగంలోని ఉత్పత్తి సర్వమూ ధనికవిధానరీతినే జరిగేది. మరి తర్వాత ఒకభాగం సోషలిస్టువ్యవస్థ క్రిందికి పోయినది.

మరి సోషలిస్టు ప్రణాళికాబద్ధమైన ఉత్పత్తి విధానం ఈ సంక్షోభానికి గురికాలేదు. ఈ విషయమై ఈ గ్రంథకర్త ఇలా వ్రాస్తున్నాడు:

"మొదటియుద్ధం జరుగుతుండగా, ఆనాటి బలవత్తర అభివృద్ధి నిరోధక ప్రభుత్వమైన జారిజాన్ని కూలద్రోసి, బోల్షివిక్కులు అధికారాన్ని కైవసం చేసుకున్నారు, వ్యావసాయిక విప్లవం రష్యా సమాజవ్యవస్థను మార్చివేసినది. అధికారం లాక్కోవడమే కాక బోల్షివిక్కులు దాన్ని రక్షించుకోగలిగారు. ప్రభుత్వ ప్రణాళికలను అమలుజరిపారు. వ్యక్తిగత యజమానులను, వ్యక్తిగత పెట్టుబడిదారులను తొలగించివేశారు. ఈ విధంగా అతివేగంగా రష్యాను ప్రపంచంలో మూడవప్రధాన పారిశ్రామికదేశంగా మార్చివేశారు,"

(రానున్న సంక్షోభం, 128 పుట)

"1929 నాటికి సోవియట్ యూనియన్ అప్పుడప్పుడే మొదటి పంచవర్ష ప్రణాళికను అమలుజరుప నారంభించినది. ప్రధానంగా వ్యవసాయదేశంగా ఉన్నదల్లా పారిశ్రామిక దేశంగా మారుతున్నది. అప్పుడప్పుడే ప్రథమ మహా యుద్ధంలోను, అంతర్యుద్ధంలోను దేశంలో ఏర్పడిన భీభత్సాన్ని చక్కబెట్టుకుంటున్నది. 1914 ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో జారిస్టు రష్యా ఉత్పత్తి ఏనూటికి నాలుగువంతులు మాత్రమో ఉండినది. 1929 సంక్షోభం ఆరంభమయినప్పటికి సోవియట్ యూనియన్ భాగం 4.5%గా నున్నది,

"సంక్షోభ సమయంలో రష్యాలోని అభివృద్ధి ఇతరదేశాలకంటె విభిన్నంగా నున్నది. అన్నిధనిక రాజ్యాలలోను పారిశ్రామికోత్పత్తి బాగా పడిపోయినది. కాని, సోవియట్ యూనియన్‌లో తగ్గలేదు

సరికదా ఏటేటా క్రమంగా పెరుగుతూవే వచ్చివది. నిరుద్యోగా న్నప్పుడే సోవియట్ నిర్మూలించగలిగింది. మిగత ధనిక రాజ్యాలలో నిరుద్యోగగతి అధ్వాన్నమవుతూ వస్తుండగా, సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగసమస్యే రాలేదు. సంక్షోభ సమయంలోగాని, నాజీ ఆక్రమణకు ముందుగాని, నాజీ ఆక్రమణ ప్రారంభంలో కాని సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగమనేది లేదు. అంటే ఆయుధోత్పత్తి, ఆర్థికవ్యవస్థలో అట్టే ప్రముఖపాత్ర నేమీ నిర్వహించని దశలోనే, అక్కడ నిరుద్యోగంలేదన్నమాట."

(రానున్న సంక్షోభం—222-3)

రెండో యుద్ధానంతరం ధనికవిధానం

రెండవ ప్రపంచ యుద్ధానంతరం యూరోపు స్థితినిగురించి మిత్రరాజ్యమండలి ఆర్థిక వ్యవహారశాఖ నివేదికలో ఇలా ఉన్నది.

"1947 ఆఖరుకు—యుద్ధానంతరం ఏణ్ణర్ధానికి—యూరోపు దేశాల పునర్నిర్మాణం చాల దూరంలోనే ఉన్నది. యుద్ధం ముగిసే టప్పటికి అతిహీన స్థాయిలోవున్న ఉత్పత్తి,వాణిజ్యాలు 1946లో చెప్పుకోదగినంత వేగంతో పెరుగుతూ వచ్చాయి. కాని 1947 పూర్వార్ధంలో అలానే కొనసాగినా, ఉత్తరార్ధంలోమటుకు వానిగతి బాగా మందగించింది. కొన్నిదేశాలలో 1947 ఆకురాలే కాలానికి తగ్గిపోవడం కూడా జరిగింది....యూరోపు ఆర్థికవ్యవస్థ నోట్ల ముమ్మరానికి గురియయినది....ప్రజల జీవనస్థాయి యుద్ధపూర్వ స్థాయికంటె చాల తక్కువస్థితిలో ఉన్నది." (1948 జనవరి)

ప్రతి నలుగురిలో ముగ్గురురైతులుగా ఉన్న ఆశియాలో (1,12 కోట్లా 50 లక్షలజనాభా) ప్రజలు అర్ధాకలితోనున్నారు. ఇక్కడ "విపరీత

మైన భౌతిక విధ్వంసనం జరిగింది. ఉత్పత్తి, యానసౌకర్యాలు, వ్యాపారం, ద్రవ్యస్థితి పూర్తిగా శిథిలితమై పోయింది....ధాన్యోత్పత్తి తగ్గిపోయి ఆహారం కరువేర్పడింది....ఉపయోగించవీలయిన విదేశ మారకం లేక తగినన్ని దిగుమతులు చేసుకునేందుకు వీలులేకపోయినది. నోట్లముమ్మరం స్వైరవిహారం చేస్తున్నది."

(అదే నివేదిక, 69 పుట).

మొత్తంమీద రెండవప్రపంచ యుద్ధానంతరం ధనికవిధానం ప్రధాన లక్షణాలను జాన్ ఈటన్ అనే ప్రసిద్ధ అర్థశాస్త్రవేత్త ఇలా సంగ్రహీకరించాడు.

1. భిన్నదేశాలలో ధనిక విధానాభివృద్ధి యెగుడుదిగుడుగా పెరుగుతున్నది.

2. పెద్దపెద్ద గుత్తవర్తకుల ప్రాబల్యం ఎక్కువయినది. ధనిక దేశాలలో ప్రభుత్వంతో వీరికున్న సంబంధాలు మరింత హెచ్చినవి.

3. చాలవరకు ధనిక దేశాలలోను, వలసదేశాలలోను సామాన్య ప్రజల జీవనస్థాయి క్షీణించిపోయినది.

4. ఒకవేపేమో ఆర్థికవ్యవస్థ మొత్తంమీద కదలిపోయినా, మరి అమెరికాలోనేమో గుత్తవ్యాపారస్తులకు కొత్తమార్కెట్లు అత్యవసరమయ్యాయి. యుద్ధంలో బ్రహ్మాండంగా పెరిగిన అమెరికా ఉత్పత్తి, ఎగుమతులకు పెట్టుబడి తిరగడం అవసరమైనది.

5. యుద్ధకాలంలో సంపాదించిన విపరీతమైన లాభాల నిల్వధనాన్ని పెట్టుబడిపెట్టేందుకు, లాభసాటి అయిన, స్థిరమైన, స్థానాలు సంపాదించుకోవడం మార్కెట్టు సమస్యవల్ల అవసరమైనది.

(అర్థశాస్త్రం, జాన్ ఈటన్ పుట 212-213)

ఇది ప్రపంచ ఆర్థికస్థితి. ఇదికూడ యుద్ధానికి ప్రోద్బలమిస్తున్నదే కాని ఆపునట్టిదిగా లేదు.

యుద్ధానంతరం అమెరికా ఆర్థికస్థితిని గూర్చి ఈ పుస్తకంలో లేకున్నా ఇదే రచయితే వ్రాసిన మరో పుస్తకంలో వివరంగా ఉన్నది. ఆ భాగం అనుబంధంగా ఇందులో చేరి ఉన్నది.

ఇలాంటి రాజకీయ ఆర్థికసంక్షోభ దశలోనున్న ప్రపంచం పంచాగ్ని మధ్యంలో పడినది.

## నివారణోపాయాలు

ఈ సంక్షోభదశనుండి తప్పించుకునేందుకు నివారణోపాయాలేమిటి? యుద్ధమా, ఆర్థిక ప్రణాళికలా, ప్రభుత్వం పెట్టుబడి ఎక్కువ చేయడమా, సోషలిస్టువ్యవస్థ స్థాపించడమా? ఒకొక్కరొకొక్కమార్గాన్ని సూచిస్తున్నారు. వీనిని చూచాయిగా పరిశీలింతాము.

నేటి ప్రపంచ దుర్గతి నివారణోపాయాలనాలోచించడం, కేవలం అర్థశాస్త్రానికి చెందిన పరిమితిలోనేకాని, కేవలం రాజ్యాంగ చర్చల పరిధిలోనేకాని సాధ్యపడదు. నేడు ఆర్థికవ్యవస్థ రాజకీయాలు సమ్మిశ్రితమై ఉన్నవి. కాబటే ఈ సమగ్రదృష్టితోనే అర్థనీతివేత్తల పరిశీలనలు నేడు కొనసాగుతున్నవి.

రెండవ యుద్ధంతర్వాత ధనికవిధానాన్ని బలపరిచే అర్థశాస్త్రవేత్తలు కూడ, తమ పాత నివారణోపాయ వివరణలను మానివేశారు. కొన్ని కొత్తవానిని అంగీకరించారు. స్వేచ్ఛా వ్యాపారసూత్రం మూలబడినది. ఆర్థికప్రణాళిక అనే మాటను—ఏదో వారికితోచిన అర్థంలోనైనాసరే— ప్రతి అర్థనీతిజ్ఞుడూ నేడు ఉపయోగిస్తున్నాడు. ప్రతి ప్రభుత్వమూ ఉపయోగిస్తున్నది. నిరుద్యోగం తొలగించి ప్రతివారికీ పని కల్పించడం—అందుకు

తగినట్టు ఆర్థికవ్యవస్థను దిద్ది రూపుతీర్చడం ప్రభుత్వ బాధ్యతగా గుర్తించక తప్పలేదు. అలాగే ఉన్నదున్నట్లుగా పాత ధనికవిధానం తప్పించుకోలేదని కూడ ప్రతి ఆర్థికశాస్త్రజ్ఞుడూ నేడు అంగీకరిస్తున్నాడు.

అయితే ఆచరణలో ప్రపంచసమస్యా నివారణకు వీరు సూచించే మార్గాలు. పద్ధతులు వేరువేరుగా నున్నవి.

యుద్ధోత్పత్తి విధానం

యుద్ధంతప్ప వేరే గత్యంతరంలేదని, కమ్యూనిజం భూతం ప్రపంచాన్నాక్రమించి తమ మార్కెట్టులను దోచుకుంటున్నదని, స్వేచ్ఛారక్షణకు దాని నిర్మూలనం అవసరమని, అందుకు ఆయుధాల ఉత్పత్తి అనంతంగా సాగాలని బాహాటంగా చెప్పేవారు కొందరు. ప్రపంచంలో వీరి సంఖ్య అత్యల్పం.

అమెరికాలో అనంతంగా పెరుగుతున్న ఆయుధోత్పత్తి ద్వారా సంక్షోభాన్ని నెట్టివేయగలగడం ఒక్కటే దారిఅని భావించి అక్కడి ఆర్థికవ్యవస్థ ఎలా వెడుతున్నదో ఈ గ్రంథకర్త విపులంగా వ్రాశాడు. ఇది బొత్తిగా ప్రయోజనకారి కాదని నిరూపించాడు. జర్మనీలోవలె యుద్ధఆర్థిక విధానంద్వారా నెట్టుకురావడం సాధ్యపడదని తెలియజేశాడు. ఇందుకై గుత్తవర్తకులెలా ఒత్తిడితెస్తున్నారో చూపాడు.

> "మామూలు ఆర్థిక పద్ధతులతో అందరికీ ఉద్యోగాలు కల్పించగలిగితేతప్పా, యుద్ధప్రమాదం రెచ్చిపోతుంది....అభ్యుదయ పంథాలోప్రభుత్వంకలుగజేసుకొనడం అనే మిగిలినఏకైకమార్గంలో సంక్షోభాన్నితప్పించేందుకు లేదా నిర్మూలించేందుకు ప్రయత్నించకుండా, అమెరికాలోని ధనికులు, గుత్తవ్యాపారస్తులు యుద్ధోత్పత్తి విధాన విస్తరణకై ప్రాకులాడ్డం ఎందుకు?....దీనికి సమాధానం

స్పష్టమే. మిలిటరీ ఆయుధనిర్మాణం, యుద్ధోత్పత్తివిధానం వీనిలో ఏదైనా తమ పలుకుబడి మరింత బలపడుతుంది.... ఈ రెంటిలో ఏఒకటి ఎన్నుకోవాలనుకున్నప్పుడు వీరు యుద్ధోత్పత్తివిధానాన్నే సహజంగా ఎన్నుకుంటారు, పూర్వంలాగా శాంతి సమయంలో యుద్ధసన్నాహాలేమీ చేయకుండా చిక్కిపోరాదనీ, అదనీ, ఇదనీ లక్ష వాదాలు చెబుతారు, అన్నిరకాలజాతీయభావాలనూ లేపుతారు. క్రొత్త విదేశాంగ విధానంకోసం, అమెరికా యుద్ధోత్పత్తివిధానం వ్యాపింపజేయడంకోసం తమచేతనైనంతా చేస్తారు."

ఈమార్గాన్నే నేడు ప్రపంచ ధనికవర్గం వెదుతున్నది. వీరు సూచించేమార్గం యుద్ధం—లేదా అందుకు మొదటిమెట్టు యుద్ధోత్పత్తి విధానం.

ధనికవిధానంలోనే ఆర్థిక ప్రణాళిక

రెండవది ధనికవిధాన పరిధిలోనే ఆర్థికప్రణాళికద్వారా, ప్రభుత్వం అందరికీ ఉద్యోగాలను, రక్షణను కల్పించాలనే వాదం. ఈవాదస్వరూపం బాగా ప్రతిఫలించేది సర్ విలియం బీవరిడ్జి పుస్తకం-"స్వేచ్ఛాసమాజంలో అందరికీ పని"

ఉన్న మనుష్యశక్తిని పూర్తిగాఉపయోగించే ఉత్పత్తివ్యవస్థ ఏర్పడాలి. ఈపని వ్యక్తిగత ధనిక సంస్థలేవీ కల్పించలేవు. "ఈ నివేదికలో కేంద్రీకృతమైన అంశమిది: సర్వకాల సర్వావస్థల్లోను, బ్రిటన్‌లోనున్న "మానవశక్తి" నంతటిని పనుల్లో ఉపయోగించేందుకు తగిన వ్యవస్థ నేర్పరచాలి. ఆ బాధ్యతను బ్రిటిషుప్రజలు తమ ప్రభుత్వంపై వెయ్యాలి."

ఇందుకాయన ప్రభుత్వం ఒక సంస్థను-నేషనల్ ఇన్‌వెస్టుమెంటు బోర్డును (జాతీయ మూలధనసమితి) ఏర్పరచాలంటాడు. ఆసమితి పనులనిలా వివరించాడు:

"సంగతి సందర్భాలు కనుక్కొని. ప్రభుత్వ, వ్యక్తిగత పరిశ్రమల రెంటికీ పాటుపడుతూ తన పెట్టుబడిని ఒక పద్ధతిలో నిర్ణయిస్తూ ఈసంస్థ పనిచెయ్యాలి, ఈసంస్థే ఒక జాతీయ ప్రణాళికను తయారుచెయ్యాలి. దానిని పార్లమెంటు ఆమోదించినతర్వాత, అమలుజరిపే అధికారం ఈ సమితికుండాలి. ఏదో ఒకమొత్తాన్ని నిశ్చయించి, అంతకుపైబడిన పెట్టుబడిగల పరిశ్రమలు, పని ప్రారంభించకముందే తమస్కీము పూర్తి వివరాలు ఈ సంస్థకు విధిగా పంపేట్టుచెయ్యాలి. వ్యక్తిగతమైన పెట్టుబడి ఏ విధంగా ఎంత, వేనిలో వినియోగింపబడుతున్నదో సంపూర్ణంగా తెలుసుకున్న తర్వాతనే, ఆర్థికమంత్రి ప్రభుత్వ పెట్టుబడికి చెందిన కార్య ప్రణాళికను నిర్ణయించ వీలుండాలి. ఈ నివేదికలో ఊహించిన పరిస్థితులలో మొత్తందేశం పెట్టుబడిలో వ్యక్తులపెట్టుబడి నాలుగోవంతుకంటె మించదు. ఇందులో సగంవంతు మూడువేల ఫాక్టరీలకు చెందిఉంటుంది. ఈ ఫాక్టరీలు దేశం మొత్తంమీద ఉన్నవానిలో నూటికి రెండోవంతుకంటె తక్కువన్నమాట."

(బీవరిడ్జి, స్వేచ్ఛాసమాజంలో అందరికీ పని. 177).

ఇందుకు సర్వాధికారాలూ ఈ బోర్డుకుండాలంటాడీయన.

"ఈ నివేదికలో వివరించిన విధానం సోషలిస్టు కాపిటలిస్టు వివాదాన్ని దాటవేస్తున్నది. వెంటనే సోషలిజం ఏర్పడాలనే వారూ, ఎన్నటికీ సోషలిజంరానేకూడదనేవారూ, అనుభవాన్నిబట్టి ప్రభుత్వ వ్యక్తిగతవ్యాపార విధానాన్ని వాటివాటి గుణావగుణాలనుబట్టి నిర్ణయించుకుందామనేవారు—ఇలాంటి విభిన్నదృక్పథాలు కలవారందరుకూడ దీనిని అంగీకరించవచ్చును."

(అదే 191-92).

ఆర్థికవ్యవస్థలో ప్రధానసమస్య అందరికీ పని కల్పించడం కావాలి అనికూడ చెప్పాడు.

ఇలా ఈయన సోషలిజం కాకుండా ప్రభుత్వం వ్యక్తిగతమైన పెట్టుబడికితోడు తానెక్కువగా పెట్టి, అర్థికవ్యవస్థను కంట్రోలు చేయాలని సూచించాడు. ఈ నివేదికలో ధనికవిధానం హద్దులలోనే ఒకప్రణాళిక నేర్పరచాలనికూడ తెలుపుతున్నాడు,

బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధం ముగియగానే నిరుద్యోగ నివారణకు పనిచేసే బాధ్యత తనదేనని తెలుపుతూ ఒక శ్వేతపత్రాన్ని ప్రకటించింది. దానిని విమర్శిస్తూ సర్‌బీవరిడ్జి ఈ పుస్తకం వ్రాశాడు.

ఈ ప్రణాళికను ప్రభుత్వం నిరాకరించింది. లేబర్‌పార్టీ ప్రభుత్వమేదో సంక్షోభ నివారణకని కొన్ని పరిశ్రమలను జాతీయం చేయాలని నిర్ణయించింది. కాని బ్రిటిష్ ఆర్థికవ్యవస్థ నేడు పూర్తిగా విచ్ఛిన్నమైపోయి ఉన్నది. అమెరికాకు ముడిపడి ఉన్నది. ఈ గ్రంథకర్త ఈ విషయమై ప్రస్తావిస్తూ "ప్రపంచోత్పత్తిలో నూటికి 10 వంతులు ఉత్పత్తిచేసే నీరసస్థితిలో ఉన్న బ్రిటన్ స్వతంత్రంగా ఏమీ చేయలే"దన్నాడు. (సంక్షోభంలో జీవనం 85 పుట)

ప్రభుత్వం ప్రకటించిన క్రిప్సు ప్లానులో (1947) పెట్టుబడిని తగ్గించాలన్నదొక్కటే కనిపిస్తుంది. ప్రభుత్వం పెట్టుబడిని కేవలం సాంఘిక సౌకర్యానికి చెందిన పనులలో మాత్రమే పెట్టాలంటున్నది. ఉత్పత్తిని దేశీయోపయోగానికే చెయ్యాలి. ధనికుల పెత్తనం తొలగించేందుకు కాని, ప్రజావసరాలకు తగినంత ఉత్పత్తి విస్తరించేందుకు కాని ఇందులో సూచనలు లేవు. జాతీయమైన పరిశ్రమలను, ప్రణాళికాబద్ధమైన ఆర్థికవ్యవస్థ ప్రాతిపదికపై కాక, పాతరకం ధనికుల మానేజ్మెంట్లకిందనే నడపాలంటున్నది. ప్రభుత్వానికప్పజెప్పే శిథిలపరిశ్రమలకుగా నష్టపరిహారం క్రింద ఎంతవుతుందో అంచనావేస్తూ ఇనుము, గాసు, విద్యుచ్ఛక్తి, రవాణా, ఉక్కు, బాంకు ఆఫ్ ఇంగ్లాండు వీనికి 250 కోట్ల పౌనులవుతుందని లేబర్ రిసెర్చర్ (డిసెంబరు 1948 లో) వ్రాసింది,

పైగా బ్రిటన్ నేడు పూర్తిగా అమెరికాపై ఆధారపడినది. ఒక్క 1947 లో మాత్రమే అమెరికా కనడాలతో తీసుకున్న ఋణం 80 కోట్ల పౌన్లు. ఈ స్థితిలో అమెరికాను ప్రోద్రోసి సోషలిస్టు ప్లానింగు అమలు జరపడం కొనసాగదు.

ఈ విషయాన్నే ఈ గ్రంథకర్త ఇలా వ్రాశాడు. "విదేశాంగ వ్యవహారాలలో వీరు (అమెరికాధనిక వర్తకులు) అమెరికాసైనిక, ఆర్థిక, పారిశ్రామిక బలాన్నంతటిని ఉపయోగించి, కొత్తరకపు సామ్రాజ్యవాదం అవలంబింపజేస్తారు. విదేశాలలోని అభివృద్ధినిరోధక, ధనికశక్తులన్నిటిని బలపరుస్తూ విదేశమిత్రులను సంపాదించుకునేందుకు ప్రయత్నిస్తారు."

(పుట 296)

మరొకచోట ఇలాఅన్నాడు:

"యూరోపులో అధికసంఖ్యాకులైన ప్రజల అభీష్టానికి విరుద్ధంగా, అభివృద్ధినిరోధకులైన వారిని అధికారంలో ఉంచేందుకు అమెరికా తన పారిశ్రామిక ఆర్థిక సంపత్తినంతటిని ఉపయోగిస్తుంది. ఈవర్గం ఆసహాయమే లేకపోతే కాలవాహినిలో కొట్టుకొనిపోగలదు." (పుట 292)

ఇంతకూ సారాంశం: నేటి ఆర్థికవ్యవస్థ పరిమితిలో, అరిమెకాపై ఆధారపడిన బ్రిటన్. ఏప్రణాళికనూ అందరికీ ఉద్యోగాలు కల్పించేదిగా, సోషలిజానికి పునాదిఏర్పరిచేదిగా అమలు జరపలేదనే.

ఇలాగే యూరోపులోకూడ చాల ధనిక ప్రభుత్వాలు ప్లానింగు వేయాలని చూచి విఫలమవుతున్నవి.

న్యూడీలు-ప్రభుత్వం పెట్టుబడి

ఇక ఈ పుస్తకం సూచించే నివారణోపాయమేమిటి?

ఈ గ్రంథకర్త ప్రభుత్వం పారిశ్రామిక రంగంలో దిగాలని, గుత్త వ్యాపారసంస్థలు బలపడి పోతున్నవికాబట్టి వాటిబలాన్ని విచ్ఛిన్నం చేయాలని సూచిస్తాడు.

ఈయన ముఖ్యంగా అమెరికాలోని అభ్యుదయశక్తు లీతరుణంలో ఏంచేయాలో సూచించేందుకే ప్రయత్నించాడు.

ఆయన సూచనలను ఆయన మాటలలోనే ఉటంకిస్తున్నాను.

గుత్త వ్యాపార సంస్థలను బలహీనపరచడం, మరేమో తద్వ్యతిరేక శక్తులను బలపరచడం తమ లక్ష్యంగా ఏర్పరుచుకోవాలి. అందరికీఉద్యోగాలు కల్పించాలి.

ఆఖరుకు సంపూర్ణంగా ఆర్థికరంగమంతటిని ప్రభుత్వమే నడపాలి.

ప్రభుత్వం ఆర్థికజోక్యాన్ని ధనికవర్గాలు తీవ్రంగా వ్యతిరేకిస్తారు. ఈ కార్యక్రమాన్ని అమలుజరపాలంటే కార్మికులు, గుమాస్తాలు, రైతులు, మధ్యతరగతులు, మేధావులు మొదలైనవారిలో అధికసంఖ్యాకులు దీనిని గట్టిగా బలపరచాలి.

యుద్ధంతెచ్చినా సోవియట్‌ను గెలవడం కష్టం. "అమెరికా తన స్థావరాలనుండి వేలకొలది మైళ్లలోఉన్న సోవియట్‌పై యుద్ధమే చేయవలసివస్తే, అప్పుడు పారిశ్రామిక బలతారతమ్యం లెక్కలకంటె భిన్నం కాగలదు. ఎంతపెరిగినా రష్యాపై మెఱపుయుద్ధం. మెఱపు ముట్టడిని అమెరికా కొనసాగించలేదు. కాబట్టి అంతిమ ఫలితమెలాఉన్నా రష్యా తిరుగుదెబ్బ తీసేస్థితిలోనే ఉంటుంది." (305)

"ఆటంబాంబు యుగంలోనైనప్పటికి నెపోలియన్ ఫ్రాన్సు, హిట్లర్ జర్మనీ చేయలేనిపనిని అమెరికా చేయగలగడం చాలవరకు అసంభవం." (306)

"అమెరికా సాయంలేకపోతే యూరోపులో ధనికవాదం నిలవలేదు. సోషలిజంవేపు నడుస్తున్న పురోగతిని ఆపవచ్చు, లేదా నిదా-

ధంగా సాగేట్టుచేయవచ్చు. కాని శాశ్వతంగా ఆగిపోయేట్టు చేయడం సాధ్యంకాదు."

"రెండు ప్రపంచ అగ్రరాజ్యాలైన సోవియట్ యూనియన్, అమెరికా రెండిటిప్రక్కన స్వతంత్రమైన మూడవ రాజకీయ కేంద్రం యూరపులో ఏర్పడడం—అది రష్యా నియంతృత్వ పద్ధతి నవలంబించకుండా సోషలిజంవేపు పురోగమించడం—ప్రపంచ చరిత్రకూ, ముఖ్యంగా ప్రపంచ శాంతికి ఎంతో ముఖ్యమైనది"

"ఆసియాలో ఏ భాగంలోనైనా సరే అభివృద్ధి నిరోధక శక్తులకు అమెరికా సాయపడకూడదని అభ్యుదయ శక్తులు నొక్కిచెప్పాలి."

"అమెరికాలో ఆర్థికసంక్షోభం అలముకొన్నప్పుడు ప్రపంచం, చరిత్ర సంధియుగంలో నిలుస్తుంది. ముందేకాక సంక్షోభ కాలంలోకూడ అమెరికాలో ధనికులూ. గుత్త పెట్టుబడిదారులే నిర్ణాయక రాజకీయశక్తిగా ఉన్నట్టయితే విదేశాంగ, దేశీయ. ఆయుధనిర్మాణాది విధానాలకువారే కారకులయితే, చరిత్ర మూడవ యుద్ధమార్గాన్నిబట్టి నడుస్తుంది. ఆతర్వాత పశురాజ్యం ప్రవర్తిల్లుతుంది.

"అలాకాక అమెరికాలో అతివాద, అభ్యుదయశక్తులు ప్రధాన నిర్మాతలు కాగలిగితే, ఒక్క అమెరికాలోనేకాక యావత్ ప్రపంచంలోను అభ్యుదయదశకు నాందీ పాడబడుతుంది." (313)

## సోషలిజం

మార్క్సిస్టులు సూచించే నివారణోపాయం సోషలిస్టు సమాజ నిర్మాణం. ఇక ఈ ధనికవ్యవస్థ ఉన్నన్నిరోజులూ ఈ సంక్షోభాలూ, యుద్ధాలూ, తప్పవుకాబట్టి, ఈ వ్యవస్థలో గుత్తవర్తక సంస్థలబలం

బ్రహ్మాండంగా ఉండగా, ఏ మరే సంస్కరణకూ వారంగీకరించక ప్రతి ఘటిస్తారుకాబట్టి, నేటి అమెరికాలో యుద్ధఆర్థికవిధానం బలపడుతున్నది కాబట్టి సోషలిజంతప్ప మరొక్క శాశ్వత నివారణోపాయం ప్రపంచానికి లేదు. ఈవాద సారాంశం తెలిపే జాన్ ఈటన్ వాక్యాలు ఉదహరిస్తాను:

"ధనికవాదానికి పరిష్కారం లేదు. దాని జీవితాన్ని ప్రజల బాధలు, దరిద్రం, యుద్ధం వీనిమీదనే కొన్నాళ్లు పొడిగించవచ్చు. ధనికవిధానంలోని పరస్పరవైరుధ్యాలు ప్రతిచోటా బయటపడుతున్నవి. అమెరికా సామ్రాజ్యవాదం యూరోపు రక్షణబాధ్యత తనపై వేసుకున్నానంటూ ఉత్పత్తిదారులైన కార్మిక సంస్థలపై దాడిచేస్తున్నది. వారిని వ్యతిరేకం చేసుకుంటున్నది. చట్టా వ్యాపారస్తులను, కపట రాజకీయవేత్తలను, రిటైరైన ఫాసిస్టులను తన స్వతంత్ర స్వచ్ఛంద సేవకులనుగా చేసుకుంటున్నది. ఇందువల్ల ధనికవిధానానికి ఆటపట్టులుగా తయారుచేయాలని తాననుకునే దేశాలే అంతర్యుద్ధంవేపు నడుస్తున్నవి. అమెరికా స్వతంత్రాన్నిగూర్చి మాట్లాడుతున్నదికాని తాననుకునే స్వతంత్రం నెలకొల్పాలంటే ఫాసిజానికీ మిలిటరిజానికీ పితృదేవతలైన వారిని తిరిగీ సింహాసన మెక్కించాలి. యూరోపు పునర్నిర్మాణానికి ప్రణాళికలు వేస్తానంటున్నది, కాని ఆప్రణాళికలు అమలుజరపడం పెట్టుబడిదారీ తగాదాకోరులకు అప్పగిస్తున్నది, వీరి ప్రపంచం ధనికవిధాన అరాచక ప్రపంచం...."

చైనాలో చంగ్ కై షేక్, కొరియాలో సిగ్మన్‌రీ, వియత్నాంలో బోదాయ్, ఆఖరుకు స్పెయిన్‌లో ఫ్రాంకో వీరికి విశ్వాసపాత్రులిప్పుడు.

"ధనికవిధానం పురోగతికి దారిచూపదు—సంక్షోభానికి యుద్ధానికే దారితీస్తుంది. నేటియుగం ప్రపంచం సోషలిజానికి మారే సంధియుగం. సోషలిస్టుశక్తులు సామ్రాజ్యశక్తుల నెదిరించి రోజు రోజూ ఆర్థికంగా. రాజకీయంగా. సిద్ధాంతరీత్యా బలపడుతున్నవి."

ఇది మార్క్సిస్టుల పరిష్కారమార్గం.

ఇంతకూ సామాన్య మానవుడు కోరుతున్నది తిండి. బట్ట. తలదాచుకునే చోటు. తనచుట్టూరా శాంతి.

ఇందుకు యుద్ధం దారితీయదని అతనికి తెలుసు. సోషలిజంతో ఏకీభవించనివారైనా ఆ వ్యవస్థను ఆటంబాంబులతో విధ్వంసం చేయనక్కరలేదుకదా. యుద్ధాలు సాంఘికసమస్యలను పరిష్కరించలేవని అతని పాత అనుభవం.

మరి సమాజం సుఖసౌభాగ్య శాంతి సంపదలతో తులతూగేందు కేదిమార్గం? అది అతను బాగా ఆలోచించాలి. వివిధ దృక్పథాలను తెలుసుకోవాలి. వానిని మననంచెయ్యాలి. తన బాధ్యతను తానుగుర్తించాలి. విశ్వకళ్యాణంకోసం శాంతి సౌభాగ్యాలకోసం ఉడుతకు ఉడుతాభక్తిగా తానూ పనిచేయాలి. ఈ పుస్తకం ఈ సమాలోచనలో సహకరించగలిగితే, అతని ఆలోచనను రేపగలిగితే మా యీ ప్రయత్నం కృతార్థమైనట్టు భావిస్తాము. అదే మా లక్ష్యం.

ఈలక్ష్యసిద్ధిపై మాకు విశ్వాసమున్నది. ఈపుస్తకాన్ని కొసకంటా శ్రద్ధగా చదవమని, బాగా ఆలోచించమని సామాన్యునికి మా ప్రార్థన.

మదరాసు
10-10-51

విశ్వం
ప్రధాన సంపాదకుడు

# ఉపోద్ఘాతం

నిరుద్యోగాన్ని నిర్మూలించి, ఉత్పాదకశక్తిని సంపూర్ణంగా ఉపయోగించుకునేందుకు అమెరికాకు, మొత్తంమీద ఆంగ్లో శాక్సన్ ప్రపంచానికి ఒక్క ద్వితీయయుద్ధం జరుగుతున్న రోజులలోమాత్రమే సాధ్యమయినది. యుద్ధసమాప్తి నెంతో ఆనందంతోకాక, అదో మాదిరి విచారంతో, అనుమానంతో చాలమంది నిరీక్షిస్తూవచ్చారు. అందు కిదొక ముఖ్యమైన కారణం. ఈ అనుమానం దూరదృష్టిగల ఏ కొందరిలోనో మాత్రమేకాదు, లక్షలాది ప్రజలలో తలసూపినది.

యుద్ధకాలంలో నేమో అందరికీ పనికల్పించిన దేశాలన్నీ శాంతి సమయంలోకూడ అలా చేయగలవా? లేక సంధికాలం — కొద్దో గొప్పో-ఆ కాస్తా గడచిపోగానే, లక్షలాదికార్మికులు పూర్వంలాగే తిరిగీ నిరుద్యోగులవుతారా?—యావత్ ప్రపంచంలోని లక్షలాది సామాన్యప్రజ లీ ప్రశ్న నెంతో ఆతుర్దాతో పదేపదే అడుగుతున్నారు. ఈ మామూలు నిరుద్యోగ సమస్య తిరిగీ ఏప్పుడితీరవలసిందేనా?—దీనిని నిరోధించేశక్తి పెద్ద పారిశ్రామికదేశాలకుకూడ లేదని చాలమంది సందేహం—ఇందుకు కారణమేమిటనికూడ వారు మరొకప్రశ్న వేస్తున్నారు. యుద్ధకాలంలో ప్రతి ఒక్కరూ బాంబర్లను, టాంకులను, మందుగుండు సామానులను ఉత్పత్తి చేస్తుంటే నిరుద్యోగం లేకపోవడమేమిటి? మరి శాంతిసమయంలోకూడ ఆహారపదార్థాలు, బట్టా బాతా, ఇళ్లు, మోటారుకారులు వగైరా ఉత్పత్తి చేయవలసే ఉన్నప్పటికి నిరుద్యోగ మెందుకు తలసూపాలి?

నిజంగానే కోట్లకొలదిప్రజ లీ ప్రశ్నలు వేస్తున్నారు. ఇందుమూలంగా, ప్రధానమైనవిషయాలలో వారి దృక్పథం మారినదని స్పష్టపడుతూనే

ఉన్నది. చరిత్రలో మొట్టమొదటి సారిగా ఆర్థిక సంక్షోభంగూర్చి—అదింకా చాలకాలానికి రానున్న దనగానే – లక్షలకొలది ప్రజలు భయభ్రాంతు లవు తున్నారు.

యుద్ధాన్నిగూర్చిన దృక్పథంలాగే, ఆర్థికసంక్షోభం గూర్చికూడ ప్రజలదృష్టి మార్పుచెందినది. మధ్యేమధ్యే ఆర్థికమాంద్యం కొద్దికాలం అడపాదడపా తల సూపినప్పటికీ, చాలకాలం ఆర్థికాభివృద్ధి కలిగిన తర్వా తనే మొదట ప్రపంచయుద్ధం వచ్చింది. ఆ సమయంలో అది విశ్వరూ పంతో ప్రత్యక్షం కాలేదు. అంతేకాక ప్రపంచంలోని పెద్ద పారిశ్రామిక దేశాలలో కార్మికులసంఖ్య క్రమంగా అసంఖ్యాకంగా పెరుగుతూవచ్చినది.

1870-71 ఫ్రాంకో ప్రష్యన్యుద్ధం మినహా, ఈకాలపుయుద్ధాలన్నీ ఆధునిక పారిశ్రామిక నాగరికత ఆరంభకాలంలోనే వచ్చాయి. కాబట్టే పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన పెద్ద రాజ్యాలమధ్య యుద్ధ మిక అసంభవ మన్నభావం బాగా వ్యాపించింది. ఇందువల్ల ప్రథమ ప్రపంచ మహాయుద్ధం అశనిపాతంలా అకస్మాత్తుగావచ్చి ప్రజలను నిర్విణ్ణులను చేసివేసింది.

ప్రథమ మహాయుద్ధంగూర్చి ప్రజ లెలా విస్తుపోయి చూచారో, 1929 లో వచ్చిన ప్రపంచ ఆర్థికసంక్షోభంగూర్చికూడ, వా రలాగే విభ్రాంతి చెందారు. పెట్టుబడిదారీ వస్తూత్పత్తివిధానం దాదా పొక శతాబ్దిదాకా అను దినాభివృద్ధి చెందుతూ వస్తున్నది. ఈ భౌతికాభ్యుదయం సహజమనీ, తప్పనిసరి అనీ ప్రజలు భావిస్తూవచ్చారు. కాబట్టే ఈ అభివృద్ధి కారణాల గూర్చి వా రేమాత్రం లోతుపాతుల్లోకి దిగి ఆలోచించలేదు. అందువల్ల 1929 ఆర్థికసంక్షోభం హఠాత్తుగా విభిన్నమైన దారితొక్కడం వారిని మరింత ఆశ్చర్యచకితులను చేసినది. దీనితో పోలిస్తే ఇంతకు మునుపటి ప్రతిష్టంభనలు చాల తక్కువకాలం ఉన్నవి. వాని ఉద్ధతి తగ్గగానే తిరిగీ ఉత్పత్తి యథాస్థితికివచ్చి, క్రమంగా పెరగడంకూడ కనిపించేది. అలాగే

1929 ఆర్థికమాంద్యంకూడ ఉంటుందని జనం భావించడంలో ఆశ్చర్యం లేదు. ఆ మాంద్యంనుంచి కోలుకొన్నా అభివృద్ధి ఎందు కంత మంద గించిందో; ఈ నూతన ఆర్థికయుగంలో అసంఖ్యాకులు నిరుద్యోగులుగా నుండిపోవడం శాశ్వతలక్షణంగా ఎందు కేర్పడినదో వారి కర్థం కాలేదు. కొత్తయుగం ఆరంభమైనదన్నది సుస్పష్టమే.

ప్రథమ ప్రపంచయుద్ధంగూర్చి, ఆర్థికసంక్షోభంగూర్చి ప్రజలు విభ్రాంతులైనప్పటికీ, రెండవ ప్రపంచయుద్ధం రాగానే అలా విస్తుపోలేదు. నాజీ పార్టీ అధికారంలోకి రాగానే, ప్రజలు, యుద్ధం వస్తుందా రాదా అని ప్రశ్నించడం మానివేశారు. వస్తుందన్నది ఖాయమని వారికి తెలుసు. ఎప్పుడు వస్తుందనిమాత్రమే వారిప్రశ్న. వా రడుగుతూవచ్చిన ప్రశ్న లివి: యుద్ధం ఎప్పుడు వస్తుంది? మొదట ఏ యే దేశా లందులో పాల్గొంటాయి? తర్వాత ఏవి చేరుతాయి? చేరకుండా యే దేశాలుండగలుగుతాయి?

యుద్ధమంటే భయం, వ్యతిరేకత ఉన్నది. అది వచ్చినా తమ దేశ మెలాగో అందులో తగుల్కొకుండా ఉండగలదులే అన్న ఆశ వీరిలో కనిపిస్తున్నది. అయినప్పటికీ, మొదటి యుద్ధంలా కాక, రెండవయుద్ధం గూర్చి ప్రజ లిది తప్పదనే భావిస్తూవచ్చారు.

రాకముందే యుద్ధాన్నిగూర్చి వారి దృక్పథం మారినట్టుగానే, ఆర్థిక సంక్షోభం రాకముందే, దానియెడలకూడ వారిదృష్టి మారినది. ఆర్థిక సంక్షోభ పిశాచికి తాము బలికాక తప్పదని వివిధదేశ జనసామాన్యం ఎన్నడో తేల్చివేసుకున్నది. దానిని దాటివేయగలమన్న ఆశ కొంతకు కొంత చాలమంది కున్నప్పటికీ, అంత దృఢమైనవిశ్వాసంమాత్రం లేదు. సంక్షోభం ఎప్పుడు వస్తుంది? ఎంతవరకు వ్యాపిస్తుంది? ఎలాంటి పరిస్థితులలో అది ఆరంభమవుతుంది? ఇలాంటి ప్రశ్నలే తప్ప అసలు వస్తుందా అని ఎవరూ ప్రశ్నించడంలేదు. తా ముంటున్న పెట్టుబడిదారీ సమాజ

వ్యవస్థ ఒక కొత్త విభిన్నదశలో ప్రవేశించిందని ఈప్రశ్నలు సూచిస్తున్నవి. కాని ఈసంగతి జనసామాన్యానికి స్పష్టంగా తెలియదు.

పెట్టుబడిదారీ ఆర్థికాభివృద్ధి దశ వందయేళ్ళలోనూ సామాన్యంగా ఇలాంటిప్రశ్న లెన్నడూ ఉదయించలేదు. ఈనా డీ ప్రశ్నలనూ, ఇలాంటి మరి కొన్నిటినీ ఆర్థిక శాస్త్రప్రవీణులూ, రాజకీయవేత్తలేకాక, ఆర్థిక రాజకీయాదులలో ఏమాత్రం ప్రత్యేక జ్ఞానంలేని సామాన్యప్రజ లెంతో ఆందోళనతో అడుగుతున్నారు. ఏదో యాదాలాభంగా ప్రశ్నించడంలేదు. మరి ఇందులో తమ అస్తిత్వం యావత్తూ, భవిష్యత్తు యావత్తూ అంతర్గర్భితమై ఉన్నదన్న ఆందోళనతో వారీ ప్రశ్నల నడుగుతున్నారు. ఆర్థికచరిత్రలో ప్రపంచ మొక సంధియుగంలో నిలిచి ఉన్నదన్న అంశ మిందులో స్పష్టంగా కన్పిస్తున్నది. ప్రపంచ ధనికవిధాన మొక నూతనదశలో ప్రవేశించింది.

సామాన్యప్రజ లందరూ తమ భవిష్యత్తునుగూర్చి యెందుకు భయపడుతున్నారు? తమ నిరుద్యోగాన్ని నిర్మూలించగలవని చెప్పబడుతున్న అసంఖ్యాక ప్రణాళికలనుచూచి వారెందుకు పెదవి విరుస్తున్నారు? ఎన్ని మంచిమాటలు, ఊరటలు చెబుతున్నా కొత్త ఆర్థికసంక్షోభం విపరీతంగా వచ్చి పడుతుందని వారెందుకు భయభ్రాంతులవుతున్నారు? ఇందుకు సమాధానం సులభమే. 1929 నాటి ఆర్థికసంక్షోభాన్ని వారింకా బాగా జ్ఞప్తికుంచుకునే ఉన్నారు.

ఆ సంక్షోభాన్నిగూర్చి ఈ పుస్తకం మొదటిభాగంలో చర్చించదలచాము. ఇది విస్మృత గత చరిత్రనుగూర్చి చర్చించడం కాదు. వర్తమానాన్నీ భవిష్యత్తునూ ఆకట్టుకున్న గతాన్నిగూర్చి చర్చిస్తున్నా మన్నమాట. వాస్తవస్థితిలో పై సంక్షోభం నేటికీ సంతృప్తికరంగా పరిష్కృతంకాలేదు. అదింకా మనల నలముకొనే ఉన్నది. భాష ముఖ్యంగా పరస్పరాభిప్రాయ

ప్రకటనకూ గ్రాహ్యతకూ సాధనం. కాని అది అసమగ్రమయినదీ. ఒకొ కప్పుడది భావగ్రహణకు ఆటంకంకూడ అవుతుంది. అంతకుముందు వానినికూడ, 1929 నాటి స్థితినివలెనే ఆర్థికసంక్షోభం అని పిలిస్తే అందువల్ల 1929 నాటి ఆర్థికస్థితి సుబోధకంకాదు. మరింత దుర్బోధక మవుతుంది కూడ. ఇదికూడా పాతకాలంనాటి ఆర్థికమాంద్యాలవంటిదే నను కుంటే దాని వాస్తవస్వభావం మనకేమాత్రం తెలియనేతెలియదు. అంతకు మునుపటికంటె ఈ సంక్షోభం (1929) పూర్తిగా భిన్నమైనది.

పారిశ్రామికంగా పెరిగిన అగ్రరాజ్యాల ఆర్థికచరిత్రలో, ఈ సంక్షోభానికి సారూప్యాలెక్కడా, ఎన్నడూ లేవు.

1929 లో ఉత్పత్తిస్థాయి 100 అని అనుకున్నామంటే, 1932 నాటికాస్థాయి అమెరికాలో 53.8 కి, జర్మనీలో 53.3 కు పడిపోయింది.* అమెరికాలో ఆర్థికజీవితంలో ముఖ్యంగా విపరీతమైన ఒడుదుడుకులు కనిపిస్తాయి. కాని, ఇంత హీనస్థితికి ఉత్పత్తి ఎన్నడూ పడిపోలేదు. జర్మనీ విషయంలోకూడ అంతే. మొదటి అర్థ శతాబ్దిపొడవునా మొదటి మహాయుద్ధంవరకూ, ఆర్థిక మాంద్యాలవల్ల ఏర్పడిన ఉత్పత్తి తగ్గుదల 6 % కంటె ఎన్నడూ మించలేదు.• చాల సార్లు 3 % కంటె మించలేదు.

---

* నానాజాతిసమితి లెక్కల పంచాంగం 938-29 పుట 181.

• వ్లాదిమిర్ కోయటన్స్కి: అర్థికసంక్షోభంవల్ల వచ్చిన ఆర్థికఫలితాలు. అంతర్జాతీయ కార్మికసంస్థ, జెనీవా 1936. "జర్మన్ పరిశ్రమలలో 1860 నుండి 1913 లోగా అభివృద్ధి ఆరుసార్లు అర్థికసంక్షోభంతో అరికట్టబడినది.-(1867, 1872, 1883, 1891, 1900, 1907). కాని రెండుసారులు (1883, 1900) మటుకు కేవలం ఉత్పత్తి కొత్తగా పెరగకపోవడం మాత్రమే వీనిఫలితం. మిగత నాలుగుసార్లలోను ఉత్పత్తిపతన మీవిధంగా ఉండినది. 1867–1870 లో 6%; 1872-1874 లో 6%: 1891-92 లో 3%; 1906-1908 లో 6%; ఉత్పత్తి తరుగుదల కనిపిస్తుంది.

1929 తర్వాత 46.7 % ఉత్పత్తి పడిపోయింది. మరీ అధ్వాన్నమైన దనుకున్నప్పుడు మునుపు ఉత్పత్తిరోజరిగిన తగ్గుదలకంటె ఈ తగ్గుదల యేడింత లెక్కువన్నమాట. పూర్వంవాటితో ఈ సంక్షోభాన్ని పోల్చ వీలు లేనందు కింతకంటె తార్కాణం కావాలా?

ఈ విపరీతమైన ఉత్పత్తి తరుగుదల, (దానివెంట నంటివచ్చిన ప్రపంచవ్యాపారంలో హీనస్థితి) దీనితోపాటు నిరుద్యోగులసంఖ్యలో వచ్చిన బ్రహ్మాండమైన పెరుగుదలకూడ 1929 ఆర్థిక సంక్షోభ విశిష్టతకు లక్షణాలు కావు. అన్నిటికంటె ప్రత్యేకప్రాముఖ్యంగల అంశ మేమిటంటే 1939 లో రెండవ మహాయుద్ధం ప్రారంభమయ్యేవరకుకూడ ప్రపంచోత్పత్తి 1929 నాటి దెబ్బనుండి కోలుకొనలేకపోతున్నది. శాంతి అవసరాలకై ఉత్పత్తి కొనసాగుతున్నంతవర కిదే స్థితి కనబడినది.

ఆర్థికసంక్షోభ తీవ్రత తగ్గాక, ఉత్పత్తి యథాస్థితికేకాక, మరింత అధికం కావడంకూడ మామూలు. ఇలాకోలుకోకపోవడమనేది వంద యేళ్ళ పెట్టుబడివారీ ఉత్పత్తివిధానంలో ఎన్నడూ కని విని యెరుగని కొత్త అనుభవం. 1929 తర్వాత పరిస్థితే విభిన్నమైనది. సంక్షోభతీవ్రత నధిగమించినప్పటికి, శాంతి అవసరాలకు చెందిన ప్రపంచోత్పత్తి 1929 కి ముందటిస్థాయి నందుకోనేలేదు. మంచికాలంలోకూడ అమెరికాలో అంత కంటె హీనంగానే ఉండిపోయినది. అదేసమయంలో వైజ్ఞానికాభివృద్ధి అఖండంగా సాగుతున్నది. 1929 సంక్షోభం నాటికంటె నిరుద్యోగుల సంఖ్య చాల ఎక్కువైనది. 1929-30 దశలోని ప్రపంచ నిరుద్యోగసంఖ్య, మొదటియుద్ధానికి వెనక ఏ సంక్షోభ దశలోకంటెగూడ అత్యధికమైనది. ఆధునిక ప్రపంచ ఆర్థిక చరిత్రలోకెల్లను ఈ పదేళ్ళసంక్షోభం అతి తీవ్ర తరమైనది.

ఆ సంక్షోభాన్ని వివిధదేశ ప్రజానీకం మఱచిపోలేదు. భయోత్పాతంతో, భగ్నహృదయంతో భవిష్యత్తుపై ప్రజలు చూడ్కులు బఱపుతున్నారంటే, ఊరటమాటలన్నిటిని విని చప్పరిస్తున్నారంటే కారణం, ఈ ఆర్థికసంక్షోభజ్వాల మింకా లోపల కాగుతుండగనే, పారిశ్రామికదేశాలు రెండవ ప్రపంచయుద్ధంలో ప్రవేశించినవని వా రెరుగుదురు కాబట్టే. యుద్ధకారణంగా అణచిపెట్టబడి అంతర్గర్భితమై ఉన్న ఈ సంక్షోభం తిరిగి పూర్వపు మహా దారుణరూపంతో తమపై విఱుచుక పడగలదని వారి గుండె గుబగుబమంటున్నది. మునుపటివా టన్నిటికంటె ఈ సంక్షోభం అతి ఘోరమైనదని, ఇక రానున్న సంక్షోభం ఇంతకంటె ఘోరాతిఘోరంగా రాగలదని వారుతికమకపడుతున్నారు.

ఈ సందేహాలు, అనుమానాలు సకారణమైనవా అన్నదే మనముందున్న సమస్య. 1929 నాటి ఆర్థికసంక్షోభంలాంటి సంక్షోభం రానున్నదా? ఈ ప్రశ్నకు స్పష్టంగా ఖచ్చితంగా జవాబివ్వడమే ఈ పుస్తకలక్ష్యం. ఇప్పుడే చెబుతాను. పై ప్రశ్నకు నా సమాధానం "ఔను" అని మాత్రమే. అలాంటి సంక్షోభం మనపై విరుచుకపడనున్నది. దానిని నిరోధించేవానికంటె, అందుకు దారితీసే శక్తులే నేడు బలవత్తరంగా నున్నవి.

భావి సంక్షోభం 1929 నాటికంటె ప్రధానలక్షణాలలో భిన్నమైన ప్రపంచపరిస్థితిలో ఏర్పడగలదు. దాని విశ్వరూపాన్ని, తీవ్రఫలితాలను గ్రహించాలంటే మనం కేవలం ఆర్థికాంశాలనే కాక, ప్రపంచరాజకీయ పరిస్థితులనుకూడ వివరించుకొనవలసి ఉంటుంది.

ఈ అంశాలదృష్ట్యా ఈ పుస్తకరచన సాగినది. అపరిష్కృతంగా నిలిచిపోయిన 1929 నాటి సంక్షోభం మొదటిభాగంలోని కేంద్రాంశం. ఆనాటి రాజకీయపరిస్థితులుకూడ అందులో చర్చించబడతాయి. రెండవ

భాగంలో ప్రధానాంశం భావిసంక్షోభం, దానివల్ల ఏర్పడే స్వదేశీ విదేశీ రాజకీయఫలితాలు-వీనిచర్చ.

బుద్ధిపూర్వకంగానే ఈ గ్రంథంలో, కేవల ఆర్థికరంగానికేకాక దానికి చెందనివిషయాలనుగూడ చర్చించాను. మన మనుకున్నంత గొప్ప సమస్యలలో కేవల ఆర్థికపరిస్థితంటూ ఒకటి సాధ్యంకాదు. మనం ప్రపంచ యుద్ధయుగంలో జీవిస్తున్నాము. ఈయుగంలో ఆర్థికసంక్షోభానికీ యుద్ధానికీ మధ్యనున్న సన్నిహితసంబంధం స్పష్టాతిస్పష్ట మవుతూ ఉన్నది. ఇందుమూలంగా ఆర్థిక రాజకీయవివరణలు వేరువేరుచేయ వీలులేనిస్థితి ఏర్పడినది. సంక్షోభఫలితాలు విశ్వవ్యాప్తమవుతాయని, అవి ప్రపంచ ఆర్థిక రాజకీయపరిస్థితిలో విప్లవం కొనిరాగలవని గ్రహించినప్పుడే భావిసంక్షోభ స్వరూపస్వభావాలను మనం అర్థం చేసుకోగలుగుతాము.

ఈ నూతనసంక్షోభదశలో మన మింకా అడుగుపెట్టలేదు. అది విజృంభించడానికి మరికొన్నియేళ్లు పట్టవచ్చును. కాని దానిఫలితాలు ప్రపంచచరిత్రలో గాఢంగా ప్రతిఫలించగలవీ, అతి తీవ్రమైనమార్పులకు దారితీయ గలవీ కాబట్టి, ఆ సంక్షోభాన్ని కొనివచ్చేశక్తులనుగూర్చి పరిశీలించడం తప్పనిసర మవుతున్నది.

అలాంటి పరిశీలనకు ఉపస్కారకంగా ఈ పుస్తకరచన సాగినది.

న్యూయార్కు
వసంతం 1946

ఫ్రిట్జు స్టెరన్బర్గు

II

ఒకటవ అధ్యాయం

# ధనికవ్యవస్థావ్యాప్తి-సంక్షోభమూ

ఆర్థికసంక్షోభంలో చాల చిక్కుసమస్య లెన్నో అంతర్గర్భితమై ఉన్నవి. వాని నన్నిటిని వివరంగా చర్చించడం ఇంత చిన్న పుస్తకంలో సాధ్యం కాదు. అయినప్పటికి 1929 నాటి సంక్షోభాన్ని అర్థం చేసుకోవాలంటే అసలు ఆర్థిక సంక్షోభాన్నిగూర్చి తెలుసుకోవడం అత్యవసరం.*

## ధనికవ్యవస్థలో సంక్షోభ మెందుకువస్తుంది?

ధనికవిధానం పుట్టుకనుంచీ ఆర్థికసంక్షోభంతో బాధపడుతున్నది. దాని వ్యాప్తితోపాటు సంక్షోభంకూడ ప్రపంచాన్నంతటిని అలముకొన్నది. ఈ వందయేళ్ళలోను పరిశీలకులు చాల సాధనసంపత్తిని సేకరించారు. అందుమూలంగా మనకు తెలియవచ్చే అంశమేమంటే, ధనికవిధానం అవిచ్ఛిన్నంగా ఏకధాటితో అభివృద్ధి చెందుతూరాదు; ఒకొక్క దశ తర్వాత—అది పెద్దదో చిన్నదో కావచ్చు—ఆర్థిక సంక్షోభమనే హీనదశ కూడ వస్తుంది; అప్పటికే ఉత్పత్తి అయిన వస్తువులకు అమ్మకందొరక్క ఉత్పత్తి పడిపోతుంది; నిరుద్యోగం పెరుగుతుంది, లాభాలు, జీతాలు కూడ తగ్గిపోతవి; తర్వాత కొంతకాలానికి ఉత్పత్తి కుదుటపడుతుంది;

---

* ఇక్కడ తడివినసమస్యలను వివరంగా నా ఇతర పుస్తకాలలో చర్చించాను. అవి జర్మనీభాషలోవి. ఇంగ్లీషులోనికి అనువాదం కాలేదు. సంక్షోభాన్నిగూర్చిన సిద్ధాంతభాగంగూర్చి వివరంగా మరో పుస్తకం వ్రాస్తున్నాను.

నిరుద్యోగులను తిరిగీ ఉత్పత్తి కార్యక్రమంలోనికి తీసుకుంటారు. ఆఖరున ఉత్పత్తి పూర్వస్థాయినేకాక అధికస్థితినికూడ అందుకుంటుంది.

ఈ ధనికవిధానగతి స్వభావం నూరేళ్ళకుపైగా కనబడుతునే ఉన్నది. కాబట్టి, ఇదెందుకు రావాలి?, అభివృద్ధిక్రమంగా—దినదినాభి వృద్ధిగా ఉత్పత్తి యెందుకు విస్తరించదు?, ఒకొక్కదశలో అతి త్వరగా ఉన్నతి చెందడం, మధ్యేమధ్యే తీవ్రతర సంక్షోభాలువచ్చి అభివృద్ధి కుంటు పడడం—ఇలాంటి ఎగుడుదిగుడు లెందుకు రావాలి—అన్నప్రశ్న లీనాటివి కావు. చాలకాలంనుంచీ వివేచకులు పరిశీలిస్తున్నవే.

ఈప్రశ్నల కనేక సమాధానా లున్నవి. వానిలో వైవిధ్యాలన్నిటిని పరిశీలించినట్టయితే ఈశతాబ్దిలోని జవాబు లన్నిటిని ప్రధానంగా రెండు తెగలకు చెందినవిగా విభజించవచ్చును. ఆ తెగలలో ఒకటి బూర్జువా వర్గం, రెండు సోషలిస్టువర్గం. సంక్షోభం ధనికవిధానంలో విడదీయరాని భాగమని, ఆ సమాజవ్యవస్థలో అది తప్పనిసరి అనీ, ఆ సంక్షోభం ధనిక వ్యవస్థ పునాదులనే కదల్చివేస్తుందనీ, ఆఖరునకు దాని అస్తిత్వానికే ప్రమాదం కలిగిస్తుందనీ సోషలిస్టు దృక్పథం. అలాకాక బూర్జువా దృక్ప

ధనికవ్యవస్థకు పూర్వం సంక్షోభం

ఘానికి చెందినవారి నేదేమిటంటే. ప్రతి సంక్షోభమూ ఏదో ఒక "ఆటంకం" "అల్లరి" లాంటిది మాత్రమే; దీనిని చాలవరకు తప్పించుకొన వీలున్నది. సంక్షోభం రానురాను అతి తీవ్రతరమవుతూ ఆఖరుకు ధనిక వ్యవస్థనే కూలదోసేంత బ్రహ్మాండరూపం వహిస్తున్నదని ముఖ్యంగా ఈవర్గానికి చెందినవారొప్పుకోరు.

ఈసంక్షోభంలో ఉత్పత్తి, వినియోగాలు ఎలా వ్యక్తీకృత మవుతాయో చెప్పడంలో రెండు దృక్పథాలకు చెందినవారూ ఏకీభవిస్తారు: ఆర్థికాభ్యుదయ దశలో ఉత్పత్తి క్రమాభివృద్ధి చెందుతుంది. దానితర్వాత లాభసాటి ధరలకు ఉత్పత్త అయిన సరుకులన్నీ అమ్మడ మిక సాధ్యం కాకపోతుంది. ఈ పరిస్థితి ఆర్థికసంక్షోభాన్ని తెలుపుతుంది. కాని ఇలాంటి స్థితెందుకు రావాలి?

దినదినాభివృద్ధి చెందుతున్న సరుకులకు లాభసాటి అమ్మకాన్ని చూపెట్టడం ధనికవిధానపు ప్రధానకర్తవ్యం. ఇందు కనుకూల పరిష్కారం కుదిరితే అది అభ్యుదయ దశ—కుదరనిది సంక్షోభదశ.

విపరీతంగా రోజురోజుకూ పెరిగిపోతున్న సరుకులకు బజారును చూపెట్టడమే ఆర్థిక సంక్షోభసమస్య అనడం, ఒక్క పెట్టుబడిదారీపద్ధతికి

ధనికవిధానంలోని సంక్షోభం



చెందిన ఉత్పత్తివిధానానికి మాత్రమే అనువర్తిస్తుంది. దీనికి పూర్వమున్న ఆర్థికవిధానాలలోకూడ సంక్షోభా లున్నవి. కాని ధనికవ్యవస్థలోని కారణాలకంటె పూర్తిగా విరుద్ధమైన కారణా లాదశలలో సంక్షోభానికి దారితీసేవి.

ఈఅంశాన్ని డయాగ్రాములద్వారా మరింత స్పష్టపరచుకొందాము. ఒకొక్క డయాగ్రాములోను రెండు పొడుగాటి గీతలున్నవి. ఒక టందులో ఉత్పత్తిని, మరొకటి వినియోగాన్ని తెలుపుతాయి. వినియోగాని కంటె—లేదా గిరాకీకంటె ఉత్పత్తి వెనుకబడినప్పుడు ధనికవ్యవస్థకు పూర్వం సంక్షోభా లేర్పడేవి. కారణ మేదైనప్పటికి ఉపయోక్తల అవస రాలకు తగినంత ఉత్పత్తి సాగేదికాదు. బహుశా యుద్ధాలవల్ల విశాల భూములు నష్టం కావచ్చు, పంటలు పాడుకావచ్చు లేదా ప్రాచ్యదేశాలలో సర్వసామాన్యంగా జరిగేట్టు ప్రధాన జలాధారాలు పాడుపెట్ట బడవచ్చును. వీనిలో ఏకారణమైనా కావచ్చు.

ఉత్పత్తి న్యూనతవల్ల ఆనాటి ఆర్థికసంక్షోభా లేర్పడేవి. ఏతత్ఫలి తంగా పేదవారు నానాబాధలకు గురియ్యేవారు. కాని ధనికవిధానంలోవలె, గిడ్డంగులు సరుకులతో నిండిపోయి, లాభం కావలసినంత రాదని అమ్మకం ఆపివేయబడేది కాదు. పైగా జీవితావసరాలు కూడ చిక్కేవి కావు. పెట్టుబడిదారీవిధానికి ముందు, సాధారణ పరిస్థితులలో ఉత్పత్తి వినియోగాలు సమానంగా ఉంటూవచ్చేవి.

ధనికవిధానం క్రింది ఉత్పత్తిలో నేటి ప్రధానసమస్య తరుగుదల కాదు—ఒకవేపు అధికోత్పత్తి, మరొకవేపు కొనుగోలు తగ్గిపోవడం—

సోషలిస్టు దృక్పథంప్రకారం ఈ అధికోత్పత్తి ధనిక సమాజ వ్యవస్థలోని ప్రముఖలక్షణంవల్ల ఏర్పడుతుంది. ఈ సంఘంలో ఉత్పత్తి

సాధనాల యజమానులైన అత్యల్ప సంఖ్యాకవర్గం ఒకవేపు–కోట్లకొలది కార్మికులొకవేపు ఉంటారు. కొంత పెరగడానికి వీలున్నప్పటికీ, ఈ కార్మికులజీతాలుగాని, వినియోగశక్తిగాని ఉత్పత్తితో సమానంగా పెరగవు.

నేటి సోషలిస్టు సిద్ధాంతాలలో పెక్కింటికి పితామహుడైన కరల్ మార్క్సు విశ్వాసమేమిటంటే, కార్మికులయొక్క, ప్రజాసామాన్యం యొక్క వినియోగశక్తిని తప్పక పరిమితంచేసే ధనికసమాజవ్యవస్థే ఈ సంక్షోభాలకు కారణం, అధిక సంఖ్యాకులైన సామాన్యప్రజల కొనుగోలు శక్తి, ఏ కాసంత భేదంతోనో అతి పరిమితమైపోతుంది. ఇందుకు కారణం సంపకంలోని పరస్పరవిరుద్ధ పరిస్థితులే. ఇందువల్లనే ధనిక విధానంక్రింద వస్తువుల విడుదల పరిమితమై పోతుంది అని ఆయన చెప్పాడు.*

ధనికవ్యవస్థ తన ఉత్పత్తిని క్రమాభివృద్ధి చెందిస్తూ, విస్తరింప జేసి తీరవలసివస్తుంది. మరి అందుతోపాటు అందుకు తగినట్టు విశాల ప్రజానీకపు వినియోజనశక్తి పెరగడానికి వీలుండదు. దానికి కారణం ధనికవ్యవస్థలోని వర్గపీడనమూలంగా వారి వినియోజనశక్తి అతి సంకు చితమైన హద్దులలో పరిమితమై పోతుంది–అని ఆయనవాదం. మార్క్సు సోషలిస్టు సిద్ధాంతాలప్రకారం, ప్రజల వస్తువినియోగశక్తి సన్నగిలడం సంక్షోభానికి కారణమని చెప్పవచ్చును. ఈ కారణాన్ని ధనికవ్యవస్థ పరిధి లోనే తొలగించడం సాధ్యంకాదు. ఈవాదం సమర్థనీయమైనదని చెప్పక తప్పదు.

---

* కరల్‌మార్క్సు, డస్‌కాపిటల్ III సంపుటి, 15 అధ్యాయం, పుట 226, హాంబర్గ్. 1894.

ఏమైనప్పటికి ఈ వినియోగశక్తి సన్నగిలడం, పదేపదే వచ్చే సంక్షోభాలలో ఎలా బయటపడుతుందో, దాని అసలుగతిని చెప్పడం మటుకు చాల క్లిష్టమైనది. ధనికవిధానం ఒక్క వినియోగవస్తువులనే కాక, ఉత్పాదక వస్తువులనుకూడ తయారుచేస్తుంది. ధనికవ్యవస్థ అభివృద్ధి చెందినట్లల్లా ఉత్పాదక యంత్రోత్పత్తి అధికాధిక మవుతూవస్తుంది. తమ జీతాలలో కార్మికులు కొనగల వస్తువులను అమ్మివేయడంలోను, అలాగే ధనికులకే స్వంతానీ కవసరమైన వస్తువులను అమ్మివేయడంలోను కష్టంలేదు. ఉత్పత్తిని విస్తరింపజేసేందుకై తయారుచేసిన ఉత్పాదకవస్తువులను ఖర్చుపెట్టడంలోకూడ ప్రథమంలో అట్టే కష్టముండదు. యంత్రాలు వగైరాలు మొదట్లో వ్యాపారంకోసం ధనికులకే అవసరమవుతాయి.

ఈ ఉత్పాదకవస్తువుల అమ్మకం పెరిగేకొద్దీ అందుతోపాటు, రోజువారీ ఉపయోగించుకొనే వస్తువుల మార్కెట్టుకూడ విస్తృతమవుతుంది. ఎందుకంటే వాని ఉత్పత్తికై ఎక్కువమంది కార్మికు లవసరమవుతారు. వారి జీతాలు ఉపయుక్తవస్తువుల అమ్మకాన్ని హెచ్చిస్తాయి. కాబట్టి ఈ విస్తరణదశ ఉన్నంతకాలం, అమ్మకంసమస్య పూర్తిగా పరిష్కృతమవుతుంది. కాని అది కొంతకాలమే. తర్వాత ఏదో ఓరోజు—కాదు ఒక సంవత్సరం రానేవస్తుంది.

కొత్తఫాక్టరీల నిర్మాణం పూర్తి అవుతుంది. ఉత్పాదక యంత్ర విస్తరణ దాదాపు ముగియవస్తుంది. పాతవాని విస్తరణలోను, కొత్తవాని నిర్మాణంలోను పనిచేసే కార్మికులు తొలగింపబడతారు. వారి కిక జీతాలు రావు. వారు కావలసినవస్తువుల నిక కొనలేకపోతారు. కనీసం ముందంతగా కొనలేరు. అందుకు తగినట్లు వస్తూపయోగం, వస్తువుల గిరాకీ తగ్గిపోతుంది. అయినప్పటికి, అంతకుముందుగా విస్తరింపజేసిన పరి

శ్రమలమూలంగా ఉపయుక్తవస్తువుల ఉత్పత్తి పెరుగుతూనే వస్తుంది. దీనిఫలితం ఆర్థికసంక్షోభం.

ఇలా ఉత్పత్తి విస్తరీకరణం, విశాలీకరణం, సమృద్ధి గల దశ వెనక్రాలే సంక్షోభం వస్తుంది. ఏమైనప్పటికి రోగంతోపాటు ఓంకమైన చికిత్సకూడా కలిసిఉన్న జబ్బులలోచేరినదే ఈ సంక్షోభంకూడ. సంక్షోభ సమయంలో ఉత్పత్తిలో కొంతభాగం మూలబడుతుంది—కారణం ఆర్థికంగా దివాలా తీయడం. ఇందుమూలంగా కొత్త ఉత్పత్తిస్థాయి, కొత్త ఖరీదులకు అవకాశం చిక్కి నూతనోత్పత్తి విస్తరణ సాధ్యమవుతుంది. కరల్‌మార్క్సు, ఫ్రెడరిక్ ఏంగిల్సులు 1948 లో కమ్యూనిస్టు మానిఫెస్టోలో ఇలా వ్రాశారు.

> "బూర్జువావర్గం సంక్షోభా న్నెలా అధిగమించ గలుగుతుంది? ఒకవేపు ఉత్పత్తిశక్తులలో కొంతభాగాన్ని బలవంతంగా విధ్వంసం చేయడం మూలంగాను, మరొకవేపు కొత్తమార్కెట్టులను జయించి సంపాదించడంద్వారాను అన్నిటికంటె, పాతవానిని పరిపూర్తిగా ఉపయోగించడంద్వారాను బూర్జువావర్గం సంక్షోభా న్నెదుర్కొగలుగుతుంది."

సంక్షోభం ధనికవ్యవస్థలో ఎందు కేర్పడుతుందో, అభివృద్ధి అనుక్రమంగా ఎందుకు సాగదో, పదేపదే ఆర్థికమాంద్య మెందుకు వస్తాంటుందో వివరించే కారణాలను కొన్నింటి నింతవరకూ మనం గుర్తించాము. కాని ఆరంభంలో మనం వేసుకున్న ప్రశ్న కింకా సమాధాన మిచ్చుకోలేదు; 1929 నాటి సంక్షోభం అంత తీవ్రరూపం వహించేందుకు కారణమేమిటి? త్వరలోనే రానున్న సంక్షోభ స్వరూపలక్షణాధు లేమిటి? నేటి ధనికపద్ధతి, 19 శతాబ్దికీ, 20-వ శతాబ్దిలో ప్రథమ మహాసంగ్రామం

వస్తూ ఉన్న పూర్వభాగానికి చెందిన ధనికపద్ధతికంటె, ఏ ప్రధానాంశా లలో విభిన్నమైనదో సమగ్రంగా వివరించేందుకై ఈ సమస్యలోని ఉత్తర భాగాన్ని వివరించుకోవాలి. ధనికవిధానాభివృద్ధీ, అందుతోపాటు సంక్షోభ క్రమం, ఏ చారిత్రక వాతావరణంలో ఏర్పడినవి ?—ఏర్పడనున్నవి ?

## ధనికవిధానం ప్రధానమైన ఉత్పత్తివిధానంగా మారినది.

యూరోపులో అంతకుముందున్న భూస్వామ్య విధానంలోనుంచీ, ధనికవిధానం పరిణతినందినది. అయినప్పటికి భూస్వామ్యవిధానాన్ని కాని, ఇతర పూర్వ ఆర్థిక సాంఘికవ్యవస్థ లన్నింటినికాని ఒక్కరోజులో ఇది స్థానభ్రష్టం చేయలేదు. ఈమార్పు శతాబ్దుల తరబడి జరిగినది. నేటికికూడ బాగా అభివృద్ధిచెందిన యూరోపుదేశాలలోకూడ అదింకా పూర్తికాలేదు. ఉదాహరణకు యూరోపులోకల్లా బాగా పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన జర్మనీలో రెండోయుద్ధమూ, నాజీ రాజ్య సైనికపతనమూ ఇవే ఆఖరుకు భూస్వామివిధానాన్ని నిర్మూలించినవి.

అంతేకాక ధనికవిధానం కొన్నిదేశాలలో ప్రధాన ఉత్పత్తివిధాన మైనప్పటికి, యావత్ప్రపంచంలోను అలా జరగలేదు. రెండోయుద్ధం ముగిసినా, నేటికికూడ ప్రపంచంలోని ఉత్పత్తివిధానం ఒక ధనికపద్ధతికి మాత్రమే చెందినదికాదు. ప్రపంచంలోని వ్యవసాయికులసంఖ్యను తీసుకుందాము. వారిసంఖ్య 130 కోట్లకంటె తక్కువఉండదని అంచనావేశారు.* మొత్తం ప్రపంచజనాభాలో దాదాపు మూడింట రెండువంతులు రైతులన్న మాట. వారిలో చాల తక్కువమంది ధనికవ్యవస్థకు చెందినపరిస్థితులలో

---

* కరల్‌బ్రాంట్, ప్రపంచ వ్యవసాయ పునర్నిర్మాణం - W. W. నార్టన్ అండ్ కో. న్యూయార్కు, 1945, పుట 7. "నూటా ముప్పైకోట్ల ప్రపంచ ప్రజ లింకా రైతులుగా నున్నారు."

పనిచేస్తున్నారు. వారిలో అత్యధికసంఖ్యాకులు ఆశియా, ఆఫ్రికాలలో నివసిస్తున్నారు. ఆ భూఖండాలలో నేటికికూడ ధనికవిధానం చాల ప్రారంభదశలో నున్నది.

మరొక అంశం—కొన్ని దేశాలలో ధనికవ్యవస్థ ఇంకా అభివృద్ధి చెందుతుండగనే, అత్యధిక జనసంఖ్యగల సోవియట్ యూనియన్‌లో పూర్తిగా దీనికి భిన్నమైన నూతన సమాజవ్యవస్థ నెలకొన్నది. ఇలా ప్రపంచంలోని అత్యధికభాగం ధనికవ్యవస్థ గుప్పిటినుండి వేరుపడినది. కాబట్టి ధనికసమాజపరిధిలో పెట్టుబడిదారీ పరిస్థితులక్రింద ప్రపంచంలోని అధికసంఖ్యాకప్రజ యెన్నటికైనా ఉత్పత్తిని కొనసాగించగలదా అని మన మనుమానించేందుకు కారణమున్నది.

ఇక పెట్టుబడిదారీవిధానం ప్రపంచంలోని అధిక సంఖ్యాకులకు వ్యాపించకపోయినప్పటికీ, నెపోలియన్ యుద్ధాలతో ఆరంభమై మొదటి మహాయుద్ధంతో ఆఖరయ్యే శతాబ్ది ఈ ధనికవిధానాభివృద్ధితో ఉపలక్షితమైనది. ఈ అభివృద్ధి ఒకప్పుడు అతి వేగంగాను, మరొకప్పుడు నెమ్మదిగాను జరుగుతున్నా ఈ శతాబ్ది పొడుగునా సాగుతునే ఉన్నది. ఇది మొదట ఆరంభమైనదేశాలలో అంతకు మునుపున్న ఆర్థికవ్యవస్థలను పూర్తిగా నిర్మూలించి ప్రధానత నందుకొన్నది. క్రమంగా మరికొన్ని దేశాలు ఈ విధానం క్రిందికి వచ్చాయి. ఈ శతాబ్దిలో ధనికవిధానం అంతకు మునుపటికంటె అతివేగంగా పురోగమించినది.

నెపోలియన్ యుద్ధాలు ముగిసిన వెనువెంటనే కేవలం ఒక్క యింగ్లాండులోను, కొన్ని పశ్చిమ యూరపు రాజ్యాలలోను మాత్రమే సుప్రతిష్ఠితమైన ధనికవిధానం, ఆ శతాబ్ది ఆఖరుకంతా ప్రపంచంలో ప్రధానమైన బలవత్తరమైన ఉత్పత్తివిధానంగా ఏర్పడినది.

ఆ శతాబ్ది ఆరంభంలో ధనికేతర మహాసముద్రంలో ఓ చిన్న దీవిగానుండిన ధనికవిధానం, 19 శతాబ్ది మధ్యకాలందాకా అలాగే ఉండి పోయినది. ఆరోజుల్లో ప్రపంచప్రజలలో నూటికి పదిమంది ధనిక విధానంక్రింది ఉత్పత్తివిధానంలో నిమగ్నులైనారని అన్నామంటే మన మెంతో ఉదారంగా అంచనా వేస్తున్నామన్నమాట. అయితే తర్వాత అతి వేగవంతంగా. మొదట ప్రపంచయుద్ధందాకా నడిచిన అభ్యుదయ దశలో వారిసంఖ్య నూటికి యాభైవరకు హెచ్చింది. ఈలోగా జనాభా కూడ అలాగే చాల పెరిగిపోయింది.

## సంక్షోభంనుండి తప్పుకునేందుకు కొత్తబజారులు కావాలి

మనం పరిశీలించదలచుచున్న ఆర్థిక సంక్షోభానికీ ఈ ధనికవిధాన అభ్యుదయదశకూ సంబంధ మేమిటని పాఠకుడు చకితుడు కావచ్చును. ధనికవిధానంలో సంక్షోభాన్ని కొనివచ్చే శక్తు లిందువల్లనే అదుపులోనికి కొనిరాబడినవి.

ప్రపంచమంతటా ధనికవిధానవ్యాప్తిమూలంగా అమ్మకపుసమస్య ఎన్నోవిధాల పరిష్కృతమైనది. అందులో ఈ క్రింది మూడు అంశాలు ముఖ్యమైనవి.

(1) ఇందుమూలంగా స్వదేశీపరిశ్రమలకు విదేశాలలో మార్కెట్టులు సంపాదించుకోవడం జరిగింది. అందుతో కోట్లకొలది ప్రజలను ధనిక ఆర్థికవ్యవస్థలోనికి లాగడం జరిగింది. ఏతత్ఫలితంగా లాభాలు పెరిగాయి, పెట్టుబడి హెచ్చింది, వస్తువినియోగంలో పెట్టుబడిదారుల భాగం హెచ్చినది.

(2) ఈ విక్రయ సౌకర్యాల విస్తృతినిబట్టి, బాగాఅభివృద్ధిచెందిన ధనికదేశాలలో లక్షలాదికార్మికులను అధికంగా పనిలో చేర్చుకొన

వీలయినది. ఇందువల్ల ఈ దేశాలలో వస్తువినియోగంకూడ చాల ఎకకు హెచ్చినది.

(3) బాగా అభివృద్ధిచెందిన పారిశ్రామికదేశాలలో కార్మికులకు అస్మకంచేసే వసతులు కల్పించే చాల పరిస్థితులు (వీనిని తర్వాత వివరిస్తాము) ఏర్పడినవి. ఇందుతో కార్మికుల సంఖ్య పెరగడమే కాక జీతాలుకూడా బాగా హెచ్చినవి.

ధనికసమాజంలోని వర్గ వ్యత్యాసం, సంక్షోభానికి ప్రధానమైన కారణమన్నసంగతి మరొకసారి జ్ఞాపకం చేసుకుందాము. ఈ వ్యత్యాసం వల్లనే ఉత్పత్తి విస్తరీకరణ ఆటంకపరుప బడినది. ఎందుకంటే ఒక వేళ ఎక్కువచేయడమే జరిగితేకూడ కార్మికులయొక్క, సామాన్య ప్రజలయొక్క వస్తువినియోగశక్తి, అతి సంకుచిత పరిమితిలో మాత్రమే పెంచడం సాధ్యమవుతుంది.

ధనికవిధానం ప్రపంచంమొత్తంమీద విజయవంతంగా వృద్ధి చెందడంతో లేబర్ మార్కెట్టులో (కార్మికుల వస్తువిక్రేతలకు) అను కూల పరిస్థితులేర్పడినవి. ఇందుతో సామాన్యప్రజల వస్తువినియోగశక్తి యెక్కువయినది. ఈ ఆధిక్యతా ధనికుల స్వంతవస్తువినియోగశక్తి పెరుగుదలా ఇవి, స్వదేశీమార్కెట్టుకు సరఫరాచేసే పరిశ్రమలు బాగా వృద్ధి అయ్యేందుకు హేతువైనవి. ఇలా స్వదేశ విదేశ వాణిజ్యం విపరీతంగా విస్తరించడంతో సంక్షోభకారక శక్తులపై కొంత అదుపాజ్ఞ లేర్పడినవి. (ఈదశలోకూడ మధ్యేమధ్యే ఆటంకాలతోనే ధనికవిధానాభి వృద్ధికొనసాగినది.) అయినప్పటికి, కొత్త విక్రయస్థానాలుదొరికేకొద్దీ ఈ ఆటంకాలను సులువుగానే దాటగలిగినది. అభ్యుదయదశ మరింత విశాలవ్యాప్తమైనది.

వాటర్లూనుండి సెరజెవోదాకా నడిచిన ఈ అభ్యుదయ యుగములో ధనికవిధానమెలా ప్రపంచంలో పాదుకున్నదో ఖచ్చితంగా తెలుసుకుందాము. దాని వ్యాపకం, తద్వారా విక్రయస్థానాలు - ఈ క్రిందిరీతిగా విస్తరించినవి;

(1) ధనికవిధానం బాగా అప్పటికే పాదుకున్న గ్రేట్‌బ్రిటన్‌లాంటి యూరపుదేశాలలో పురాతన ఉత్పత్తి విధానాల నిర్మూలనం కొనసాగుతూవచ్చినది. ఈ విధానంరానురాను ప్రధానమైనట్టి, దాదాపు ఏకైకమైనట్టి ఉత్పత్తివిధానంగా నెగడినది. ఈ విధానమింకా శైశవదశలో నున్న దేశాలలో-ఆరోజుల్లో ఈమాట యూరోపుఖండానికంతటికి అనువర్తిస్తుంది-ఆఖరుకిది ప్రధానఉత్పత్తి విధానంగా ఏర్పడినది. ఉదాహరణకు జర్మనీ.

(2) ఇదే సమయంలోనే, పారిశ్రామికంగా ఉత్పత్తిచెందకున్నా ఇంకా రాజకీయస్వాతంత్ర్యం కల దేశాలకుకూడ వెళ్లింది. అక్కడ పరిశ్రమాభివృద్ధి జరుగుతున్నంతకాలం వ్యాపిస్తూనే వచ్చినది. ఉదాహరణకు రష్యా జపానులు.

(3) అల్పజనసంఖ్యగల అమెరికా, కెనడా, తెల్లవారు నివసించే బ్రిటిష్ అధినివేశాలు వగైరా ప్రదేశాలలోకూడా ధనికవిధానం వృద్ధిచెందినది. యూరపు పెట్టుబడిదారీ పద్ధతి విస్తరణకీ ప్రాంతాలెంతో ఉపయోగించినవి. ఈ దేశాలలోనికి పెట్టుబడి, సరుకులు, లక్షలకొలది స్వదేశీయులు - ప్రవహించడం జరిగినది, వలస వెళ్లడం బ్రహ్మాండరూపంతో కొనసాగినది.

(4) ఇక స్వతంత్రం పోగొట్టుకున్న ప్రాంతాలలోనికికూడ ఈ ధనికవిధానం వ్యాపించింది. ఇవి సామ్రాజ్యపు వలసదేశాలు-ఉదాహర

ణకు ఆశియా ఆఫ్రికా ఖండాలలో చాల ప్రాంతాల కీ విధానం వ్యాపించింది. ఈ ప్రాంతాలనెంతవఱకు పారిశ్రామికం చేయాలన్న విషయంలో, యూరోపులోని సామ్రాజ్యదేశాల ప్రయోజనాల కనుగుణముగా నిర్ణయం చేయబడుతూవచ్చింది.

ఇలా విస్తరింపబడుతున్న ధనికవిధానం మూలంగా అధికంగా ఉత్పత్తి అవుతున్న వస్తువులకు ప్రపంచమంతటా మార్కెట్టులను కని పెట్టడం జరిగింది. ఇందుతో విదేశవాణిజ్యం ప్రపంచంలో ఎక్కువక్రావడం సహజమే. 1850 ని గూర్చి కాలిన్‌క్లార్కు ఇలా అన్నాడు.*

"దిగుమతులు, ఆనాటి ప్రపంచంలో 33 కోట్ల 60 లక్షలపౌనుల విలువగలిగినా, మొత్తం ఎగుమతులు 30 కోట్ల 50 లక్షల పౌనుల విలువగలవిగాను ఉన్నవి. ఆనాడు వాణిజ్యంలో నాయకత్వం వహించినవి ఆరు రాజ్యాలు."

యూరపియన్ దేశాలు. ఇతర దేశాలు.

(పదిలక్షల పౌన్లస్టెర్లింగులో)

| | దిగుమతులు | ఎగుమతులు |
|---|---|---|
| గ్రే. బ్రిటన్ | 100 | 70 |
| ఫ్రాన్సు | 45 | 56 |
| హాంబర్గు | 22 | 20 |
| హాలెండు | 22 | 18 |
| బెల్జియం | 16 | 15 |
| రష్యా | 14 | 14 |

| | దిగుమతులు | ఎగుమతులు |
|---|---|---|
| అ. సంయుక్తరాష్ట్రాలు | 39 | 32 |
| ఇండియా | 12 | 20 |
| బ్రేజిల్సు | 6.5 | 5.5 |
| క్యూబా | 5.7 | 5.6 |
| చైనా | 2 | 5 |
| కనడా | 4 | 3 |

1. కాలిన్‌క్లార్కు, అర్థికాభివృద్ధిపరిస్థితులు, లండన్ 1940, పుట 449,
2. అదేపుట 461.

1850 నుండి 1913 దాకా ప్రపంచవాణిజ్యం మహోన్నతంగా వృద్ధిచెందినది. ఈ క్రింది అంకెలుకూడ కాలిన్‌క్లార్కుగారినుండే తీసుకుంటున్నాను. (2) ఇవి 1851 నుండి ప్రపంచవాణిజ్యం పెరుగుదలను తెలుపుతాయి. పౌనుల లెక్కలోనున్నవి. మొదటి కాలంలో ఆనాటిధరలు, రెండులో 1929 నాటిధరల లెక్కను ఇచ్చాము.

మిలియన్ పౌన్లలో ప్రపంచవాణిజ్యం

| | | | 1929 నాటి ధరల లెఖ |
|---|---|---|---|
| 1851 | .... | 641 | 997 |
| 1860 | .... | 1,428 | 1,903 |
| 1869-70 | .... | 2,297 | 2,795 |
| 1880 | .... | 3,024 | 4,230 |
| 1892-96 | .... | 3,852 | 6,890 |
| 1900 | .... | 4,025 | 6,610 |
| 1910 | .... | 6,430 | 9,050 |
| 1913 | .... | 7,840 | 10,710 |

ఈ అంకె లేమిటిని తెలియజేస్తున్నవి? ఆనాటిధరలలో చూచినా. 1929 నాటి ధరలలో చూచినా, 1850 నుండి 19 శతాబ్ది చివరిదాకా ఆరింతలకంటె ఎక్కువగా ప్రపంచవాణిజ్యం వృద్ధిచెందినది. 1900 నుండి, మహాయుద్ధ ప్రారంభానికి ముందటి సంవత్సరం 1913 నాటివరకు ఈ స్వల్పకాలంలోనే ఒక్కతూరి దాదాపు మూడింత రెండువంతులు వృద్ధిచెందినది.

1851 నుండి 1913 దాకా ఒక్క విదేశ వాణిజ్యం వృద్ధిచెందడమే కాదు. స్వదేశంలో అమ్మకంకూడా అంతకంటె ఎక్కువగా పెరిగి పోయినది.

ఇందుతో మనవివరణ ఒక ప్రధానఘట్టానికి వచ్చినది. ఇక ఈ అభివృద్ధిదశలో పనిలోఉన్న కార్మికులసంఖ్య, వారి జీతాలు ఎలా ఎక్కువయ్యాయో. తద్వారా స్వదేశవ్యాపారం మెలా ఇనుమడించిందో మనం కనుక్కోవాలి. ఈ అభివృద్ధికి కారణాలు ధనికయుగంలో ఒకానొక ప్రత్యేక కాలానికి మాత్రమే ఎలాసరిపడినవో, అదెంతవరకో ఇక మనం కనుక్కోవలసి ఉన్నది.

### ఉద్యోగాల పెరుగుదల జీతాల హెచ్చుదల

పెట్టుబడిదారీపోటీవల్ల, పెట్టుబడిదారులు తమలాభాలలో కొంత భాగాన్ని, తమ యంత్రాలను మరింత సున్నితం చేసేందుకు, తమ వ్యాపారాన్ని మరింత విస్తృతం చేసుకునేందుకుగా పెట్టుబడిక్రింద మార్చుకోవడం తప్పనిసరి అవుతుంది. ఏ పెట్టుబడిదారీ కర్మాగారాన్ని తీసుకున్నప్పటికి, దానిపెట్టుబడిని రెండుగా మనం విభజించవచ్చును. ఒకభాగం యంత్రాలు, ముడిసరుకులు, అందుకుచెందిన మరికొన్నిటిని కొనేందు కుపయోగిస్తారు. రెండోదాన్ని జీతాల కుపయోగిస్తారు. ఇందులో మొదటిభాగాన్ని ఎక్కువచేయడం, రెండవభాగాన్ని క్రమంగా తగ్గించడం ధనికవిధానాభివృద్ధిలో ఎల్లప్పుడూ మనకు కనిపిస్తుంది. మరొక విధంగా చెప్పాలంటే, తాము పెట్టే పెట్టుబడిలో ఒక నిర్ణీత భాగానికి మొదట నూరుమందిని పెడితే, క్రమంగా తర్వాత అంతమొత్తాలకే ఆ కార్మికుల సంఖ్యను తగ్గించేందుకు ప్రయత్నించడం, అలా తగ్గించడం కనిపిస్తుంది. వైజ్ఞానికాభివృద్ధి మూలంగా యంత్రోపయోగం ఎక్కువకావడం కార్మికుల

సంఖ్య తగ్గడం వీలవుతుంది. ఇందుమూలంగా నిరుద్యోగం పెరుగుతుంది—మార్క్స్ మాటలుపయోగిస్తే "పారిశ్రామిక మూలబలం" నిర్మిత మవుతూ వస్తుంది,

ఈ కార్మికమూలబలం మూలంగా కార్మికుల జీవనస్థాయి హీన స్థితిలోనే ఉండిపోతుంది. కారణం కార్మికుల వస్తువినియోగశక్తి హెచ్చనే హెచ్చదు. ఒకవేళ హెచ్చినా చాల సంకుచిత పరిమితిని దాటదు. అని మార్క్స్ మహాశయు డన్నాడు. ఆయనింకా ఇలా వ్రాశాడు.

"సాంఘిక శ్రమశక్తి అభివృద్ధి పుణ్యమా అంటూ, ఉత్పత్తి సాధనాలు మహత్తరంగా వృద్ధిచెందడం జరుగుతుంది. ఇందు మూలంగా మానవశక్తి వ్యయాన్ని క్రమంగా తగ్గించవచ్చును. ఇది ధనికవ్యవస్థలో ఎలాంటి రూపాన్ని ధరిస్తుందంటే......శ్రమ శక్తికున్న ఉత్పాదనశక్తి హెచ్చినకొల్లా తమ జీవనోపాధిపై కార్మికుల ఒత్తిడి ఎక్కువవుతూవస్తుంది. ఇందువల్ల వారి జీవిత పరిస్థితులు మరింత అధ్వాన్న స్థితికి వస్తాయి."*

దీనికి ముందు, ఆయన ఇలా వ్రాశాడు;

"పారిశ్రామిక చక్రంలో అప్పుడప్పుడు వచ్చే మార్పులను బట్టి కార్మిక మూలబలం పెరగడం తరగడం ఆధారపడి ఉంటుంది. దీనిననుసరించే జీతాల మామూలు పెరుదుదల తరుగుదల సామాన్యముగా నిర్ణీత మవుతూ వస్తుంది."•

తాను పరిశీలించిన యుగంలో నిరుద్యోగ మధికమవుతుందని, తద్వారా జీతాలు, కార్మికుల వస్తువినియోగశక్తి తగ్గిపోయే అననుకూల

---

* కరల్‌మార్క్స్, డస్‌కాపిటల్, సం I, పుట 610 హాంబర్గ్, 1909

• అదే - పుట 602.

పరిస్థితు లేర్పడతాయని మార్క్స్ అప్పటికే తేల్చివేశాడు. ఈ విషయములో ఈయనది పొరబాటని ఇప్పుడు మన మెరుగుదుము. ఈ కాలంలో నిరుద్యోగుల సంఖ్యలో అంత పెద్ద పెరుగుదల కనిపించలేదు. అంతేగాక పని దొరికిన కార్మికులసంఖ్యలో చాల అభివృద్ధి కనిపించింది. ఇదెలా జరిగినది అని మనం ప్రశ్నించుకోవాలి. కార్మికులసంఖ్యేగాక, వారిజీతాలు పెరగడంకూడ సాధ్యపడజేసే కారణాలేమిటి అని మనం తెలుసుకోవాలి.

ఇక్కడకూడా అసలు నిర్ణాయకాంశం ఆధునిక విధానాభివృద్ధి జరుగుతున్న చారిత్రిక వాతావరణమే. ఈ శతాబ్దిలో పెట్టుబడిదారీ పద్ధతిలో ఉత్పత్తి అభివృద్ధి ఎన్నిమార్గాల నడిచిందో తెలుసుకున్నాము. కార్మికులకొనుగోలుశక్తిపై వాని ఫలితా లొకే విధంగా లేవు. ఒకొకతూరి అవి పరస్పర వ్యతిరేకంగాకూడ నడిచాయి. ప్రప్రథమంగా, ధనిక విధానము మునుపటి ఉత్పత్తి విధానా లన్నిటిని నిర్మూలించి, ఆస్థానంలో తన ఉత్పత్తి పద్ధతిని నెలకొల్పినది. ఈ సమయంలోకూడ పెట్టుబడిదారీపోటీ సహజంగా ఉండనేఉన్నది. యంత్రోత్పత్తి నెక్కువచేసి, తమ ఉత్పత్తి శక్తిని పెంచి తీరవలసిన స్థితిలో ధనికులున్నారు.

ఫలితం—పెట్టుబడిలో ఒక నిర్ణీతాంశానికి పూర్వంకావలసినంత కంటె కార్మికులు తక్కువ అవసరమై నిరుద్యోగం ప్రబలినది. పాత కాలపు ఉత్పత్తి విధానాలను నిర్మూలిస్తున్న సమయంలో స్వదేశాలలో మరొకరెండు రకాల కార్మికులు పెట్టుబడిదారులకు చిక్కారు. పల్లెలలో ఒత్తి డెక్కువై అక్కడినుండి పట్టణాలకు; వలసవచ్చినవారు; రెండు- పూర్వం స్వతంత్రంగా పనిచేసుకుంటూవచ్చిన చేతిపనులవారు. వీరు, యంత్రాలవల్ల ఉత్పత్తి అయిన సరుకులు చవకగనక, వానితో పోటీ చేయలేక తమ వృత్తులు నాశనమైపోయి ఫాక్టరీలలో పనికోసం దేవులాడుతూ పట్టణాలకు చేరుకున్నారు. ఇలా పల్లెలనుంచి వలసవచ్చినవారు..

స్వతంత్రవృత్తులు పాడైపోయిన చేతిపనులవార్లు మొదలైనవారితో నిరుద్యోగ కార్మికసంఖ్య మరింత పెరిగిపోయింది. ఇందువల్ల కార్మికులకు వస్తువులు విక్రయించేవారిస్థితి అధ్వాన్నమయిపోయినది. ఫలితం ఈ దశలో బాగా అభివృద్ధిచెందిన ధనికదేశాలలో అసలు జీతాలు పెరగలేదు. ఎక్కడో పెరిగినా ఇవిచాల కొద్దిగామాత్రమే పెరిగాయి.

ఇంగ్లాండులోని పరిస్థితేమిటి? 1913 లో జీతాల ప్రమాణం, లెక్క కోసం 100 అని అనుకుంటే, 1820 లో 59 మాత్రమే, 1825 లోనూ 59 మాత్రమే. 1830 నాటికి 58 కి తగ్గాయి. 1835 కు మరీ 57 కు తగ్గాయి. 1840 లో 59 కి పెరిగినా తిరిగీ 1845 కు 57 కు పడిపొయ్యాయి. 1850 దాకా అలాగే ఉన్నవి. అంటే 1820 కంటె 1850 నాటికి రెండుపాయింట్లు తక్కువగా ఉన్నాయన్నమాట. *.

ఫ్రాన్సులోకూడ ఇదే పరిస్థితే కనిపిస్తుంది. 1900 నాటి జీతాల ప్రమాణం 100 గా తీసుకున్నామంటే, 1810 లో 55.5, 1820 లో 53.5, 1810 లో 54, 1840 లో 57, 1850 లో 59.5 కు తగ్గి ఉన్నాయి. •

ఈ కాలంలోని సంక్షోభాలు చాల తీవ్రరూపంతో వచ్చాయి. వాని తీవ్రతకు ముఖ్యకారణం, ఉత్పత్తి, ఉత్పాదనశక్తి ఎంతవృద్ధిచెందినదో అందుకే మాత్రం సరిపోలనిరీతిగా కార్మికవర్గ జీవనప్రమాణం అతి హీనస్థితిలో నున్నది. ఈ కాలంలోని - 19 శతాబ్ద పూర్వార్థంలోని పరి

* ఈలెక్కలన్నీ క్రింది పుస్తకాలలోనుంచి తీసుకున్నాము. డాక్టర్ కారల్ టిస్‌జ్కా పుస్తకం ఆర్డర్ యల్ బౌలేగారి, 19 శతాబ్దంలో బ్రిటన్‌లో జీతాలు, అనే పుస్తకం—

2. అవే.

స్థితులే, నిరుద్యోగాన్ని గూర్చి, ఆర్థికసంక్షోభాలనుగూర్చి మార్క్సు పరిశీలనకు తగిన విషయసామగ్రి సేకరణకు సాయపడినవి. దీనిమీద ఆధారపడే ఆయన, ఈ ధనిక విధానపు ప్రారంభదశలోకూడ మరింత తీవ్రమైన వర్గవైషమ్యాలు చెలరేగగలవని విశ్వసించాడు - ఇందులో ఆశ్చర్యంలేదు.

గ్రేట్ బ్రిటన్‌లో 19 శతాబ్ది మధ్యభాగంలోని, మిగతా యూరోపు పారిశ్రామిక దేశాలలో మరికొంతకాలానికి ఈశకం అంతమయినది. ప్రపంచాధిపత్యానికైన పెట్టుబడిదారీ దండయాత్ర ఉన్నతి సందుకున్నది.

ఇలా ధనికవిధానం ప్రపంచవ్యాప్త మవుతుండగా, ఇందువల్ల వివిధదేశాలలోని కార్మికుల వస్తువినియోగశక్తి తగ్గినదేకాని యెక్కువకాలేదు. మరి పారిశ్రామికదేశాలలోని స్థితి కది వ్యతిరేకమైనస్థితి. అఖండంగా పురోగమిస్తున్న సామ్రాజ్యవాదగతిలో ముఖ్యంగా ఇది అతి వాస్తవం - తమ రాజకీయ స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకొన్న దేశాలలోని ఆర్థికాభివృద్ధి సామ్రాజ్యదేశాల ప్రయోజనాలనుబట్టి ఆటంకపరుపబడుతూ వచ్చినది. ఇండియాలోని బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలనలో మనం దీనిని స్పష్టంగా గుర్తించవచ్చును. భారీ పరిశ్రమలతో పెద్దయెత్తున ఉత్పత్తి అవుతున్న వస్తువులతో పోటీచేయలేక స్వతంత్రంగా జీవిస్తూవచ్చిన చేతిపనులవారు, యూరోప్పులో వలెనే బజారులనుండి తరిమివేయ బడినారు. అయితేయూరపులో ఈ వృత్తులు నశించిన పనివారు ఫాక్టరీలలోనైనా ఉద్యోగాలు సంపాదించుకో గలిగారు. ఇందుతో కార్మికుల మార్కెట్టులో ఒత్తిడిని ఎక్కువ చేయగలిగారు. కాని ఇండియాలోని పరిస్థితి ఇలాగా లేదు. స్వదేశీపెట్టుబడిదారీ పరిశ్రమ లేమాత్రం బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి అనుకూలం కావు కనక, అవి ఏర్పడకుండా సాధ్యమైనన్ని ఆటంకాలు

కల్పింపబడినవి. ఇలా ధనిక ప్రపంచంలోనికి ఇండియా ఆర్థికవ్యవస్థ చేర్చుకోబడినప్పటికి, అక్కడ కార్మికుల సంఖ్య ఎక్కువకాలేదు. వృత్తులు నశించిన చేతిపనులవారు భూమిపై కెగబ్రాకవలసివచ్చినది. ఇలా భారత హస్తకళాకారుల నిర్మూలన మూలంగా బ్రిటన్ నేతపరిశ్రమ పెరిగినది. యంత్ర విస్తరణ యెంత జరిగినప్పటికి మార్కెట్టు విశాలం కావడంవల్ల, కార్మికుల సంఖ్య ఏమాత్రం తగ్గలేదు. భారతదేశం యాపత్తూ బ్రిటిష్ వస్తువులకు బజారు అయినదికదా. ఇందుమూలంగా ధనిక విధానం ప్రవేశించినప్పుడు తరువాత చాలకాలందాకా వలసదేశాలలో స్వదేశకార్మికుల సంఖ్య పెరక్కపోవడం మూలంగా సామ్రాజ్యవాదదేశాలలో కార్మికులెక్కువమందికి పనిదొరికినది. ఇంకొక విధంగా ఇంతమందికి పని దొరికి ఉండదు. తమ వలసంకు వస్తువులను పంపించే సామ్రాజ్య దేశాలకుమాత్రమే ఈ అనుకూలం ఏర్పడలేదు. పెద్దవలసలులేనట్టి దేశాలలోని కార్మికులకుకూడ ఈ అనుకూల్యం ఏర్పడినది. వివిధజాతులు ధనికవిధానాల మధ్యనున్న ఆర్థిక సంబంధాలే ఇందుకుకారణం. ఈ సామ్రాజ్యవాద ధనికవిధాన పురోగమనం, తమ దేశాలలోని కార్మికుల కొనుగోలుశక్తిని పెంచినప్పటికి, సామ్రాజ్యవాదపు బారికి పడినదేశాలలోని పరిస్థితులను అధ్వాన్నం చేసివేసినది.

అమెరికా పారిశ్రామికాభివృద్ధికూడా యూరోపులో ఇలాంటి పరిస్థితినే కల్పించినది. 19 వ శతాబ్ద ఉత్తరార్థంలో, అమెరికా ఖండానికి, ముఖ్యంగా సంయుక్త రాష్ట్రాలకు యూరోపునుండి - విపరీతంగా ప్రజలు వలసవెళ్ళారు. కరువుకాటకాల రోజులలో నిరుద్యోగులైన కార్మికులూ, వృత్తులు గంగలో కలిసిన చేతిపనులవారూ వలసవెళ్ళారు. అంతేకాక వ్యవసాయం వదులుకుని, పల్లెలనుండి బయలుదేరినవారు ఆదేశాల పట్టణాలకు వెళ్ళక, తిన్నగా అమెరికాకే వలసవెళ్ళడం జరి

గింది. ఇందువల్ల అమెరికాలోని ధనికవిధానాభివృద్ధి యూరోపులోని వస్తువైరుధ్యాల పెరుగుదలను అరికట్టినది. స్వదేశంలోని వైరుధ్యాలూ అంతగా పెరగలేదు.

ఇవన్నిటిమూలంగా ఈ శకంలో నిరుద్యోగం పెరగలేదు - పైగా పనిదొరికినకార్మికులసంఖ్య లక్షల సంఖ్యలో పెరిగినది. జీతాలు, జీవన ప్రమాణాలు, వస్తువినియోగంకూడ పెరిగినది. ఈ పెరుగుదలలు మరీ అల్పమైనవికావు. మేము ముందిచ్చిన అంకెలు 19 శతాబ్ద మధ్యకాలం వరకు బ్రిటను, ఫ్రాన్సులలోని జీతాలను సూచిస్తాయి. ఆశతాబ్ది చివరి దాకా వాని స్థితి నీక్రింది అంకెలు (అందులోనుంచే ఇవీ తీసుకోబడినవి) తెలియజేస్తాయి. 1912 లో జీతాల ప్రమాణం 100 గా మనం తీసుకున్నట్టయితే బ్రిటన్‌లో 1850 నాటికది 57 గా ఉన్నది. కాని 1855 కు 63 కు పెరిగి, తర్వాత మధ్యలో కొంత కొంతతగ్గినా ఆఖరుదాకా పెరుగుతూనే వచ్చినది ; 1860, 64; 1865, 67; 1870, 70; 1875, 89; 1880, 81; 1885, 82; 1890, 90; 1895,88; 1900, 100.

ఇదేకాలంలో ఫ్రాన్సులోకూడ జీతాల ప్రమాణగతి ఇలాగే ఉన్నది. 1900 నాటి ప్రమాణం 100 గా తీసుకుంటే 1850 లో అది 59.5 కు దిగినది. తర్వాత పెరుగుతూనే వచ్చినది. 1860, 63; 1870, 69; 1880, 74. 5; 1890, 89.5; 1900 లో 100;

ధనిక విధానాభివృద్ధి మూలంగా తప్పనిసరిగా రావలసిన నిరుద్యోగాధిక్యత, ప్రపంచం మొత్తంపేద ధనికవిధానం వ్యాపించడం మూలంగా బాగా సర్దుబాటయినది. ఈ అంశాల మూలంగానే నిరుద్యోగం పెరక్కపోవడమే కాక, ఉద్యోగా లెక్కువమందికి దొరికినవి. పాటక జనులు రోజురోజుకూ దిగనారిపోలేదు. వారి సంపాదన హీనస్థితిలోనే నిలిచి

పోలేదు. చాల యేళ్లవరకు మొత్తంమీద కార్మికుల జీతాలు హెచ్చినవి. ఇక సంక్షోభం రాగానే ఈ అనుకూల పరిస్థితుల పుణ్యమా అని దానిని దాటడం కొంత సులువైనది.*

ఈ శకంలో కొన్నిచిన్న తరుగుదలలున్నా వరుసగా వృద్ధి కనిపిస్తుంది. ఉత్పత్తి, విదేశ వాణిజ్యంకూడ పెరిగినవి. లాభాలు జీతాలు పెరిగినవి. స్వదేశ విదేశీ మార్కెట్టులు విస్తరిల్లినవి. అందుతోపాటే కార్మికులసంఖ్య వారి జీతాలు, వారి జీవనస్థాయీ పెరిగినది. కాబట్టే ఈకాలంలో ప్రజలదృష్టి సంక్షోభాలపైనాక హెచ్చుతగ్గులుగా పోతున్న ఆర్థికచక్రంపై నెలకొన్నది. ధనిక విధానం ఇలా పెరుగుతూ సోషలిస్టు సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేస్తుందా అనిపించింది. క్రమంగా సాంఘిక వైరుధ్యాలు పెరిగి తీరుతాయని, తన్మూలంగా ఆర్థికసంక్షోభాలు పదేపదేవస్తాయని. ఆఖరుకీ సంక్షోభాలే ధనికవిధానాన్ని చావుదెబ్బ తీస్తాయని సోషలిస్టు సిద్ధాంతంకదా.

అ॥ స॥ రాష్ట్రాలలో ఆల్విన్ హెచ్. హాన్సన్ ఇలా వ్రాశాడు:

---

* ప్రధాన పారిశ్రామిక దేశాలైన బ్రిటన్, జర్మనీ, అమెరికాల ఉత్పత్తి మెలికలగూర్చి షుంపీటర్ ఇలా వ్రాశాడు:—

"చాలకాలం పెరుగుగల ఒకే విధంగా కొనసాగింది,....ఏదేశంలో కూడ 1873 సర్వనాశనకారిగా కనిపించలేదు. అమెరికాలో 1884 లో తరుగుదలే లేదు. 19 శతాబ్ది ప్రారంభంలో సంక్షోభం జర్మనీలోనే కొద్దిగా కనిపిస్తుంది. ఇంగ్లాండులో అన్నాళ్ళకుగా రెండుసార్లు మాత్రమే కనిపించినది—అదికూడ రెండేళ్ళే జర్మనీలో 1868, 1869, 1870 లో కనిపించింది, అమెరికాలో ఒక్కతూరిమటుకు కనిపించింది." జోసఫ్ ఎ. షుంపీటర్—వ్యాపారచక్రాలు, రెండోభాగం, మెక్ గ్రూహిల్, న్యూయార్కు, 1939, పుట 494.

"గత నూటా యాభై యేళ్ళలో ధనికవిధానం చాల బాలారిష్టాలతో బాధపడ్డది- (స్పెట్‌హాఫ్ మాటలలో). కొత్తకొత్త మూలాధారాలను ఉపయోగంలోనికి కొనిరావడం, కొత్తకొత్తవానిని కనిపెట్టడం కొత్తయంత్రాలను కనుక్కోవడం, ఇంకా ఎక్కువ వ్యవసాయంమీదనే ఆధారపడిన దేశంలో కరువుకాటకాలు రావడం, యుద్ధాలు, అడ్డూ ఆగలేనిఋణంమీద ఆధారపడిన ఆర్థివిధానం—ఈ అంశాలన్నీ హెచ్చుతగ్గులకు ఆందోళనస్థితులకు కారణమైనవి. ఈకారణాలనిప్పుడు తొలగించడం జరుగుతున్నది. కాబట్టి వాణిజ్యచక్రగతి మారుతున్నది."*

ప్రపంచంలో పారిశ్రామికాభివృద్ధి విపరీతంగా జరిగినదేశాలలో రెండవదైన జర్మనీలో ప్రఖ్యాత ఆర్థికవేత్త వెర్నెర్ సొంబార్టు ఇలా వ్రాశాడు.

"మార్క్సు ఆర్థిక సంక్షోభసిద్ధాంతాన్ని ప్రవచిస్తున్నప్పుడు ఇంగ్లాండులో ముఖ్యంగా తీవ్రమైన "ఆర్థికమాంద్యం" ఆవరించినది. ఇందువల్ల యూరోపుకూడ కొంతదెబ్బతిన్నది. కాబట్టి అభ్యుదయ దశల వెనుకనేవచ్చే ఈ సంక్షోభాలు రానురాను తీవ్రతరమవుతాయని ఆయన తలంచేందుకు ఆస్కారం లేకపోలేదు. 1825, 1836, 1847 లలోలాగే అభివృద్ధిజరుగుతూవస్తే, మార్క్సు సిద్ధాంతీకరించిన సర్వవినాశదశ సకారణంగానే కనిపిస్తుంది. ....1857 నాటిసంక్షోభం, ఇంగ్లాండు అనుభవించిన అతిదారుణమైనవానిలోకల్లా ఆఖరుది. 1873 లో జర్మనీ

* ఆల్విన్ హెచ్. హాన్సను, పి హెచ్. డి., ప్రొఫెసర్ "వ్యాపారచక్రసూత్రం ...నిలఅభివృద్ధి నేటిస్థితి"—మిన్నెసోటా విశ్వవిద్యాలయం 1927

ఆస్ట్రియాలు దారుణమైన సంక్షోభాన్ని రుచిచూచినవి. కాని తర్వాత యూరోపు ఆర్థికజీవనంలో కనిపిస్తున్న అంశం ఏమిటంటే, పరస్పర వైరుధ్యాలు, వైషమ్యాలు ఒకదానికొకటి సర్దుబాటుచేసుకొనిపోవటెనని, వానితీవ్రత తగ్గిపోతూవచ్చి—అలానే జరిగితే అసలే నశించిపోవచ్చుననిన్నీ, ఈపరిస్థితి మహాయుద్ధం దాకా కొనసాగింది. ఆయుద్ధం దీనిని దుర్బలపరచలేదు. తర్వాత పూర్తిగా అందుకుభిన్నంగా మారిపోయినది." *

వెర్నెర్ సొంబార్టు ఈమాటలను 1928లో రాశాడు, ఆసంవత్సరం ఒకటీ దాటగానే ధనికవిధానచరిత్రలోకల్లా అతిదారుణమైన సంక్షోభం ప్రపంచాన్ని కలవరపెట్టినది.

---

* వెర్నెర్ సొంబార్టు, Das wlrtschaftsleben imzeitalter des Hoch_ kapitalismus, Vol III Part 2, P. 702 మ్యూనిక్ అండ్ లీప్జిగ్—1928

రెండో అధ్యాయం

# నేటికీ నిర్మూలితంకాని 1929 నాటి సంక్షోభం

19 శతాబ్దిమొదలు మొదటి ప్రపంచయుద్ధంవరకూ ఆర్థిక సంక్షోభాన్ని తప్పించిన శక్తులవివరణ, 1929 సంక్షోభం ఏర్పడిన కాలాన్ని వివరించడంలో మనకెంతో తోడ్పడుతుంది. ఈసంక్షోభ తీవ్రత అసాధారణమా లేక సామాన్యమేనా అని నిశ్చయించడంలో మనకెంతో అమూల్యసంపత్తి నిది చేకూర్చగలుగుతుంది.

ధనికవిధానం ప్రపంచ దిగ్విజయ యాత్రకు బయలుదేరిన నెపోలియన్ యుద్ధాల ఆఖరుకాలంలో, భూఖండంలోని ప్రజలలో ముటాముటిగా నూటికి 10 మంది మాత్రమే ఈవిధానం క్రిందపని చేస్తున్నారనీ, దాదాపొక శతాబ్దితర్వాత ఈదామాషా సగానికి సగం పెరిగిందనీ మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. అంతేకాక ప్రపంచంలో సగభాగా న్నీధనికవిధానం జయించడంవల్ల, స్వదేశీ విదేశీ మార్కెట్లులు విపరీతంగా పెరిగిపోవడంవల్ల సంక్షోభానికి దారితీసే శక్తులబలం సన్నగిల్లినదనికూడ మనం జ్ఞాపకముంచుకోవాలి.

కేవలం నూటికి పదిమందినిమటుకే తన పలుకుబడిలోనికి తీసుకున్న ధనికవిధానం ఆదశలో ఏకొద్దిప్రాంతాలలోనికో ఏకాంతో విస్తరిం

చినా అసలు ధనికకేంద్రాలలో విపరీతమైన మార్పులకు కారణమయ్యేది. కాని ఈవిధానం ప్రపంచ జనసంఖ్యలో సగానికి సగాన్ని తనపొత్తిట పొదివికొన్నరోజుల్లో, ఏమాత్రం తమదేశాలలో మార్పుకు కారణంకావాలన్నా ఈవిధాన విస్తరణం మరీ భారీగా జరగాలి. దానివ్యాపనం మరింత విశాలమైన ప్రాంతాలకు వ్యాపించాలి.—ఈసంగతి మనకిప్పుడు స్పష్టంగా బోధపడుతుంది.

మరొకవిధంగా చెప్పాలంటే, 19 శతాబ్ది మధ్యభాగంనుండి మొదటిమహాయుద్ధంవరకు జరిగిన అభివృద్ధికంటే ఎన్నిరెట్లో పెద్దయెత్తున జరిగితేగాని, మొదటియుద్ధం తర్వాతనుండి 1929 వరకున్న కాలంలో పూర్వపు ఫలితాలు కలగనేరవు. ఏమైనప్పటికీ వాస్తవాంశాలను గమనిస్తే అందుకు వ్యతిరేకంగా జరిగినది.

నిజానికి రెండు ప్రపంచయుద్ధాలకుమధ్యనున్న కాలమంతటిలోను కొత్తమార్కెట్టుల విస్తరణ చెప్పుకోదగినంత సాగలేదు. (ఎందుకనేసంగతికాక ఏంజరిగినదనేదే మనమిప్పుడు చూస్తున్నాము.) ఈ కాలంలో జరిగిన విస్తరణ మొదటియుద్ధంవెనకటి ఆరుసంవత్సరాలలో జరిగినంతకూడాలేదు. ఏదో కదాచిత్తుగా కొంతఅభివృద్ధి అక్కడక్కడా కనిపించినా అంతకంటె చాలతక్కువ. ధనికకేంద్రాలు పెరిగాయి, పెట్టుబడిదారీ రాజ్యాల సంఖ్య, బలం పెరిగింది.

అమెరికా స్థితిలో మార్పు.

మొదటిప్రపంచయుద్ధానంతరం కొత్తమార్కెట్టుల ఏర్పాటు సరికట్టిన అతిప్రధానకారణం అమెరికా స్థితిలో వచ్చిన పెద్దమార్పు.

ఈవిషయానికి సంబంధించిన అంశాలు అందరికీ బాగాతెలిసినవీ వివాదాస్పదంకానివీ కాబట్టి, అవెంతముఖ్యమైనవైనప్పటికీ సంగ్రహంగా

మాత్రమే వివరిస్తున్నాము. యూరపియన్ల దృష్టిలో అమెరికా అంటే, తమదేశీయులు కోట్లకొలదిమంది వలసవెడుతున్నచోటు; అంతేకాక కోట్లకొలది పెట్టుబడిపెట్టేందుకు అవకాశమిచ్చు తావు; తమపరిశ్రమలు ఉత్పత్తిచేసే అవసరవస్తువులకు పెద్దబజారు. ఇక అమెరికా దృష్టితోనే చూస్తే తన ధనికవిధాన సరిహద్దులనది ఇంకా విస్తరింపజేసుకో వీలున్నది. తనదేశంలోనే కొత్తమార్కెట్టులను కల్పించుకో వీలున్నది.

కాని రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో అమెరికా పూర్తిగా మార్పుచెందినది. ఇక అమెరికా యూరోపునుంచి వచ్చే వారికి వలస రాజ్యం కాదు. పూర్వం తన దేశంలోనికి రానిచ్చేవారిలో చాల తక్కువ మందిని మాత్రమే 1929కి ముందు కూడ అమెరికా రానిస్తూ వచ్చింది. యూరోపు నిరుద్యోగ నివారణలో ఏ కొంతో తోడ్పడుతూన్న అమెరికా పూర్తిగా ఆపనినుండి తప్పుకుంది. వలసవచ్చేవారి సంఖ్యతగ్గింపు అమెరికాలోనేకాక అమెరికా ఖండమంతటా తగ్గిపోయింది. ఉదాహరణకు, మొదట ప్రపంచయుద్ధానికిపూర్వం, కనడాకు, అర్జెంటినాలకు వచ్చే యూరపియన్ వలసదారులసంఖ్యలో 1929 నాటికి అత్యల్పాల్ప భాగంమాత్రమే మిగిలినది. యూరపియన్ దేశాలనుండివచ్చే నిరుద్యోగుల ప్రవాహానికిగా అమెరికాఖండం రిజర్వాయరుగా ఉండ నిరాకరించింది.

అంతేకాక యూరపియన్ పారిశ్రామికవస్తువులకు ప్రధానమైన బజారుగా అమెరికా ఉపయోగపడడం మానివేసినది. ఏదో కొద్దిగా పరిశ్రమలుండి, ప్రధానంగా వ్యావసాయకదేశంగా ఉండిన అమెరికా, ప్రపంచంలోకల్లా అతిబలవత్తరమైనపారిశ్రామికదేశంగా తయారయినది. ఏతత్ఫలితంగా దాని విదేశ వాణిజ్యసంబంధాలలో మార్పువచ్చింది. యూరపియన్ వస్తువుల అమ్మకం బాగాతగ్గినది. వారిపెట్టుబడికూడ

సన్నగిల్లుతూవచ్చింది. యుద్ధానికిపూర్వమైతే అమెరికా యూరపియన్ల కెంతో లాభసాటి మార్కెట్టుగా ఉపయోగపడింది.

ఇంతేగాక, అమెరికా సంయుక్తరాష్ట్రాలలోనే ఇక ధనికవిధానం తనమార్కెట్టును విస్తరింపజేసుకొనలేక పోయినది. స్వదేశంలోని మార్కెట్టు చాలకపోవడంవల్ల, అది తనసరిహద్దులను ముందుకు నెట్టుకొని పో నారంభించింది. అమెరికా విదేశవాణిజ్యంలో వచ్చినమార్పు చాల గమనించదగినది. యూరోపుకు అమెరికాకు చెందిన విదేశ వర్తకం తగ్గిపోతూ, అది ఆసియాదేశాలకు దక్షిణఅమెరికాకు—సాధారణంగా యూరోపుదేశాలుగాక ఇతరదేశాలకు వ్యాపిస్తూవచ్చింది. అదే సమయంలో ప్రపంచంలోకల్లా అమెరికా, పెట్టుబడి ఎగుమతిచేయడంలో ప్రప్రధానదేశమయింది. ఈపరిస్థితి సారాంశమేమిటంటే, అమెరికా, యూరోపు ధనికవిధానవ్యాప్తికి ఆటపట్టుకాకపోవడమేగాక, తానే మహావేశంతో పురోగమించే ధనికరాజ్యశక్తిగామారి, కొత్తమార్కెట్టుల కోసం తనసరిహద్దుల కావల వెతక నారంభించింది.

అమెరికాలోవచ్చిన ఈమార్పుమూలంగా, యూరోపులో అప్పటికే వున్న సాంఘికవైరుధ్యాలు మరింత తీవ్రరూపం తాల్చినవి. స్వదేశంలో ధనికవిధానవ్యాప్తి అంత్యదశకు వచ్చినదికాబట్టి, మిగత ప్రపంచ ధనికవిధానంకంటే సంక్షోభంమూలంగా ఈదేశం మరీ గట్టిదెబ్బతిన్నది. ఈశకంలో కొత్తమార్కెట్టులకోసం వెతకడంలో ధనికవిధానకేంద్ర దేశాలలో జరిగిన మహాభివృద్ధినిగురించి ముందు తెలిపాను. ఈఅభివృద్ధిలో ఏకైక మహన్నిదర్శనం అమెరికా సంయుక్తరాష్ట్రాలలో వచ్చినమార్పు.

## ఆసియాలోనికి జపాను ప్రవేశం

ఈశకంలో క్రొత్తమార్కెట్టులకోసం జరిగేపోరాటంలోయూరోపు ధనికవిధానపు పోటీదారుగా ఒక్కఅమెరికాయేకాక, జపాను సామ్రాజ్య వాదంకూడ బలవత్తరమైన పోటీదారుగా బయటపడనారంభించింది. మొదటి మహాయుద్ధానికిపూర్వం, జపానులో ధనికవాద పారిశ్రామికాభి వృద్ధి మునుపటికంటె బాగాజరిగినది. ఇండియా చైనాలవలెకాక జపాను తన రాజకీయ స్వతంత్రాన్నలాగే నిలుపుకొన్నదికూడ. ఆసియా ఖండంలో కొత్తమార్కెట్టులను సంపాదించుకునేందుకు, విస్తరింప జేసుకునేందుకు, జపాను 1929 కంటె ముందే తీవ్రంగా పూనుకున్నది. పాత ధనికరాజ్యాలకంటే దానికీవిషయంలో కొన్ని మంచిఅనుకూలా లున్నవి. తనసామ్రాజ్యవాదం వ్యాపింపజేయవలసిన ప్రదేశం తన ఇంటిముంగిటేవున్నది. రెండోది ఆసమయంలో ఇతరధనికరాజ్యాలలో వలెకాక, జపాను ప్రభుత్వం తనదేశ ఆర్థికవిధానాభివృద్ధిపై సంపూర్ణాధి కారం కలదిగా ఉండినది. ఇందుమూలంగానే ఆప్రభుత్వం తన సైనికావసరాలకు, గుత్తవర్తకసంస్థలకు అనుగుణంగా క్రమబద్ధమైన ప్రణాళిక వేసుకొన వీలయినది.

ఇలా యూరపియన్ ధనికరాజ్యాలకు కొత్తమార్కెట్టులను వెదుక టంలోనిపోటీలో రెండు బలవత్తరమైన ధనికరాజ్యాలు తయారయినవి. అయితే ఇదెంత ముఖ్యమైన అంశమైనా ఇదొక్కటే, విషమపరిస్థితికి కారణంకాలేదు. 19 శతాబ్దిలోని ధనికవిధానాభివృద్ధి యుగంలోకూడ, ఒకదేశంవెనుక మరొకటి పోటీచేయ నారంభించింది. వాస్తవంగా నిర్ణాయకాంశమైనదేదంటే, రెండు ప్రపంచయుద్ధాలమధ్య విస్తరీకరణ వేగం యెక్కువకాలేదు సరికదా తగ్గిపోయినదికూడ.

## రష్యా విప్లవప్రభావం

చాలాకాలంనుంచి యూరపు ధనికవిధానం జారిస్టురష్యాను మంచి మార్కెట్టుగా చూసుకుంటూవచ్చింది. యూరపియన్ యంత్రనిర్మిత వస్తువులను దిగుమతిచేసుకుంటూ, రష్యా తాను ముడిసరుకులను ఎగుమతిచేస్తూవచ్చింది. రష్యన్ మార్కెట్టుమూలంగా యూరోపు ఎగుమతి పరిశ్రమలు తమ ఉత్పత్తిని అమ్మకాన్ని పెంచుకోగలిగినవి—ఎక్కువ మంది కార్మికులను పనిలోనికి తీసుకోగలిగినవి.

బోల్షివిస్టు విప్లవం, దీనికిపెద్ద ఆఘాతం కలిగించింది. కొంత కాలం యూరపియన్ వస్తువులకు రష్యా మార్కెట్టుగా ఉపయోగపడ్డం నిలిచిపోయింది. తర్వాత సోవియట్ రష్యా విదేశవర్తకం పెరిగింది. కాని, సర్వదా పూర్వపు జారిస్టు రష్యాలాగా ఈదేశం పనికిరావడం మానివేసింది. 1919 నుండి 1929 వరకూ ఒక్కసంవత్సరంకూడ రష్యా దిగుమతులు యుద్ధాత్పూర్వమున్న సంఖ్య నందుకోలేదు. 1909 నుండి 1913 దాకా జారిస్టు రష్యాదిగుమతులు సగటున 4,9941 లక్షల రుబుళ్లు. 1919 లో ఈసంఖ్య 140 లక్షల రుబుళ్లు. 1923 24 కల్లా ఈసంఖ్య 10,22·7 మిలియన్ రుబుళ్లకు పెరిగినది. కాని 1929 నాటికి 3,857 మిలియన్ రుబుళ్లకంటె యెక్కువరాలేదు.*

## వలసల పారిశ్రామికవృద్ధి దెబ్బతిన్నది

యంత్రవస్తు సామగ్రిని కొనడంలో రష్యా వెనక్కుపోయిన సమయంలోనే, ఇతరధనికేతర ప్రపంచంలోని పెట్టుబడివృద్ధి బాగా తగ్గిపోయినది. రెండు ప్రపంచయుద్ధాలమధ్య, ప్రపంచ జనాభా 200

---

* ఈలెఖ్ఖలు తీసుకున్నది: A యుగోవ్—రష్యా—యుద్ధ, శాంతియుగాలలో ఆర్థికరంగం—న్యూయార్కు 1942—పుట 99.

కోట్లు ఉంటుందని అంచనావేశారు. ఇందులో సగంజనాభా సోవియట్ యూనియన్లోనో ధనికరాజ్యాలలోనో నివసిస్తున్నారు. మిగత సగం మాత్రమే పురాతన ఆర్థికవ్యవస్థక్రింద ఉంటున్నారు. వీరిలో అత్యధిక భాగం ఆసియా ఆఫ్రికాలలో నున్నారు. అక్కడ కొత్తమార్కెట్టులకు చాల అవకాశాలు కనిపించినవి. అయినప్పటికి ఈ అవకాశాలను వలస దేశాలలోకాని, అర్థవలసరాజ్యాలలోకాని ఉపయోగించుకోవడం జరిగ లేదు.

మొట్టమొదట బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చి వలసదేశాలను మనము పరిశీలింతాము. ఈప్రాంతం చాలపెద్దది. ఇందులో దాదాపు 50 కోట్ల మందిఉన్నారు. ఆసియా భాగంతోకూడా కలిపి సోవియట్ యూనియన్ జనాభా యెంతఉందో అంతకంటె వారిసంఖ్య మూడురెట్లు ఎక్కువన్న మాట. ఇందువల్ల ఈప్రాంతంలో కొత్తమార్కెట్టులకు చాలపెద్ద అవకాశంఉండినది. ఈప్రాంతాలలో మరింత అభివృద్ధికి తగిన అవకాశాలను యూరపియన్ సామ్రాజ్యవాదాలప్పటికే కల్పించిఉంచాయి. తమ వస్తుసామగ్రిని పంపకంచేసేందుకప్పటికే చాల రైలుదారులు నిర్మితమై ఉన్నవి.

బ్రిటిష్ ఇండియా ప్రధానమైన వలసదేశం *

1900 నుండి 1913 దాకా బ్రిటిష్ యంత్రనిర్మిత వస్తువులకు ముఖ్యమైన మార్కెట్టుగా బ్రిటిష్ ఇండియా ఉపయోగపడుతూ వస్తకం

* ఇండియా రెండుగా విభక్తమై 1947 ఆగస్టు 15 నుండి— కామన్వెల్తులో భాగంగా ఉన్న రిపబ్లిక్కుగా ఏర్పడినది. ఈ పుస్తకం 1947 లో వ్రాసినదని గుర్తుంచుకొనాలి. (అనువాదకుడు): పైలెక్కలు ప్రభుత్వ ప్రకటనలలో నుండి సేకరించినవి. నేటిస్థితి మార్పుగలదని వేరేచెప్పనవసరం లేదు.

దినదినాభివృద్ధి చెందుతూవచ్చింది. 1897—98 లలో ఇండియా దిగుమతులు 629.6 మిలియన్ రూపాయల విలువగలవి. 1913-14 కల్లా 1832.5 మిలియన్ రూపాయలకు పెరిగినవి. ఇండియా దిగుమతి వర్తకం, ఇలా ఆఅల్పకాలంలో నూటకినూటా యాభై వంతులు పెరిగినది. అదేసమయంలోనే, ఇండియా రైల్వే 25 వేల మైళ్లనుండి 35 వేల మైళ్లకు పెరిగినది.—అంటే దాదాపు నూటికి 40 వంతులు. 1900–1 లో రైళ్లు తీసుకొనివెళ్లిన వస్తువులతూకం 44 మిలియన్ టన్నులు— 1913–14 నాటి కీతూకం రెట్టింపై 84 మిలియన్‌ల టన్నులైనది. 20 శతాబ్ది ప్రారంభంమొదలు, మొదటియుద్ధందాకా, ఇండియాలో బొగ్గు ఉత్పత్తి 62,17,000 టన్నులనుండి 16,468 వేల టన్నులకు—అంటే నూటికి నూటాయాభై వంతులు పెరిగినది.

ఇలా బాగావృద్ధిచెందినప్పటికి ఇండియా పారిశ్రామికంగా చాల వెనుకబడిఉన్నది. అత్యధిక జనాభా వ్యవసాయంపై ఆధారపడిఉన్నది. ఈసమయంలో ఒక నిర్ణీతపద్ధతిలో ఇండియా పారిశ్రామికంకాకుండా బ్రిటన్ ఆటంకపరుస్తూ వచ్చింది. తమప్రయోజనాల కనుకూలమైన పరిశ్రమలనుమాత్రమే కొనసాగనిచ్చింది. ఆకాలంలో పాతఉత్పత్తి విధానాల నిర్మూలనం ఏదిజరిగినా అది బ్రిటనుకు అనుకూలంగామాత్రమే జరుగుతూవచ్చింది. ఉదాహరణకు 1913 లో మొత్తం ఇండియాకు దిగుమతైన సరుకులవిలువ 11.76 మిలియన్ రూపాయలు. ఇందులో 18.33 మిలియన్ రూపాయల విలువగల సరుకులు అంటే నూటికి 64.2 పాళ్లు బ్రిటన్‌నుండి దిగుమతి అయ్యాయి. అత్యల్పంగా జరిగిన ఇండియా పరిశ్రమవ్యాప్తి ఆరోజుల్లో బ్రిటన్ సామ్రాజ్యవాదానికి అఖండమైన మార్కెట్టును చేకూర్చింది. ఇదిగాక లక్షలకొలది భారతీయులను పీడించడంద్వారా బ్రిటనుకు ధనం ప్రవాహంలా ప్రవహించింది.

రెండుయుద్ధాల మధ్యకాలంలో బ్రిటనుకూ, ఇతర ప్రపంచధనిక విధానానికి క్రమాభివృద్ధిచెందే మార్కెట్టుగా భారతదేశం ఉపయోగపడి వుండాలంటే, అక్కడ పరిశ్రమాభివృద్ధి ఎంతో జరిగిఉండాలి. భారత ప్రజల జీవనస్థాయి పెంచిఉండాలి. ఈకార్యక్రమంలో బ్రిటనూ, ఇతర ధనికరాజ్యాలూ కలిసి పనిచేసిఉండాలి. కాని ఇలాంటిదేమీ జరగలేదు. అక్కడి అభివృద్ధి ఎంతహీనంగా జరిగిందో చూదాము. ఫాక్టరీ చట్టం క్రిందికివచ్చే కర్మాగారాలలోను ఇతరసంస్థలలోను పనిచేసే కార్మికుల సంఖ్య (20 మందికంటే ఎక్కువమంది పనివారుండే సంస్థలలో) 1920 లో 1.2 మిలియన్లనుండి 1929 కి 1.5 మిలియన్లకు పెరిగింది. 353 మిలియన్ల జనాభాగలదేశంలో పెరిగిన కార్మికులసంఖ్య 3 లక్షలు మాత్రమే. ఈకాలంలో భారతపరిశ్రమాభివృద్ధి ఎదుగు బొదుగులు లేకుండా నిలిచిపోయినది. 1931 జనాభా లెక్కలనుబట్టి పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులసంఖ్య—చిన్నా పెద్దా పరిశ్రమలన్నింటిలోను పని చేసేవారిసంఖ్య—17.5 మిలియన్లనుండి 15.3 మిలియన్లకుతగ్గిపోయింది.

పారిశ్రామికంగాను, ఆర్థికంగాను ఏర్పడిన ఈ స్తబ్దత, భారత విదేశవర్తకంలోకూడ ప్రతిఫలించింది. 1913 లో ఇండియా దిగుమతుల విలువ 18,330 లక్షల రూపాయలుగా అంచనావేశారు. 1929 లో వీనివిలువ 24,080 లక్షలరూపాయలకు పెరిగింది. ఎగుమతులుమట్టుకు 1913 లో 24420 లక్షల రూపాయల విలువగలవి. 3108 మిలియన్ రూపాయలు విలువగలవిగా 1929 లో తేలినవి. ధరలనుబట్టి మొత్తం ఇండియా విదేశవర్తకం విలువ లెక్కకడితే 1/3 వంతు పెరిగినది. కాని ఇది కాగితంమీద పెరుగుదలమాత్రమే—ఎందుకంటే బొంబాయి పిలకత్తాలలోని వ్యాపారసూచికనుబట్టి 1929 లో దాదాపు 1913 కంటె నూటికి యాభైపాళ్లు మాత్రమే పెరిగింది. అంటే 1913 కంటె 1929

లో విదేశీవ ర్తకం మొత్తం ఏమీపెరగలేదన్నమాట. కాబట్టి ఈకాలంలో పాతకాలపుమార్కెట్టు చెదరకున్నా, కొత్తగా విస్తరించలేదని స్పష్ట పడుతుంది.

ఇండియాస్థితిలోనే మిగత యూరపియన్ రాజ్యాల• వలసదేశా లన్నీఉన్నవి. అయినప్పటికి ఈ వలసప్రాంతాలలోనే పరిశ్రమలు వెనుక బడలేదు. ధనికవిధానానికి పూర్వకాలీనములైన ఆర్థికవిధానాలున్న అన్నిచోట్లా ఇదే స్థితి.

ఏఒక్క-దేశానికీ వలసప్రాంతంకాకుండా, ఏదో ఒకవిధమైన స్వతంత్రం (రాజకీయం)గా ఉండినదేశం చైనా. ఇది పారిశ్రామికంగా చాల వెనుకబడినదేశం. ఇందులోని జనాభా ప్రపంచజనాభాలో అయిదో వంతున్నది. ఈప్రాంతంలో అభివృద్ధికి కావలసినన్ని అవకాశా లున్నవి.

వలసదేశాలలోని స్థితకు సర్దుబాటుగా-కనీసం పశ్చాద్భోణిలో చైనా పరిశ్రమలు పెరిగిఉండినా, ప్రపంచ ధనికవిధానానికి కావలసినంత కొత్తమార్కెట్టు దొరికేది. కాని అంతర్గర్భితంగా ఉన్న చైనాలోని అవకాశాలు గుర్తింప బడతాయి. ఇందుకు కారణ మేమిటి? చైనా ఆధు నిక ప్రపంచ చరిత్రలోనికి స్వతంత్ర దేశంగా జపాను వలె ప్రవేశించ లేదు. ఒక సామ్రాజ్యానికి వలసదేశంగా ఇండియావలె మారలేదు. చైనాను పీడించేందుకు బ్రిటనూ, జపానూ ముఖ్యముగాను జర్మనీ ఫ్రాన్స్ అమెరికాలుకూడ పోటీ పడసాగినవి. చైనానామకః కొంత స్వతంత్రం కల అర్ధవలసదేశం. పై సామ్రాజ్యదేశాలన్నీ చైనాను పారిశ్రామికం చేయవలెననిగాని, తద్వారా వారి జనాభా జీవనప్రమాణాన్ని పెంపుదా మనిగాని తలంచలేదనేది సుస్పష్టమే. వ్యక్తిగత ధనిక ఆర్థిక •ప్రయోజ

నాల దృష్ట్యామాత్రమే సామ్రాజ్యదేశాలు ఆనాడు చూచినవి. తమసరుకులు కొన్నిటికి మార్కెట్టుకోవాలి. తమ పరిశ్రమలకు ముడిసరుకులు రావాలి. చైనాలోని చౌకశ్రమశక్తిని పెద్దలాభాలకై తాము వినియోగించుకోవాలి. చైనాలోఉన్న కొద్దిపరిశ్రమలూ విదేశీయుల చేతులలోనే ఉన్నవి.

కేట్ యల్. మిచ్చెల్ ఇలా వ్రాశాడు— *

"1937 జూలైకిముందు చైనా ఆర్థికవ్యవస్థపై విదేశాలకున్న పెత్తనం ఈక్రింది అంశాలద్వారా తెలుసుకోవచ్చును. చైనా మొత్తం గనుల ఏటా ఉత్పత్తి మొత్తం 200 లక్షల టన్నులలో దాదాపు సగం విదేశీయులచేతిలోని గనులే ఉత్పత్తిచేసేవి. చైనాలోని ఇనుపగనులలో అత్యధికభాగం జపాను పెట్టుబడిదారుల చేతిలో నున్నవి—అందులో ఉత్పత్తిఅయ్యే ముడిఇనుమంతా జపానుకు ఎగుమతి చేసేవారు. చైనాలో ఉన్న పత్తిమరలు మొత్తం 50,32,700 లలో, చైనీయుల చేతిలో 26,27,700 న్నూ, జపానువారి పెత్తనంక్రింద 21,83,600 న్నూ, బ్రిటిష్‌వారి పెంత్రోలులో 2,21,300 న్నూ ఉండినవి. ఇక మరమగ్గాల లెఖ్ఖ లివి.

| | |
|---|---|
| చైనీయుల చేతిలోనున్నవి | 25,100 |
| జపానువారి చేతిలో | 30,800 |
| బ్రిటిష్‌వారి చేతిలో | 4,000 |

* కేట్ యల్. మిచ్చెల్ "పశ్చిమ పసిఫిక్కు ప్రాంతంలో పరిశ్రమల పెంపు" పుట 102

చైనా నౌకావర్తకంలో ఉపయోగించే ఆవిరిటన్నులలో 2/3 వంతులు విదేశీయుల చేతిలోనే ఉన్నవి. చైనాలోని 10731 కిలో మీటర్ల రైల్వేలు దాదాపు పూర్తిగా విదేశపెట్టుబడితో వేసినవే."

చైనాలో బలవత్తరమైన కేంద్రప్రభుత్వముండాలని ఈ సామ్రాజ్య వాదదేశాలు తలంచలేదు; పైగా అలాంటిప్రభుత్వముంటే తమస్వార్థానికి ఆఘాతం కలుగుతుందని వారు భావించారు. కాబట్టి చైనా అర్ధవలస దేశంగా ఉంటూవచ్చింది. అక్కడ పరిశ్రమోపజీవనులైన భూస్వాముల వర్గం అలాగే నిలిచిపోయింది. ఇతరదేశాలన్నింటివలెనే ఈవర్గం దేశాన్ని క్రమబద్ధంగా పరిశ్రమపరిపూర్ణంచేయడంలో గొప్ప ఆటం కంగా పరిణమించింది.

ఇండియాలో ఒక్క బ్రిటిష్ సామ్రాజ్యవాదం మాత్రమే పరిశ్ర మాభివృద్ధిని ఆటంకపరుస్తూ వచ్చింది. మరి చైనాలో పరిశ్రమాభివృద్ధి నరికట్టినవి—లేదా ఆలసింపజేసినవి చాల విదేశసామ్రాజ్యాలున్నవి— ఇవన్నీకూడ చైనాను అర్ధవలసగానే ఉంచాలని ప్రయత్నించాయి.

చైనా పరిశ్రమాభివృద్ధి ఎంత మందగమనంతో నడుస్తూ వచ్చి నదో, దాని విదేశవర్తకం లెఖ్ఖలనుచూస్తే స్పష్టంగా బోధపడుతుంది. 1913 దాకా జరిగిన అభివృద్ధి ఏమిటి? జర్మన్ లెక్కల కార్యాలయ నివేదిక ఈక్రింద ఇస్తున్నాము.

"1885 దాకా చైనామొత్తం విదేశవర్తకం టర్నోవరు ముటీముటాయిగా 70 కోట్ల మార్కులు మాత్రమే—ఇందులో ఎగుమతి దిగుమతులు ఇంచుమించు సమానంగా ఉన్నవి. ఇది తాబేటి నడకతో ఎక్కువ కాసాగింది. జనాభా మొత్తంమీద అంచనావేస్తే విదేశవర్తకం తలకొక్కమార్కు వంతున పడు

తుంది—ఎగుమతులు దిగుమతులూ కలిపి. 1899 నాటి దిగుమతులు మొత్తం 60 కోట్ల మార్కులకు పెరిగాయి. ఎగుమతులు 80 కోట్లకు పెరిగాయి. మొత్తం విదేశవర్తకం విలువ 140 కోట్ల మార్కులన్నమాట. అంటే 1885 కంటె రెండింతలు మాత్రమే పెరిగింది. ఇదేగమనంలోనే దాదాపు మహాయుద్ధందాకా మందపుగోగతి కనిపిస్తుంది. 1913 నాటికి ఎగుమతుల విలువ 124 కోట్లమార్కులకు, దిగుమతుల విలువ 176 కోట్ల మార్కులకు మొత్తం వర్తకం విలువ 300 కోట్లకు పెరిగింది." *

ఈక్రిందిలెక్కలు అప్పటినుంచి 1929 సంక్షోభం నాటిదాకా జరిగిన అభివృద్ధిని తెలుపుతున్నవి.

చైనా విదేశవర్తకం (మిలియన్ హైక్వాన్ టేల్సులో) †

| | 1913 | 1921 | 1925 | 1929 |
|---|---|---|---|---|
| దిగుమతులు | 570.2 | 906.1 | 947.9 | 1,265.8 |
| ఎగుమతులు | 403.3 | 601.3 | 776.4 | 1,015.7 |

ఈసమయంలో ధరలలో ఆధిక్యం అంతబొత్తిగా లెక్కలోకి రాదని చెప్పలేము. కాని చైనా విదేశవర్తకం మొత్తంలో నిజమైన ఆధిక్యత పైధరలఆధిక్యతనుబట్టిచూస్తే కనిపించదు. ధరలు బాగా పెరిగాయికనుక, ఈ ఆధిక్యత అసలు మునుపటికంటె తక్కువేకాని ఎక్కువకాదని బోధపడుతుంది.

* Die wirtschaft des Auslandess 1900-1927 issued by the statistischess Reichsaimt, Berlin 1928, P. 697.

† (The maritime costomes, Foreign trade of China Statistical the Inspectorate General of Customes, Shanghai)

అంతేకాక ఆయెక్కువయినదికూడ ఇండియాలోకంటె మరీ తక్కువ. 1929 లో ప్రపంచ వర్తకంలో సైనాసగం కేవలం 2.13%. ఇక పెరిగినదల్లా ఇండియాభాగంకంటె చాలతక్కువ. కాబట్టి ప్రపంచ ధనికవిధానం ఇతరచోట్ల పోగొట్టుకున్న మార్కెట్టును, ఇంత విశాలమైన ముఖ్యమైన ప్రాంతంలో సంపాదించుకోలేకపోయినది. ఈశకంలో ప్రపంచంలో అయిదోవంతు జనభాకలిగిన అర్ధభూఖండం "కొత్త మార్కెట్టుగా" తన పాత్ర నేమాత్రం నిర్వహించలేకపోయినది.

సామ్రాజ్య వలసదేశాలనుగూర్చి చైనానుగూర్చి మనమిక్కడ అనుకున్నదంతా ఆఫ్రికాకు, మధ్య-దక్షిణ అమెరికాలకుకూడా అనువర్తిస్తుంది. ఇక్కడ కొంత పరిశ్రమల అభివృద్ధి జరిగినప్పటికి, సామ్రాజ్య కేంద్రదేశా లిప్పటికే బాగా వృద్ధిచెందడంచూస్తే, ఏమాత్ర మిది లెక్కలోనిదికాదు.

ఈధోరణి ఒకేవిధంగా కొనసాగుతూవచ్చింది. ధనికవిధానం ఏళ్లకొలది అవిచ్ఛిన్నంగా పురోగమించినప్పటికి, ప్రపంచమంతటా విజయయాత్ర సాగించినప్పటికి, ఇతరవిధానాల మహాసముద్రంలో చిన్న దీవిగానున్నదల్లా—ప్రపంచ ప్రధాన ఉత్పత్తివిధానంగా తయారయినప్పటికి, కొత్త పాతమార్కెట్టులకోసం పాతపారిశ్రామికరాజ్యాలు కొత్త పారిశ్రామికరాజ్యాలతో పోటీకి దిగినప్పటికి వలసదేశాలలోను ఏమాత్రం అభివృద్ధి కొనసాగక, దాదాపు స్తబ్దత ఏర్పడిపోయింది. వాని విదేశ వర్తకం పెరగలేదు. వానికీ ఇతర ధనికరాజ్యాలకూ ఉన్న తారతమ్యం 1913 స్థాయిలోనే ఉండిపోయింది.

1929 సంక్షోభానికి ముందుకూడ కొన్ని కొత్తమార్కెట్టులే ఏర్పడడంవల్ల చాల తీవ్రమైన ఫలితాలు కలిగినవి. కొత్తమార్కెట్టులు

ధనికవిధానంతో సరుకుల. పంపకానికి చాల ప్రధానమైనవి. అవే సంక్షోభవిషయంలో నిర్ణాయకమైనవి. ప్రథమ మహాయుద్ధానికిపూర్వం కొత్తమార్కెట్టుకోసం జరిగిన సఫలవిజయయాత్ర సామ్రాజ్య మాతృదేశాల మార్కెట్టులనుకూడ పెంచినదని, తర్వాత పోటీ 19 శతాబ్ది పూర్వార్ధంతో పోలిస్తే బాగా తగ్గిపోవుటకు కారణమయినదని గమనించాము. ఇందువల్ల జీతాలు పెరిగాయి. కొత్తగా లక్షలాది కార్మికులకు ఉద్యోగాలు దొరికాయి.

స్వదేశం మార్కెట్టులకూ కొత్తమార్కెట్టులకూ మధ్యనున్న ఈ సంబంధం మనసులో ఉంచుకుంటే, ఇలా కొత్తమార్కెట్టుల విస్తరీకరణలో ఏర్పడిన ప్రతిష్టంభన, పారిశ్రామిక మహాదేశాల దేశీయ వర్తకానికి దెబ్బకొట్టే ఉంటుందని విదిత మవుతుంది. ఇదే నిజమైన పరిస్థితి.

## సంక్షోభానికి పూర్వం నిరుద్యోగ ప్రాబల్యం.

మొట్టమొదట ఈ అంశమంత స్పష్టంగాలేదు. మొదట మహాయుద్ధం, యూరోపు వస్తూత్పత్తిలో చాల విఘాతాలకు దారితీసినది. కొన్నిచోట్ల ఉత్పత్తిశక్తిపై కూడ దెబ్బతీసినది, ఇందువల్ల మొదటిలో యూరోపు భూఖండంలో నైనాసరే పునర్నిర్మాణోపయోగార్థం ఉత్పత్తి, సరుకుల అమ్మకం హెచ్చింది. యుద్ధానంతరం యూరపు ఉత్పత్తి వ్యవస్థ కొంతవరకు పునర్నిర్మితమైనప్పటికి, 1913 స్థాయికంటె తక్కువదశలో తిరిగీ ఉత్పత్తి ఆరంభమైనప్పటికి, కొన్ని సంవత్సరాలలోనే ఉత్పత్తివ్యవస్థ విస్తరణ ఆగిపోయింది, ఆ తర్వాత ఉపయోగించక మూలబడిన ఉత్పత్తిశక్తి ఒకవంకా—ఇది సంక్షోభానికి ముందని గుర్తుంచుకోవాలి—నిరుద్యోగం ఒకవంకా ఎక్కువయినది. అత్యధికంగా అభివృద్ధి చెందిన యూరోపుదేశాలలో నిరుద్యోగులసంఖ్య

శాశ్వతంగా పదిలక్షల సంఖ్యకు పైగానే ఉంటూవచ్చింది. జర్మనీ లోను బ్రిటనులోకూడ ఇదే దుస్థితి.

మొదటి యుద్ధానికిముందు జర్మనీలో నిరుద్యోగుల లెక్కలు మనవద్దలేవు. ట్రేడ్ యూనియన్ సభ్యులలో ఉద్యోగం లేనివారి లెక్కలున్నవి. ఇవి లేబరుమార్కెట్ల స్థాయిని కొంతవరకు బాగానే తెలియజేస్తున్నవి.

> "1907-13 లలో ట్రేడ్‌యూనియన్ సభ్యులలో నూటికి 2.3% మాత్రమే నిరుద్యోగు లున్నప్పటికి, 1927-29 ల మధ్య ఈ సంఖ్య నాలుగింతలు, ఆరింతలుకూడ అధికమయినది."*

జర్మనీలో మొత్తం నిరుద్యోగుల సంఖ్యయెంత ?

జర్మనీలో ద్రవ్యోల్బణం ముగిసేటప్పటికి శాశ్వతంగా పది లక్షలకుపైగా కార్మికులు నిరుద్యోగులయ్యారు. 1929ఆర్థిక సంక్షోభం ముందు కూడ, మొదటి యుద్ధానికి ముందువచ్చిన సంక్షోభా లన్నింటిలో కంటె నిరుద్యోగుల సంఖ్య చాల అధికంగా ఉన్నది,

జర్మనీలో నిరుద్యోగం (వేల సంఖ్యలో)

| | | ఏటా సగటు |
|---|---|---|
| 1924 | .... | 911 |
| 1925 | .... | 646 |
| 1926 | .... | 2,011 |
| 1927 | .... | 1,353 |
| 1928 | .... | 1,353 |
| 1929 | .... | 1,892 |

* Deutschaftskunde 1933, P 297.

మొదటిప్రపంచయుద్ధానికిముందు నిరుద్యోగులను గూర్చిన లెక్కలు బ్రిటనులోకూడ లేవు. ట్రేడ్‌యూనియన్ సభ్యులలో నిరుద్యోగులనుగూర్చిన లెక్కలు మాత్రమే ఉన్నవి. 19 శతాబ్ది మధ్య భాగంనుండీ ఈ నిరుద్యోగసంఖ్య ఎలా పెరుగుతూ, తరుగుతూ వచ్చిందో తెలిపే లెక్కలొక బ్రిటనుకు మాత్రమే చిక్కుతున్నవి. 'యుద్ధకాలంలో సమష్టి ప్రభుత్వం నిరుద్యోగాన్ని గురించి ఒక శ్వేతపత్రాన్ని ప్రకటించింది, ఇందులో చాల చక్కని చార్టుచేర్చారు; 1860 నుండి బ్రిటిష్ నిరుద్యోగగతి నిది స్పష్టంగా తెలియబరుస్తుంది. ఈ చార్టును గురించి విశేషం వ్యాఖ్యానించ నవసరంలేదు.

గ్రేట్ బ్రిటన్‌లో నిరుద్యోగం : 1858–1938.




[Employment policy - courtesy - The macmillan Co.]

1950 మొదలు మొదటి ప్రపంచయుద్ధందాకా గ్రేట్ బ్రిటన్లో నిరుద్యోగం 2% నుండి 8% వరకు అటూఇటూ మారుతూ వచ్చింది. సర్ విలియం బీవరిడ్జి ఇలా అన్నాడు.*

"1872 నాటి అసాధారణ అభ్యుదయం మినహాయిస్తే ఈ తరంగాలు 98 దాకా తగిలినవి. అంటే నూటికి ఇద్దరు నిరుద్యోగు లున్నారన్నమాట. 1897 నాటి అసాధారణమాంద్యం మినహాయిస్తే, దిగుదల నూటిలో 92వంతులదాకా ఉంది. అంటే నూటికి ఎనమండుగురు నిరుద్యోగులున్నారు."

రెండు యుద్ధాల మధ్యకాలంలో నిరుద్యోగస్థాయి 10% నుండి 20% దాకా ఉంది. అంటే మొదటి యుద్ధానికి పూర్వం పదేళ్ళలో రంటె ఎక్కువ, 19 శతాబ్ది ఉత్తరార్ధంలోకంటె ఎక్కువ అన్నమాట.

అమెరికాతో పోల్చి చూదామంటే ఈ విషయంలో మనకు నమ్మకమైన లెక్కలు దొరకడంలేదు. కాని మొదటి యుద్ధానికి పూర్వం ఒక తరందాకా ఉండిన వైఖరికి భిన్నంగా, 1919-29 మధ్య కాలంలో యంత్రపరిశ్రమలలోకాని, గనులలోకాని ఎక్కువమంది కార్మికులకు ఉద్యోగాలు దొరకలేదు. ఈ అంశాన్ని ప్రక్కపుటలోని అంకెలు తెలుపుతున్నవి.•

ఈ కాలంలో కార్మిక ఉత్పత్తి శక్తి మరీ ఎక్కువ కాబట్టి ఎన్ని ఎక్కువవస్తువుల నుత్పత్తి చేయాలన్నా ఎక్కువమంది కార్మికులను పనికి చేర్చుకోవలసిన అవసరంలేదు.

---

* సర్ విలియం బీవరిడ్జి, స్వేచ్ఛాసంఘంలో అందరికీ ఉద్యోగాలు.

• Statistical Abstract of the U.S.A. 1942, P. 885

కర్మాగారాలు:

| సంవత్సరం | సంస్థలు | ఏటేటా సగటు పనిచేసిన కార్మికుల సంఖ్య |
|---|---|---|
| 1919 | 210,268 | 8,423,964 |
| 1921 | 192,059 | 6,475,474 |
| 1923 | 192,096 | 8,194,170 |
| 1925 | 183,877 | 7,871,409 |
| 1927 | 187,629 | 7,848,070 |
| 1929 | 206,663 | 8,369,705 |

ఇంతవరకు మన పరిశీలన ఏమిటిని తెలియజేస్తున్నది ? మొదటి యుద్ధానికి పూర్వం పదేళ్ళలో, అతి ముఖ్యమైన పెట్టుబడిదారీ రాజ్యం మార్కెట్టుల అత్యల్ప విస్తరణతో కొన్నిచోట్ల ఉన్న మార్కెట్టుకూడ పడిపోవడంతో సంతృప్తి పడవలసివచ్చింది. ఈ కాలంలో బయట ప్రాంతాలను విస్తరించ లేకపోవడంవల్ల, దాగా ఆర్థిక ప్రాబల్యం ఉన్న రోజుల్లోకూడ నిరుద్యోగం మొదటియుద్ధంక్రిందట పదేళ్ళలో కంటె ఎక్కువగానున్నది. పూర్వం ఆర్థికమాంద్యపు రోజులలో ఉన్నంత ఎక్కువగా, ఈ అభ్యుదయ దశలోకూడ నిరుద్యోగం కనిపించింది. యూరోపు పారిశ్రామిక దేశాలలోకంటె, ఉత్పత్తి అత్యధికంగా హెచ్చిన అమెరికా సంయుక్త రాష్ట్రాలలోకూడ, ఉత్పత్తి హెచ్చుదలకు తగినంతగా కార్మికుల సంఖ్య ఎక్కువ కాలేదు. (అసలెక్కువే కాకపోవడం సామాన్యంగా కనిపిస్తుంది.) అభ్యుదయ కాలంలో కూడ కార్మికుల నెక్కువమందిని తీసుకొనే వైఖరి అంతమయినట్టు స్పష్టంగా కనిపిస్తుంది.

1929 నాటి ప్రపంచ సంక్షోభానికి ముందుగా వచ్చిన ఆర్థికాభ్యుదయ యుగం, పూర్వపు అభ్యుదయ దశలకంటె ఒకవిషయంలో పూర్తిగా భిన్నంగా కనిపిస్తుంది. ఇందుకు యుద్ధాన్ని కారణంగా చెప్పడం ఎంత అనాలోచితమో ఒక్క అమెరికా పరిస్థితిని గమనిస్తే తెలిపోతుంది, తర్వాత ఆర్థికంగా బాగున్న మంచిరోజుల్లోకూడ అమెరికాలో కార్మికులసంఖ్య ఎక్కువకాలేదు. కాబట్టి యుద్ధమే అందుకు కారణమని చెప్పలేము. ఇంకొక అంశంకూడా గమనించాలి. అమెరికా ధనికవిధానం, తానిక దేశీయవర్తకాన్ని పెంచుకోలేక రాను రాను ఎక్కువగా విదేశాలలో కొత్తమార్కెట్టులకోసం పోటీపడజొచ్చింది. ఇందుకు కూడ యుద్ధం బాధ్యమని చెప్పవీలులేదు, ఈకాలంలో వలసదేశాలలోను అర్ధవలసదేశాలలోను కొత్తమార్కెట్టులు ఏర్పడకపోయేందుకు కూడ మొదటియుద్ధం కారణంకాదు. యూరపియన్ సామ్రాజ్యవాద విధానమే ఇందుకు కారణం.

వాటర్లూనుండి సెరజెవోదాకా ఉన్న ఈశతాబ్ది మొత్తంమీద జరిగిన అభివృద్ధినుండి ఈదశను పూర్తిగా భిన్నంగా చేసివేసిన ముఖ్యకారణం చెబుతాను. ధనికవిధానం తన ఉత్పత్తిశక్తిని, ఉత్పత్తిని తప్పనిసరిగా అధికం చేసుకోవలసివచ్చింది. అందులో ఈ ఆధిక్యం యుద్ధానంతరం విదేశాలలో కొత్తమార్కెట్టుల ఆసరా లేకనే జరగవలసివచ్చింది. కాబట్టి ఆర్థిక సంక్షోభం వచ్చినప్పుడు, పూర్వ ధనికవిధాన చరిత్రలో యెన్నడూ కని విని యెరుగనంత తీవ్రరూపంతో విశ్వవ్యాప్తంగా సంక్షోభం అలముకొన్నది. ఈ అంశాన్నెవరూ కాదనడం లేదు. కాబట్టి ఆర్థిక సంక్షోభ ఫలితాల నిక్కడ సంగ్రహంగా మాత్రమే వివరిస్తున్నాము.

## సంక్షోభంలో ఉత్పత్తి, నిరుద్యోగం, విదేశవర్తకం,

ప్రపంచంలోని అతి ప్రధాన పారిశ్రామిక దేశాలలో యంత్రోత్పత్తి 1929 నుండి 1932 దాకా ఎలా జరిగిందో ఈ క్రింది లెక్కలు తెలుపు తున్నవి.

### ప్రపంచ ఉత్పత్తి *

| | సోవియట్ కలిపి | సోవియట్ కాక | అమెరికా సం. రా. | జర్మనీ | ఫ్రాన్సు | యునైటెడ్ కింగ్డమ్ (బ్రిటన్) |
|---|---|---|---|---|---|---|
| 1929 | 100 | 100 | 100 | 100 | 100 | 100 |
| 1930 | 88.6 | 86.5 | 80.7 | 85.9 | 99.1 | 92.3 |
| 1931 | 79.1 | 74.8 | 68.1 | 67.6 | 86.1 | 83.8 |
| 1932 | 69.8 | 63.8 | 53.3 | 53.3 | 71.6 | 83.5 |

సోవియట్ యూనియన్ కాక ప్రపంచోత్పత్తి 1929 కి 1932 కు మధ్య 1920 స్థాయికంటె 63.8% తగ్గిపోయింది. ఈతగ్గుదల ప్రధాన పారిశ్రామికదేశాలైన అమెరికా జర్మనీలలో అత్యధికం. ఈ దేశాలలో ఈ మూడు నాలుగు సంవత్సరాల ఆర్థిక సంక్షోభకాలంలో ఉత్పత్తి సగానికి సగం తగ్గిపోయింది. పారిశ్రామికోత్పత్తి అమెరికాలో 53.8% కు, జర్మనీలో 53.3% కు తగ్గిపోయింది, కాని గ్రేట్ బ్రిటన్‌లోను ఫ్రాన్సులోనుకూడ ఈతగ్గుదల చాలానే కనిపిస్తుంది. ఫ్రాన్సులో దాదాపు 30% ఈతగ్గుదల కనిపిస్తుంది. ఇతర పెద్ద పారిశ్రామికరాజ్యాలన్నిటి

* నానాజాతి సమితి లెక్కల పంచాంగం—1938-39. పుట. 180-81.

కంటె బ్రిటనే కాస్త సులువుగా సంక్షోభంనుంచి బయటపడింది. ఇక్కడ ఉత్పత్తి "కేవలం" 16.5% మాత్రమే పడిపోయింది. *

ధనికవిధాన చరిత్రలో ఉత్పత్తి హీనత ఇంతగాకున్నా దీనికి ఏకాంతదగ్గరలోకికూడ ఎన్నడూ రాలేదు, నిరుద్యోగంలో ఆధిక్యతా. ఉత్పత్తిలో హీనతా రెండూ కలిసిరావడంకూడ ధనికవాద చరిత్రలో ఎన్నడూ కని విని యెరుగనిది. వాయిటిన్‌స్కీ ఇలా వ్రాశాడు.

"ఆర్థిక సంక్షోభకాలమంతటా నిరుద్యోగధోరణి సామాన్యంగా ఎలావుందో ఈ అంతర్జాతీయ కార్మికసంస్థ తయారుచేసిన నిరుద్యోగసూచిక తెలియజేస్తుంది. తారతమ్య పరిజ్ఞానానికై ఈ సూచిక 1929 లో నిరుద్యోగస్థాయిని 100 గా లెక్కవేసి ఆ ప్రాతిపదికపై లెక్కకట్టింది. ఆయేడు ఉత్పత్తి మాంచి హెచ్చు స్థాయిలోవున్నా బ్రిటన్‌లో పదిలక్షలమంది, అమెరికాలో దాదాపు 30 లక్షలమంది, జర్మనీలో 20 లక్షలమంది, ఇటలీలో 3 లక్షలమంది, జపానులో 3 లక్షలమంది, ఆస్ట్రియాలో రెండులక్షలమంది నిరుద్యోగ కార్మికులున్నారు. ఈ అధికారుల అంచనాలలో కొందరిని వదలివేయడం తప్పదనుకొంటే, మొత్తం 1929 లో ప్రపంచ నిరుద్యోగ కార్మికులసంఖ్య మొత్తంగాచెబితే కోటిదాకా ఉంటుంది. 1929 నుండి 1932 నాటికి ఈసంఖ్య మూడురెట్లు పెరిగింది; సంక్షోభ తీవ్రదశలో ఈలెక్కలు తీసుకున్న దేశాలలో దాదాపు 3 కోట్ల కార్మికులు నిరుద్యోగులుగానున్నారు. కొంతకాలం ఉద్యోగాలలో ఉంటూవచ్చిన కార్మికులు

* అనుకూలపరిస్థితిని అంచనావేయడంలో ఒకసంగతి జ్ఞప్తికుంచుకొనాలి. 1929 కి ముందు ఉత్పత్తిస్థాయి యుద్ధపూర్వస్థాయికంటె తక్కువలోనే ఉంది. ధనిక రాజ్యాలలో బ్రిటన్ ఒక్కటే ఈ స్థితిలో ఉండినది.

ందులో చేరలేదు. అసలు పైకి కనిపించని నిరుద్యోగులూ చేరలేదు. ఆరెండువర్గాలనూ చేర్చుకుంటే ఈసంఖ్య తప్పకుండా నాలుగుకోట్లు దాటుతుంది."*

ఇలా దారుణంగా ఉత్పత్తి తగ్గిపోవడం, నిరుద్యోగం అత్యధికం కావడం వీనితోపాటు ఘోరంగా ప్రపంచ విదేశ వర్తకంకూడ తగ్గిపోయినది. 1929—33 వరకు ప్రపంచం మొత్తంమీద ఎగుమతి దిగుమతుల వివరాలను ఈక్రింద ఇస్తున్నాము.

(1000 మిలియన్ల బంగారు డాలర్లలో) •

| | 1929 | 1930 | 1931 | 1932 | 1933 |
|---|---|---|---|---|---|
| దిగుమతులు | 33.6 | 29.1 | 20.8 | 14 | 12.5 |
| ఎగుమతులు | 33 | 26.5 | 18.9 | 12.9 | 11.7 |

సంక్షోభ సమయంలో ప్రపంచ వర్తకం నాలుగోవంతు పడిపోయింది. 1929 లో 100 అని ప్రాతిపదిక తీసుకున్నట్టయితే, నానాజాతి సమితి లెక్కలప్రకారం ప్రపంచ వర్తకం 74 కు పడిపోయింది. ఇంతకు ఆజువాజులోకూడ ధనికవిధాన చరిత్రలో ఈ పతనం ఎన్నడూ కనిపించదు. మొదటి యుద్ధానికి మునుపు మున్ఫై యేళ్లలోను. విదేశ

* వ్లాడమీర్ వాయిటిన్‌స్కీ. ఆర్థికసంక్షోభం-సాంఘిక ఫలితాలు. జినీవా. 1936. పుటలు 142-43.

• నానాజాతి సమితి లెక్కల పంచాంగం 1933—34 పుట 195

వర్తకం 10% కూడ తగ్గిపోలేదు. నిజానికి దశలోని సంక్షోభసమయాలలో విదేశశర్తకం ఇంకా నెమ్మదిగా నైనప్పటికి ఎక్కువవుతూనే వచ్చింది. వాయిటిన్ స్కీ ఇలా వ్రాశాడు :*

"అంతవరకు పెరుగుతూవచ్చిన విదేశవర్తకం 1881 నుండి 1913 దాక మూడుసార్లు కుంటువడినది. మొత్తం ఎగుమతి దిగుమతుల విలువ 1883—1885 లోను (9%). 1891—94 లోను (8%), 1907—1908 లోను (7%), పడిపోయింది. అయితే ఇదేసమయంలోనే ప్రపంచధరలు (యు. కె. టోకు ధరల సూచిక—ఎకానమిస్టు ప్రచురితం—ప్రకారం) మరింత తగ్గిపోయాయి (1883—85 లో 11%, 1889—94 లో 13%, 1907—8 లో 9%). కాబట్టి విదేశవర్తకం ఇటీవలికంటె భిన్నంగా పెరుగుదల అలానే ఉంచుకొనగలిగినది."

ఈ పరస్పర విరుద్ధ ధోరణిని ప్రక్కపుటలోని డయాగ్రాము* స్పష్టపరుస్తున్నది.

ఇతర వైయక్తికదేశాలలో భేదాలన్నిటిని పరిశీలించినట్టయితే ప్రపంచ వర్తకం, 1929 సంక్షోభ సమయంలో ఉత్పత్తిలో తరుగుదల, నిరుద్యోగులలో పెరుగుదల, విదేశవర్తకంలో తగ్గుదల-ఈ విఘాతాలన్నింటిని అనుభవించింది, వీనిలో అన్నీ కూడ అభూత పూర్వమైన తీవ్రరూపంతో బయట పడినవి.

---

* వ్లాడిమిర్ వాయిటిన్ స్కీ, "ఆర్థిక సంక్షోభం సాంఘిక ఫలితాలు", జెనీవా 1936, పుట 66.

అంతర్జాతీయ మారకం విలువలు

(దిగుమతి ఎగుమతులు—బంగారు డాలర్లు)




సంక్షోభ ఫలితాల విశ్వజనీనత

ఈ 1929 సంక్షోభ ఫలితాల బారినుండి, ఆర్థికవ్యవస్థలోని ఏ శాఖ కూడ తప్పించుకోలేదు. పందొమ్మిదో శతాబ్దిమధ్యభాగం నుండి మొదట ప్రపంచయుద్ధందాకా వచ్చిన సంక్షోభాలకంటె అతిదారుణ రూపంతో ఈ సంక్షోభం విరుచుకపడినది. అంతేకాక, కరల్ మార్క్స్ లన సిద్ధాంతాలను ప్రవచించుటకు తగిన సామగ్రిని చేకూర్చిన 1825, 1836, 1847 నాటి ఆర్థికసంక్షోభాలకంటె కూడ ఇది తీవ్రాతి తీవ్ర రూపంతో ప్రపంచాన్ని కలచి వైచినది. 1929 సంక్షోభ సమయంలో తిరిగి మార్క్స్ అభిప్రాయాలు. సిద్ధాంతాలు ప్రపంచ దృష్టినాకర్షించి వాదోప వాదాలకు సిద్ధాంతరాద్ధాంతాలకు కేంద్రం కావడం యాదృచ్ఛికం కాదు.

1929 సంక్షోభం అతితీవ్రమూ, విస్తారమూ అయినది కాబట్టి ధనికవ్యవస్థలోని ఏ శాఖకూడ దీనినుండి తప్పించుకో లేకపోయింది. పూర్వపు సంక్షోభాలలో ఇలా జరగలేదు. ఏప్రత్యేక దేశాన్ని కాని దెబ్బతీయకనే సంక్షోభం వస్తుండేది, పోతుండేది. అలాకాక 1929 సంక్షోభం, ప్రతి పెట్టుబడిదారీ దేశాన్నీ—అది పాతపారిశ్రామిక దేశంకానీ, వ్యవసాయమే ఇంకా ప్రధానంగాఉన్న దేశంకానీ-కలచివేసినది. సామ్రాజ్య దేశాలనూ, దానివలస ప్రాంతాలను కూడ భీభత్సం చేసివేసింది.

అన్ని పెట్టుబడిదారీ దేశాలకు వ్యాపించడమేకాక, ఆదేశాలలోని అన్నివర్గాలపైనా ఈ సంక్షోభం దెబ్బతీసింది. ఎవరూ దీని దెబ్బ తప్పించుకోలేక పొయ్యారు. పూర్వం ఆర్థిక మాంద్యాలువస్తే. పెట్టుబడిదారులు, వారిక్రింద పనిచేసే కార్మికులు మాత్రమే దెబ్బతినేవారు-మరి రైతులు, భూస్వాములు, ఉద్యోగులు, పెన్షన్‌దారులు, స్వంత ఆదాయంకలవారు యథారీతిగానే ఉండిపోయేవారు. ఇంకా ఆలోచిస్తే, వీరి ఆదాయాలు తగ్గక. ధరలు తగ్గిపోవడం వల్ల మరింత వీరి జీవిత ప్రమాణం పెరిగేది. ఇలా ధనిక వ్యవస్థలో ఒక శాఖ సంక్షోభానికి బలికానందువల్ల సంక్షోభాన్ని దాటుకునేందుకు ఇదొక ఉపస్కారకంగా ఉండేది. 1929 సంక్షోభంలో ధనికవ్యవస్థక్రింద ఏరంగంకాని వేరుగా ఉండిపోలేదు.

ఈ సమయంలో ఉత్పత్తి సగానికి సగంపడి పోయింది. షుంపీటర్ అన్నట్టుగా.*

---

* జోసెఫ్, షుంపీటర్, వ్యాపారచక్రాలు-మాక్‌గ్రూహిల్, న్యూయార్కు-1939, పు 908.

"అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వ్యాపారం యావత్తులోను మూడువంతులు (పొలాలతోబాటు) ఆర్థిక సర్వనాశస్థితికి బలిగావలసి వచ్చింది."

సమాజంలోని ఏశాఖకూడ సంక్షోభ ఫలితాలను తప్పించు కొనలేక పోయింది. క్రిందటి సంక్షోభాలలో రైతులు వ్యవసాయదారులు సామాన్యంగా దెబ్బతినేవారు కారు. ఈ కాని సంక్షోభం వ్యావసాయికమూ, పారిశ్రామికమూ కూడ. రైతులు దెబ్బతినడంతో ఆ రంగం పారిశ్రామిక సంక్షోభంపై వ్యతిరేకంగా పనిచేసి, సంక్షోభాన్ని మరింత రెచ్చిపోజేసింది.

పూర్వం పెన్షన్లమీదా, స్వంత ఆదాయాల మీదా బ్రతుకుతున్న వారు (పూర్వం చెప్పినట్టు బాగుపడ్డంతప్ప) దెబ్బతినేవారు కాదు. కాని ఈ సంక్షోభంలో ప్రపంచం కరెన్సీలు—ఒక దేశం తర్వాత మరొకచోట విలువ పోగొట్టుకుంటూ వచ్చాయి. బేనకు వేలమంది దివాలా తీయడం కూడ ఈ వర్గంపైపని చేసింది. ఆలాగే ప్రభుత్వోద్యోగుల జీతాలు పూర్వం యథాపూర్వంగానే ఉండేవి. 1929 లో మాత్రం ఇలాకాదు. నోట్లవిలువ తగ్గడంవల్ల పరోక్షంగా ఈ జీతాలు తగ్గాయి. అంతేకాక సంక్షోభ సమయంలో ప్రభుత్వాలు తమ ఆదాయం 25% నుండి 45% దాకా తగ్గిపోవడంవల్ల ప్రత్యక్షంగానే జీతాలపై కోతలకుదిగారు. ఆ సంక్షోభ సమయంలో జర్మనీ ఆర్థిక పరిశోధనాలయం ఇలావ్రాసింది *

"ఈ సంక్షోభంలో తగ్గిపోయినంతగా, గత యాభై యేళ్ల లోను ఎన్నడుకూడ ప్రజల ఆదాయం తగ్గిపోలేదు. ఇంత విశ్వ

* Uicrteliahrshefte Zur Konjunkturforschung : 6 Jahrgang. Heft B, P 42.

జనీసంగా ఆదాయం పూర్వమెన్నడూ అధమస్థితికి పోలేదు—ఉద్యోగుల జీతాలు, స్వతంత్ర వ్యక్తుల ఆదాయాలు, వ్యవసాయీకుల ఆదాయాలు వగైరాలుకూడ తగ్గిపోయాయి. పూర్వం ఇవెన్నడూ దెబ్బతినేవి కావు."

ఇది జర్మనీనిగూర్చే వ్రాసినప్పటికి, యావత్ ప్రపంచంలోని అన్ని ధనికరాజ్యాలకుకూడ అనువర్తిస్తుంది.

## ఈ సంక్షోభం వ్యావసాయికమూ, పారిశ్రామికమూ కూడ

1929 నాటి ఆర్థిక సంక్షోభం వ్యవసాయానికీ పరిశ్రమలకుకూడ వ్యాపించినది. అందులో దీని మహాతీవ్రతవల్ల ధనికసమాజంలోని ఆర్థిక వ్యవస్థలోని ప్రతిశాఖనూ, ప్రతివర్గాన్నీ కదిపివేసింది. ఇదొక్క ఈ సంక్షోభానికి మాత్రమే చెందినది. 19 శతాబ్దిలోని ఏ యితర సంక్షోభంలోను ఇలా జరగలేదు.

ధనికవిధానం వ్యవసాయాన్ని తన గుప్పిటిలోనికి నెమ్మదిగా క్రమంగా లాగుకున్నది. వ్యవసాయంలో ఉత్పత్తి పురాతనపద్ధతులపై నడుస్తున్నంతవరకూ. రైతులు ఉత్పత్తిచేసిన పంటలో ఏ కొద్ది మాత్రమో బజారుకు వెడుతున్నంతవరకూ, రైతులు తమ పంటలోని అధికబాగంమీదనే జీవనం గడుపుతున్నంతవరకూ పరిశ్రమలలోలాగా వ్యవసాయంలో అధికోత్పత్తి అనేది ఏర్పడలేదు. కాబట్టే 19 శతాబ్ది పారిశ్రామిక ఆర్థిక సంక్షోభ సమయాలలో వ్యవసాయోత్పత్తి సంక్షోభ ప్రభావాన్ని ధిక్కరించగల స్థితిలోఉన్నది. ఇది సంక్షోభాన్ని దాటుకునేందుకు కూడ ఉపస్కారకమైనది. 19 శతాబ్ది ఉత్తరార్థంలో వచ్చిన గొప్ప వ్యవసాయ సంక్షోభం నిజమైన అంతర్జాతీయ సంక్షోభంకాదు, అది

కేవలం యూరోపు వ్యవసాయానికి మాత్రమే చెందినది. అందులోనూ ధాన్యోత్పత్తికి మాత్రమే చెందినది.

ఈ సంక్షోభాన్నిగూర్చి ఫ్రెడరిక్ ఏంగిల్సు ఇలా వ్రాశాడు*

"సముద్రాంతర ఆవిరినౌకలు, ఉత్తరదక్షిణ అమెరికాలు ఇండియాలకు చెందినరైల్వేలు, యూరపుధాన్యం బజారులో కొత్త కొత్త ప్రాంతాలు పోటీచేసే స్థితిని కల్పించినవి. ఒకవేపు ఉత్తర అమెరికా "ప్రియరీలు", మరొకవేపు అర్జెంటినా "పంపాసు" ఉన్నవి. ఇది ప్రకృతి సిద్ధంగా సాగులాయకైన భూములు, పాత కాలపు వ్యవసాయ పద్ధతులలోకూడ అపరిమితమైన పంటపండే కన్నెచెర వదలని భూములవి. మరొకవేపు రష్యా భారతదేశాలలోని గొంచె భూములున్నవి, ఈ భూములలో పండిన పంటను రాను రాను ఎక్కువభాగం రైతులు అమ్ముకోవలసివచ్చేది.... ఇందుకు కారణం, నిరంకుశప్రభుత్వోద్యోగులు నానాహింసపెట్టి వీరితో నగదు రూపంలో పన్నులువసూలు చేసేవారు. ఆడబ్బు కట్టడం కోసం వీరు పంట లమ్ముకోవాలి. తమ సేద్యపుఖర్చులెంత అనే లెక్క వేసుకొనేందుకుకూడ వీరికివీలులేదు. కిస్తీ చెల్లించవలసిన తేదీ నాటికి తమవద్ద డబ్బుండితీరాలిగనుక, వర్తకులు పెట్టిన ధరకు వీరమ్ముకోవాలి. పాతకాలపు పన్నులక్రింద యూరపియన్ కౌలుదారులు, రైతులు-ఈ వినూతనప్రపంచపు నవభూములతోను, పన్నులఒత్తిడితో బజారునపడిన రష్యా,—భారత—రైతులతోను పోటీచేయలేక పోయ్యారు. యూరపులోని పొలంలో కొంత భాగం, అమ్మకానికి ధాన్యం ఉత్పత్తిచేయడం వదులుకున్నది....

* మార్క్సు, కాపిటల్-రెండోభాగం 259-60-హాంబర్గు 1894 ఏంగిల్సును ఉదహరించిన భాగం.

పీటన్నిటిమూలంగా స్కాట్లెండునుండి ఇటలీదాకా, దక్షిణ ఫ్రాన్సునుండి తూర్పుప్రష్యాదాకా వ్యవసాయ సంక్షోభం అలము కొన్నది."

ఈ సంక్షోభాన్నెదుర్కొనేందుకు, యూరపులో వ్యవసాయదారులు విపరీతంగా, ఉన్నదానిలో అతి శక్తియుక్తులతో సేద్యంచేయ నారంభిం చారు. పైనుండి వచ్చేధాన్యం బారినుండి, స్వదేశధాన్యం ధరలను రక్షిం చేందుకు, యూరపియన్ ప్రభుత్వాలు సుంకాలను అధికంగా విధించే వారు. వీని ఫలితంగా యూరోపు భూఖండంలో ధాన్యంధరలు పెరిగాయి. అయినా యూరోపుప్రధానపారిశ్రామికదేశాల పట్టణ కార్మికులు ఎక్కువ ధరలు పెట్టగలిగేవారు. కారణం రక్షణసుంకాలవల్ల పెరిగిన ధాన్యం ధరలకంటె వారి జీతాల హెచ్చుదల ఎక్కువ,

పూర్వపు సంక్షోభాలలాకాకుండా 1929 నాటి సంక్షోభం యూరో పుతోపాటు, అమెరికాకు, వలసదేశాలకు, అర్థవలసదేశాలకుకూడ వ్యాపిం చింది, ధాన్యోత్పత్తిని మాత్రమేకాకుండా, వ్యవసాయోత్పత్తి నంతటిని అలముకొన్నది. ప్రతిచోటా వ్యవసాయం ఇందులో చిక్కుకొన్నది. వ్యవసాయ సంక్షోభం పారిశ్రామిక సంక్షోభాన్ని మరింత తీవ్రపరిచినది.

ఈ వ్యవసాయ సంక్షోభం ప్రపంచంపై అకస్మాత్తుగా పిడుగులా వచ్చిపడలేదు, పైగా పట్టణాలలో సంపత్తి ఇంకా అధికంగా ఉన్నప్పుడే ఇది స్పష్టంగా కనిపించసాగినది. సంపద తులతూగుతున్నరోజుల్లో కూడ నిరుద్యోగం తొలగించ వీలులేకపోయినది—ఈ సంపదలో అత్యధికభాగానికి పాలులేకపోయినది. 1929 నాటికి ముందుకూడ

అభ్యుదయంలో వ్యవసాయానికి భాగంలేదు. కరల్ బ్రాంటు ఇలా వ్రాశాడు *

"న్యూయార్కు స్టాక్ ఎక్స్ఛేంజి 1929 శరత్తులో శిథిలం కావడంతో ప్రపంచ సంక్షోభం ఆరంభంకాలేదు. మూడు నాలు గేళ్ళక్రితం ఉన్న ధరల సగటు స్థాయినుండి, 1928 ప్రారంభం లోనే ప్రపంచ ప్రధాన వ్యావసాయిక వస్తువుల ప్రపంచమార్కెట్టు ధరలు పడిపోసాగినవి."

వ్యవసాయ సంక్షోభానికి కారణాలు సుస్పష్టమే. ఈ కాలంలో వ్యవసాయోత్పత్తి లెక్కినకు,చాల అభివృద్ధిచెందింది. ఉత్పత్తి బాగా ఎక్కువయినది. దీనికి తగినంత లాభసాటి మార్కెట్టు దొరకలేదు. రైతులు, కౌలుదారులు, పన్నులు. కౌలు, (మగతా) ఇతర అప్పులు వగైరాలు అచ్చుకునేందుకు తమ పంటలో ఎక్కువభాగం అమ్మకం చేయవలసివచ్చేది. ఇలా ఎక్కువ పంట మార్కెట్టుకు తరలడంవల్ల. వ్యవసాయసంక్షోభ ఫలితంగా పడిపోయిన ధరలవల్ల మరింత నష్టపడ వలసివచ్చింది.

పరిశ్రమలలో అధికోత్పత్తి, కోట్లకొలది కార్మికులు నిరుద్యోగులు కావడం, పనిలోఉన్న లక్షలాది కార్మికులుకూడ చాలీచాలని జీతాల మూలంగా తమ జీవితావసరవస్తువులుకూడ కొనలేని స్థితిలోనికి రావడం ఏర్పడింది. ఈ పరిస్థితివల్ల సాంఘికవ్యవస్థ యావత్తూ అధోగతిపాలయి నది. అదే సమయంలో వ్యవసాయోత్పత్తికూడ ఎక్కువకావడం లక్ష లాది రైతులు, కౌలుదారులు సర్వనాశనస్థితికి దిగజారడం, ప్రపంచం

*కరల్ బ్రాంటు. ప్రపంచ వ్యవసాయపునర్నిర్మాణం. న్యూయార్కు. 1945. పుట 53.

యావత్తూ క్షుధార్తులతో నిండిపోవడం • వీటన్నిటిమూలంగా ధనిక సాంఘిక వ్యవస్థపైనే విశ్వాసం రానురాను విధ్వంసితమైపోయింది. ధనిక వ్యవస్థలోనే అంతర్గర్భితమైఉన్న సంక్షోభ తీవ్రత వ్యవసాయ సంక్షోభంలో కొట్టవచ్చినట్టు అతినగ్నస్వరూపంతో బయటపడినది.

పూర్వకాలపు ఆర్థికవ్యవస్థలో ఆర్థిక సంక్షోభాలు ఉత్పత్తి తగ్గిపోవడంవల్ల (కరువుకాటకాల వల్ల) ఏర్పడేవి. ఆ సాంఘిక వ్యవస్థలలో వ్యవసాయోత్పత్తి అతిప్రధానంగా ఉండేది. పంట చాలకపోతే తిండిగింజలు కరువై ప్రజలు ఆకలికి మాడిపొయ్యేవారు. అప్పటి ప్రజలు రోజూచేసే ప్రార్థన అతి వాస్తవమైనది. "రోజూ మా కాహారమివ్వు ప్రభూ". ఏమైనప్పటికి 1929 సంక్షోభంలో ఆహారం అధికంగా ఉత్పత్తి అయినది. దీనిఫలితంగా లక్షలాది రైతులు పొలాలనుండి తొలగింపబడే స్థితివచ్చింది. ధాన్యంధరలు పూర్తిగా పడిపోవడంవల్ల, తమ పన్నులను, మగఖాలను వడ్డీలను చెల్లించుకోలేక పోయారు. అదే సమయంలో పట్టణప్రజలకు తిండిగింజలెంతో అవసరమయ్యాయి. కాని వారు హెచ్చుధర లిచ్చుకొనే స్థితిలోలేరు. రైతులిక తిండికై ప్రార్థించడం లేదు—పంటలు పాడైపోయినా మంచిదే ననుకుంటున్నారు,

ధనికవిధానం ఈ 1929 సంక్షోభాన్నెలా ఎదుర్కొన్నది? దాన్నుంచీ అసలిప్పటికైనా పూర్తిగా బయటపడ గలిగినదా?

కొత్తమార్కెట్టులకు ధనిక పద్ధతి విస్తరించడం మానివేసిన తర్వాత ఈ ఆర్థిక సంక్షోభం వచ్చినది.

1919-29 దః కూడ ఇంతే-ఈ దశలోనే కొంత తిన్నగా ఉత్పత్తి కోలుకో నారంభించింది. సంక్షోభాన్ని దాటుకునేందుకు, మునుపటిలాగా కొత్త మార్కెట్టులు ఏర్పడలేదు.

సంక్షోభానికీ యుద్ధానికీ మధ్య వి_స్తరణ ఆగిపోయింది.

ఈ పరిస్థితినిలా తెచ్చిన వివిధ కారణాలను పరిశీలింతాము.

1. రష్యా విప్లవానికీ, ఆర్థిక సంక్షోభానికీ మధ్య, రష్యా విదేశ వర్తకం జారు పరిపాలన కాలంనాటి స్థాయికి రాలేదు. అంతేకాక రష్యా ఉత్పత్తి 1929 నాటికల్లా బాగా అభివృద్ధిచెందినది. సోవియట్ ప్రభుత్వం తయారుచేసిన వివిధ పంచవర్ష ప్రణాళికలప్రకారం ఆ ఉత్పత్తి అతివేగంగా భారీయెత్తున పెరుగుతూనే వస్తున్నది. కాని సోవియట్‌కు ఇతర ధనికరాజ్యాలకూ మధ్యనున్న విదేశవర్తక సంబంధాలు క్షీణిస్తూనే వచ్చినవి. యుగోవ్ * లెక్కల ననుసరించి, రష్యా ఎగుమతులు 1909-13 మధ్య 6,513.9 మిలియన్లు; అలాగే సగటుదిగుమతులు అదేసమయంలో 4,994.1 మిలియన్లు, రష్యా ఎగుమతులు 24,590.8 వేల టన్నులు. దిగుమతులు 11,240.7 వేల టన్నులు. అలాకాక 1933-38 లో రష్యా ఎగుమతులు 1,331.9 మిలియన్ రుబుళ్లు, 2167.5 మిలియన్ల రుబుళ్ళ మధ్యఉండేవి. దిగుమతులు 1018 మిలియన్ రుబుళ్ళు 1525.1 మిలియన్ రుబుళ్ళమధ్య ఉండేవి. టన్నులలో ఎగుమతులు 9682.3 వేల టన్నులు 17,916.3 వేల టన్నులమధ్యను, దిగుమతులు 1025.2 వేల టన్నులకు 1285.8 వేల టన్నులకు మధ్యనుఉండేవి. 1938 లో రెండో యుద్ధానికొక

---

* ఎ. యుగోవ్ యుద్ధశాంతులలో ఆర్థికరంగం-న్యూయార్కు 1942, పుట 99. యుద్ధపూర్వ, పరదశలను పోలుస్తూ యుగోవ్ ఇలా అన్నాడు: ఈ లెక్కలు "విదేశవాణిజ్యమంత్రి వర్గానికి చెందిన శాస్త్రీయాలయం తయారుచేసినది. తారతమ్యవివేచనకు 1936 నాటి విదేశవర్తకం ఫైసలాయతీకై నిశ్చయించిన కొత్త రుబులు వెలతీసుకోబడింది. 1909-1913 మొదలువెనుక ప్రచురించిన ఎగుమతి దిగుమతి లెక్కలన్నీ కొత్త లెక్కతో-4.38-హెచ్చింప బడినవి."

సంవత్సరంముందు- సోవియట్ రష్యా మొత్తం విదేశవర్తకం జారిస్టు రష్యా 1913 లో జరిపిన విదేశ వర్తకంలో నాలుగోవంతు మాత్రమే ఉన్నది. కాబట్టి మనం పరిశీలిస్తున్న కాలంలో సోవియట్ రష్యా ప్రపంచ ధనిక విధానానికి కొత్త మార్కెట్టుగా ఏ మాత్రం లేదు; పైగా "పాతదే" బాగా కుదించి వేయబడినదిగా మాత్రమే ఉన్నది.

(2) అమెరికా 1920-29 ల మధ్య తన దేశానికి వలసవచ్చే వారి సంఖ్యను 1905-14 ల మధ్యలోనున్న సంఖ్యలో సగానికి తగ్గించివేసినది * 1929-39 నుండి అమెరికాలోనికి ప్రవేశించేందుకుచాల తక్కువమందికి మాత్రమే † అనుమతి నిస్తూవచ్చారు. 1935-39లో మరింత తక్కువ -2,72,422 మాత్రమే-ఈపదేళ్ళలోను కలిసి అమెరికాలోకి వలసవెళ్లిన వారిసంఖ్య 1904-15 ల మధ్యఒక్క ఏడాదిలో వెళ్లినవారి సంఖ్యకంటె తక్కువ. ఈ కాలమంతటి లోను యూరోపు లేబర్ మార్కెట్టుకు అనుకూలంగా ఉండడం మానివేసింది. యూరోపులో నిరుద్యోగ కార్మికుల సంఖ్య అనంత రూపం ధరిస్తున్నది. పైగా పెట్టుబడిని ఎగుమతిచేసుకొని కొంత సంక్షోభాన్నుంచి తప్పించుకొనే అవకాశాన్ని కూడ యూరోపుకు లేకుండా అమెరికా ప్రవర్తించింది.

మొదటియుద్ధం తర్వాత చెప్పుకోదగినంత పెట్టుబడిని బయటికి ఎగుమతిచేయగల శక్తి యూరపియన్ రాజ్యాలలోకల్లా ఒక్క బ్రిటనుకు మాత్రమే ఉండినది. కాని అదేసమయంలో అమెరికా గొప్ప పెట్టుబడి ఎగుమతిచేయగల రాజ్యంగా రంగంలో ప్రవేశించింది.

---

* అమెరికా లెక్కల అబ్‌స్ట్రాక్టు వాషింగ్టన్ 1942, పు. 122

† అదే

"1919 నుండి 1929 దాకా అమెరికాలో తీసుకున్న విదేశ ఋణాలు, 7,500 మిలియన్ల కొత్త పెట్టుబడిని ఇతరదేశాలకు సమకూర్చాయి. బ్రిటన్, ఫ్రాన్సు, హాలండు ఇంకా ఇతర పెట్టుబడి పెట్టగల దేశాలన్నీ కలిపిపెట్టిన విదేశఋణాలకంటె ఈ మొత్తం ఎక్కువ.*"

ఈలోగా సంక్షోభం మూలంగా ప్రపంచవర్తకం అభూతపూర్వమైన స్థితికి దిగజారి పోయినది. యూరోపులోకంటె అమెరికాలో ఉత్పత్తి మరింత పడిపోయింది. విదేశవర్తకం కూడ మిగత ప్రపంచ మంతటికంటె అమెరికాలో బాగా పడిపోయింది. పెట్టుబడి ఎగుమతులలో కూడ అమెరికా ధనస్వాములు బాగానష్టపడ్డారు. కాబట్టి పూర్వంలో 1929 సంక్షోభానంతరం కొత్తగా పెట్టుబడిఎగుమతి జరగలేదు. పైగా పాతకాలపు పెట్టుబడిలో కొంత భాగాన్ని ఉప సంహరించుకోవడం జరిగింది. ఇందులో ప్రపంచ ఆర్థిక సమస్యలు మరింత చిక్కుపడ్డాయి.

" ఇప్పుడు విదేశాలలో దీర్ఘకాలపు పెట్టుబడులను అమెరికా బాగా తగ్గించి వేసింది.........పూర్వం పెట్టిన పెట్టుబడులనే ఎక్కువగా వెనక్కు తీసుకోవడం జరిగింది."*

(3) మొదటి ప్రపంచయుద్ధం తర్వాత, మధ్యయూరపులో కొత్త స్వతంత్ర రాజ్యాలేర్పడడంవల్ల, అక్కడి పరిశ్రమల అభివృద్ధిలో మాంద్యం ఏర్పడింది. సంక్షోభ ఫలితంగా జర్మనీలో

* ప్రపంచ ఆర్థికవ్యవస్థలో అమెరికా, ఆర్థికమాల నెం 23, అమెరికా వాణిజ్యశాఖ, వాషింగ్టన్ 1943, పుట 31.

* ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అమెరికా, ఆర్థికమాల NO 23 అమెరికా వాణిజ్యశాఖ.

జాతీయ సోషలిజం(నాజీజం—అను.) అధికారానికి వచ్చాక, ఒకకొత్త రకపు జర్మన్ సామ్రాజ్యతత్వం పెంపొందినది. ముందే తిన్నగా పెరుగుతున్న మధ్యయూరపు మార్కెట్లను. పునరుజ్జీవితమైన జర్మనీ సామ్రాజ్య తత్వం ఆక్రమించ సాగినది.

(4) సంక్షోభానికి పూర్వమే, యూరపు వివిధ రాజ్యాల వలస దేశాలలో పరిశ్రమల అభివృద్ధి దాదాపు ఆగి పోయినది. తర్వాత కూడ అదేస్థితే కొనసాగినది. ఈ సామ్రాజ్యవాద విధానంవల్ల వలస ప్రాంతాలన్నీ సంక్షోభదారుణతకు మరింతగా గురికావలసి వచ్చినది. అంతకు మునుపుకూడ ఇక్కడి పరిశ్రమాభివృద్ధి తాబేటినడకతో సాగుతూవచ్చినది. కాబట్టి సంక్షోభాన్ని నెట్టివేసుకునేందు కీదేశాలు కొత్త మార్కెట్టుల నివ్వలేక పోయినవి.

(5) వలసలలోను, అర్ధవలసలలోను ఏ మాత్రం పరిశ్రమలు పెంపొందిఉన్నా, అందువల్ల వచ్చేలాభాలలో జపానే ప్రధానభాగాన్ని సంగ్రహించినది. జపాను ప్రభుత్వం తన సామ్రాజ్యదృష్టితో తన దేశీయ పరిశ్రమలను పెంపొందించసాగినది. ప్రభుత్వప్రణాళికలు, యుద్ధ ఆర్థిక వ్యవస్థలమూలంగా జపాను సంక్షోభ దుష్ఫలితాలనుండి తప్పించుకొన్నది. తన, వలసల విదేశవర్తకాన్నంతటిని జపానే పూర్తిగా గుత్తతీసుకొన్నది. బాగా దెబ్బతిన్న యూరపు సామ్రాజ్యాల విదేశవర్తకం బాగా తగ్గిపోయింది, కొన్నిచోట్ల చాల బాగున్నదంటే వెనకఉన్నంతా అలాగే ఉన్నదన్నమాట. ఈ సమయంలో జపాను సామ్రాజ్యంయొక్క విదేశవర్తకం కొంతకుకొంత పెరిగినది.

ఇలా 1929 కి ముందు కొత్తమార్కెట్టుల అభివృద్ధి ఆగిపోయిన స్థితే తర్వాత రెండో యుద్ధం 1939 లో వచ్చేదాకా కొనసాగినది.

అంతర్గర్భిత సంక్షోభంలోనే
ప్రపంచధనికవిధానం యుద్ధంలో దిగింది,

మొట్టమొదటిసారిగా తనకున్న సంపత్తితోనే ధనికవిధానం సంక్షోభా న్నెదుర్కోవలసివచ్చినది. ధనిక విధానం కొత్తమార్కెట్టులు లేకనే సంక్షోభంలో ప్రవేశించి, అవి లేకనే వెళ్లబోయవలసివచ్చింది. ఇంతవరకు మనం జరిపిన పరిశీలనవల్ల (1) ఈ సంక్షోభం ధనికవిధాన చరిత్రలో అతిదారుణరూప మెందుకు ధరించినదో, (2) నేటిదాకా దాని నెలా దాటలేకపోవలసివస్తున్నదో—మనకు బోధపడుతున్నది.

ఇందులో మొదటిదానికిచెందిన లెక్కలనింతకుముందేఇచ్చాము. రెండవదానిని గురించి ఇక పరిశీలింతాము.

ప్రపంచోత్పత్తి సంక్షోభంలోనుండి 1938 దాకా ఎలానడిచిందో * క్రింద ఇస్తున్నాము.

ప్రపంచోత్పతి ; గనులలో పరిశ్రమలలో
(1929 లో 100 అనే ప్రాతిపదికపై వేయబడినది.)

| | రష్యాతోపాటు | రష్యా లేకుండా |
|---|---|---|
| 1934 | 85.8 | 77.7 |
| 1935 | 96.3 | 86 |
| 1936 | 110.5 | 96.4 |
| 1937 | 119.4 | 103.7 |
| 1938 | 111.5 | 93 |

* నానాజాతిసమితి లెక్కలపంచాంగం 1938-1939. పుటలు 180-81

ఈ లెక్కలద్వారా, ప్రపంచధనిక విధానోత్పత్తి ఒక్క 1937 లో మాత్రమే, 1929 నాటికన్నా క్రొత్త హెచ్చినట్టు కనిపిస్తుంది. 1934-38ల మధ్య సగటు ఉత్పత్తి 1929 నాటి ఉత్పత్తి స్థాయికంటె దాదాపు 86% తక్కువ. కాని ఇవికూడ సరైన పరిస్థితిని తెలుపవు. కారణం ఇందులో జర్మనీ యుద్ధోత్పత్తి, బ్రిటన్, ఫ్రాన్సు, జెకొస్లొవేకియా వగైరాల యుద్ధావసరోత్పత్తికూడ ఇందులో చేరడంవల్ల ఈమాత్రమైనా కనిపిస్తుంది. ఈ కాలంలో జరిగిన శాంత్యవసరాల ఉత్పత్తి లెక్కలను 1929 ఉత్పత్తి అంకెలతో పోలిస్తే మరింత విభేదం కనిపిస్తుంది,

రెండోయుద్ధానికిముందు అయిదేళ్ళలోను అమెరికా ఉత్పత్తిని (ఈదేశంలో ఆయుధోత్పత్తి ఈ కాలంలో బాగా తక్కువ) జర్మనీ ఉత్పత్తితో పోలిస్తే ఇది మరింత స్పష్టపడుతుంది. రెండు దేశాలలోను సంక్షోభంమూలంగా ఉత్పత్తి సగానికిసగం తగ్గిపోయినది. కాని తర్వాత ఈ దేశాలలో అభివృద్ధి చాల భిన్నంగా కనిపిస్తుంది *

పారిశ్రామికోత్పత్తి స్థాయిసూచిక. (1929 ఉత్పత్తి ప్రాతిపదిక 100—)

| | అమెరికా | జర్మనీ |
|---|---|---|
| 1934 | 66.4 | 79.8 |
| 1935 | 75.6 | 94 |
| 1936 | 88.1 | 106.3 |
| 1937 | 92.2 | 117.2 |
| 1938 | 72.3 | 126.2 |

ప్రపంచంలోకల్లా ప్రధాన ధనికరాజ్యమైన అమెరికాలో ఉత్పత్తి స్థాయి సంక్షోభానంతరం ఎన్నడూ 1929 స్థాయి నందుకోలేదు. యుద్ధా

* నానాజాతిసమితి లెక్కల పంచాగం 1938-39, పుటలు 180,81

నికి క్రిందటి సంవత్సరంలోకూడ 1929 నాటి ఉత్పత్తిలో ముప్పాతిక వంతులేదు. ఇలా ఉత్పత్తి సగానికిసగం అమెరికాలో తగ్గిపోవడం ఏ సంక్షోభ సమయంలోనుగూడ జరగలేదు. అలాగే సంక్షోభంవచ్చిన 9 ఏళ్ళ తర్వాతకూడ పూర్వస్థాయికి ఉత్పత్తిరాకపోవడంకూడ అభూత పూర్వమే.

జర్మనీలోని పరిస్థితి ఇలాలేదని పైలెక్కలు తెలుపుతున్నవి. 1936 నాటికి ఉత్పత్తి 1929 నాటిస్థాయినందుకున్నది. 1938లో ఉత్పత్తి స్థాయి 126.2 పెరిగింది. 1939 మొదటిభాగంలో ఈ సూచిక 135 కు పెరిగింది. ఇలా కొంతకాలంలోనే జర్మనీ ఉత్పత్తి క్రిందటి అభ్యుదయదశలో స్థాయికంటె మూడోవంతు ఎక్కువపెరిగింది, కాని ఈఅభివృద్ధి సామాన్యవ్యాపారధోరణికి సంబంధించినదికాదు. శాంతిసమయంలో ఏ ధనికరాజ్యంకాని ఊహించనంత ఎక్కువగా నాజీలు ఆయుధోత్పత్తిని ఎక్కువ చేశారు.

ఇతర ప్రధాన ధనికరాజ్యాలలోని పారిశ్రామికోత్పత్తిని ఈ క్రింది లెక్కలు వివరిస్తున్నవి. *

పారిశ్రామికోత్పత్తి సూచిక (1929 ఉత్పత్తి 100—ప్రాతిపదిక)

| | బ్రిటన్ | ఫ్రాన్సు | ఇటలీ | జపాను |
|---|---|---|---|---|
| 1934 | 98.8 | 75.2 | 80 | 128.7 |
| 1935 | 105.6 | 72.5 | 93.8 | 141.8 |
| 1936 | 115.8 | 78 | 87.5 | 151.1 |
| 1937 | 123.6 | 81.7 | 99.6 | 170.8 |
| 1938 | 115.5 | 76.1 | 98.5 | 173 |

* నానాజాతిసమితి లెక్కలపంచాంగం. 1938-39. పుటలు 180-181

భారీయెత్తున ఆయుధోత్పత్తిచేయకుండా 1929 ఉత్పత్తిస్థాయిని మించగలిగిన పెద్ద పెట్టుబడిదారీ రాజ్యం ఒక్క గ్రేట్ బ్రిటన్ మాత్రమే. అయినా ఇదీ ఏమంత చెప్పుకోదగినది కాదు. 1929 స్థాయికూడ ఈ దేశంలో 1913 స్థాయికికూడ రాలేదు. అదీకాక సంక్షోభంలో జర్మనీ, అమెరికాలకంటె బ్రిటన్ ఎక్కువ దెబ్బతిన్నది. గ్రేట్‌బ్రిటన్‌కు మరొక అనుకూలంకూడ ఏర్పడినది, దిగుమతిధరలు—ఆహారం, ముడిసరుకులు కూడ—ఎగుమతి ధరలకంటె చాల హీనస్థితికి పడిపొయ్యాయి—ఎగుమతులలో మూడింట రెండువంతులు పారిశ్రామిక వస్తువులే. ఇందువల్ల సంక్షోభ ఫలితాలనుండి బ్రిటన్ కొంతకుకొంత తప్పించుకోగలిగినది. మరొకటి వలసలకూ బ్రిటన్‌కూ ఉన్న సన్నిహితసంబంధం, ఆయుధోత్పత్తిలో పెరుగుదలకూడ సహాయపడినవి—ఆయుధోత్పత్తి జర్మనీతో పోలిస్తే లెక్కలోనిది కాదనుకొండి.

ఫ్రాన్సులో అమెరికాలోలాగే ఉత్పత్తిస్థాయి ఈదశలో 1929 స్థాయి నెన్నడూ అందుకొనలేదు. వరుసగా ఆర్థిక మాంద్యం కనబడుతున్నది. ఈ కాలమంతటా 1929 ఉత్పత్తిలో ముప్పాతికవంతు మాత్రమే ఉత్పత్తి జరిగినది.

ఇటలీలో కూడ ఆయుధోత్పత్తి ఎక్కువగాఉన్నా ఉత్పత్తిస్థాయి 1929 స్థాయి నందుకోనేలేదు.

జర్మనీ తరువాత, 1929 లో కంటె ఉత్పత్తి నెక్కువచేసినది ఒక్క జపాను మాత్రమే. సంక్షోభ ఫలితంగా జపానులో ఉత్పత్తిపతనం చాలతక్కువ. 1929 ఉత్పత్తి నూరు అనుకుంటే 1931 లో 91.6 మాత్రమే తగ్గింది. తిరిగీ 1932 లో 97.8 కి పెరిగింది. 1933 లో 113.2 కు అధికమయినది. * పై టేబిల్ మేరకు 1929 కంటె అన్ని

---

* నానాజాతి లెక్కల పంచాంగం —1938, 39, పు—180-181

దేశాలకన్న జపా నెక్కువ ఉత్పత్తి చేసింది. ఇందుకుతగిన కారణా లున్నవి.

ఈకాలంలో జపాను తనకు కావలసిన కొత్త. మార్కెట్టులను ఏర్పరచుకొన్నది. 1931 లో మంచూరియాపై దండయాత్ర చేసినది. ఇవికాక తన ఆయుధోత్పత్తిని విస్తరీకరించుకొన్నది, శాంతి సమయంలో ఆంగ్లోశాక్సన్ దేశాలలో ఉండిన పరిస్థితులు, పైకారణా లన్నింటివల్ల తాను చైనాపై దాడిచేయకముందే, జపానులో స్థిరపడినవి. ఇలా జపాను, జర్మనీలలో ఆయుధోత్పత్తి క్రమంగా వృద్ధి అవుతున్నప్పటికి, గ్రేట్‌బ్రిటన్. ఫ్రాన్సు, చిన్న యూరపియన్ రాజ్యాలు పైవానికి సమాధానంగా తమ ఆయుధోత్పత్తిని కూడ పెంచుకోవలసి వచ్చినప్పటికి ప్రపంచ వస్తూత్పత్తి (సోవియట్ యూనియన్ను మినహాయిస్తే) సంక్షోభానికి పూర్వంకంటె, 1929 కీ రెండో మహాయుద్ధానికీ మధ్యకాలంలో బాగా తగ్గిపోయింది, పైగా కోట్లకొలది నిరుద్యోగుల సంఖ్య శాశ్వతంగా అలాగే నిలిచిపోయినది.

1929 లో ముందు, పెట్టుబడిదారీ దేశాలలో నిరుద్యోగ సంఖ్య, అంతకు ముందటి అభ్యుదయ సమయాలలో ఎన్నడూలేనంత ఎక్కువగానున్నది. మరి సంక్షోభం రాగానే నిరుద్యోగం యెంత ఎక్కువయిపోయిందంటే, ఉత్పత్తి పడిపోవడంతో పాటుగా ఈ నిరుద్యోగం ధనిక సమాజవ్యవస్థ పునాదులనే కదిలించి పారవేసినది. ఇంతేకాక. సంక్షోభ సమయంలోను, యుద్ధారంభం వరకున్నూ నిరుద్యోగం ప్రపంచ ధనికరాజ్యాలన్నిటా 1929 నాటికంటె అత్యధికంగా వ్యాపించినది.

అమెరికాలో నిరుద్యోగం విశ్వరూపం వహించినది, గంటకు మనిషి చేయగల ఉత్పత్తి ఎక్కువవుతుండగా, ఉత్పత్తి 1929 కంటె

మరీ తక్కువస్థాయిలో నున్నదన్న సంగతిని మనం జ్ఞాపకముంచు కున్నట్టయితే, ఈ సంగతిని మనం సులువుగా అర్థంచేసుకొన గలుగు తాము. 1939 లో యూరోపులో రెండో ప్రపంచ యుద్ధం ఆరంభమయి నప్పుడు, అమెరికాలో నిరుద్యోగులసంఖ్య కోటీ నాలుగు లక్షలు—అంటే దేశంమొత్తంమీద పనిచేస్తున్న కార్మికుల సంఖ్యలో అయిదోవంతు నిరు ద్యోగులున్నా రన్నమాట.*

గ్రేట్‌బ్రిటన్‌లో యుద్ధారంభానికి అయిదేళ్ళముందు, వదలకుండా 15 లక్షల నిరుద్యోగు లున్నారు. 1929 స్థాయికంటె ఉత్పత్తిహెచ్చినా ఈ సంఖ్య తగ్గలేదు. నిశ్చయమైన సంఖ్యలను క్రింద ఇస్తున్నాము †

బ్రిటన్‌లో పూర్తిగా పనిలేనివారు

| | | నూటికి |
|---|---|---|
| 1934 | 18,01,913 | 13.9 |
| 1935 | 17,14,844 | 13.1 |
| 1936 | 14,97,587 | 11.2 |
| 1937 | 12,77,928 | 9.4 |
| 1938 | 14,23,662 | 10.3 |

ఫ్రాన్సులోను, పశ్చిమ యూరోపులోను, జెకొస్లొవేకియాలోను నిరుద్యోగం 1929 కి క్రిందటికంటె సంక్షోభంలోను, తర్వాత రెండో యుద్ధంవచ్చేకున్నూ చాల ఎక్కువ.

*సైమన్ కుజ్నెట్సు, యుద్ధకాలంలో జాతీయోత్పత్తి, న్యూయార్కు. 1945.పుట 101

† నానాజాతి సమితి లెక్కల పంచాంగం 1938-39. పుట 65

విదేశవర్తకం సంగతి ఇలావుంది ; 1929 లో ప్రపంచం దిగుమతుల (పాత బంగారుఅమెరికన్‌డాలర్లు) విలువ 35,595 మిలియన్ల డాలర్లు. అదే సంవత్సరం ఎగుమతుల విలువ మొత్తం 33,024 మిలియన్ల డాలర్లు. 1934 లో ప్రపంచం దిగుమతుల విలువ (ఒక్క-స్పెయిన్ తప్ప-ఇదిఉన్నా లేకున్నా వచ్చే భేదం అట్టేఉండదు.) 11,816 మిలియన్ డాలర్లకు, ప్రపంచం ఎగుమతుల విలువ 11,215 మిలియన్ డాలర్లకు, పడిపోయింది. 1937 కంతా ప్రపంచ దిగుమతులు 16,247 మిలియన్ డాలర్లకు, ఎగుమతులు 15,347 మిలియన్ డాలర్ల విలువకు హెచ్చాయి. తిరిగీ 1938 లో ప్రపంచ వస్తూత్పత్తిలోను, ప్రపంచ వర్తకంలోను పెద్దలోటు ఏర్పడింది. దిగుమతులు 14,232 మిలియన్ డాలర్లకు పడిపోయినవి *

సోవియట్‌ను మినహాయించి ప్రపంచోత్పత్తి 1929 స్థాయినిదాటి హెచ్చినదల్లా ఒక్క 1937లో మాత్రమే. ఇదికూడ ముఖ్యంగా ఆయుధోత్పత్తి హెచ్చడంవల్ల ఏర్పడినదే. ఈ కాలంలో ప్రపంచవాణిజ్యం 1929 స్థాయికంటే హెచ్చడంకాదు, అసలా స్థాయినందుకొన్న సంవత్సరమైనా ఒక్కటి లేదు.

నూరేళ్ల ధనికవిధాన చరిత్రనుబట్టి చూస్తే మనకొకటి బోధపడుతుంది. సంక్షోభం గడచినది అనేందుకు గురుతు, ఆర్థిక వ్యవస్థలో సంక్షోభానికిముందటి అభ్యుదయదశలోవున్న ఉత్పత్తిస్థాయి తిరిగీ అందుకొనాలి. అంతేకాక దాన్నిదాటి మరింత హెచ్చాలి. అప్పుడే సంక్షోభం పోయిందన్నమాట. మరి1929 సంక్షోభానంతరం, ప్రపంచ ధనిక విధానం 1939లో రెండో యుద్ధం ఆరంభమయ్యేదాకా ఆ స్థితికి రాలేదు.

* ఈ లెక్కలన్నీ నానాజాతిసమితి లెక్కల పంచాంగం 1938 - 39, పుట 219 లోనివి.

ఇందువల్ల అప్పటికి సంక్షోభాన్ని విజయవంతంగా దాటవేయడం జరగ లేదన్నమాట.*

దీని ప్రాముఖ్యాన్నెక్కువగా నొక్కిచెప్పనవసరం లేదు. దీని కర్థం ప్రపంచ ప్రజలూ, ప్రభుత్వాలూ కదలి చిక్కాకైన సాంఘిక ప్రాతిపదికపైనే రెండో ప్రపంచయుద్ధంలో ప్రవేశించాయన్నమాట. మొదటి యుద్ధంలోకంటె సంఘమిప్పుడు బాగా పునాదులు కదిలిపోయి ఉన్నది.

1929 సంక్షోభాన్ని పూర్తిగా దాటలేకపోవడం అనేది ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో ఒక మైలురాయి. ప్రపంచ రాజకీయాలలో కూడ ఇదొక కొత్త శకాన్ని సూచిస్తుంది.

ఈ సంక్షోభంవల్ల ఏర్పడిన ఛిన్నాభిన్నత అనంతం కాబట్టే, అసలు ధనిక సమాజవ్యవస్థ అస్తిత్వమే ప్రశ్నగా తేలిపోయినది. ఇందువల్ల ఈ సంక్షోభం ఒక సంగతిని స్పష్టపరిచింది:—ఆర్థిక వ్యవస్థకూ రాజకీయాలకూ మధ్యను, ఆర్థిక స్థితికీ విదేశాంగ విధానానికి మధ్యను, ఆర్థికస్థితికీ ప్రపంచ రాజకీయాలకు మధ్యను—అతి సన్నిహితమైన సంబంధం ఉన్నది. ఇలాంటిదశలో కేవలం సంక్షోభాన్ని దాని కారణాల, ఫలితాలను, దాని నిర్ణీతగతినిమాత్రం వివరిస్తే చాలదనికూడ పై సంక్షోభం వెల్లడిచేసింది.

---

* అమెరికా వ్యవసాయానికి కూడ ఇది అనువర్తిస్తుంది. వాణిజ్యశాఖ వ్యవసాయ ఆర్థికసమితి చిల్లరప్రచురణ నెం 567. పుట 124. వ్యవసాయ ఆర్థిక వ్యవస్థపై యుద్ధప్రాబల్యం అనే పుస్తకం—లో ఇలా ఉన్నది:- "రెండో యుద్ధం వచ్చేప్పటికి, వ్యవసాయం, 1930 తీవ్ర సంక్షోభంనుండి ఇంకా కోలుకొనలేదు." అంటే సంక్షోభం లోనమెదలుతుండగనే అమెరికా వ్యవసాయంకూడ యుద్ధంలో ప్రవేశించినదన్నమాట. మొదటియుద్ధ ఆరంభస్థితి ఇదికాదు. అదే ప్రచురణలోనే (3పుట) ఇలాఉంది: "మొదటి యుద్ధానికిముందు, ధరల పెరుగుదల, సౌభాగ్యం ఇవి వ్యవసాయంలో ఇరవై యేళ్లు కనిపిస్తూవచ్చినవి."

పాత కాలంలోలా ధనికవిధాన విస్తరణ ఆగిపోయింది. కాబట్టి అలాంటి దశలో వచ్చిన సంక్షోభాలతో పోల్చ వీలులేక పోతున్నది. మార్కెట్టు ధోరణి, జీతాలు, లాభాలు, ధరలు వీని స్థితిని పరిశీలించడం వల్ల ఏమీతేలదని తేలిపోయినది. జీతాలు, ధరలు, లాభాలు మొదలైన వానిని కేవలం అర్థశాస్త్రరీత్యా వివరించడం లాభంలేదు. నేటి ప్రపంచ చరిత్ర. ధనికవిధాన దశలలో ధనికదేశాల సామ్రాజ్యాల అస్తిత్వం, వాని ఆర్థికస్థితిపై పూర్వమంత ప్రాభవం నెరపడంలేదుకనక, ఆ వివరణ ఈ అంశానికి సమాధానం చెప్పలేకపోతున్నది. విదేశరాజ్యాల స్థితి ఆర్థిక వ్యవస్థపై ఎలా పలుకుబడి నెరపినదో ఈ కేవల ఆర్థిక వివరణ వివరింప లేదు.

కాబట్టే సంక్షోభానికి సంబంధించిన చాల వివరాలు, పరిశీలనలు పాఠకుని చాల అసంతృప్తునిగనే వదిలివేస్తున్నవి; అసలీ సమస్యను క్షుణ్ణంగా, సమగ్రంగా కాక, అందులోని సూక్ష్మవివరాలనుగూర్చి ప్రత్యేక శాస్త్రనిపుణులు చేసిన వివరణ లవి. కాబట్టి సంక్షోభాన్ని సమగ్రంగా చూడాలంటే సమగ్ర వివరణం అత్యవసరమవుతున్నది. అప్పుడా సంక్షోభాన్ని పూర్తిగా ప్రపంచ రాజకీయ సమస్యలతో దానికున్న అతి సన్నిహిత సంబంధాలతోపాటు చూడగలుగుతాము.

మనమింతవరకు 1929 సంక్షోభాన్ని, అది ఏర్పడిన దశను కేవలం ఒక భాగంమాత్రమే పరిశీలించాము. మనమిప్పు డందుకుతోడు సామ్రాజ్య విస్తరణను, ప్రపంచ సంక్షోభమూ రెండుప్రపంచ యుద్ధాలూ ఏర్పడుచుకపడిన రాజకీయ పరిస్థితిని పరిశీలించి వివరించుకోవాలి.

మూడో అధ్యాయం

# సామ్రాజ్యవాద విస్తరణ

సంక్షోభకాలంలో నూతనంగా మార్కెట్టులేర్పడలేదు. అందువల్ల సంక్షోభం మరింత తీవ్రతరమయింది. రష్యావిప్లవం, అమెరికా స్థితిలో మార్పు, ఇవికాక ఇందుకు ప్రధానమైన కారణం వలస దేశాలను, అర్ధ వలస దేశాలను భారీయెత్తున పారిశ్రామికం చేసే ప్రయత్నం జరగ లేదు.

ఈ పరిస్థితికి చెందిన అంశాలను పరిశీలించాము. ఇక వీనికి కారణాలను తెలుసుకొనాలి. ఇందుకోసం క్లిష్టమైన సామ్రాజ్యతత్త్వ విస్తరణగూర్చి వివరంగా తెలుసుకోవాలి. ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సంక్షోభంపై పలుకుబడినెరపే అంశాలనుగూర్చి మనం సహజంగానే ఈ సందర్భంలో పరిశీలించవలసి ఉంటుంది.

1929 సంక్షోభ వివరణను గూర్చి మనమనుకున్న మాటలు సామ్రాజ్య విస్తరణకుకూడ చెందినవే. ఇది చారిత్రక పరిశీలన కాదు. మరి మనం సామ్రాజ్య విధానాన్ని వివరించేప్పుడు రాబోవు సంక్షోభాన్ని గూర్చి, అందుకు చెందిన చారిత్రక వాతావరణాన్ని గూర్చి వివరిస్తున్నామన్నమాట. ఈ సామ్రాజ్యవాద విధానం ప్రపంచ జనాభాలో నాలుగో వంతుమొదలు సగంవరకు వ్యాపిస్తున్నది,

ధనికవిధానం తన బాహ్యప్రవృత్తుల ననేక రీతులుగా వ్యాపింప జేస్తుందని ఇంతకుమునుపే తెలుసుకున్నాము. వీనిలో ఒకటి సామ్రాజ్య వాదం. ఒకొక్క దేశంలోని ధనికవిధానం తన సరిహద్దులనుదాటి మిగత దేశాలలోనికి ప్రవేశించ .నారంభించిన కాలంలో ఏర్పడే లక్షణం సామ్రాజ్యవాదం. కాని అలాంటి విస్తరణలన్నీ సామ్రాజ్యవాదం కావు. పారిశ్రామికంగా వెనుకబడిఉన్నప్పటికి, రాజకీయంగా సంపూర్ణ స్వతం త్రంగాఉన్న దేశాలలోనికి ధనికవిధానం 19శతాబ్ది ఉత్తరార్ధంలో విస్తరిం చినదని తెలుసుకున్నాము. ఇలాంటి దేశాలే జారిస్టు రష్యా, జపానులు. వలసలు. అర్ధవలసలపై సామ్రాజ్యవాదపు పెత్తనం

సామ్రాజ్యవాదం అలాకాదు. ధనికవిధానం కొన్ని ప్రాంతాలలోకి విస్తరించాక, ఆప్రాంతాలపై రాజకీయ పెత్తనంకూడ వహిస్తుంది—అదే సామ్రాజ్యవాద లక్షణం. ఆ ప్రాంతాలు ధనికవాద మాతృదేశానికి వల సలుగనో, అర్ధవలసలుగనో, నామకః స్వతంత్రాలైన రాజ్యాలుగనో తయారవుతాయి. ఇలా సామ్రాజ్యవాదాక్రమణ జరగగనే ఆ దేశాల భావి ఆర్థికాభివృద్ధిపై ఆదేశ ప్రజల కేమాత్రం అధికారముండదు. సామ్రాజ్య పరిపాలకులు తమ ప్రయోజనాల కనుగుణంగా ఈప్రాంతాల ఆర్థికాభివృద్ధి గతిని నడిపిస్తారు. ఈ అంశమే సామ్రాజ్యవాద సమస్యను క్లిష్టతరం చేస్తు న్నది. 19శతాబ్ది మధ్యలో బ్రిటన్ ఆరంభించినప్పటినుండి నేటిదాకా జరి గిన ధనికవాద సామ్రాజ్యవాద కాలంలో, ప్రపంచ ధనికవాదం చాల మార్పులకు లోనైనది. ఇదికాక, అదేకాలంలో ప్రధాన ధనిక రాజ్యా లలో పరస్పర విభేదాలెక్కువగా నున్నవి. కాబట్టి సామ్రాజ్యవాద పద్ధతుల లోను, ఆశయాలలోను కూడ పెద్ద విభేదాలు కనబడుతున్నవి.

సామ్రాజ్యవాద వివరణలో ఏర్పడిన అపోహలకు పొరపాట్లకు కారణమేమి ? ఒకానొకదశలో ఒకానొక దేశంయొక్క సామ్రాజ్యవాద

విధానం గూర్చి చేసిన వివరణను విచక్షణ లేకుండా సామాన్యంగా సామ్రాజ్య వాదానికి అనువర్తింపజేయడమే ఇందుకు కారణం. ఇది తప్పని వేరే చెప్ప నవసరంలేదు—ఇందుమూలంగానే తప్పు. నిర్ణయాలు చేయడంకూడ జరుగుతున్నది.

ఈ వివరణకు దూరమైన వివిధ కారాణాలవల్ల చాలముందుగనే గ్రేట్ బ్రిటన్‌లో ధనిక విధానం ప్రధాన ఉత్పత్తి విధానంగా ఏర్పడినది. అలాగే బ్రిటష్‌సామ్రాజ్య విస్తరణకూడ చాలముందుగనే ఆరంభ మయి నది. రెండు యూరోపు పెద్దదేశాలైన ఫ్రాన్సు జర్మనీలు దాని ననుగ మించాయి, బ్రిటన్ తన మహాసామ్రాజ్యాన్ని నిర్మించేటప్పటికి తానొక ప్రధాన పారిశ్రామిక దేశంగానున్నది. అది ఉత్పత్తి చేసినవస్తువులకు వెంటనే మార్కెట్టు లభించినది. పరిస్థితి అత్యనుకూలంగా ఉన్నది. అందువల్లనే తనపారిశ్రామిక ప్రయోజనాలకై ప్రత్యేక స్థానాలిక అవసరం లేనందువల్ల, అసలీ వలసదేశాలను వదిలిపెట్టకూడదా అన్నసమస్య సోష లిస్టులలోనేకాక పెట్టుబడిదారులలో కూడ ఉదయించింది.

బ్రిటన్ తన సామ్రాజ్యాన్ని వదులుకోలేదని మన మెఱుగుదుము. సామ్రాజ్యం నిర్మించేటప్పటికది ప్రపంచంలోకెల్ల ప్రధాన పారిశ్రామిక దేశమన్న సంగతి మనం గుర్తుంచుకోవాలి. ఇది తర్వాత మన వివ రణలలో ఉపకరిస్తుంది. కాని తర్వాత వలసదేశాలు కాని, ప్రత్యేక స్థానాలుకాని లేని ఇతర పారిశ్రామిక ముఖ్యదేశాలకంటె బ్రిటన్ వెనుక బడినది; పారిశ్రామిక దేశాల నాయకస్థానం నుండి అమెరికా జర్మనీల వెనుక మూడవస్థానానికి దిగజారినది. ఇంకొక అంశ మేమిటంటే, బిటన్ ఫ్రాన్సుల పెద్ద సామ్రాజ్యాలు స్థాపింపబడు తున్నప్పుడు, అది నేటి రూపంలో సంపూర్ణంగా ఏర్పడినప్పుడు కూడ, స్వేచ్ఛా వ్యాపార విధానం ఇంకా మాతృదేశాలలో ప్రధానరూపంగా ఉన్నది.

గుత్తపెట్టుబడిదారీ విధానంయొక్క ఒకానొక దశ సామ్రాజ్యవాద విధానమని చెబుతారు.* అది పొరబాటు.† గుత్తవ్యాపారం కేంద్రీకృతం కావడానికి ఎన్నోఏళ్లముందే బ్రిటన్, ఫ్రాన్సులు సామ్రాజ్యవాద విస్తరణను ఆరంభించినవి. మరి అమెరికాలో నేమో, సామ్రాజ్య విస్తరణ ఆరంభంకాకముందే గుత్తవ్యాపారం బలపడినది.

సామ్రాజ్య మాతృదేశాలలో పెట్టుబడిదారీ పోటీ స్వేచ్ఛగా జరుగుతున్న రోజులలోనే సామ్రాజ్యవాద విస్తరణ ఆరంభమయినది. ప్రభుత్వం ఆర్థికవిధానంపై అత్యల్పంగా పెత్తనం వహిస్తున్న దేశాలలోనే ఈ విస్తరణ ఆరంభమయింది. కాబట్టి యీ యూరోపు సామ్రాజ్యాల వలసలలో ప్రణాళికాబద్ధమైన ఆర్థికవ్యవస్థ సమస్యే ఉదయించలేదు. తమ వలసలలోను, తాము ప్రవేశిస్తున్న అర్ధ వలసలలోను ఈ పెట్టుబడిదారీ దేశాల లక్ష్యమేమిటి? పెట్టుబడిదారులు తమదేశాలలోకన్నా వలసలలో ఎక్కువ లాభాలు గడించేవారు. ముడిసరుకు వలసలలో మిగతచోట్లకన్న చౌకగా దొరుకుతుందనేది నిజం. ఇక తమ స్వదేశాలలో ఉత్పత్తిచేసిన సరుకులను వలసలలో మంచిలాభాల కమ్ముకోవచ్చును.

ఇందుకు కారణం తమ దేశాలలో ఇతర ఫాక్టరీల పోటీ ఉంటుంది. వలసలలో కేవలం చేతిపనులవారి పోటీమాత్రమే ఉంటుంది. భారీయెత్తున ఉత్పత్తి చేయబడిన పారిశ్రామిక వస్తువులంత చౌకగా వీరు

* లెనిన్ సామ్రాజ్యవాదం; రుడోల్ఫ్ హెల్ఫర్డింగ్ Das Finanzkapital Vienna 1910.

† గుత్తవ్యాపార విధానం పెరుగుదలఒకవేపు. సామ్రాజ్య విస్తరణ ఒకవేపు ఒక్కజర్మనీలో మాత్రమే ఒకే కాలంలో నడిచింది. ఈ జర్మనీ ప్రత్యేక సామ్రాజ్య గతిని అసలు సామ్రాజ్య తత్త్వగతితో అంటగట్టడం రుడాల్ఫ్ హిల్ఫెర్డింగు పుస్తకంలో లోపం.

తమ వస్తువుల నివ్వలేరు. కాబట్టి వారి పోటీ అతి దుర్బలంగా ఉంటుంది. ఇదీకాక, వలసదేశాలలోని కార్మికుల జీవనస్థాయి యూరోపు దేశాలలోని కార్మికుల జీవనప్రమాణంకంటె చాలతక్కువ. కాబట్టి వీరి శ్రమశక్తిని మరింత లాభసాటిగా ఉపయోగించుకోవచ్చును. *

## సామ్రాజ్య తత్త్వం—సంక్షోభ నివారణ

సామ్రాజ్య విస్తరణమూలంగా ప్రపంచ ధనికవిధానం చాల లాభపడింది. అప్పుడప్పుడువచ్చే సంక్షోభతీవ్రత నెమ్మదించి కలిగినది. ఎక్కువ వలసలున్నదేశా లీవిషయంలో ఎక్కువ లాభపడినవి. ఇంతేగాక, పరిపాలనా భారాన్నంతా అవే మోసుకొనేవి. సామ్రాజ్యవాదు లేర్పరచిన పాలనలో ఉద్యోగస్థులకు విపరీతమైన జీతాలు, అధికారులకు పెన్షన్లు ఉండేవి. ఇవన్నిటిని వలసదేశాలే అచ్చుకొనేవి. *

వలసదేశాలు సామ్రాజ్యవాద దేశాలకెన్నో లాభాలు చేకూర్చినవి. ముఖ్యంగా ఈదేశాలు ప్రపంచ ప్రధానధనిక రాజ్యస్థానాన్ని పోగొట్టుకున్నాక, వలసదేశాలలోని ప్రభుత్వాలు రాజకీయంగా పైలాభాలు ఉపయోగపడేట్టుగా సాయశక్తులా ప్రయత్నించాయి. 20 శతాబ్ది ప్రారంభంలో

* ఈ విషయం పైవ్రాస్తూ కరల్ మార్క్సు ఇలా అన్నాడు : "ఇదికాక వలసలలో పెట్టిన పెట్టుబడిమీద ఎక్కువ లాభాలు సంపాదించుకొనవచ్చు. కారణం ఆ వలసలు చాలవెనుకబడిన ప్రాంతాలు కాబట్టి,లాభా లెక్కువవస్తాయి. అలాగే బానిసలను, కూలీలను ఉపయోగిస్తారు. కాబట్టి, శ్రమశక్తిని బాగా పీడించ వీలవుతుంది." కాపిటల్—సం. iii, భాగం 1, పుట 219

* "మనకూ ఇండియాకూమధ్య అత్యుపయోగకారిగా ఏర్పరచుకున్న ఉద్యోగాల మూలంగా, మన దీవిలోని 20 లేక 30 లక్షలమందికి జీవనం జరుగుతున్న దనుకుంటాను." విన్‌స్టన్ చర్చిల్. కామన్సుసభ, మార్చి 29, 1933.

బ్రిటనూ, ఫ్రాన్సు ప్రపంచంలో ప్రధానపారిశ్రామిక దేశాలుకావు—ఆస్థానం అమెరికా జర్మనీలు ఆక్రమించాయి.

విదేశరాజకీయాలలో స్పర్ధలు పెరిగాయి.

పారిశ్రామికాభివృద్ధిలో వెనుకబడిపోతూన్న ఇంగ్లాండు ఫ్రాన్సు లకు తమకంటె బలీయమైన దేశాలతో పోటీచేయవలసి వచ్చింది. ఇందు వల్ల తమవలసలను రక్షించుకునేందుకు, గట్టిపరుచుకునేందుకు ఆరంభించవలసి వచ్చింది. తమ రాజకీయాధికారం వీరికి యితర పోటీ దారులకంటే అనుకూలాల నేర్పరిచింది. బ్రిటన్ ఫ్రాన్సులను పోల్చి చూస్తే యీ విషయం సులువుగా బోధపడుతుంది. 19 శతాబ్ది ఆఖరు నుండి మొదటి మహాయుద్ధందాకా, జర్మనీ పారిశ్రామిక వస్తూత్పత్తి, విదేశవర్తకం బ్రిటన్‌కంటె అత్యధిక గమనంతో పెరుగుతూ వచ్చింది. ప్రపంచమార్కెట్టులో జర్మనీకి బ్రిటన్ను వెనక్కునెట్టి వెళ్లగలశక్తిఉన్నా తనకున్న వలసల మూలంగా బ్రిటన్ తనసామ్రాజ్యంలోనికి జర్మనీకంటె పది రెట్లు ఎగుమతులు చేసుకోగలిగింది.

పాత సామ్రాజ్యదేశాలు తమ అధీన ప్రాంతాలపై పెత్తనాన్ని గట్టిపరుచుకునేందుకు శక్తి వంచనలేకుండా పాటుబడుతుండగా, ప్రపంచమంతటా ప్రధాన పారిశ్రామిక దేశాలమధ్య తీవ్రమైనపోటీ ఆరంభమయింది. అప్పటికిఉన్న సామ్రాజ్యాలు వేని క్రిందికీ వెళ్లిపోని ప్రాంతాలపై పెత్తనంకోసం, ప్రతిపెద్ద దేశం, పోటీ పడసాగింది. ఇందు మూలంగా 19 శతాబ్ది చివరను, 20 శతాబ్ది మొదటను అలా వేరుగా ఉండిన ప్రాంతాలన్నీ ఏదో ఒక సామ్రాజ్యప్రభుత్వం నోట పడిపోవడం జరిగింది. అలాంటి ప్రాంతాలు తక్కువయ్యే కొద్దీ, వాటినాక్రమించడం కోసం పోరాటం మరింత తీవ్రం కాసాగినది. పెట్టుబడిదారీ దేశాల

మధ్య విద్వేషాలు పెచ్చుపెరిగినవి. అనాక్రమిత ప్రాంతాలు మాయం కాగానే ఈ పోరాటం, ప్రపంచ వలసదేశాలను పునర్విభజన చేయాలన్న ఘోరణికి దిగింది.

సామ్రాజ్యదేశాలు, ఇతర ధనిక రాజ్యాలు తమప్రాంతాల నాక్ర మించకుండా నిరోధించవలసి రావడమేకాక, తమ ఆంతరంగిక పరిస్థి తుల ప్రమాదాన్ని కూడ ప్రతిఘటించవలసి వచ్చింది. మొదట సామ్రాజ్య విస్తరణకు దారితీసిన కారణాలే ఈ ప్రమాదాలకు కూడ మూలమైనవి.

సామ్రాజ్యాల పరాశ్రయ పాత్ర

పురాతన సాంఘిక వ్యవస్థలలో, సామ్రాజ్య దేశాలు తమ వలస లిచ్చే కప్పంతో సంతృప్తిపడేవి. ఇలాంటి పరిస్థితులలో వలసదేశాల ఆర్థికవ్యవస్థ మారవలసిన అవసరం లేకపోయేది. ఇలాగే చాలకాలం గడిచింది. కాని తర్వాత ధనికవిధాన సామ్రాజ్య ప్రభుత్వాలకూ, వలస లకూమధ్య అలాంటి స్థిరత అసాధ్యమయింది. కేవలం కప్పంతో ధనిక విధానం సంతృప్తి చెందలేదు. తన సరుకులకు వలసలలో మార్కెట్లు ఏర్పరుచుకోవాలి. వలసల ఆర్థిక విధానాన్ని పూర్తిగా మార్చివేసినప్పుడే ఇది సాధ్యమవుతుంది.

జమీందారీయుగంలోని యూరపియన్ రైతులలాగే తమకు కావల సిన వన్నీ ఉత్పత్తిచేసుకొనే ఆసియా రైతులు, తమ పారిశ్రామిక వస్తువు లెలా కొనగలరు? కాబట్టే వలస దేశాలలోని స్వతంత్ర కర్షక ఆర్థికవ్యవ స్థను నిర్మూలించవలసిన అవసరం సామ్రాజ్య ప్రభుత్వాలకు కలిగినది. తన సరుకుల నా దేశానికి ఎగుమతి చేసేందుకు హార్బర్లను, రైల్వేలను నిర్మించవలసి వచ్చింది. ఆరైతుల ఇతర వస్తూత్పత్తిని, దేశీయ కుటీర

పరిశ్రమలను విధ్వంసంచేసి, తమ సరుకులనే రైతులు కొనేలా చేయ వలసి వచ్చింది.

ఇలా వలసలలోని పూర్వ ఉత్పత్తి విధానాలను ధనిక విధానం నిర్మూలించిందంటే, మొదట్లో తమదేశాలలోని ప్రాచ్యఆర్థిక వ్యవస్థలను నిర్మూలించినట్టుగానే కాని అంతకంటె పైగా ఏమీచేయలేదు. తమ దేశాలలో పరిశ్రమల నభివృద్ధిపరిచినట్టుగా, వలసలలో పాత ఆర్థికవ్యవస్థలను నిర్మూలించాక కొత్త పరిశ్రమలను నెలకొల్పలేదు. పాత పారిశ్రామిక దేశాలు, వెనుకబడినదేశాల నాక్రమించుకున్నతర్వాత, అక్కడ సామ్రాజ్య దేశాలలోవలె పారిశ్రామికస్థాయి పెరగలేదు. మార్క్స్ 90ఏళ్ళ క్రిందట అన్నట్టుగా చరిత్ర నడవలేదు. "భారతదేశంలో బ్రిటిష్‌ప్రభుత్వ పాలన—భావిఫలితాలు" అనేపేర న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్ పత్రికలో 1853 ఆగస్టు 8వతేదీ ఆయన ఇలా వ్రాశాడు;

> "ఇంగ్లీషు మిల్లు యజమానులు కేవలం, భారతదేశ ఉత్పత్తిదారులనుండి, పత్తి మొదలైన ముడిసరుకును తక్కువ ధరలకు లాగాలనే ఉద్దేశంతోనే రైల్వేలనాదేశంలో ఏర్పాటుచేయాలనుకుంటున్నారు. కాని ఇనుము, బొగ్గు ఉన్న దేశంలోనికి యంత్రాలను ఒకతూరి ప్రవేశపెట్టింతర్వాత వీరు వాని అభివృద్ధిని అరికట్టడం సాధ్యంకాదు. అంత విశాల దేశంలో రైల్వేల నేర్పరిచి ఊరుకోలేరు. తక్షణావసరాలకు, రైల్వే యంత్రాలకు ఎప్పటికప్పుడవసరమయ్యే కొన్నిపరిశ్రమల నేర్పరచక తప్పదు. తద్వారా రైల్వేలకు మాత్రమే చెందని ఇతర పరిశ్రమలు కూడ పెంపొందుతాయి. కాబట్టి భారతదేశంలో రైళ్ళ ఏర్పాటు ఆధునిక పరిశ్రమలకు అగ్రగామి అవుతుంది."

బ్రిటిష్ సామ్రాజ్యవాదం. భారతదేశంలో రైళ్లను చిక్కగా ఏర్పర చింది. వీని లెఖ్ఖలనుబట్టి కేచూస్తే బ్రిటన్‌లో కంటె అధికంగా ఉంటుంది. కాని ఇది "ఆధునిక పరిశ్రమలకు అగ్రగామి" కాలేదు. అలా చేయాలని బ్రిటిష్ ధనికవిధానం ఊహించనైనా లేదు. బ్రిటిష్ ధనికులు తమ సరుకులకు ఇండియాలో మార్కెట్టును నిర్మించుకోదలచారు. తమ పోటీదారులైన ఇతర పారిశ్రామిక దేశాలకంటె వెనకబడ్డంవల్లనే, తమకున్న ఈ అనుకూల స్థానాలను వదులుకోదలచలేదు. కాబట్టి అక్కడి దేశీయ పారిశ్రామిక వ్యవస్థకు తోడ్పడలేదు. పైగా దాన్ని అరికట్టజూచారు. అసలే ఆపలేకున్నా సాధ్యమైనంత మెల్లిగా నడిచేట్టుచూచారు.

భారత దేశీయ పరిశ్రమాభివృద్ధికి చెంది నంతవరకు బ్రిటిష్ సామ్రాజ్య ఆర్థికవిధానం పరాశ్రయ జీవనంవంటిది. ఇలా దేశీయపరిశ్రమల నరికట్టడం, అది సాధ్యంకాకపోతే సాధ్యమైనంత మెల్లిగా సాగేట్టుచేయడం ఒక్క ఇండియాకోనే కాదు—ఈ విధానాన్నే అన్ని యూరపియన్ సామ్రాజ్య ప్రభుత్వాలూ తమ వలసలలో అనుసరించాయి. ఈ పారిశ్రామికాభివృద్ధి నిరోధాన్ని తియ్యనిమాటల్లో బ్రిటిషు సామ్రాజ్యవాదులు కప్పిపుచ్చుతూ వచ్చారు. ఫ్రెంచి సామ్రాజ్యవాదులు మరింత బాహాటంగా మాట్లాడేవారు, ఛార్లెస్ రోబెక్రా-ఇలా రాశాడు;

"ఏ వలస దేశంలోకూడ పరిశ్రమలను స్వేచ్ఛగా పెరగనివ్వ లేదు; అలాంటి అవకాశం పరస్పర విరుద్ధమని, అనూహ్యమని ఫ్రాన్సు తలచింది. ఇండోచైనాను దీనినుండి మినహాయించలేము."*

---

* ఛార్లెస్ రొబెకా - ఫ్రెంచి ఇండోచైనా ఆర్థికాభివృద్ధి-ఆక్సుఫరు యూనివర్సిటీ ప్రెస్సు, లండన్, న్యూయార్కు 1944, పుట 269.

పారిశ్రామికాభివృద్ధిలేని వలసలకంటే, తమకున్న ఆర్థికానుకూలాలే కాక, అక్కడి పరిశ్రమల నరికట్టేందుకు. కనీసం అడ్డగించేందుకు తగిన రాజకీయావకాశాలుకూడ సామ్రాజ్యదేశాల కున్నవి. ఈ వలసలు తమకు వేలమైళ్ల దూరంలోనున్నవి. అక్కడ యూరపియన్ పౌరులు తక్కువ మందిఉన్నారు. 1931 జనాభాలెక్కలమేరకు ఇండియాలో 1,68,000 మంది బ్రిటిష్ పౌరులున్నారు. అంటే దేశీయులు 2,000 మందికి ఒకరు చొప్పున ఉన్నారన్నమాట. కాని ఇంత తక్కువమంది బ్రిటిష్ పౌరులే ప్రధానమైన ప్రభుత్వ, ఆర్థిక, సైనిక స్థానాలన్నిటినీ తమ గుప్పిటనుంచు కొన్నారు. ఇదే పరిస్థితినే స్థూలంగా ఫ్రెంచి, డచ్చి వలసలలో కూడ చూడవచ్చును.

ఇందువల్ల ఒకప్రశ్న వస్తుంది. ఇంత తక్కువమంది విదేశీయులు స్వదేశాలకు వేలమైళ్లదూరంలోఉంటూ, తమ సహాయార్థం గొప్ప యూర పియన్ సేనావాహిని లేకనే ఎలా ఈ స్థానాల నుంచుకోగలిగారు? దీనికి పరిష్కారం-దేశీయులలో తమకు తోడుదొంగలను సంపాదించుకోవడమే. అన్నిచోట్లా ఇదే పరిష్కారమార్గమయింది. పరిశ్రమలను బాగా పెంచి నట్లయితే జాతీయ భావాలుగల దేశీయ ధనికవర్గమూ. కార్మికవర్గమూకూడ బయలుదేరేవి- అది తమకు ప్రమాదకారణ మయ్యేది. ఆధనికులూ కార్మి కులతోపాటు చేరి స్వతంత్రంకోసం పోరాటం ఆరంభించేవారు. కాబట్టే యూరపియన్ సామ్రాజ్యవాదులందరూ వలసలలో దేశీయ పరిశ్రమలను నిర్మించకుండా చూచారు—అది సాధ్యంకాకపోతే కనీసం పెరక్కుండా జాగ్రత్తపడ్డారు.

సామ్రాజ్య విధానం, జమీందారీ విధానాల కలయిక.

ప్రతిచోటా సామ్రాజ్యవాదులకు దొరికిన మిత్రులు పాతదేశీయ భూస్వాములూ, రాజులూ. ఈ వర్గాన్ని తమకు మిత్రులుగా చేసుకొని.

వారిపూర్వపు స్థానాలను సామ్రాజ్యవాదులు ఖాయపరిచారు. కొన్నిచోట్ల ఈ వర్గీయులను క్రొత్తగా సృష్టించడంకూడ జరిగింది. ఈ కార్యక్రమం బ్రిటిష్ ఇండియాలో 18 శతాబ్ది ఆఖరున ఆరంభమయింది. లార్డు కారన్‌వాలిస్ పర్మనెంటు సెటిల్మెంటుతో ఇలాంటి కొత్తవర్గాన్ని నిర్మించడం ఆరంభమయింది.

ఇండియాలో 1828 నుండి 1835 దాకా గవర్నర్ జనరల్‌గా నున్న లార్డు విలియం బెంటింక్—బ్రిటిష్‌సామ్రాజ్యవాదానికి భారత భూస్వామి వర్గానికీ మధ్యనున్న మైత్రినిగూర్చి బాహాటంగా చెప్పాడు. తాను అధికారంలో ఉండగా ఇలా అధికార పూర్వకంగా చెప్పాడు;

"సువిశాల ప్రజాందోళనకు, విప్లవానికి వ్యతిరేకంగా మనకు రక్షణకావాలి. అందుకు మనకు పర్మనెంటు సెటిల్మెంటు ఈ అనుకూలాన్ని చేకూర్చింది. ఇతరవిషయా లెన్నింటిలోనో—ముఖ్యమైన వాటిలోకూడ అది విఫలమయినప్పటికి, బ్రిటిష్‌పాలన సాగాలని తీవ్రంగావాంఛించే ధనవంతులైన భూస్వాములను చాల మంది నిది సృష్టించింది. వీరికి జనసామాన్యంపై బాగా అధికారమున్నది" *

పారిశ్రామికాభివృద్ధి ప్రతిష్టంభించి పోవడంవల్ల, అత్యధిక భారతీయుల జీవనప్రమాణం అతి హీనస్థితిలో నున్నది. కాబట్టి కొన్ని వ్యావసాయిక సంస్కరణలను బ్రిటన్ ఆరంభించింది. అయినప్పటికీ తన ఉనికికీ, పెత్తనానికి అత్యవసరమైన భారతభూసామ్యివర్గాన్ని రక్షించి తీరాలి కాబట్టి, తామే సాయపడి సృష్టిచేసిన ఈ భూస్వాముల ఆస్తి

* బెంటింక్ ఉపన్యాసం నవం 8,1829—A. B. కీతుగారి భారతవిధానాన్ని గూర్చిన ప్రసంగాలు, పత్రాలు—1750-1921 Vol 1,2,5

ప్రాతిపదికకీ సంస్కరణలేవీ దెబ్బతీయకుండా చూచుకున్నారు. ఇందువల్లనే 1928 లో ప్రకటితమైన వ్యవసాయాన్ని గూర్చిన రాయల్ కమిషన్ నివేదికలో ఇలా వ్రాశారు.

"నేడున్న భూస్వామ్య విధానాన్ని గూర్చికాని, కౌలుపద్ధతి గూర్చికాని సలహాలివ్వడం ఈ కమిషన్ విధులలో చేరినదికాదు."

ఇలాంటి మైత్రినే బ్రిటిష్ సామ్రాజ్యంలోని ఇతర వలసలలోను ఇతర యూరపియన్ రాజ్యాలలోను సంపాదించుకోవడం జరిగింది. ఫ్రెంచి ఇండోచైనాగూర్చి ఈవిషయంలో ప్రొఫెసర్ రొబెకా ఏంచెప్పాడో తెలుసుకోవడం మంచిది. ఇతగాడుసోషలిస్టూకాడు, కనీసం సామ్రాజ్యవాద వ్యతిరేకీ కాడు. ఆయ నిలా వ్రాశాడు :

"మరొక విధంగాకూడ గ్రామీణ ప్రజలు యూరపియన్ ఆక్రమణవల్ల నష్టాలను అనుభవించారు.....ఫ్రెంచి ఆక్రమణ తర్వాత, టొంకిన్‌లో. పెద్దపెద్ద జమీదారీలు సృష్టిఅయ్యాయి. ఇందువల్ల చాలమంది రైతులు కొత్తగా కౌలుదారులయ్యారు. సాధారణమైన అసమగ్రమైన. పరిశీలన ప్రకారం ఈ క్రింది లెక్కలు నియ్యవచ్చును. * టొంకిన్ కోస్తాలో 594,000 రైతులకు—61.6% గురికి—ఒక మావ్ (0.36 హెక్టార్ : హెక్టార్ :—2.471—ఎకరా) భూమిఉన్నది. 288.000 మందికి—30%—ఒకటినుండి 5మావ్ల పొలంఉంది. ఇక అసలే భూమిలేని వాడినిగూర్చి కాని, ఏ క్రాస్తో తమకుండి, కౌలుకితరుల పొలం చేసుకునే వారినిగూర్చి కాని చెప్పవీలులేదు. హైడువాంగులలోని నాలుగుదక్షిణజిల్లాలలో పన్ను రిజిస్టరు జాబితాలోని కెక్కినవారిలో సగంమందికీ ఒక్క

* హై. హెన్రీ. Economic agricole de le Indochina Hanio P.3

చదరపు మీటరు వరిపొలం కూడలేదు. భూములులేని కుటుంబ యజమానుల సగటుసంఖ్య కోస్తాలో సామాన్యంగా చాలతక్కువ. చాలజాగ్రత్తగా టాక్నిన్ రాష్ట్రంలోని చాలగ్రామాలలో పరిశీలన జరిపింతర్వాత గోరో † ఇలాఅంచనా• వేశాడు. భూములు అసలులేనట్టి_5 సోలకంటె (సో:0.18 హెక్టార్) తక్కువ పొల మున్నవారు నూటికి ముగ్గురున్నారు" *

ఇలా చిన్నరైతుల కడుపుగొట్టి, ఫ్రెంచి సామ్రాజ్య వాదం ఇండోచైనాలో తన మిత్రులైన భూస్వాములను బలపరుచు కున్నది.

యూరపియన్ సామ్రాజ్యవాదుల రాకకుముందే ఉన్నత భూస్వామి వర్గం కొంతఉంది. కొంత వీరు సృష్టిచేశారు. ఏమైనప్పటికి తమ సహాయ సానుభూతులతో ఈభూస్వామివర్గం యూరపియన్ సామ్రాజ్య వాదులకు ప్రధానమిత్ర మండలిగా తయారయినది. ఇందువల్ల ఒకముఖ్య మైన అంశం కొత్తగా ఏర్పడింది ; తమదేశాలలో భూస్వామ్యవిధానాన్ని నిర్మూలించి అభివృద్ధిచెందిన ధనికవిధానం, వలస దేశాలలో భూస్వా ములతో పొత్తు కలిపింది. వలసదేశాలలో సామ్రాజ్యవాదానికి దొరికిన నమ్మకమైన బంటులు భూస్వాములున్నూ, వారి ఉపగ్రహాలైన వడ్డీ వ్యాపారులూ పన్నులు వసూలుచేసే వారున్నూ.

సామ్రాజ్యవాదులకూ. వలసలలోని భూస్వాములకు మధ్య ఏర్ప డిన ఈ మైత్రిద్వారా ముఖ్యమైన అర్థిక ఫలితాలు కొన్ని ఏర్పడినవి. అతి ప్రధానంగా ఆర్థికాభివృద్ధి కుంటుపడింది. దేశీయభారీ పరిశ్రమల

---

† P· Courou, Les Paysans de delta tonkinois.

* ఛార్లెస్ రొబెకా, ఫ్రెంచి ఇండోచైనా ఆర్థిక ప్రతిపత్తి O. U. P లండన్ న్యూయార్కు, 1944, పుట 82-3

నిర్మాణానికి ఈమైత్రే ఆటంకంగా ఉంటూవచ్చింది. నేటికీ ఇదొక పెద్ద ఆటంకమే. భూస్వామివర్గాన్ని అలాగే ఉంచదమంటే, పలసదేశాలలోని అత్యధిక సంఖ్యాక ప్రజల జీవనస్థాయి అతిహీనస్థితిలో నుంచడమన్న మాట. పెద్దదేశాలలోని సగటు ఆదాయంతో పోలిస్తే ఈదేశాలలోనిది అత్యల్పం. కాబట్టి దేశీయపరిశ్రమ దేనికీ మార్కెట్టు మరీ సంకుచిత మయింది. పైగా అవి అభివృద్ధి కాకుండా భూస్వామివర్గం అడ్డుపడినది.

ఈ వర్గం ఉన్నన్నినాళ్ళూ, దేశీయులైన వడ్డీవ్యాపారులు. రైతు లను దోచుకునేందుకు మంచిసందు దొరుకుతుంది. ఈదోపిడీ పెట్టుబడితో విపరీతంగా వడ్డీలు లాగేవారు. ఈ దోపిడీకి అవకాశమున్నన్నినాళ్ళూ. దేశీయధనికులు మరొక పరిశ్రమ స్థాపించేందుకు ప్రయత్నించరు. పరి శ్రమలంటే కొంత నష్టానికీ అవకాశముంది. పైగా ఈదోపిడీలో వచ్చేంత లాభాలందులో ఎన్నెన్నటికీ రావు. బ్రిటన్‌ను సమర్థింపజూచేవాండరూ. దేశీయ ధనికులను పరిశ్రమలలో పెట్టుబడి పెట్టేటట్టు చేయటం అతి కష్ట తరమని చెబుతూవచ్చారు. కాని తమడబ్బుకు వచ్చేవడ్డీ యెంత అధికమో. అందువల్ల వారెలా పరిశ్రమలవేపు చూడడంలేదో ఈ రెంటికీ ఉన్న సం బంధం మాత్రం వారెన్నడూ పేర్కొనరు. *

యూరోపులో ధనికవాదం అభ్యుదయకరంగా ఉన్నంతవరకు, ఉత్పత్తిశక్తుల నభివృద్ధిపరిచింది. పలసలలో ఇందుకు వ్యతిరేకంగా పరి

* "ఇండియాలో పరిశ్రమలకు పెట్టుబడి తక్కువగా నున్నది. ఇతరవిధాల పెట్టుబడి పోటీ దీనికి కొంతవరకు కారణం. ఇప్పటికీ ఇండియాలో చాలమంది ఆస్తి-సొత్తులు, బంగారు, వడ్డీవ్యాపారం, వ్యాపారం, ప్రభుత్వ పత్రాలు కొనడం- వీనిలో పెట్టుబడి పెడతారుకాని, ఏవో నష్టాలకు అవకాశమున్న పరిశ్రమల జోలికి పోరు." జి. ఇ. హబ్బర్డు, తూర్పు దేశాలలో పరిశ్రమవ్యాప్తి, పశ్చిమంలో దాని ఫలితం, ఆక్సుఫర్డు యూనివర్సిటీ ప్రెస్సు, లండన్ 1945, పుట 257

శ్రమాభివృద్ధి నరికట్టినది. పూర్తిగా రానీలేకపోయినా సాధ్యమైనంత వరకు ఆపింది.

సామ్రాజ్యవాదంలో రెండు దశలు

సామ్రాజ్యవాద దురాక్రమణ ప్రారంభదశలో ఆసియా ఆఫ్రికాలలో రైల్వేలు నిర్మిస్తున్నప్పుడు, సామ్రాజ్య దేశాలలోని పరిశ్రమలకు కొత్త మార్కెట్లు దొరికాయి. ఇందుతోపాటు వలసలలోని కుటీర పరిశ్రమలలో అధికభాగం విధ్వంసం చేయబడినది. అలాగే తమ తీరుబడిసమయాలలో రైతులు చేసుకునే ఉత్పత్తిలో అధికభాగం నాశనమయింది.

అయినా ఈ మొదటిదశ ముగియగనే, సామ్రాజ్యాభివృద్ధి మందగించింది. రైల్వేలనిర్మాణం ఒకసారే సాగింది. వాని నిర్మాణం, రక్షణ యూరోపులోవలె గొప్ప పారిశ్రామికాభివృద్ధికి దారితీయలేదు. కుటీరపరిశ్రమల దోపిడీకూడ ఒకసారేకదా జరిగేది. వాని వినాశం ఒకసారితోనే తీరిపోతుందికదా. ఆతర్వాత ఏమాత్రం ఆర్థికాభివృద్ధి జరగాలన్నా, కోటానుకోట్ల స్వదేశీయుల జీవనస్థాయి బాగా పెరగాలి. భూస్వామివర్గానికీ సామ్రాజ్యవాదులకూ మధ్య ఏర్పడినమైత్రి దీని నాటంకపరిచింది. కాబట్టే మార్క్సు అనుకున్నట్టు ఈ వలసలలో ఆర్థికాభివృద్ధి జరగలేదు. కాబట్టి రెండు యుద్ధాల మధ్యకాలంలో వలసదేశాలలో చెప్పుకోదగినంత కొత్త మార్కెట్ల అభివృద్ధి సాగలేదు.

వలసల వస్తువులఎగుమతి హీనస్థితిలో ఉండిపోయింది

నలభై కోట్ల భారతీయులపై బ్రిటన్ నూరేళ్లు రాజ్యంచేసినా పరిశ్రమాభివృద్ధి హీనస్థితిలో ఎందుకున్నదో ఈఅంశం తేటతెల్లం చేస్తుంది. కేట్ మిచ్చెల్ ఇలా వ్రాశాడు:

"నలభైకోట్ల ప్రజలుగల ఇండియా ఉత్పత్తికంటె, 70 లక్షల జనాభా గల ఆస్ట్రేలియా పరిశ్రమల ఉత్పత్తి విలువ ఏకొంచెమో తక్కువమాత్రమే."*

వలస దేశాలన్నిటా పరిశ్రమల అభివృద్ధి మరీ వెనకబడ్డంవల్ల అక్కడినుంచి వస్తువుల ఎగుమతి అత్యధమస్థితిలో ఉంది.

డచ్చివారిక్రిందఉన్న వలసలలో పారిశ్రామిక వస్తువుల ఎగుమతులు 2% మాత్రమే ఉన్నవి. 1935-37 లో కూడ ఇదే స్థితి. మరి అదే వస్తువుల దిగుమతులు అదేచోట మొత్తం దిగుమతులలో 60 వంతులున్నవి. 1935 లో 55%కి దిగినా 1937లో తిరిగి 60 వంతులకు పెరిగినవి. •

ఫ్రెంచి వలసలలో, పారిశ్రామిక వస్తువుల ఎగుమతి 1928-37ల మధ్య మొత్తం ఎగుమతులలో నూటికి 2-4వంతుల మధ్య ఉన్నది. అదే సమయంలో వస్తువుల దిగుమతులు, మొత్తం దిగుమతులలో 71 నుండి 74% వరకూ ఉన్నవి.†

గత శతాబ్దిలో బ్రిటిషు ఇండియా అభివృద్ధిని గూర్చి ప్రొఫెసర్ బుచానన్ ఇలా వ్రాశాడు:

"ఈ దేశంలో పారిశ్రామికోత్పత్తికి తగిన ముడి వస్తువులన్నీ ఉన్నవి. అయినా నూరేళ్లనుంచీ బ్రహ్మాండంగా పారిశ్రామిక వస్తువులు

---

* కేట్‌యల్. మిచ్చెల్: పశ్చిమ పసిఫిక్కులో పరిశ్రమలు 1942, పుట 241.

• నానాజాతిసమితి, ప్రపంచ వాణిజ్యవ్యాప్తి. జెనీవా 1942, పుట 29

† అదే.

దిగుమతి చేయబడినవి. పైగా ఇతర దేశాలల్లో ఎంతో అభివృద్ధి చెందిన పరిశ్రమలలో అతి సులభమైనవి మాత్రమే ఇక్కడ కొద్దిగా ఏర్పడినవి- ముడిపత్తి, జనుము, సులభంగా త్రవ్వవీలైన బొగ్గు, సులభంగా తీయ గలిగిన అత్యుత్తమమైన ఇనుము చూరున్నది. ఏ పనీలేక కడుపుమాడు తున్న జనాభా కావలసినంత ఉంది; ప్రపంచం ఏ దేశానికైనా సరే రెండోస్థానం తప్పకవచ్చే సువర్ణరజతరాశు లున్నవి....ఇతరులు తమ సరుకులను సులువుగా అమ్ముకుంటున్నతనసొంతదేశపు మార్కెట్టు అందుబాటులో ఉన్నది. ఈ అనుకూలాలన్నీ ఇన్ని ఉన్నప్పటికి, ఒక్క శతాబ్దితర్వాతకూడ భారతదేశం, పరిశ్రమలద్వారా కేవలం తన జనాభాలో నూటికి ఇద్దరిని మాత్రమే బ్రతికిస్తున్నది."*

వలసలలో సంక్షోభం అతి తీవ్రరూపం తాల్చింది.

ఇలా పరిశ్రమాభివృద్ధిశూన్యత, ఇందులోపాటు, కొన్నిముడి సరుకులపైకే తమదృష్టినంతా కేంద్రీకరించడం వీనిమూలంగా, 1929 సంక్షోభంలో ఈ వలసలు యూరోపు పారిశ్రామిక దేశాలకు సాయపడ లేక పోయినవి. కోట్లకొలది వలసప్రజల స్వయంసంపూర్ణ ఆర్థిక వ్యవస్థను సామ్రాజ్యవాదం ధ్వంసం చేసివేసింది. అలాగే రైతులు తీరు బడివేళల చేసుకునే ఉత్పత్తి నిహతమైపోయింది. ఇందుతో ఆ ప్రజలు బలవంతంగా, యూరపియన్ వస్తువులు కొనవలసి వచ్చినది. తమ దేశంలో అమ్మకంకాని కొన్ని ముడిసరుకులనే వారుఉత్పత్తి చేయవలసి వచ్చింది. వాని అమ్మకానికి ప్రపంచపు మార్కెట్టుపై ఆధారపడవలసి వచ్చింది.

---

* డి. హెచ్. బుచానన్, ఇండియాలో పెట్టుబడిదారీ వ్యాపారాభివృద్ధి, 1934 పుట 450.

సంక్షోభంరాగానే, అందుతోపాటు వస్తూత్పత్తి తగ్గిపోగానే, వలసల ముడిసరుకుల మార్కెట్టు చాల సంకుచితమయిపోయింది—ఆ ముడి సరుకులు ధనికపద్ధతిపై ఉత్పత్తి అవుతున్నవి. పైగా వ్యవసాయ వస్తువుల ధరలు బాగా పడిపోవడంవల్ల వలసల ఆర్థికవ్యవస్థ చాల దెబ్బ తినింది, కేట్ మిచ్చెల్ ఇలావ్రాశాడు:

"డచ్చి ఇండియాలో సంక్షోభ తీవ్రతకు సూచనగా 1929 నుండి 1933వరకు ఎగుమతుల విలువ 67%కు తగ్గిపోయింది.... సంక్షోభ కాలమైన 1929-30ల మధ్య తేయాకు, కాఫీతోటలలో ఉద్యోగుల సంఖ్య 1,200,000నుండి 600,000కు తగ్గిపోయింది. అలాగే వ్యవసాయపు పంటలకుచెందిన పరిశ్రమలలో చాలమందికి ఉద్యోగాలు పొయ్యాయి. దేశీయుల అనాథస్థితి దుర్భరాతి దుర్భర మయిపోయింది. కొన్ని ముడిసరుకుల ఎగుమతులమీద ఆధార పడిన ఆర్థికవ్యవస్థ ఎంతప్రమాదకరమో ఇందుమూలంగా తేటతెల్ల మయినది."*

ఈ పరిస్థితే ఇతర యూరపియన్ రాజ్యాల వలసలలోకూడ కనిపిస్తుంది. బ్రిటిషు ఇండియాలో దిగుమతులు 2,408మిలియన్ రూపాయల నుండి (1929), 1932కు 1326 మిలియన్ రూపాయలకు, 1933 లో 1154మిలియన్ రూపాయలకు పడిపోయినవి. ఎగుమతులు 1929 లో 3108మిలియన్ రూపాయలనుండి, 1932కు 1323 మిలియన్ రూపాయలకు, 1933లో 1463 మిలియన్ రూపాయలకు పడిపొయ్యాయి. †

ఇంతగా ఆర్థిక సంక్షోభం బ్రిటిష్ ఇండియాను కలవరపరచేందుకు కారణముంది. అక్కడ ప్రధానంగా దొరికే ముడిసరుకుల ధరలు, తాము

* కేట్. ఎల్. మిచ్చెల్, పశ్చిమ పసిఫిక్కు ప్రాంతాలలో పరిశ్రమాభివృద్ధి [పుట 200—1

† రెండో అధ్యాయం పుట 34 చూడండి.

దిగుమతి చేసుకొనవలసిన వస్తువుల ధరలకంటె చాల తక్కువకు పడి పోయ్యాయి. వీరా ఆంస్టే మాట లివి.

"1929 సెప్టెంబరు నుండి మార్చి 1934 వరకు....బియ్యం, నూనెగింజలు, ముడిజనుము, ముడిపత్తి—వీని ధరలు సగానికి సగం తగ్గిపొయ్యాయి. మరి గుడ్డలు, లోహాలు, చక్కెర—వీని ధరలు కేవలం 30%మాత్రమే తగ్గాయి."*

బ్రిటిషు మలయాలో దిగుమతుల విలువ, 1925లో 103,800 మిలియన్ పౌన్లనుండి 1932కు 44,437 మిలియన్ పౌన్లకు, 1933 లో 41,359 మిలియన్ పౌన్లకు పడిపోయింది. మరి ఎగుమతుల విలువ 1927లో 108,445 మిలియన్ పౌన్లున్నది. 1932కల్లా 38,107మిలియన్ పౌన్లకు, 1933 లో 43,897 మిలియన్ పౌన్లకు పడిపోయింది. •

ఫ్రెంచి ఇండోచైనాలో దిగుమతుల విలువ 1927లో 2574 మిలియన్ ఫ్రాంకులనుండి 1932కు 968మిలియన్ ఫ్రాంకులకున్నూ, 1933లో 919 మిలియన్ ఫ్రాంకులకున్నూ పడిపోయినది. ఎగుమతుల విలువేమో 1929లో 2612 మిలియన్ ఫ్రాంకులనుండి 1932కు 1018 మిలియన్ ఫ్రాంకులకు 1933 లో 1015 మిలియన్ ఫ్రాంకులకు పడిపోయినది. †

మొత్తంమీద సామ్రాజ్యవాద దేశాలలోకంటె వలసదేశాల ధనిక విభాగంలో సంక్షోభం అతి తీవ్రరూపంతో ప్రత్యక్షమయింది.

వలస దేశాలలోని పరిశ్రమాభివృద్ధి ప్రతిష్టంభన, సంక్షోభం రాక పూర్వమే ప్రపంచ ధనిక విధానానికి ప్రతిద్వంద్విగా పరిణమించింది.

---

* వీరాఆంస్టే, భారత ఆర్థికాభివృద్ధి, న్యూయార్కు, 1942 పుట 488.

• విదేశపు ఎగుమతి దిగుమతులు, లెక్కలశాఖ, సింగపూరు.

† Annuaire statistique de l' Indo-chine, Honoi

ఏవో కొన్ని ముడిసరుకుల ఉత్పత్తిమాత్రమే జరిగే ఈదేశాల అసమగ్ర ఆర్థికవ్యవస్థ సామ్రాజ్యదేశాలకంటె సంక్షోభం వీనిలో తీవ్రతదాల్చుటకు ఉపస్కారకమైనది. ఇలా యూరపియన్ సామ్రాజ్యవాదాల పరాశ్రయ జీవనవిధానం పుణ్యమా అని, పూర్వ సంక్షోభాలలో ఎంతో సాయపడుతూ వచ్చిన ఆసియా తన పూర్వపాత్రను నిర్వహించలేకపోయినది.*

## జపాను—యూరోపు సామ్రాజ్యవాదాల విభేదం.

ఇంతదాకా, యూరోపు సామ్రాజ్య తత్త్వంగూర్చి కొంత వివరంగా తెలుసుకున్నాము. కాని ఈకాలంలో కూడ ఇదొక్కటే

* 1857ఆర్థిక సంక్షోభాన్ని దాటుకునేందుకు కొత్తమార్కెట్ల ఏర్పాటెలా తోడ్పడిందో బ్రిటన్‌లో స్పష్టంగా కనిపిస్తుంది. ఫెలిక్సు పిన్నర్ ఇలా వ్రాశాడు: "(అమెరికా మార్కెట్టు) లాభసాటిమార్కెట్టు పోవడంవల్ల తగిలిన దెబ్బను, ఇంగ్లాండు, ప్రపంచ వర్తకంలో మరోచోట సరిజేసుకున్నది....ఇంగ్లీషు సామ్రాజ్యవాదం తూర్పున కొత్త భూములకు ప్రాకినది....ఇంగ్లీషు పెట్టుబడి కొత్త దారుల ప్రవహించినది. ఆసియాలో రైళ్లు, బాటలనిర్మాణం; ముడిసరుకుల ఉత్పత్తి పెరుగుదల వగైరాలు. ఇందులో అమెరికా, యూరోపు, బాల్టిక్ దేశాలు ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా వగైరాలతో వాణిజ్యం తగ్గగా వచ్చిన నష్టం పూడించి. ఈ కొత్తదారిలో ఇంగ్లీషు బట్టలపరిశ్రమ చాల బాగుపడింది....అమెరికాకు ఇంగ్లాండు ఎగుమతులు 1857లో 19మిలియన్లనుండి, 1857నాటికి 14 మిలియన్‌పౌన్ల స్టెర్లింగుకుపడిపోగా, ఇండియాకు ఇంగ్లీషు ఎగుమతులు అదేఏళ్ళలో 11.7మిలియన్ పౌన్లనుండి 16.8 మిలియన్ పౌ॥ స్టెర్లింగుకు హెచ్చినవి. 1858లో ఇంగ్లీషు బట్టల ఎగుమతుల్లో సగం నూలు ఎగుమతుల్లో నాలుగోవంతు తూర్పు ఆసియాకు, చైనాకు వెళ్ళినవి. 1858—60లలో నూలుబట్టల ఎగుమతుల పెరుగుదలలో నూటికి 80వంతులు వలసలు అధినివేశాలేకారణం. ఈపెరుగుదల కొత్త మార్కెట్ల ఏర్పాటు ముఖ్యమైందుకంటే అంతర్యుద్ధం మూలంగా అమెరికాలో స్తబ్ధత 1865 లో పోరాటం ఆగిన తర్వాత దాకా ఉంది."

కాదున్నది. జపాను సామ్రాజ్యవాదం క్రమంగా పెరగసాగింది. కొత్త లక్షణాలనుకూడ చూపసాగినది, వీనిని వివరించుకొనడం మన కవసరం. ఎందుకంటే. సామ్రాజ్యదేశంలోని ఆర్థికవ్యవస్థ పలుకుబడి, దాని సామ్రాజ్యవాద విధానంపై ప్రతి ఫలిస్తుంది.

జపాను సామ్రాజ్యవాద దశలో ప్రవేశించేటప్పటికే, అక్కడి గుత్తవ్యాపార సంస్థలు, బ్రిటన్. ఫ్రాన్సు, డచ్చి దేశాలలోకంటె బాగా బలపడినవి. ఇందుతోపాటు జమీందారీ వ్యవసాయ పద్ధతికూడ అలాగేఉన్నది, యూరపియన్ దేశాలలోకంటె జపాను ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వపాత్ర అధికమైనది. సేనకూడ అక్కడికంటె ఎక్కువపలుకుబడి నెరపినది. తాను ఆక్రమించుకున్న వలసలు (చైనా, కొరియా, మంచూరియా) తనతల వాకిటనే ఉన్నవి, కాబట్టి తనసైనిక బలాన్ని, సహజ సంపదను యూరోపుదేశాల కంటె ఎక్కువగా ఉపయోగించ గలిగినది. అయితే జపాను సామ్రాజ్య విస్తరణఆరంభించే టప్పటికి, యూరపియన్ అగ్రదేశాలవలె పారిశ్రామికంగా అంత అభివృద్ధి చెందలేదు, 1928 వరకు చూచుకున్నా ప్రపంచోత్పత్తిలో జపానుభాగం నూటికి 2.35 మాత్రమే. మరి జర్మనీ పాలు 9,26%; గ్రేట్ బ్రిటన్ 9.26%; ఫ్రాన్సు భాగం 7%. ఇక అమెరికా ఉత్పత్తి చూస్తే 44.8% * జపాను సామ్రాజ్యవాదం, ఇతర లక్ష్యాల ననుసరించవలసి వచ్చేందుకు ముఖ్య కారణం, తన పారిశ్రామిక దుర్బలస్థితే.

బ్రిటన్ ఫ్రాన్సులు సామ్రాజ్య నిర్మాణం చేస్తున్నప్పుడు రెండునూ పారిశ్రామికంగా నాయకత్వం వహిస్తున్నవి. తమ పారిశ్రామిక స్థితిని బలపరుచుకునేందుకై అవి సామ్రాజ్య విస్తరణకు పూనుకొనలేదు.

* Vierteljahreshefte fur KonJunkturforschung, Sounderheft 31, Die Industriewirtschaft, Berlin 1933, P 38

జపాను పూర్తిగా భిన్నస్థానంలో నున్నది. తనకూ ఇతర ధనిక రాజ్యాలకూ మధ్యఉన్న తేడాను భర్తీ చేసుకోవడం జపాను ఆశయం వాటికంటె కాకున్నా, వాటితో సమానంగానైనా బలపడాలి.

అయినప్పటికి పరిస్థితి అంత సుముఖంగాలేదు. కీలక ప్రాయమైన ఇనుము, పెట్రోలులాంటి ముడిసరుకులు తనకు తక్కువ. కాబట్టి తన పరిశ్రమల అభివృద్ధికై తన సామ్రాజ్య సహాయం తీసుకునేందుకు పూనుకున్నది. ఇందువల్ల జపాను ఆర్థికసామ్రాజ్య విధానంకొన్ని అంశాలలో మాత్రమే యూరపియన్ రాజ్యాల సామ్రాజ్యవిధా నాన్ననుసరించింది, మిగత కొన్ని ప్రధానంశాలలో పూర్తిగా వేరుపడి పోయినది.

యూరపియన్ సామ్రాజ్య ప్రభుత్వాల లాగే. తన వలసలలో ప్రధానఆర్థిక రాజకీయస్థానాలు జపాను చేతిలోనే ఉన్నవి. తానూ యూరోపురాజ్యాలలాగే వలసలలో భూస్వామ్యవిధానా న్నలాగే ఉంచింది. అక్కడి ప్రజలలో పరాన్నభుక్కులైన భూస్వాముల అల్పసంఖ్యాకవర్గాన్ని ఏర్పరచింది. మిగత అధిక సంఖ్యాకులు కౌలుదార్లుగనో, భూములులేని రైతులుగానో ఉండిపోయారు. ఇంతవరకు సామ్యమున్నది. కాని ప్రపంచ అగ్రరాజ్యాల స్థాయినందుకునేందుకు వలసలసాయం తనకు కావాలి కాబట్టి జపాను, తన ఆర్థిక విధానాన్ని మరొక రూపంలో అనుసరించింది.

మంచూరియాలో జపా ననుసరించినవిధానంలో ఇది స్పష్టంగా కనిపిస్తుంది. మంచూరియాపై జపానుదాడిచేసి నప్పటినుంచి రెండో యుద్ధంలో ప్రవేశించేదాకా (1931—41) మంచూరియాలో జపాను విపరీతంగా పరిశ్రమలను పెంచింది. అక్కడి జనాభా బ్రిటిష్ ఇండియా

జనసంఖ్యలో పదోవంతు మాత్రమేఉన్నా, ఇండియాలో సామ్రాజ్య ప్రభుత్వం ఏందఏళ్ళలో చేసినదానికంటె, ఆ పదేళ్లలోను జపానుఅక్కడ పరిశ్రమాభివృద్ధి నెక్కువగా కొనసాగించినది. ఈ అభివృద్ధిని చైనా ప్రజల కోసమని జపాను సాగించలేదన్నది సుస్పష్టమే. మంచూరియాలో బొగ్గు, ఇనుము, పెట్రోలు ఉత్పత్తి నెక్కువ చేసిందంటే, కారణం తనదేశంలో తనకు తగినంతగాదాని నుత్పత్తి చేయలేక పోవడంవల్లనే. ఆశియా ప్రధాన భూభాగంపై తమసేనలను నడిపించి నప్పుడీ మంచూరియా తమకు ఆయుధాగారంగా పనికిరావాలని జపాను ఆశించింది. కాబట్టే, అక్కడ టాంకు విమానఫాక్టరీలను నిర్మించింది. ప్రత్యేక చారిత్రకకారణాలవల్ల జపాను తన సామ్రాజ్యంలో పరిశ్రమల నభివృద్ధిపరచవలసి వచ్చినది. వానికి భిన్నమైన చారిత్రక కారణాలవల్ల యూరపియన్ రాజ్యాల వలసలలో పరిశ్రమలను అరికట్టడం జరిగినది,

ఇలా సామ్రాజ్యంలో విభిన్నమైన ఆర్థిక లక్ష్యాలతో పనిచేయడమే గాక. జపాను—బ్రిటిష్ సామ్రాజ్యప్రభుత్వాలు, తామనుసరించే పద్ధతులలో కూడ వేరు వేరు దారులు తొక్కినవి. ఈ కాలంలో బ్రిటనులోకంటె, ఇతర ఏయూరపియన్ రాజ్యంలోకంటె కూడ జపానులో, ప్రభుత్వానికీ ఆర్థికవిధానానికీ మధ్యనున్న సంబంధం అతి సన్నిహితమైనది. కొన్ని శతాబ్దుల జీవితంలో బ్రిటిష్ ధనికవిధానం, దాదాపు భూస్వామ్య విధానాన్ని నిర్మూలించివేసింది. ఆ దశలో ప్రభుత్వానికి ఆర్థికవ్యవస్థ పైనున్న పెత్తనం చాలతక్కువ. అప్పుడు బ్రిటన్‌లో ఉదార ధనికవాదదశ కనిపిస్తున్నది. ఇదే దశలోనే బ్రిటన్ తన సామ్రాజ్యాన్ని స్థాపించడం విస్తృతపరచడం జరిగింది. ఇతర యూరపియన్ సామ్రాజ్యలన్ని కూడ ఇలాటిదశలో సామ్రాజ్య విస్తరణ జరిపాయి. ఈ దశలో ఆర్థికవిధానాన్ని నడిపేందుకుగాని, దానిపై పెత్తనం వహించేందుకుగాని

బ్రిటన్ పూనుకోలేదు. ఇండియా ఆర్థికాభివృద్ధిని తాము నడిపించాలన్న అభిప్రాయం విక్టోరియా ఇంగ్లాండుకు వెటకారంగా కనిపించి ఉండేది.

జపాను పరిస్థితి పూర్తిగావేరు. భూస్వామ్యవిధానం 19 శతాబ్ది ఉత్తరార్ధంలో కూడ కొనసాగుతునే ఉన్నది. ఆధునిక ధనికవిధానం పారిశ్రామికాభివృద్ధి ఆరంభమైనప్పు డది ప్రధానాంశంగానే ఉన్నది. ప్రభుత్వం మొదట పరిశ్రమాభివృద్ధిని ప్రోత్సహించ సాగినది. దేశంలో ఉదారధనిక వాదంలేదు. పాతభూస్వామ్య రాజ్యాంగంనుండి వృద్ధిచెందిన ఆధునిక జపాను సామ్రాజ్యప్రభుత్వం ప్రారంభంలోనే గుత్తవ్యాపార ధోరణిని వెలువరించినది. జపాను సామ్రాజ్యవాదం బలపడేలోగానే రాజ్యాంగ యంత్రం, ఆర్థికవ్యవస్థపై పెత్తనంవహించి, దానిని నడప సాగినది. ఆర్థిక ప్రణాళికల శాఖల నేర్పరిచింది. దీనిని వలసలకు వ్యాపింపజేసి జపానుకు అవసరమైనరీతిగా అక్కడి పరిశ్రమల నేర్పరచ దొడగినది.

మంచూరియా (మంచూకో అని జపా నిచ్చిన పేరు) అభివృద్ధి గమనం, జపానును మరింత పారిశ్రామికం చేయాలన్నందుకు తగినట్టు నడపబడినది, షుంపీటర్ ఇలా వ్రాస్తున్నాడు :

"1937 ప్రారంభంలో- పారిశ్రామిక వ్యావసాయి కాభివృద్ధికి మంచూకో ఒక పంచవర్షం ప్రణాళికను ప్రకటించినది. 1938 ఏప్రెల్‌లో దీనిని పునస్సంస్కరించారు. ఇదేసమయంలోనే జపానులో ఇనుము, ఉక్కు, కాగితంపల్పు, ఉప్పు, బంగారం, అల్యూమినం—వగైరాల ఉత్పత్తికి పంచవర్షప్రణాళికలు వేయబడినవి. తర్వాత ఇవన్నిటిని ఏకముఖం చేశారు." *

* జపాను, మంచూరియాల పారిశ్రామికీకరణం, 1930—40 సంపాదకుడు, ఇ.బి. షుంపీటర్, న్యూయార్కు 1940, పుట 273.

అంటే ధనికవాద. సామ్రాజ్యవాద చరిత్రలో జపానొక నూతనా ధ్యాయాన్ని ఆరంభించినదన్నమాట. రెండో ప్రపంచ యుద్ధందాన్రా, యూరోపులోని సామ్రాజ్యవాద దేశాలలో ప్రణాళికాబద్ధమైన ఆర్థికవ్యవస్థ లేదు. వలసలలోనూ అంతే. నాజీప్రభుత్వం ఒకవిధమైన ప్రణాళికాబద్ధ ఆర్థికవ్యవస్థను (" Wehrwirtschaft ") ద్వారాఏర్పరచింది. యుద్ధావసరా లకు అనుగుణంగా తన ఆర్థికవ్యవస్థను మార్చుకునేందు కీ ఏర్పాటు జరి గింది. అయితే జర్మనీకి వలసలు లేవు. కాబట్టి స్వదేశంలోను వలసలలోను ప్రణాళికాబద్ధమైన ఆర్థికవ్యవస్థగల ధనికదేశం ఒక్క జపాను మాత్రమే.

తన సామ్రాజ్యవాద దురాక్రమణను మరింత పెంచుకునేందుకు, సమయం వచ్చినప్పుడు యుద్ధంలో దిగేందుకు, తన వలసలతోపాటు ప్రపంచంలో ప్రధాన పారిశ్రామికదేశంగా తయారయ్యేందుకు జపాను, ఈ పద్ధతినను సరించింది. జపాను, దానిసామ్రాజ్యం యొక్కపరిశ్రమల సాహ సస్యాన్ని పరిశీలించేప్పుడు మనమీ సైనిక, సామ్రాజ్యవిధానరీతిని మన సులో ఉంచుకొనాలి.

వలసలపై ఓశతాబ్ది రాజ్యంచేశాక, సామ్రాజ్యవాదం, చిన సంప్ర దాయసిద్ధ రూపంలోనైనాసతే సంచలింపసాగినది. ఈదశలో వలసలలోను అర్ధవలసలలోను నివసిస్తున్న ప్రజల ధోరణి ఏమిటి? సామ్రాజ్య మాతృ దేశాలలోని కార్మికుల వైఖరి ఏమిటి?

సామాన్య జీవితావసరాలుకూడ తీర్చకుండా, ప్రపంచ జనాభాలో అర్ధభాగాన్ని సామ్రాజ్యవాదం వ్యాపించినవి

ప్రపంచంలోని వివిధ దేశాల ప్రజల జీవన ప్రమాణాన్ని కోలిన్ క్లార్క్ పోల్చిచూచేందుకు ప్రయత్నించాడు. ఇందుకై ఆయన ఆయా దేశాల జాతీయాదాయాన్ని "ఇంటర్నేషనల్ యూనిట్" ప్రాతిపదికపై

గ్రహించాడు. ఇంటర్నేషనల్ యూనిట్ అంటే ఇలా ఆయన నిర్వచించాడు:

"అంతర్జాతీయ ప్రమాణం అనగా....1924–34ల మధ్య పదేళ్లలోను అమెరికాలో ఒక డాలరుకు కొనదగిన వస్తువుల యొక్క, శ్రమశక్తియొక్క మొత్తం." †

ఆయన అంచనానుబట్టి రెండో యుద్ధానికి పూర్వం అమెరికా ప్రపంచ నాయకత్వం వహించింది. అమెరికాలో తలాకు ఏటా ఆదాయం 1300నుండి 1400, ఇం॥ యూనిట్లు. కనడా 1200-1300మధ్య. బ్రిటన్ 1000-1100మధ్య. ఇక 200 యూనిట్లు తక్కువ ఆదాయంగల జనాభా మరొకవేపున్నది. ప్రపంచ జనాభా 209 కోట్లా యాభైలక్షలని ఈయన అంచనా వేశాడు. దరిద్రస్థితికి లోపలివేపున్న దేశాల జనుల సంఖ్య మొత్తం 111కోట్ల 30లక్షలు—అంటే ప్రపంచ జనాభాలో సగానికిపైగా ఈ దరిద్రులున్నారు.*

వీరిలో అత్యధిక సంఖ్యాకులు వలస-అర్ధవలస దేశాలలోనున్నారు. సామ్రాజ్యవాద పీడనకు గురియై దిగనారిపొయ్యారువీరు. వీరిలో 45కోట్లు చైనాలోను, 37కోట్లా 5లక్షలు బ్రిటిషుఇండియాలోను. ఆరుకోట్లా యాభై నాలుగులక్షలా 30వేలు డచ్చి యీస్టుఇండీసులోను. 11కోట్ల 78లక్షలు మిగత ఆసియాలోను (ఇండోచైనా, కొరియా, ఫార్మోసా. సయాం, సిలోన్, మలయా), 10కోట్ల 60 లక్షల 90వేలు ఆఫ్రికాలోను, (ఈజిప్టు, అల్జీరియా, దక్షిణాఫ్రికా, మొరాకో, టూనిస్‌తప్పఆఫ్రికాఖండమంతటా) ఉన్నారు.

---

† కోలిన్‌క్లార్కు, ఆర్థికాభ్యుదయపరిస్థితులు, లండన్ 1940 పు॥ 2

* అదే. పుట 57.

వీరందరూ నేటికీ ఆకలితో మాడుతున్నారు. ఏదో అతిశయోక్తి కాదిది, వాస్తవం. బ్రిటిషు సామ్రాజ్యవాదం భారతదేశంలో చాల చేసిందని చెప్పే వీరా ఆంస్టే వ్రాత చూడండి:

"మంచికాలం అనుకునే సంవత్సరంలో తనదేశపు ప్రజల ఆరోగ్యశక్తులకు తగినంతగా—పంపకం సమానంగా ఉంటుం దనుకుంటే—ఇండియాలో పంటలు పండుతాయి. అయినా తగినంతకూ, కరువుకూ మధ్య వ్యవధానం చాలతక్కువ. ఒక్క పంట విశాలమైన ప్రాంతంలో పోయిందంటే, దేశమంతటా కరువు వస్తుంది. ఇక ఆ కరువువేవచ్చినట్టి ప్రాంతంమాట వేరుగా చెప్పనవసరంలేదు." *

అసలు సంగతేమిటంటే ఇండియాలో "చాల ప్రాంతాలలో" పదే పదే కరువు వస్తుంది. ఏళ్లకొలదీ బ్రిటిషు పాలనలో అక్కడ కరువు శాశ్వతంగా ఉంటూనే ఉంది. ఈ అంశం రెండో యుద్ధం నాను తర్వాతను అతి స్పష్టంగా దారుణరూపంతో ప్రత్యక్షమయినది. ఇలా క్షుద్బాధ బ్రిటన్ పాలనలో భారతదేశపు శాశ్వత లక్షణమై పోయింది. కాబట్టి భారతీయుని ఆయుర్దాయం, ఇంగ్లీషువాని ఆయుర్దాయంలో సగంమాత్రమే అయి ఊరుకుంది.

"పశ్చిమ రాజ్యాలన్నిటిలోకంటే భారతదేశంలో సగటు ఆయుర్దాయం చాల తక్కువ; 1921 జనాభా లెక్కలలో మగవారి సగటు ఆయుర్దాయం 24.8 ఏళ్లు, ఆడవారి సగటు ఆయుర్దాయం 24.7 ఏళ్లు మొత్తంసగటున 24.75 ఏళ్లు. అదేసమయంలో ఇంగ్లాండు వేల్సులలో సగటు ఆయుర్దాయం 55. 6ఏళ్లు. 1931

* వీరాఆంస్టే, భారత ఆర్థికాభివృద్ధి, న్యూయార్కు 1942, పుట 443

నాటికిది మరింత తగ్గిపోయింది — మగవారికి 23.2. ఆడవారి ఆయుర్దాయం 22.8.*"

ఇదే స్థితే సామ్రాజ్యవాదం బారిపడిన వలస దేశాలన్నిటా కనిపిస్తుంది. ఈప్రాంతాల ప్రజల జీవనప్రమాణం అతి హీనస్థితిలో ఉంటం వల్ల, ఆకలి, తమ ముంగిటనే ఎల్లకాలం ఉంటూ. పదేపదే ఇంటిలోనే ప్రత్యక్షమయ్యేది.

భావి సంక్షోభ పరిస్థితులను మనం పరిశీలించేటప్పుడు, రెండో యుద్ధం తర్వాత ప్రపంచ ఆర్థికస్థితిని గమనించేటప్పుడు మనకీ సామ్రాజ్య వాద విధానాల ఫలితం చాల ప్రధానం కాగలదు.

## సామ్రాజ్య మాతృదేశాలలో, సాంఘిక వైషమ్యాల తగ్గుదల

మరొకవేపు సామ్రాజ్యవాదమూ, ధనిక విధానంక్రింద ఉత్పత్తి విస్తరించడమూ అనేవి పెద్ద పారిశ్రామిక రాజ్యాల సాంఘిక వ్యవస్థపై ప్రతిఫలించినవి. ఈ దేశాలే ప్రపంచ చరిత్రగతి కంతటికి ప్రధానంగా ఉంటూవచ్చినవి.

తరతరాలుగా. నిరుద్యోగం విపరీతంగా పెరుగుతూ వచ్చింది. దీనికి వ్యతిరేక కారణమైన సామ్రాజ్య విస్తరణ, నిరుద్యోగ విజృంభణ నరికట్టేంత గొప్పగా కొనసాగుతూ వచ్చింది.

కాబట్టి చాలకాలంవరకు లేబర్‌మార్కెట్ల స్థితి బాగున్నది. జీతాలు బాగా పెరిగాయి; ఈస్థితి 20శతాబ్ది ఆరంభందాకా కొనసాగినది. కొన్ని

---

* భారతదేశంలో కార్మికులు. అంతర్జాతీయ కార్మిక కార్యాలయం 1938. పుట 8, 1931 ఇండియా సెన్సస్ పుట98ని అనుసరించి.

దేశాలలో మొదటి యుద్ధందాకా, కొన్నిట 1929 సంక్షోభ సమయందాక కూడ ఈ స్థితి కనబడుతుంది.

సామ్రాజ్యవాదం వలసలలోనికి, అర్థవలసల్లోనికి వ్యాపించడం మూలంగా ప్రారంభంలో ధనికవాదం, తనతోపాటు కొనివచ్చిన దరిద్ర బాధలను, వలసలలోనిదౌర్భాగ్యులపై కొంతవరకు నెట్టివేయగలిగింది. మరొకవేపు ధనికవాదం విపరీతవిస్తరణ, ధనికదేశాలలోని జనసామాన్య జీవనస్థాయిని పెంచే ధోరణిలో నడిచింది. అమెరికాలో ఇది స్పష్టంగా గోచరిస్తుంది. ఈకాలంలో అక్కడ ధనికవాదం తనదేశంలోనే ఎక్కువ వ్యాపిస్తూ లక్షలాది రైతులను విశాల భూభాగంలో స్థిరపడేట్టు చేసింది. క్రమాభివృద్ధి చెందుతున్న పరిశ్రమలు స్వదేశంలో ధనికవిధాన విస్తరణ, కార్మికుల సంఖ్య తక్కువగా ఉండడం ఇవన్నీ, అమెరికా కార్మికుల లేబర్ మార్కెట్టుకు అనుకూలంగాపనిచేసినవి. వారి జీతాలు. జీవితస్థాయి పెరుగుటకు హేతువైనవి.

వలసలు అర్ధవలసలలోనున్న అత్యధిక సంఖ్యాక ప్రజల దుర్భర దారిద్ర్యం, పెద్ద పారిశ్రామిక దేశాలలోని కార్మికులకు ప్రాకలేదు. పైగా వారిజీతాలు జీవితస్థాయి హెచ్చినవి. రెండు యుద్ధాల మధ్య ప్రపంచ చరిత్రగతికి ఈ పరిస్థితి చాల ముఖ్యమైనది. అనేక ప్రధాన సమస్యల కిది మూలం-పదేపదే సోషలిస్టు సిద్ధాంతవేత్తలు దీనిని సరిగా వ్యాఖ్యానించలేక పోయ్యారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాద విజృంభణ బ్రిటిషు కార్మికుల స్థితిలో ప్రతిఫలించగలదని మార్క్సు, ఏంగిల్సుకూడ చాలసార్లు నొక్కిచెప్పారు. 1858 అక్టోబరు, 7న ఏంగిల్సు మార్క్సుకిలా వ్రాశాడు.

"ఇంగ్లీషు కార్మికులు రానురాను బూర్జువాలవుతున్నారు, అన్ని దేశాలకంటె బూర్జువా దేశం, బూర్జువా భూస్వామ్యవర్గంతో పాటు, బూర్జువా కార్మికవర్గాన్ని, బూర్జువాలనుకూడ సృష్టించు కొంటున్నది, ప్రపంచాన్నంతటిని పీల్చుకుని తినే దేశంలో ఇలాంటిది కొంతవరకు తప్పదుమరి! "

ఏంగిల్సు తాను వ్రాసిన "ఇంగ్లాండులో కార్మికులస్థితి" అనేప్రసిద్ధ గ్రంథానికి, చాలాకాలం తర్వాత తనే పీఠిక వ్రాస్తూ ఇలా అన్నాడు:

"ఇంగ్లాండుకు ఈపారిశ్రామిక యాజమాన్యం ఉన్నంతకాలం, దీనివల్ల కలిగే సౌకర్యాలలో బ్రిటిష్‌కార్మికులుకూడ భాగరులవుతారు. వారిలో ఈసౌకర్యాల పంపకం చాలవ్యత్యాసాలతో నిండుకున్నది; ఎక్కువభాగాన్ని అదృష్టవంతమైన అల్పసంఖ్యాక వర్గం కాజేస్తున్నది. అయినా అధిక సంఖ్యాకులు కూడ అప్పుడప్పుడు తాత్కాలికంగా ఇందులో భాగస్వాములవుతున్నారు. ఇందువల్లనే ఓవనిజం తర్వాత ఇంగ్లాండులో సోషలిజం రాలేదు. ఈ యాజమాన్యం కూలిపోగానే ఇంగ్లీషు కార్మికుల ఈ ప్రత్యేక సౌకర్యాలు పోతాయి—మరీ అనుకూలాలున్న అల్పసంఖ్యాకులు కూడ దీనిని పోగొట్టుకుంటారు. ఏదో ఒకరోజు ఇతరదేశ కార్మికుల స్థితికే వీరు వస్తారు. అందువల్లనే తిరిగి ఇంగ్లాండులో సోషలిజం వస్తుంది" *

ఈ పీఠికలో, తన పుస్తకంలోని కొన్నిభావాలను ఏంగిల్సు దిద్దుకున్నాడు 19 శతాబ్ది ప్రారంభంలోని అనుభవం మూలంగా, ఇంగ్లీషు

* నాలుగో జర్మన్ ప్రచురణనుంచి అనువాదంలో ఉటంకింపబడినది స్టట్‌గర్ట్సు 1913, పుట XXIII

కార్మికులస్థితి అధ్వాన్నమైపోతుందని, మహాఅయినా ఇంతకంటె బాగు పడదని ఏంగిల్సు. భావించాడు. "పెట్టుబడి" (దస్‌క్రాపిటల్) మార్క్సు వ్రాసినప్పుడు, అందులోని కొన్ని అంచనాలకు ప్రాతిపదిక ఈ ఊహే.

పైన ఉదహరించిన మాటల్లో ఏంగిల్సు, తనపాత అభిప్రాయా లను కొంతవరకు మార్చుకున్నప్పటికీ, ఏంగిల్సు చాలదూరం వెళ్లలేదు. "అయినప్పటికి అధికసంఖ్యాకులు కూడ అప్పుడప్పుడు తాత్కాలికంగా ఇందులో భాగస్వాము లవుతున్నారు" అనడం సరిక్రాదు. ఏళ్లుకాదు, తరాలదాకా బ్రిటిష్ కార్మికులలో అధికసంఖ్యాకుల జీతాలు హెచ్చుతూ వచ్చాయి— ఈ సంగతిని ముందే మనం గ్రహించాము.

ఇంగ్లాండు విషయంలోను. అంతర్జాతీయ పరిస్థితి ఊహించడం లోను కూడ ఆయన పొరబడ్డాడు. ఆయన అనుకున్నట్టు జరగలేదు, యూరపులోని కార్మికుల జీవనస్థాయి హీనస్థితిలోనే ఉండిపోలేదు, అందుకనుగుణంగా బ్రిటిష్ కార్మికుల జీవనస్థాయికూడ తర్వాత తగ్గి పోలేదు. ముఖ్యంగా జర్మనీ. ఫ్రాన్సు, బెల్జియం, హాలెండ్, స్కాండినేవియా దేశాల విషయంలో ఇది వాస్తవం. అమెరికాలో బ్రిటనుకంటె ఎక్కువగా కార్మికుల జీవనస్థాయి పెరిగినది.

కార్మికుల జీవవనస్థాయి హెచ్చినందువల్ల సాంఘిక విద్వేషాలు తగ్గాయి. దీనికీ కొత్తమార్కెట్టుల ఏర్పాటుకూ మధ్య నున్న సంబంధాన్ని, చాలకాలంక్రిందటే ఒకాయన కనిపెట్టాడు. ఒక్క సాంఘిక శాస్త్ర విద్యార్థులు తప్ప ఆయనపేరు ఇంగ్లీషువా రెరుగరు—ఆయనపేరు కిరల్ రాడ్ బర్టస్—ఆయనిలా వ్రాశాడు:

"ఒకొక్క విదేశీకొత్త మార్కెట్టు ఏర్పడ్డం అంటే సాంఘిక సమస్య అంతిమ పరిష్కారం కొన్నాళ్లదాకా వాయిదాపడ్డం అన్న మాటే" అదే పుస్తకంలోనే తర్వాత ఆయనిలా వ్రాశాడు:

"ఈ దృష్టితో మనం ఆసియా ఆవిష్కరణను, ముఖ్యంగా చైనా జపానుల ఆవిష్కరణను గమనించాలి. అవి ప్రపంచంలో కెల్లా ధనవంతమైన మార్కెట్లు. పైగా ఇండియా బ్రిటిష్ రాజ్యం కిందే ఉండిపోయింది. వీటన్నిటి ఫలితంగా సాంఘిక సమస్యకు కాస్త ఊపిరితిప్పుకునే అవకాశం చిక్కింది".*

ఇంకా సామ్రాజ్యవాదం ప్రారంభపు రోజుల్లోనే 90 ఏళ్ళక్రితమే సామ్రాజ్యవాద విస్తరణ సాంఘికసమస్యను వెనక్కునెట్టగలదని గుర్తించడం నిజంగా మహత్కార్యమే.

19శతాబ్ది ఆఖరున సామ్రాజ్యవాదులలో ముఖ్యుడైన సెసిల్ రోడ్సు [rhodes] మరోవిధంగా అదే భావాన్నే వెల్లడించడం గమనించదగినది. ఆయనిలా వ్రాశాడు:†

"నాలుగుకోట్ల బ్రిటిషు ప్రజలను దారుణమైన అంతర్యుద్ధం నుండి తప్పించడం; సాంఘిక సమస్యను పరిష్కరించడం—ఇదే నాకున్న బలమైన వాంఛ. ఇందుకు మనం మనలో యెక్కువగా నున్న ప్రజలను స్థిరపరిచేందుకు కొత్త దేశాలనుసంపాదించాలి. వారు ఫ్యాక్టరీలలోను, గనులలోను ఉత్పత్తిచేసే సరుకులకు

* కరల్ రాడ్ బర్టస్—క్లీన్ ష్రిఫ్టన్ వాన్ డాక్టర్ కరల్ రాడ్ బర్టస్—జాగేట్జో, బెర్లిన్, 1890, పుట 233. లోనుంచి ఉదాహృతం.

† డీ న్యూజీట్— XVI సం॥ సంచిక 11. 1898 పుట, 304 నుంచి ఉదాహృతం.

కొత్త మార్కెట్టులను కల్పించాలి. నేనెల్లప్పుడూ చెబుతుంటాను —సామ్రాజ్యంఅనేది ఆహారసమస్యఅని. అంతర్యుద్ధం రాకూడదని మీరు కోరుతున్నట్టయితే మీరందరూ సామ్రాజ్యవాదులు కాక తప్పదు."

బాగా అభివృద్ధిచెందిన పారిశ్రామిక దేశాలలో, సంఘ విద్వేషాల తీవ్రత చాలకాలందాక తగ్గిపోయింది.

ఈ అంశాన్ని మార్క్సు ఏంగిల్సులు స్పష్టంగా గుర్తించలేక పోయ్యారు—అలాగే ఇటీవలి సోషలిస్టు నాయకులు, సిద్ధాంతవేత్తలు కూడ—రోసా లక్సంబర్గు, లెనిన్ ఇద్దరూ—గుర్తిందలేదు. రోసా, తన గొప్ప గ్రంధంనుండి, అక్యుమిలేషన్ డస్ కాపిటల్స్ (ఇది ఇంగ్లీషు లోని కనువాదం కాలేదు.) సమాజశాస్త్రంలో నూతన దృక్పథాన్ని చేకూర్చింది. కాని ఆమెకూడ, పెట్టుబడి "కార్మికుల జీవనస్థాయి తగ్గిస్తుంది" అని వ్రాసినది.* సామ్రాజ్యతత్వం పెరగడంతో వర్గ విద్వేషాలు పెచ్చుపెరుగుతాయనికూడ ఆమె తన ఆంటీ క్రిటిక్‌లో వ్రాసింది.†

ఇందులోని పొరబాటు సుస్పష్టమే. పెట్టుబడి "కార్మికుల జీవన స్థాయినితగ్గిస్తుంది" అనడం అబద్ధం. చాలకాలం ఆస్థాయి సామ్రాజ్య దేశాలలో పెరిగిందికూడ. కాబట్టే మొదటియుద్ధ దశపూర్తిగా ఆమె అనుకున్నట్టుకాక అందుకు విరుద్ధంగా జరిగింది,

ఈ తప్పునే లెనిన్‌కూడ చేశాడు, కార్మికులలో కొందరి జీవితస్థాయి మాత్రమే పెరుగుతుందన్న ఏంగిల్సు మాటల నాయనతీసు

---

* రోసా లక్సంబర్గు. డీ అక్యుమిలేషన్ డస్ కాపిటల్సు. బెర్లిన్, 1913. పుట 445.

† రోసా లక్సంబర్గు, ఆంటీ క్రిటిక్—ఫ్రాంకోస్ వెర్లా లిక్జిన్, 1921, పు 21

కాని, బాగా పెరిగిన ప్రతిదేశంలోని కార్మికుల స్థితికీ, యీయన అనువర్తింపజేశాడు. ప్రపంచ యుద్ధానికి క్రిందటిదశలో అంతర్జాతీయంగాను, ఇంగ్లాండులోను కూడ కార్మికులలో ఉన్నత వర్గమొకటి బయలుదేరుతుందని ఆయన చెప్పాడు.

"ఒకశాఖలోని యెంతోమంది పెట్టుబడిదారులలో కొందరు, చాలదేశాలలో కొన్నిదేశాల పెట్టుబడిదారులు విపరీతంగా గుత్త వ్యాపారంలో లాభాలను సంపాదిస్తారు. కాబట్టి తమ ఆర్థికాను కూలాలవల్ల వ్యక్తిగతంగా! కొందరు కార్మికులకు, తాత్కాలికంగా చాలమందికి కూడ లంచాలు ఇయ్యగలుగుతారు. ఇలా ఆ కార్మికులను ఆప్రత్యేక శాఖలోని, లేదా ఆ ప్రత్యేక దేశంలోని పెట్టుబడి దారులవేపు లాక్కోగలుగుతారు." *

మొదటియుద్ధానికి ముందు, పెద్దపారిశ్రామిక దేశాలలోని కొందరు కార్మికులే బాగుపడ్డారన్నమాట నీయన ఋజువుచేసేందుకు ప్రయత్నించలేము. ప్రపంచంలోని పెద్దదేశాలన్నిటా ఈ మాట తప్పిపోయినది. ఈ పొరబాటే రాజకీయస్థితిని గూర్చిన అంచనాలో కూడ ప్రవేశించింది.

తక్కువమంది కార్మికులే బాగుపడ్డారనడంవల్ల, సోషలిస్టు విప్లవం త్వరలో రానున్నదని ఆయన భావించాడు. పెద్ద పారిశ్రామిక దేశాలలో ప్రథమమహాయుద్ధ సమయంలోగాని, యుద్ధంముగిసిన వెంటనేగాని విప్లవం రావచ్చునని భావించాడు కూడ. ఇందువల్లనే ఆయన నిర్ణయాలింకా కొన్ని బయలుదేరినవి. ఎక్కువమంది కార్మికులస్థితి బాగుపడక పోతే, కేవలం కొందరే బాగుపడితే వారుఅల్పసంఖ్యాకులపై పెత్తనం వహిస్తారు.

---

* లెనిన్. ఇంపీరియలిజం—సం V, వియన్నా, 1933, పు. 109.

ఆ మైనారిటీ నాయకత్వాన్ని తొలగించక తప్పదు, ఇదే ప్రథమయుద్ధ సమయంలోను, రష్యావిప్లవసమయంలో-తర్వాత కూడ లెనిన్ అను కున్నది. కాబట్టి ఆయనిలా వ్రాయడం హేతుకమే.

"సామ్రాజ్యవాదం యొక్క, ఆర్థిక స్వభావాన్ని గూర్చి మనంచెప్పిన అంశాలన్నిటినిబట్టీ, ఇది మారుతున్న ధనికవిధాన మనిగాని. ఇంకా ఖచ్చితంగా చెప్పవలసివస్తే శిథిలిత మవుతున్న ధనికవాద మనిగాని చెప్పవచ్చును" *

ఈ నమ్మకంవల్లనే రష్యావిప్లవం, మిగత పెద్దధనిక దేశాల విప్ల వాలకు దారితీస్తుందని నమ్మజేసింది. రష్యావిప్లవ సమయంలోను తర్వాతకూడ ఆయన దీనిని గట్టిగా నమ్మాడు.•

మొదటియుద్ధ సమయంలో కాని, తర్వాతవెంటనే కాని ఏ ప్రధాన పారిశ్రామిక దేశంలోను విప్లవం రాలేదని మనకిప్పుడు తెలుసు. రష్యా విప్లవం ఒక్కటే వేరుగాఉండి పోయింది. ఆరోజుల్లో రష్యాయే పారిశ్రామికంగా వెనుకబడియున్నది. కాబట్టి చరిత్ర ఈ విషయంలో మార్క్సులాగే లెనిన్ పొరబడ్డాడని తీర్పుచెప్పింది.

---

* లెనిన్—సామ్రాజ్యవాదం, సం.V, వియన్నా-1933 పుట 110

• ఈ అవకాశాన్ని చర్చిస్తూ, లెనిన్ ఇలా 1920 లో వ్రాశాడు : "బాగా అభి వృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలలో ఏఒక్కదానిలో నైనాసరే కార్మికవర్గ విప్లవం విజయవంతమయ్యాక, హఠాత్తుగా పెద్దమార్పురావచ్చు. అప్పుడిక రష్యా ఆదర్శ దేశంగా ఉండదు. తిరిగీ వెనుకబడిన దేశం (సోషలిజం, సోవియట్ పద్ధతి అనేవాని దృష్టిలో) కావచ్చు. ఈ అవకాశాన్ని బొత్తిగా గమనించక పోవడం పొరబాటు."

లెనిన్, సెంటిలిచీ వార్క్స్ సం॥ XXV 203. వియన్నా, 1930.

## పారిశ్రామికాభివృద్ధి చెందిన దేశంలో సాంఘికవిప్లవ మెందుకు రాలేదు?

"పెట్టుబడి" మొదటి సంపుటికి పీఠికలోమార్క్సు ఇలా వ్రాశాడు. "పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన దేశం, చిన్నదేశాల భావిరూపాన్ని మాత్రమే సూచిస్తుంది." మార్క్సు మొదటియుద్ధంవరకూ ఇతరప్రధాన సోషలిస్టు నాయకులూ ఇలాగే అనుకున్నారు. అంతేకాక ఇలా అభివృద్ధిచెందిన దేశమే తొలుత సోషలిస్టు పరివర్తనకు దారితీస్తుందని, దాని నుండి తర్వాత, మిగతవెనుకబడిన దేశాలకది వ్యాపిస్తుందని, అనుకున్నారు కాని, ఇందులోకూడ చరిత్రవేరుగా నడిచింది.

బాగాపెరిగిన దేశాలలో సోషలిస్టు విప్లవం రాకపోయేందుకు ప్రధానకారణం సామ్రాజ్యవాదం, కార్మికులజీవితస్థితిలో అందువల్ల కలిగిన మార్పున్నూ. బాగా అభివృద్ధిచెందిన సామ్రాజ్యదేశాలు, మిగతవానికి వాని భావిరూపాన్ని చూపలేదు. పైగావానిని పారిశ్రామికం కానీకుండ అడ్డు పరచాయి.

పెద్దపారిశ్రామికదేశాలలో ఎక్కువమంది కార్మికుల జీవితం బాగు పడింది, వర్గద్వేషాలు, వర్గ కలహం వీని తీవ్రత తగ్గింది. మొదటి యుద్ధం వచ్చినప్పుడు కార్మికులు ధనికవాదాన్ని విప్లవమార్గాలలో నిర్మూలించ బూనుకోలేదు-విప్లవం కూడదనే నాయకులనే అనుసరించారు. కాబట్టే అతిదుర్బలమైన చోటనే ధనికవాదంలో గండిపడింది. ఇలా కార్మికులస్థితి బాగుపడని జారిస్టు రష్యాలో విప్లవం వచ్చినది.

మన వివరణ సారాంశాన్ని ఇలా సంగ్రహించ వచ్చును; ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలోనికి సామ్రాజ్యవాదం వ్యాపించడం ధనిక విధానంలోని సంక్షోభంయొక్క చక్రనేమిక్రమతీవ్రతను తగ్గించింది.

విదేశాలలో మార్కెట్టు దొరకడం, తద్వారా స్వదేశాల కార్మికులస్థితి బాగుపడడం, తద్వారా స్వదేశం మార్కెట్టు కూడ విస్తరించడం జరిగింది ఇందులో సామ్రాజ్యవాదం సాంఘికసమస్య అంతిమ పరిష్కారానికి వాయిదావేసింది. అయితే వలసలలోను, అర్ధ వలసలలోను, సామ్రాజ్య వాదం, భూస్వామ్యవిధానంతో చేతుయికలిపింది. ఈ ప్రాంతాలలో మరింత పరాశ్రయజీవిగా సామ్రాజ్యవాదం తయారైనది. ప్రపంచం లోని సగం జనాభాను అష్టదరిద్రులుగా చేసివేసింది.

ఇలా వలసలలో పారిశ్రామికాభివృద్ధి నరికట్టడం మూలంగా క్రమంగా ధనికదేశాలలో సంక్షోభాలు వచ్చినప్పుడు ఆదుకొనే శక్తిని. ఈ సామ్రాజ్యవాద విధానం గోల్పోతూ వచ్చింది. కాబట్టి రెండు యుద్ధాల మధ్యకాలంలో—సామ్రాజ్యవాద ద్వితీయదశలో ఆర్థిక సంక్షోభ తీవ్రత మరీ హెచ్చింది.

ప్రత్యేక ధనికదేశాలు సామ్రాజ్యాలను నిర్మించుకునే ధనికవిధాన దశ అంతమయింది. సామ్రాజ్యాక్రమణకు కొత్త ప్రాంతాలు మిగలలేదు. అయితే సామ్రాజ్యవాదమే అంతమయినదని అర్థంకాదు. సామ్రాజ్యం ఉన్న దేశాలు తమ ప్రత్యేకస్థితినిఇలాగే నిలుపుకొనజూచాయి. ఈనూతన పరిస్థితుల కనుగుణంగా ఒక కొత్తరకపు సామ్రాజ్యవిధానం రూపొంద సాగినది.

సామ్రాజ్యవాదాన్ని, దాని అభివృద్ధిదశలోను. రెండు యుద్ధాలమధ్య దశలోనుకూడ పరిశీలించాము. ఇందువల్ల మనం చేసుకున్న నిర్ణయాలు. 1929 సంక్షోభపు చారిత్రక పరిస్థితిని, రానున్న సంక్షోభగతిని తెలుపు తున్నవి. అయినప్పటికి వచ్చే సంక్షోభానికి ప్రబల కారణాలను వివరించే ముందుగా రాజకీయచిత్రాన్ని పూర్తిచేయాలి.

నాలుగో అధ్యాయం

# ప్రపంచ సంక్షోభ కాలంలోను, రెండు యుద్ధాల మధ్యకాలంలోను - ప్రపంచ రాజకీయ పరిస్థితి

వాటర్లూనుండి సెరజెవోవరకూగల శకంకంటె, తర్వాత 1929 సంక్షోభం వచ్చినశకం ఎలా భిన్నమైనదో—ఆ విభిన్నత ఎందువల్ల వచ్చినదో మనమింతవరకు పరిశీలించాము. ఆర్థిక పరిస్థితిలో వచ్చిన ఈ ప్రధానమైన విభేదం సహజంగా రాజకీయంగా కొన్ని మార్పులకు కారణమయినది. ఆ మార్పులు తిరిగీ ఆర్థికస్థితిపై తమప్రభావం వెలార్చాయి.

ఇందువల్ల మొదటియుద్ధానికి పూర్వపు స్థితికంటె రెండవ యుద్ధానికి ముందటి పరిస్థితిలోని విభిన్నత, విపరీతమైన కొత్త మార్పులకు దారి తీసినవి. ఈ మార్పులను మొదటి యుద్ధంలోను—అది ముగిసిన వెంటనేను వచ్చిన మార్పుల సామ్యంతో వ్యాఖ్యానించ బూనుకున్నట్టయితే మన కవి అర్థంకావు.

## రెండో యుద్ధదశ, అమెరికాలో అపార్థాలు

ఇలాంటి సామ్యంతో వాదించడం ముఖ్యంగా అమెరికాలో మరీ ఎక్కువ. ఇది యాదృచ్ఛికం కాదు.

మొదటియుద్ధం ఆఖరుదశలో అమెరికా అందులో ప్రవేశించింది. యుద్ధభీభత్సం అక్కడ అందువల్లనే అల్పంగా కనిపిస్తుంది. యూరోపు రాజ్యాలతో పోల్చి చూచినట్టయితే అమెరికా నష్టపడింది చాల తక్కువ. ఇంతేకాక సాంఘికంగా చెక్కుచెదరని రాజ్యంగా అమెరికా జర్మనీతో యుద్ధానికి దిగింది. అదేస్థితిలోనే బయటపడింది.

అలాగే రెండో యుద్ధంలో కూడ ఆఖరు రోజుల్లోనే అమెరికా ప్రవేశించింది. ఈదఫాకూడ జర్మనీపైనే కత్తిగట్టింది. అయితే ఈసారి తన శక్తిసంపదల నధికంగా సమీకరించింది. అంతిమ విజయంలో అమెరికా భాగం చాలతక్కువ. సంక్షోభం పూర్తిగా నిర్మూలితం కాకున్నా, ఈతూరికూడ ఇతర యూరపియన్ రాజ్యాలతో పోలిస్తే చెక్కుచెదరని సాంఘికస్థితి గలదిగనే యుద్ధంలో ప్రవేశించింది. సాంఘిక భద్రతగల దేశంగానే బయటపడింది.

కాబట్టి ఇటీవలి ప్రపంచ చరిత్రకు అమెరికన్లు అపవ్యాఖ్యానాలు చేయడం గొప్పవింతకాదు. ఇతరులతో పోలిస్తే కొంత శాంతంగా నడిచిన అమెరికాచరిత్ర సామ్యంతో వీరు సిద్ధాంతాలు చేస్తున్నారు. రెండు యుద్ధాలూ అతి విభిన్నమైన దశలలో వచ్చినవని వారు గుర్తించలేకపోతున్నారు. రానున్న సంక్షోభాన్ని గూర్చి అంచనా వేయడంలో పై అపోహ చాల పొరబాటుపడుటకు దారితీయగలదు. కాబట్టి మొదటి ప్రపంచ యుద్ధ దశకంటె రెండవ ప్రపంచ యుద్ధదశ ఎందులో పూర్తిగా విభిన్నమైనదో సాధ్యమైనంత స్పష్టంగా నిశ్చయించుకోవడం అత్యవసర మవుతున్నది.

## మొదటి యుద్ధానికిముందు యూరోపు పారిశ్రామిక దేశాల సాంఘిక భద్రత

ప్రపంచాన్ని పాళ్లువేసుకోవడంలో వచ్చిన సామ్రాజ్యవాదుల తగాదాలు, ప్రధాన పారిశ్రామిక దేశాలలోని ఆంతరంగిక సంఘ విద్వేషాలు

తగ్గడంతోపాటు పొడసూపినవి. ఈ సంగతిని ప్రత్యేకించి నొక్కిచెప్పవలసినపని లేదు. దీనిఫలితం, పెద్ద సామ్రాజ్యదేశాల పరిపాలకవర్గం గొప్ప తిరుగుబాట్లు వస్తాయని భయపడవలసిన అవసరం లేకపోయింది. కాబట్టి వారివైఖరి రూపొందడంలో ఈభయానికి ఏపాత్రా లేకపోయింది.

ధనిక వ్యవస్థలో తమస్థితి బాగుపడ్డం చాల యేళ్లుగా కార్మికులు చూస్తున్నారు. తమ జీతాలు, తద్వారా జీవనస్థాయీ హెచ్చినవి. కాబట్టి మార్క్సన్నట్లు శృంఖలాలు తప్ప మనం పోగొట్టుకోవలసినవేవీ లేవనే స్థితిలో వారులేరు. పోయేది చాలాఉంది వారికి. ఇందువల్ల సాంఘిక విప్లవాలు. తిరుగుబాట్లు రానున్నవేమోనని, మిత్రమండలుల నేర్పరుచుకోవలసిన అగత్యం సామ్రాజ్య పాలకులకు లేకపోయింది. ఇంతేకాక ఆ పెద్దరాజ్యాల సాంఘిక భద్రత చాల హీనంగా ఉంది. గెలిచిన దేశాల్లోగాని, ఓడిన దేశాల్లోగాని మొదటి యుద్ధపు తీవ్ర సాంఘికసంక్షోభం ఎక్కడా సోషలిస్టులనుకున్నట్లు సోషలిస్టు విప్లవాన్ని కొనిరాలేదు—ఓడిన దేశాలలో సంఘవ్యవస్థ యుద్ధఫలితంగా దుర్బలపడ్డంమాత్రమే జరిగింది.

ఇలా కొంతవరకు మొదటి యుద్ధం ఒక చారిత్రక మహాయుగానికంతమని చెప్పవచ్చును. చాలయేళ్లుగా వస్తున్న ధనికవాదాభ్యుదయానికది సమాప్తి. దీర్ఘకాల ధనికవాదాభ్యుదయ ఫలితంగా ఏర్పడిన సాంఘిక భద్రత విషయంలోమట్టుకు—రష్యా విప్లవం నూతన శకారంభాన్ని సూచిస్తున్నప్పటికి, యుద్ధం నడుస్తున్న కాలంకూడ పై శకానికి చెందినదే, *

* ఈ విషయంలో ఏంగిల్సు 1892లో డీన్యూజిట్‌లో వ్రాసిన వ్యాసం గమనించాలి. "జర్మనీలో సోషలిజం" అని దాని శీర్షిక. అందులో ఇలా ఉన్నది:

"యుద్ధం రానేవస్తే ఒక్కవిషయం నిజం; పదిహేనుఇరవైకోట్ల సైనికులు పరస్పరం నరుక్కొని, యూరోపు ఇంతకుముందు కని వినని రీతిగా ఈయుద్ధంలో నాశంచేస్తారు. ఈ యుద్ధం వెంటనే సోషలిజం విజయవంతమయ్యేట్లు చేస్తుంది.

మొదటి యుద్ధంలో ఏదేశమూ ఆర్థికంగా సన్నాహం చేసుకోలేదు

యూరోపులో మొదటియుద్ధం సమగ్రయుద్ధంగా నడిచింది. అంటే అక్కడిప్రజలు తమకున్న శారీరక ఆర్థిక సంపద నంతటినీ సమీకరించి పోరాడా రన్నమాట. కాని అలాంటి సమగ్రయుద్ధానికి వారు సన్నద్ధులై ఉండలేదు—ఇది మొదటియుద్ధానికీ, రెండోయుద్ధానికీఉన్న ప్రధాన భేదం. ఆ దశలో అగ్రరాజ్యాలలో పరిశ్రమలు పూర్తిగా ప్రధానత వహిస్తున్నవి. కాబట్టి ఆయుద్ధం ఆర్థికంగా సమగ్రయుద్ధ మయిపోయింది—కాని అలా అని అందుకు వారు సన్నద్ధులుకాలేదు. మధ్య రాజ్యాల విషయంలోను మిత్ర రాజ్యాలైన బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాల విషయంలోనుకూడ ఇదేస్థితి. మిగత అగ్రరాజ్యాలన్నిటిలాగే సైనిక కార్యాలయోద్యోగులతో జర్మనీయుద్ధంలో దిగినదేకాని, ఆర్థిక నిపుణుల కార్యాలయ నిర్మాణంతో కాదు. యుద్ధం నడుస్తున్న సమయంలో మాత్రమే ఇరువేపులవారూ ఆర్థిక సర్వాధికార కార్యాలయాల నేర్పరుచుకున్నారు.* యుద్ధం కొన్ని నెలలకంటె ఎక్కువ

---

లేదా—పాత సాంఘిక వ్యవస్థను క్రిందినుండి పైదాకా కదిపి పారవేసి శిథిలితం చేసివేస్తుంది. ఇందువల్ల ధనికసమాజ వ్యవస్థగతి ఎన్నటికంటెకూడ అసాధ్యమై పోతుంది. సాంఘిక విప్లవం పది, పదిహేనేళ్లు వాయిదా పడుతుంది. అయితే ఆతర్వాత మరింత వేగవంతమైన సమగ్రమైన దెబ్బతీసి ఆ విప్లవం విజయవంత మవుతుంది.''

* అధికార జర్మన్ రీచ్‌సార్చిల్‌లో ఇలా ఉంది: "ఆర్థిక సర్వాధికార కార్యాలయం ఏర్పరచాలన్న సలహా చాలసార్లుచేశారు. డీల్‌బ్రూక్- మంత్రి—ఈ అభిప్రాయాన్ని వ్యతిరేకించాడు. 1912- డిసెంబరు 28న, రీచ్ ఛాన్సెలరుకు ఇలాంటి ఏర్పాటువల్ల అచరణలో ఏ అనుకూలతా కలగదని ఆయన వ్రాశాడు.'' రీచ్ సార్చిల్, డర్‌వెల్ట్‌క్రిగ్, 1914-18 Vol. I, క్రీగస్టంగ్ అండ్ క్రీగ్‌స్విర్‌షాఫ్టు బెర్లిన్, 1930, పుటలు 341-2

కాలం జరగదని, గభాలున విజయం చేకూరుతుందని సామాన్యంగా అందరూ భావించడంవల్ల జర్మనీలో ఆర్థిక సర్వాధికారి కార్యాలయం ఏర్పాటు కాని, ముడిసరుకుల సమీకరణకాని, అలాంటి ఏ సన్నాహంకాని చేయలేదు. యుద్ధం ఆరంభమయ్యాకనే, జర్మనీ గొప్ప పారిశ్రామిక నిపుణుడు వాల్టర్ రేథ్‌నా యుద్ధమంత్రివర్గంలో ప్రవేశించి, ముడిసరుకుల సరఫరాకు ఏర్పాట్లు జరపసాగాడు, (వీమర్ రిపబ్లిక్కు విదేశాంగ మంత్రిని నాజీల పూర్వీకులు ఖూనీచేసినప్పుడే 1921 లో ఈయన్నుకూడ చంపివేశారు)

హోహెన్‌జోలర్నుల కాలంనాటి జర్మనీ తనకు కావలసిన ఆహారంలో అయిదోవంతు విదేశాలనుంచి తెచ్చుకొనేది. త్వరలోనే బ్రిటిష్ దిగ్బంధనం ఆ సరఫరాకు తీవ్రమైన ఆఘాతం కలిగించింది. తమ ఆహారం కొఱత తెలిసివుండికూడా వారు దీర్ఘకాల యుద్ధానికి తగినట్టు, ఆహారాన్ని నిలవచేసుకోలేదు.

మొదటియుద్ధం వచ్చినప్పుడు జర్మనీ దేశీయ వ్యవహారశాఖా మంత్రిగా ఉన్న క్లెమిన్సు ఫాన్‌డెల్ బ్రూక్ చెప్పిన దేమంటే. యుద్ధమిక రానున్నదని జులై కడపటివారంలో రోటర్‌డాములో నిల్వచేసిఉన్న ధాన్యాన్ని కొనేందుకు తానెంతో ఉబలాట పడుతున్నాడట. ఇందుకై 50 లక్షల మార్కులు అప్పివ్వమని ఈయనకోరాడు. అందుకు ఆర్థికమంత్రి ఇలా సమాధానమిచ్చాడు.

" నేను మీవాంఛ నెరవేర్చేస్థితిలో లేను, మీకు యాభైలక్షల మార్కులనిచ్చివేశాక, యుద్ధంరాకపోతే, ఆధాన్యాన్ని ప్రభుత్వానికి "నష్టంవచ్చే ధరలకు" అమ్మవలసివస్తుంది. ఇదీకాక, 1915 కు ఆదాయవ్యయపట్టికను తయారు చేయడంలో నాకు చాలచిక్కులేర్పడగలవు."

మరి రెండవయుద్ధ సమయంలో ఇలా జరగలేదు. నాజీలుముందుగనే వ్యావసాయిక వస్తువులలో స్వయం సంపూర్ణత కావాలన్న విధానాన్ననుసరించారు. ఈ రెంటినీ పోల్చిచూస్తే చాలు రెండుయుద్ధ దశలకూ మధ్యనున్న భేదం మనకు తెలిసిపోతుంది.

ఇలా ఆర్థికంగా యుద్ధానికి సన్నాహంచేయలేదు కాబట్టి, జర్మనీ సైనికవ్యయం నాజీజర్మనీ వ్యయంతో పోల్చిచూస్తే నిజానికి చాల తక్కువ (జర్మనీలాగే వారి ప్రతికక్షులుకూడ ఆర్థికసన్నాహాలు చెయ్యలేదు) అంతక్రితం కంటె బాగా యెక్కువగా ఉన్నట్టి 1913 సం॥ లోని జర్మనీసైనిక వ్యయంకూడ, ఆదేశపు జాతీయాదాయంలో నూటికి నాలుగోవంతుకంటె హెచ్చులేదు. అప్పటి జర్మనీ సాలుసరి జాతీయాదాయం 50 మిలియన్ల మార్కులు—మరి 1913 సైనికవ్యయం—నౌకాబలం, భూసేనకూడ కలిసి – 2 మిలియర్డు మార్కులు. దీనినే మరొక విధంగాకూడ చెప్పవచ్చును. రెండోయుద్ధానికి దారితీసిన దశతోపోల్చి చూస్తే మొదటియుద్ధానికి దారితీసిన దశలో "మిలిటరీ" జర్మనీ ఆయుధోత్పత్తి (మిత్రమండలి దేశాలసంగతీ అంతే) చాల అప్రధానమైన పాత్రను నిర్వహించింది. ఈ అంశం చాలముఖ్యమైనది.

పై పరిశీలన సారాంశమిది: మొదటి యుద్ధానికిముందు, చిరకాలం అవిచ్ఛిన్నంగా ధనికవిధానం పెంపొందుతూ వచ్చింది. సంఘవిద్వేషాలు చాల తగ్గిపోయినవి; సంఘభద్రత ఆయుధోత్పత్తి (యుద్ధకాలీన ఆర్థికవ్యవస్థ)పై ఎక్కువ ఆధారపడలేదు.

## రెండో యుద్ధానికిముందు సమాజంలో అస్థిరత, రాజకీయ అస్థిరత

రెండుకాలాలకు మధ్యనున్న విభేదాన్ని సూచించేందుకీ లక్షణాలు చాలును. రెండోదశలో ధనికవిధానాభ్యుదయం అవిచ్ఛినంగా చాలకాలం

సాగలేదు. కాబట్టే సాంఘికభద్రతలేదు. పైగా ఈకాలమంతా సామాజికంగా రాజకీయంగా అస్థిరతతో నిండుకున్నది. ఇది విప్లవాలు, విద్రోహాలతో నిండినయుగం.

మొదటియుద్ధం జరుగుతుండగా, ఆనాటి బలవత్తర అభివృద్ధి నిరోధక ప్రభుత్వమైన జారిజాన్ని కూలద్రోసి, బోల్షివిక్కులు అధికారాన్ని కైవసంచేసుకున్నారు. వ్యావసాయిక విప్లవం రష్యాసమాజవ్యవస్థను మార్చివేసినది. అధికారం లాక్కొనడమే కాక బోల్షివిక్కులు దాన్ని రక్షించుకో గలిగారు. ప్రభుత్వ ప్రణాళికలను అమలుజరిపారు. వ్యక్తిగత యజమానులను, వ్యక్తిగత పెట్టుబడిదారులను తొలగించివేశారు. ఈవిధంగా అతి వేగంగా రష్యాను ప్రపంచంలో మూడవ ప్రధాన పారిశ్రామిక దేశంగా మార్చివేశారు.

బోల్షివిక్కులు రష్యాలో అధికారానికివచ్చి, పరిపాలన కొనసాగించడం, ఈశకంలో చాల చారిత్రక ప్రాముఖ్యంగల సంఘటన. ప్రభుత్వాల రాజకీయ బాంధవ్యం ఒక్క యూరోపులోనేకాక ఆసియాలోను-తద్వారా ప్రపంచమంతటను ఇందుతో మార్పువచ్చినది. రెండు యుద్ధాల మధ్య కాలానికి-రానున్న సంక్షోభ సమయానికి ఇది పూర్తిగా అనువర్తిస్తుంది.

ఇలా రష్యాలో బోల్షివిక్కులు సమాజం పునాదినే మార్చివేయగా.. యూరోపులో సంఘ వైషమ్యాలు మరింత తీవ్రరూపం తాల్చినవి. కాని సమాజాన్ని మార్చేందుకు సోషలిస్టు శక్తులకు తగినబలం లేకపోయినది-. విద్రోహశక్తులే బలంగా కనిపించాయి.

ఫాసిజం ఇటలీలో మొదట విజయం సాధించినప్పటికి, జర్మనీలో నాజీ విద్రోహ విజయం అంతకంటె చరిత్ర ప్రాముఖ్యతగల సంఘటన.

అయినది. 1929 సంక్షోభ పూర్వయుగపు అభ్యుదయకాలంలో నాజీజం, రాజకీయాలతో అంత పెద్దపాత్రను నిర్వహించలేదు. వర్సైల్సు సంధి జరిగిన పదేళ్లతర్వాతకూడ, 1928 మే 20న రీచ్ స్టాగ్ ఎన్నికలలో నాజీలకు మొత్తం ఓట్లలో నూటికి 2.6మాత్రమే వచ్చినవి. అప్పటికి వారొక చిన్న రాజకీయ వర్గంగామాత్రమే ఉన్నారు. 1929సంక్షోభం యూరోపులో అన్ని దేశాలకంటె జర్మనీ ఎక్కువ దెబ్బతిన్నది. ఇంకేయితర యూరోపు దేశంలోకాని ఇంత ఎక్కువగా ఉత్పత్తి పడిపోలేదు. నిరుద్యోగం ఇంత ఎక్కువగా మరెక్కడా కనిపించలేదు. అంతేకాక ఇంతపెద్ద దెబ్బతిన్నప్పటికి అమెరికా కున్నట్టుగా పెద్ద నిలువలులేవు. జర్మన్ మధ్యతరగతులప్పటికే దరిద్రులై, నోట్లముమ్మరం మూలంగా నిరుపేదలై ఉన్నారు. ఇందువల్ల జర్మనీలో సంఘవ్యవస్థ అమెరికాలోకంటె సంక్షోభంతో తీవ్రంగా కలతచెంది ఉన్నది.

ఈ ఆర్థిక పరిస్థితులు జర్మనీలో నాజీవిద్రోహ విజయాని కనుకూలమైనవి. ఈ అంశం మొదటియుద్ధ పూర్వదశకంటె రెండవ యుద్ధపూర్వదశ వేరని చెప్పేందుకు ముఖ్యకారణాలలో ఒకటయినది.

ధనికవిధాన పురోగమనదశ ముగిసినదని, ప్రపంచ చరిత్రలో నూతనశకం ఆరంభమయినదని రష్యా విప్లవం, జర్మనీ నాజీవిద్రోహం మనకు స్పష్టపరుస్తున్నవి.

జర్మనీలో నాజీపాలన, రష్యాలో సోవియట్ ప్రభుత్వం అతి బలోపేతమై ఏర్పడడం, 1929 సంక్షోభ ఫలితాలు, ఈ మూడున్నూ రెండవ యుద్ధందాకా రాజకీయ ప్రగతిని నిర్ధరించాయి.

1914 కు క్రిందటిదశలో పెద్దధనిక పారిశ్రామిక రాజ్యాలు సాంఘికంగా భద్రంగా ఉన్నవి, విప్లవభయంవారి విదేశాంగ విధాన్నాన్ని నిర్ణ

యించడం లేదు. పరిపాలక వర్గంలో తమ అధికారం తప్పక కొనసాగుతుందన్న విశ్వాసం చెదరిపోయింది-సామాన్యవిదేశ రాజకీయ లక్ష్యాలతో పాటు, వీరికి తమసాంఘిక అధికారాన్ని, సౌకర్యాలను నిలుపుకోవాలన్న ఆదుర్దా ఎక్కువయినది, కాబట్టి ఈదశలో వీరి విదేశాంగ నీతి అటూ యిటూ వంకర టింకరగా నడుస్తూవచ్చింది.

రెండో యుద్ధానికిముందు ప్రత్యేక మిత్రగ్రహకూటాలు లేవు,

రెండు యుద్ధాలకు పూర్వదశలలో మిత్రరాజ్యాల మైత్రి సమస్యను పరిశీలించినట్టయితే ప్రభుత్వపాలకుల అస్థిరవిధానం, వారివిదేశాంగ నీతి వంకరటింకరగా నడవడం స్పష్టమవుతుంది. మొదటి యుద్ధానికి ముందు సాధారణ సంఘవ్యవస్థ స్పష్టంగా ఉన్నది. ఒకవేపు జర్మనీ నాయకత్వంక్రింద మధ్య ప్రభుత్వాలున్నవి. మరొకవేపు బ్రిటన్, ఫ్రాన్సులు జారిస్టురష్యాతో చెలిమిగానున్నవి. ఒక్క ఇటలీ సంగతి మాత్రమే ఇంకా అనుమానంగా నున్నది,

రెండోయుద్ధంలో బ్రిటన్, రష్యా, ఫ్రాన్సు, అమెరికాలుచేరిన మిత్రమండలి ఆ మొదటియుద్ధంలో లాగే అక్ష రాజ్యాలైన- జర్మనీ, ఇటలీ, జపానులను ఓడించాయి. కాని ఈ మైత్రి యుద్ధానికి పూర్వంకాక యుద్ధసమయంలోనే క్రమంగా ఏర్పడినది. యుద్ధ పూర్వదశలో ఈ మైత్రి స్థూలరేఖకూడ కనిపించదు.

మొదటియుద్ధంలా కాక, రెండోయుద్ధం రావడానికి చాలముందే యుద్ధం వస్తుందన్న వదంతులు-ముఖ్యంగా నాజీలు అధికారానికి వచ్చాక- బాగావ్యాపించి ఉన్నవి, యుద్ధం వస్తుందని పాలకులు ప్రతీక్షిస్తున్నారు. కాని, యుద్ధం వచ్చాకకూడ ఆఖరున ఏయేరాజ్యాలు గుంపు కడతాయో పూరా స్పష్టంకాలేదు. ఇందుకు కారణం ప్రతిచోటా పాలకవర్గాల రాజ

కీయభయం—తమస్వదేశాలలోనే విప్లవాలు వచ్చితమ్ము నిర్మూలించి వేస్తాయేమోనన్న భయం-వీరిలో పాదుకున్నది అందుతోపాటు సోవియట్-యూనియన్‌తో మైత్రనెరసి దాని సరసన పోరాడేందుకు వీరు భయపడుతున్నారు.

రెండో యుద్ధం వాస్తవంగా 1931 లో ఆరంభమైనదని చెప్పవచ్చును. ఆ సంవత్సరమే జపాను మంచూరియాపై దాడి చేసి, చైనాను లొంగదీయ సమకట్టింది. ఆసియాలో జపాను పలుకుబడి హెచ్చిపోతుందన్న భయంతో—ఈవిషయంవరకు బ్రిటిషు సామ్రాజ్యతత్త్వం జపాను సామ్రాజ్యతత్త్వాన్ని వ్యతిరేకిస్తూ వచ్చింది. అయితే ఇందుతోపాటు, బ్రిటిషు మొండిఘటాలకు మరొక భయంకూడ ఉన్నది: జపాను ఓడిపోయినట్లయితే, చైనా జాతీయవాదులు బలపడతారు. ఇందుమూలంగా ఆసియా అంతటా సామ్రాజ్య వ్యతిరేక చర్యలు పెచ్చుపెరిగిపోవచ్చు. ఇందుతో తన సామ్రాజ్యపు వలసదేశాలలో జాతీయోద్యమం బలపడవచ్చును—ఇదొక భయం వీరిగుండెల్లో మెదలుతున్నది. కాబట్టే మొదటిరోజుల్లో వీరు జపాను సామ్రాజ్యతత్వ దురాక్రమణకు సమ్మతించారు. అప్పుడు భారత మంత్రిగాఉన్న అమెరీ-ఇతడే 1945లో లేబర్‌పార్టీ అధికారానికి వచ్చేదాకా ఆ పదవిలో ఉన్నాడు—1933 ఫిబ్రవరి 27 న కామన్సుసభలో ఇలా ప్రకటించాడు:

> "ఆచరణలోగాని, మాటలలోగాని, సానుభూతిలోగాని మనం వ్యక్తిగతంగానో, ఉద్దేశపూర్వకంగానో జపానుకు వ్యతిరేకంగా ఈ విషయంలో ఎందుకు కల్పించుకోవాలో నాకేమాత్రం కారణం కన్పించడంలేదు-ఈసంగతి ఒప్పుకొనితీరాలి: ప్రధానవాస్తవికపరిస్థితులపై ఆధారపడిన బలవత్తర కారణాలు జపానుకున్నవి.

మంచూరియాలో శాంతిభద్రతలు నెలకొల్పి, చైనా జాతీయ విజృంభణ దురాక్రమణనుంచి తన్ను తప్పించుకుంటున్న జపానుపై మొదట రాయివేసి, జపానిలా చేయరాదని నొక్కివక్కాణించే వారు మనలో ఎవరున్నారు? జపానునే ఖండిస్తే ఇండియాలోని మన విధానమంతా, ఈజిప్టులోని మన విధానమంతా ఖండనార్హమే అవుతుంది.''

ఆసియాలోని నాటిపరిస్థితినిది సూత్రప్రాయంగా తెలుపుతున్నది— యూరోపులోని స్థితికూడ ఇలాగే ఉన్నదప్పుడు. యూరోపులో మొత్తం మీద విద్వేషాలు చెలరేగేందుకు ముందుగావచ్చిన సంఘర్షణ స్పెయిన్ అంతర్యుద్ధం. ప్రజాస్వామిక ప్రాతిపదికపై ఎన్నుకోబడిన అభ్యుదయకర ప్రభుత్వానికి వ్యతిరేకంగా, దేశంలోని అభివృద్ధి నిరోధకుల యొక్క, భూస్వామివర్గాలయొక్క తోడ్పాటుతో సైనికవర్గం తిరుగుబాటు చేశారు. ఈ ఫాసిస్టు శక్తులకు అంతర్జాతీయ ఫాసిజం తొలినుంచి సాయపడుతూ వచ్చినది. స్పెయిన్‌లో ఫాసిజం జయిస్తే, యూరోపులో ఫాసిస్టుశక్తులు బలపడతాయని, ఇందుతో పశ్చిమ ప్రజాతంత్ర రాజ్యాలలో కార్మికవర్గ బలమూ, వారి స్థానమూ తగ్గిపోతుందని గుర్తించిన ఇటలీ, జర్మన్ పాలకులు క్రమంగా స్పెయిన్‌లో జోక్యం కల్పించుకోసాగారు. ఇందువల్ల పశ్చిమరాజ్యాలు సైనికంగాకూడ దుర్బలపడతాయి. జర్మనీ ఇటలీల సైనిక బలం హెచ్చుతుంది- ఇది వారి ఆలోచన.

అక్షరాజ్యాల విదేశ, స్వదేశ విధానాల రెంటినిబట్టి ఫ్రాంకోను బలపరచడం అవసరమైనది. బ్రిటన్ ఫ్రాన్సుల సంగతి వేరు. జర్మన్ ఇటలీల తోడ్పాటుతో స్పెయిన్‌లో ఫాసిజం గెలిస్తే, యూరోపులో తమ రాజకీయ, సైనికస్థానం బలహీనమవుతుందని వీరికి స్పష్టంగా తెలుసు.

మరి ఆ సమయంలో ఫ్రాన్సులో ఉన్న బ్లూం ప్రజాతంత్ర సంఘటిత ప్రభుత్వాన్ని బోల్షివిజమని దుమ్మెత్తిపోస్తున్న బ్రిటిషు టోరీలకూ, ఫ్రెంచి అభివృద్ధినిరోధకులకూ మరొకభయం చుట్టుకున్నది: స్పెయిన్‌లో ఫ్రాంకో ఓడిపోతే అక్కడి సోషలిస్టు విప్లవోద్యమం బలపడుతుందికదా. ఈ భయంతో వీరు స్పెయిన్ ప్రభుత్వాని కడుగడుగునా ఆటంకాలు కల్పిస్తూ వచ్చారు. ఇందుతో ఒక్కసంగతి స్పష్టపడింది. సాంఘిక విప్లవాలభయం ప్రపంచ అగ్రరాజ్యాల విదేశాంగనీతి నిర్ణయంలో ప్రధానపాత్రను నిర్వహిస్తున్నది, మొదటియుద్ధ పూర్వరంగదశలో ఈ స్థితిలేదు.

స్పెయిన్ అంతర్యుద్ధం ముగిశాక, హిట్లర్ ఆస్ట్రియాను స్వాహా చేశాక, జెకొస్లొవేకియాకు ప్రమాదస్థితి ఏర్పడింది. దీని నాపాలంటే, బ్రిటన్, ఫ్రాన్సు, సోవియట్ యూనియన్ సంయుక్తంగా ఐక్యం కలిగించుకోవాలి. కాని ఈ పద్ధతి పశ్చిమ రాజ్యాలకు మరింత ప్రమాదకారిగా కనిపించింది.

నాజీజర్మనీ పరాజయం, యూరోపులోని విప్లవశక్తులను బలపరచగలదని బ్రిటిషు టోరీల భయం. ఫ్రెంచి అభివృద్ధి నిరోధకులకు, ఫ్రెంచి పరాజయానికంటె నాజీజర్మనీ ఓటమే భయంకరంగా కనిపించింది. *

---

* మ్రురాస్ శిష్యుడూ, ఫ్రెంచి రాచరిక ఫాసిస్టు ఉద్యమానికి ప్రవక్తా అయిన థీరమౌల్నీర్ వ్రాస్తూ, 1938 లో మితవాదులు యుద్ధానికి పరాఙ్ముఖులైనందుకు కారణం ఇలా చెప్పారు. "ఈ పార్టీల భావం ఏమంటే, యుద్ధం వస్తే వినాశం విపరీతంగా ఉంటుంది. అంతేకాక ఫ్రాన్సు పరాజితమై సర్వనాశమయ్యే అవకాశమూ ఉంది. అదీకాక జర్మనీ ఓడిపోతే, కమ్యూనిస్టు విప్లవానికి ప్రధాన నిరోధకమైన నిరంకుశ నియంతృత్వం శిథిలితమయి పోతుందన్నమాట. అంటే ఇవి బహుశా యూరోపులో బోల్షివిస్టు విప్లవవిజృంభణకావచ్చు. అంటే ఫ్రెంచి పరాజయం ఒక్క ఫ్రెంచి పరాజయం మాత్రమే. కాని, ఫ్రెంచి గెలుపు నిజానికి

ఓని ఫలితంగా మ్యూనిక్ సంధి జరిగింది. పశ్చిమరాజ్యాలు జెకొస్లొవేకి యాను జర్మనీ కప్పగించాయి. ఇలా చేయడంవల్ల నాజీ సామ్రాజ్యవాద దురాక్రమణ తూర్పునకు వ్యాపిస్తుందని, హిట్లర్ సోవియట్‌పై దాడిచేయ డంతో భావియుద్ధం ఆరంభంకాగలదని బ్రిటిషు ఫ్రెంచి అభివృద్ధినిరోధక వర్గాలు భావించినవి.

కాని అలా జరుగలేదు. పశ్చిమరాజ్యాలతో తమకున్న పాత అను భవాన్నిబట్టి అవిశ్వాసంతో సోవియట్ యూనియన్ నాజీజర్మనీతో నిరా క్రమణసంధి చేసుకున్నది. హిట్లర్ పోలెండుపై దాడిచేయడంతో రెండో యుద్ధం ఆరంభమయింది. వెంటనే బ్రిటన్ ఫ్రాన్సు లందులో తగుల్కొ న్నవి. తర్వాత హఠాత్తుగా సోవియట్‌పై దాడిచేయడంతో, హిట్లరే సోవి యట్ యూనియన్‌కూ పశ్చిమ రాజ్యాలకు మధ్య మైత్రికి తావిచ్చాడు. అలాగే జపాను పెరల్ హార్బర్‌పై దాడిచేయడంతో అక్షరాజ్య వ్యతిరేక కూటమిలో అమెరికా చేరడం జరిగింది.

## రెండో యుద్ధానికి ఆర్థిక సన్నాహాలు

రెండో యుద్ధానికి ముందటికాలమంతా యుద్ధ ఆర్థిక సన్నాహాలతో నిండిపోయింది.

మొదటి యుద్ధానికిగా, జర్మనీకాని, తద్విరోధులుకాని ఆర్థికంగా గొప్ప సన్నాహాలు చేయలేదని మనం తెలుసుకున్నాము. యుద్ధం వచ్చే

జయం కాదు సరికదా తన సర్వనాశానికి. తను నమ్మిన నాగరికత సర్వనాశనానికి చక్కని దారిచూపెట్టే సిద్ధాంతాలకిది విజయం కాగల్దు."

కంబాట్, నవంబరు, 1938 ఫ్రెంచి హక్కులు—నాజీ జర్మనీ అనే పుస్తకంలో ఛార్లెస్ ఎ. మిక్గా ఉదహరించినది—డ్యూక్ యూనివర్సిటీ ప్రెస్, 1943—

దాక్రా, వారందరూ సామాన్యమైన శాంతికాలపు పద్ధతులమీదనే నడుస్తు న్నారు. రెండోయుద్ధానికి క్రిందటి పరిస్థితి వేరు. 1929 సంక్షోభం ఇతర దేశాలన్నిటికంటె జర్మనీపై పెద్ద దెబ్బతీసింది. ఉత్పత్తి దాదాపు సగానికి సగం పడిపోయింది. నాజీలు అధికారానికి వచ్చేటప్పటికి ఇదే స్థాయిలోనే ఉంది. ఉత్పత్తియంత్రం వారిచేతిలోనున్నది, దానిని కొంతభాగమే ఉప యోగిస్తున్నారప్పటికి. ఆధునికయుద్ధం యంత్రాలయుద్ధమని నాజీలూ, జర్మనీ సేనానాయకులూ యెరుగుదురు. కాబట్టే సైనికంగాను, పారిశ్రామి కంగానుకూడ సన్నద్ధులుకావాలనుకున్నారు. యుద్ధానికి సైన్యసన్నాహాలు చేయడం యూరోపులో మామూలే. తరతరాలుగా అవి సాగుతున్నవి. అక్కడిదేశాలన్నిటా విధిగా ప్రతివారూ సైనికశిక్షణ పొందాలన్ననియమం ఉన్నది. కాబట్టి సైన్యసన్నాహ విషయంలో నాజీలు కొత్తగా ఏమి ప్రవేశపెట్టలేదు. ఆర్థికరంగంవేరు-అక్కడేవారు కొత్తదారులు తొక్కారు. శాంతి సమయంలో అంతకుమునుపెన్నడూ కనివిని యెరుగనిరీతిగా విప రీతంగా ఆయుధోత్పత్తిచేశారు. విపరీతంగా పెరుగుతూ వస్తున్న జర్మన్ ఆర్థికవ్యవస్థనంతటినీ యుద్ధసన్నాహాలకు వినియోగించారు. ఇలా 1929 నాటికంటె పూర్వపు అభ్యుదయకాలంలోని ఉత్పత్తినందుకొని, ఆఖరుకు అంతకుమించి ఉత్పత్తి చేయసాగారు. ఇంకా యుద్ధం రాలేదు. కాని ఆర్థికవ్యవస్థ పూర్తిగా యుద్ధసన్నాహాలలో దిగింది. దీనినేవారు "వేర్ విర్ట్ షాఫ్టు"-అంటారు. *

ఈ కార్యక్రమాన్ని నాజీలు అమలుజరపడం సులువైనది, కారణ మేమిటంటే, ఉన్నపరిశ్రమలన్నిటా కార్మికులందరూ అప్పటికి ఉత్పత్తిలో పాల్గొనడంలేదు. కాబట్టే ఈవిపరీత ఆయుధోత్పత్తి ఇతర వస్తూత్పత్తిని

---

* వేర్ విర్ట్ షాఫ్ట్—ఈ పదం నాజీ రాజ్యంలోనే వాడుకలోకి వచ్చింది. వివరణకు టిప్పణి చూడండి.

తగ్గించలేదు. 1932సంక్షోభ సమయంలో తగ్గినదానికంటె జర్మన్ల జీవన స్థాయి మరింత తగ్గిపోలేదు. తమ కార్యక్రమాన్ని అమలుజరుపుతూ, నాజీలు నిరుద్యోగులకు పనులివ్వగలిగారు. మొదటియుద్ధం అనుభవం మూలంగా వీరీసారి సైనికంగాను, ఆర్థికంగానుకూడ సమీకృతులయ్యారు. ఆర్థిక సర్వాధికార కార్యాలయాన్నికూడ ఏర్పరచారు. ఈ విధంగా తాము తేనున్న యుద్ధానికి అన్ని రంగాలలోనూ తయారై ఉన్నారు.

"సప్తవర్ష యుద్ధానికిముందు, ఫ్రెడరిక్ ది గ్రేట్‌కున్న ఖడ్గం-ఫ్రాన్సు, అస్ట్రియాల ఖడ్గానికంటె పొట్టిదే, కాని ఆ పెద్దరాజ్యాలు తమ కత్తిని దూసినదానికంటె మూడింతలు వేగంగా ఫ్రెడరిక్ తనకత్తిని ఒరనుండి తీశాడు" అని ఫ్రాంజ్‌మెహరింగ్ వ్రాశాడు.*

1914లో జర్మనీకూడ తన శత్రువులు కత్తి దూయకముందే అతి వేగంగా తనకత్తి దూసినది. కాని ఆనాటికి యుద్ధతంత్రగతి పురోగమించినది. కత్తే జయాపజయాలను నిర్ణయించే రోజులు గతించాయి. అందుతో పాటు పారిశ్రామికంగా సన్నద్ధులు కావాలి. ఈ విషయంలో మహా యుద్ధానికి జర్మనీపారిశ్రామిక సన్నాహం ఆనాటికి తగినంత లేదు.

తన శత్రువులకంటె ముందుగా కత్తిదూయదలచినదేశం, ఆధునిక యంత్రయుద్ధంలో కేవలం సైనికంగా తయారయితే చాలదు, పారిశ్రామికంగా, ఆర్థికంగాకూడ సిద్ధంకావాలి. ఈ సంగతి నాజీలు బాగా యెరుగుదురు. తాము అధికారంలోనికివచ్చిన 1933సం॥నుంచీ 1939లో యుద్ధం వచ్చేదాకా వారి ప్రధానాశయం ఈవిధంగా సన్నద్ధులుకావడమే.

---

* ఫ్రాంజ్ మెహరింగ్, డీ లెసింగ్లిజెండే, 2 అఫ్లేజ్ స్టట్‌గర్ట్ 1906, పుట 167.

యుద్ధానికి ఆర్థిక సన్నద్ధతనుబట్టి చూస్తే, 1911 లో యుద్ధంలో పాల్గొన్న దేశాలన్నీ ఒకే స్థితిలోనే ఉన్నవి-అంటే అందరూ తయారుగా లేనివారే. మరి రెండోయుద్ధం వచ్చినప్పుడు నాజీజర్మనీ మిగత అన్ని దేశాలకంటె మంచి అనుకూలమైన స్థితిలోఉన్నది.

శాంతి సమయంలో జర్మనీ ఆయుధోత్పత్తి కార్యక్రమ మహత్వాన్ని చూడాలంటే ఒక అంశం చాలు. యుద్ధం రాకపూర్వమే, జర్మనీ జాతీయాదాయంలో సగపాలు ప్రభుత్వ (ఆయుధ) ప్రయోజనాలకై వినియోగిస్తూవచ్చారు. ఈ విషయాన్ని తర్వాత వివరంగా పరిశీలింతాము. ఎందుకంటే. యుద్ధోత్పత్తిదృష్ట్యా ఆర్థికవ్యవస్థ నంతటిని పునర్నిర్మించడంతో, ప్రభుత్వం పలుకుబడి ఆర్థికవ్యవస్థపై అధికంగా వ్యాపించింది. ఇందువల్ల కేవలం నాజీ జర్మనీకిమాత్రమే చెందని ఒక కొత్తసమస్య ఉదయించింది.

## రెండవ మహాయుద్ధ ప్రభావం

రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభంలో వివిధ యుద్ధమగ్న ధనిక దేశాలలో సాంఘికవైషమ్యాలు, మొదటియుద్ధ ప్రారంభంలోకంటే, తీవ్రతరంగానున్నవి. యుద్ధంవల్ల వచ్చిన మార్పులుకూడ మొదటితూరికంటె రెండవతూరి అధికంగా కనిపిస్తాయి. అమెరికాతోపాటు ప్రపంచమంతా నూతన చారిత్రక శకంలో ప్రవేశించింది. అక్షరాలా దీనిని ప్రపంచ చరిత్రయుగమని చెప్పవచ్చును.

1914-18 యుద్ధాన్ని మొదటి ప్రపంచయుద్ధ మనడ మంత సమంజసం కాదు. అది ముఖ్యంగా యూరోపుయుద్ధం. కట్టకడపట అమెరికా పశ్చిమ రాజ్యాలకు తోడుగాచేరి, తన సహజసంపదలో కొద్దిగామాత్రమే ఉపయోగించింది. జపానుకూడ చేరినమాట నిజమేకాని అది నామకః

మాత్రమే. తన శక్తిసంపదలలో అత్యల్పభాగాన్నిందులో ఉపయోగించింది. మిగతఆసియా పూర్తిగా శాంతంగాఉంది. అయినప్పటికీ మొదటి ప్రపంచయుద్ధమన్నమాట మన తలలో బాగా నాటుకుపోయింది కాబట్టి, నిజంగా మొదటి ప్రపంచయుద్ధమనిపించుకోదగిన 1939—45 యుద్ధాన్ని రెండవ ప్రపంచ యుద్ధమని మనం చెప్పుకోవలసి వస్తున్నది.

1914—18 యుద్ధంలాగా ఇది యూరపియన్ యుద్ధం కాదు. అమెరికా యుద్ధంకూడ. అమెరికా తన సర్వశక్తిసంపదలను సమీకరించవలసి వచ్చింది. జపాను, చైనా—ఆసియాఅంతా తలమున్కలుగా ఇందులో దిగినది కాబట్టి, ఇది ఆసియాయుద్ధం కూడ.

ఇలా ప్రపంచంలోని ఏకాస్త ప్రాముఖ్యంగల దేశంకూడ కుత్తుకబంటిగా దిగి, తన సర్వశక్తిసంపదలను వినియోగించితీరవలసి వచ్చినది. కాబట్టి ఈ 1939—45 యుద్ధం నిజమైన ప్రపంచ యుద్ధమని చెప్పవచ్చును.

అలాగే సైనిక ఆర్థికరంగాలలో ప్రపంచం నూతన శకంలో ప్రవేశించిన దనికూడ ఈ యుద్ధం బహిరంగపరచినది. మిగత ప్రపంచగతినుండి, ఏ దేశమూ నేడు తప్పించుకోలేక పోతున్నది. కాబట్టే ఇది నిజంగా ప్రపంచ చరిత్రశకం.

ఈదశలోనికి ప్రపంచంలోని వివిధదేశాలూ విభిన్న ఆర్థికవ్యవస్థలతో ప్రవేశించినవి. ఇందులో కొత్తేమి లేదనుకొండి. ఇందులో కొత్త ఏమిటంటే, సోవియట్ యూనియన్‌లాంటి సోషలిస్టుదేశం, బాగా పెరిగిన ధనికవిధాన పారిశ్రామిక దేశాలూ, ఇంకా పూర్వకాలపు పద్ధతులున్న దేశాలూ ఇవన్నీకూడ ఒకదానిని కట్టబడి మునిగినా తేలినా కలిసి పనిచేయవలసిన స్థితికివచ్చాయి—ఈ యుద్ధంలోనే.

ఇవ ఆశయాలు లక్ష్యాలనుబట్టిచూడ ఇది ప్రపంచ యుద్ధం. నాజీల లక్ష్యం ప్రపంచాధిపత్యం. ఈకాలంలో ప్రపంచాధిపత్య సమస్య వ్యాసాలలో, పుస్తకాలలో చర్చించే స్థితినిదాటి ఆచరణకు చెందిన సమస్యగా మారినది. ప్రపంచాధిపత్య సాధనకు ఒకే ఒక్కదేశం కార్యప్రణాళికను తయారుచేసుకుని, తత్సాధనకు ప్రయత్నించి చాలవరకు నెగ్గినది. బ్రిటన్ పరాజయం ఒక వెంట్రుకవాసిలో తప్పిపోయింది. జర్మనీ బ్రిటన్‌ను ఓడించగలిగేఉంటే సోవియట్ యూనియన్‌నుగూడ గెలవగలిగిఉండే దేమో-బహుశా. ఈ రెండు దేశాలను గెల్చినదేశం ఇక ప్రపంచాధిపత్యం సాధించడంలో ఆశ్చర్యంలేదు. హిట్లర్ రెంటినీ జయించలేకపొయ్యాడు. కాని వాని ప్రయత్నం మనకు తెలుపుతున్నదేమిటి? పెద్దరాజ్యాల చెప్పు చేతలలోనున్న శకంకాదిది, మరి ప్రపంచ శక్తుల పెత్తనంక్రింద నున్న శకంలో మనం ప్రవేశించాము.

అమెరికాకు, మిగత ప్రపంచానికి మధ్య విపరీతమైన అఖాతం

ఈ ప్రపంచ శక్తుల శకంలో, ఈ ప్రపంచ చరిత్ర శకంలో ఈ వాస్తవ ప్రపంచ యుద్ధశకంలో యుద్ధఫలితా లొకొక్క దేశంలో ఒకొక్క రీతిగానున్నవి. మొదటిసారికంటె ఈతూరి యీవిభేదం చాల యెక్కువగా కనబడుతుంది. ఇతర అగ్రరాజ్యాలలో కంటె, అమెరికాలో ఈ యుద్ధఫలితాలు వేరుగానున్నవి. నిజానికి ఈప్రపంచ చరిత్రశకంలో ప్రధాన లక్షణం, అమెరికాకూ ఇతర ప్రపంచానికీమధ్య ఏర్పడిన పెద్దఅఖాతమని చెప్పవచ్చును.

యుద్ధకాలపు ఉత్పత్తిగతినిబట్టి మాత్రమే చూచినప్పటికి, రెండు యుద్ధాల మధ్యనున్న విభేదం, అమెరికాకూ ఇతర ప్రపంచానికీమధ్య ఏర్పడిన విభేదం స్పష్టంగా కనబడుతుంది.

మొదటియుద్ధంలో పెద్దరాజ్యాలు దిగినప్పుడు, వాని ఉత్పత్తి యంత్రం పూర్తిగా పనిచేస్తున్నది. పెద్దగా నిరుద్యోగంకూడ లేదు. ఇందువల్ల యుద్ధఫలితంగా ఉత్పత్తిలో ఏర్పడిన కాస్త కొరవకూడ శాంతిస్థాయికంటె తక్కువస్థాయికి ఉత్పత్తిని కొనివచ్చినది. ఇలా కాక సామాన్యంగా చూస్తే, మొదటియుద్ధంలో ఉత్పత్తిహీనత కేవలం పరోక్షఫలితంగా మాత్రమే ఏర్పడినది. కారణాలివి; ఉత్పత్తిలో పని చేసే యువకులను సైన్యంలోకి తీసుకున్నారు. చావులు 80 లక్షలు మించాయి, ఉత్పత్తి యంత్రాన్ని సరిగా పునర్నిర్మించ వీలులేకపోయింది. ఆహారం కరువు పెరిగింది, తత్ఫలితంగా కార్మికుల ఉత్పత్తిశక్తి ప్రతిచోటా సన్నగిల్లినది. అయినప్పటికి, ప్రత్యక్ష సైనికచర్య ఫలితంగా, ఉత్పత్తి తగ్గిపోవడమనే దంత యెక్కువకాదు. యూరోపులోని రెండు ముఖ్యపారిశ్రామిక దేశాలైన బ్రిటన్, జర్మన్ భూములలో యుద్ధం సాగలేదు. విమానదాడులు చాల స్వల్పపాత్రను నిర్వహించాయి. యుద్ధచర్యలద్వారా ఫ్రాన్సు బెల్జియంలలో జరిగిన ఉత్పత్తియంత్రవినాశం కొద్దిపాటే. కాబట్టి ఉత్పత్తిలో తరుగుదల యూరోపంతటా—బ్రిటన్ తోపాటు సమానంగా ఆనాడు కనిపించింది.

మొదటి ప్రపంచయుద్ధంలో పారిశ్రామికోత్పత్తి యుద్ధంలో దిగిన దేశాలలో 1913 సంఖ్యలో మూడోవంతు తగ్గిపోయినది. అమెరికాతోపాటు యూరపియన్ ఇతరరాజ్యాలలో ఉత్పత్తి పెరిగింది. ఏమయినప్పటికి యూరోపు పారిశ్రామిక వస్తూత్పత్తి, 1919లో ప్రపంచ వస్తూత్పత్తి, యుద్ధానికిపూర్వం సంఖ్యకంటే తక్కువ.

పారిశ్రామికోత్పత్తిపై ప్రథమ యుద్ధఫలితాలు (1913-100)

| | 1919 |
|---|---|
| యూరోపులోని యుద్ధంలో దిగిన దేశాలు | 33 |
| యూరోపులోని తటస్థ దేశాలు | 99 |
| సోవియట్‌తోపాటు యూరోపు | 66 |
| అమెరికాతోపాటు యూరోపుకుచెందని ఇతర దేశాలు | 114 |
| ప్రపంచం | 90 |

మరి రెండవ యుద్ధంలో ఉత్పత్తి అభివృద్ధి ఇందుకు వ్యతిరేకంగా సాగింది. ధనికరాజ్యాలలోని ఉత్పత్తియంత్రం పూర్తిగా ఆకాలంలో పనిచేయడం లేదు. ఒక్క జర్మనీ జపానులలో మాత్రం ఆయుధోత్పత్తి జోరుగా సాగుతున్నది. కాబట్టి అక్కడి స్థితివేరు. ఇందువల్ల ఆంగ్లోశాక్సన్ దేశాలు రెండోయుద్ధంలో ప్రవేశించే సమయంలో తమ ఉత్పత్తి యంత్రమంతా పనిచేయడంలేదు. ఇక దీర్ఘరోగంలా నిరుద్యోగం వదలకుండా పట్టుకొని ఉన్నది. నిరుద్యోగుల సంఖ్య లక్షలు దాటింది.

ఇంతేకాక, యుద్ధతంత్ర పద్ధతులుకూడ మారినవి. రెండు యుద్ధాలలోకూడ ముఖ్య రణరంగం యూరోపుకే పరిమితమైనది. రెండవ యుద్ధంలో సోవియట్ యూనియన్‌లోని యూరోపియన్ రాష్ట్రాలలో వినాశంచాలయెక్కువ. ఇదిప్పుడుపూర్వంలా వ్యావసాయిక ప్రాంతంకాదు-బ్రిటన్‌ను మించిపోయిన ఉత్పత్తిశక్తికల పారిశ్రామిక ప్రాంతం. ఆంగ్లో అమెరికన్ విమానదాడుల ఫలితంగా ఎన్నోపట్టణాలు, పారిశ్రామిక జిల్లాలు విధ్వంసమయ్యాక, జర్మనీలోనే రెండోయుద్ధం ఆఖరురోజుల్లో యుద్ధం జరిగింది. ఈ దఫా పరోక్షంగానేకాక, ప్రత్యక్షంగా కూడ

పారిశ్రామికోత్పత్తి తీవ్రంగా దెబ్బతిన్నది. పారిశ్రామిక విధ్వంసనం, పారిశ్రామిక ఉత్పత్తిశక్తిని నులిమివేయడం వీనిద్వారా యుద్ధానికిఉత్పత్తి బలియయిపోయినది,

ఈసారి యుద్ధంమూలంగా విధ్వంసనం అధికపరిమయినప్పటికి, బ్రిటన్‌లోను. అమెరికాలోను అంతకంటె ఎక్కువగా ఉత్పత్తిపెరిగినది. మరి మొదటియుద్ధంలోనేమో యూరోపు భూఖండంలోలాగే బ్రిటన్‌లో కూడ ఉత్పత్తి తగ్గిపోయినది. రెండవతూరి పరిస్థితివేరు. బ్రిటన్, 1921 తర్వాత మొట్టమొదటిసారిగా విపరీతంగా పెరిగిపోతున్న నిరుద్యోగాన్ని తగ్గించుకోగలిగినది, తనకున్న ఉత్పత్తిశక్తిని పూర్తిగా వినియోగించుకోగలిగినది. ఉత్పత్తిలో బాగా పనికివచ్చే వయసులోనున్నవారిని 50 లక్షల మందిని సైన్యంలోనికి సమీకరించినప్పటికి, యుద్ధకాలమంతటిలోను, బ్రిటిష్ పారిశ్రామిక వస్తూత్పత్తి, యుద్ధానికి పూర్వసంవత్సరంలో కంటెను, శాంతి సమయంలో బాగా ఉత్పత్తి జరిగిందన్న సంవత్సరాలలో కంటెను చాల అధికంగా ఉన్నది,

ఈస్థితి అమెరికాలో మరింత స్పష్టంగా కనిపిస్తుంది. ఆదేశం యుద్ధప్రత్యక్ష విధ్వంసనానికి గురికాలేదు. ఒక్కరోజుకూడ ఆదేశభూమిపై యుద్ధం జరగలేదు. ఒక్క బాంబుకూడ అక్కడపడలేదు. పైగా యుద్ధప్రారంభంలో అమెరికాలో నిరుద్యోగులసంఖ్య అత్యధికంగా ఉన్నది. మూలబడిన ఉత్పత్తి యంత్రాలు చాల ఉన్నవి. ఇదిగాక యుద్ధంలో తాను చేరకమునుపూ, చేరినతర్వాతా కూడ, అక్కడ కొత్త ఫాక్టరీలు నిర్మింపబడినవి.

మొదటిప్రపంచ యుద్ధసమయంలో కూడ, అమెరికా ఉత్పత్తి, శాంతి సమయంలోకంటె అధికంగా ఉన్నదికాని, అప్పుడు ఉత్పత్తి

సామగ్రి పూర్తిగా ఉపయోగింపబడినది. అంత యెక్కువగా నిరుద్యోగం కూడలేదు. కాబట్టి ఉత్పత్తి ఆధిక్యత అంతముఖ్యం కాదు. ఇదికాక ఆరోజుల్లో ప్రపంచోత్పత్తిలో అమెరికావాలు చెప్పుకోదగినంతలేదు. ఇందువల్ల మొదటి యుద్ధకాలంలోను, అమెరికా ఉత్పత్తి పెరుగుదల, అంతవరకు వస్తే యూరప్‌లోకాక ఇతర దేశాలన్నిటిలోని ఉత్పత్తి పెరుగుదల యూరోపులోని ఉత్పత్తి తరుగుదలకంటె తక్కువే.

ఈసారి పరిస్థితివేరు. అమెరికా ఉత్పత్తి పెరుగుదల అనంతం. అందుతోపాటు అమెరికాకు ప్రపంచోత్పత్తిలోని భాగం చాల యెక్కువ. యుద్ధానికిముందే కావలసినంత పెరిగింది. కాబట్టే యూరోపుభూఖండ మంతటిలోను, ఆశియాలోను ఉత్పత్తిలో వచ్చిన తరుగుదలను పూర్తిగా సర్దుకోపోగలంత యెక్కువగా అమెరికా ఉత్పత్తి పెరిగినది. ఇందువల్లనే మొదటియుద్ధం కంటె ఈ రెండవయుద్ధం యూరోపును మరింత విధ్వంసనం చేసినప్పటికి, ప్రపంచ వస్తూత్పత్తిమట్టుకు పెరగనే పెరిగింది. అమెరికాకు, యూరోపుకు మధ్య ఈ అభివృద్ధిలో కనబడే అసమానతను అంతకంటె స్పష్టంగా మరేదీ చూపలేదు.

సైనికనష్టాలలో కూడ ఈ అసమానత కనిపిస్తుంది. ఈ నష్టాలు మొదటియుద్ధంలో చేరిన అన్ని దేశాలలోను సమానంగా లేకపోయినప్పటికీ, ప్రధానమైన యూరోపు పారిశ్రామిక రాజ్యాలలో దాదాపు సమానమే. రెండవయుద్ధంలో పరాజయం పొందడంవల్ల ఫ్రెంచివారినష్టాలు మిగత వారితో పోలిస్తే తక్కువ. జననష్టం 200,000 మాత్రమే. మరి జర్మనీ రష్యాలేమో, మొదటి యుద్ధంలోకంటె ఈసారి యెక్కువ నష్టపడినవి. ఇంకా ఖచ్చితమైన సంఖ్యలు దొరకడం లేదు. మరీ తక్కువ అంచనావేసినా జర్మనీ జననష్టం 30 లక్షలు—రష్యా జననష్టం మరింత యెక్కువ.

రష్యా-జర్మన్ యుద్ధం ప్రారంభమయ్యాక దాదాపు మూడేండ్లకు గాని ఆంగ్లో శాక్సన్-రాజ్యాలు పశ్చిమరంగాన్ని ఆరంభించకుండా గడప గలిగారన్నందువల్లనే, వీరి నష్టాలు రష్యాతో పోల్చిచూస్తే, తక్కువని బోధపడుతుంది. 1915-18లో కంటె, ఈసారి బ్రిటిష్ చావులు నాలుగో వంతుమాత్రమే ఎక్కువ.* అప్పటికంటె ఈతూరి అమెరికా జననష్టం ఎక్కువే. కాని బ్రిటిషు నష్టాలు, అలాగే రష్యా నష్టాలు సంగతి అలా ఉంచి, జర్మనీతో పోల్చిచూచినప్పటికి చాల తక్కువే. †

* "ఉత్తమ యంత్రాలతో జరిగిన యుద్ధంలో బ్రిటిష్ సైనికుల చావులు 2,33,000 మాత్రమే—1914-18లో జననష్టం 8,12,000 గాయపడినవారి సంఖ్యకు చచ్చినవారి సంఖ్యకు 2:1నిష్పత్తిలెక్కన కట్టుకుంటే 27,6000 మాత్రమే 1:1కంటె కొంచెం ఎక్కువగా 1939-45లో గాయపడ్డారు." ఎకానమిస్టు, లండన్, జులై 21, 1945

† అమెరికా సేన మొదటియుద్ధంలో నష్టాలు:

| | |
|---|---|
| చచ్చినవారు | 37,569 |
| గాయాలతో చచ్చినవారు | 12,942 |
| రోగాలతో చచ్చినవారు | 62,670 |
| యాదృచ్ఛిక మరణాలు వగైరా | 6,776 |
| ప్రాణాయపాయకరంకాని గాయాలు పొందినవారు | 193,663 |
| ఖైదీలుగా పట్టుబడ్డవారు | 4,416 |

రెండవ యుద్ధంలో భూసముద్రసైన్యాలు రెండిటా, అమెరికా జననష్టం—2,95,867 (న్యూయార్కు టైమ్సు, గురువారం మే 9, 1946) యుద్ధశాఖ ప్రచురించిన సారాంశం ప్రకారం—సైన్యం నష్టాలు 9,484,18-ఇందులో మృతులు, క్షతగాత్రులు, ఖైదీలు,పోవడి తెలియనివారు కలిసి—నౌకాదళం, మారైన్‌కోర్, కోస్టుగార్డుకలిసి—నష్టాలు 1,48,775. దాదాపు 3 లక్షలమంది చనిపోయారనుకుంటే, జర్మనీ మొత్తం నష్టంలో నూటికి పదోవంతు మాత్రమే నన్నమాట.

మరి రెండవ యుద్ధంలో అమెరికా స్థితి ఇతర దేశాలకంటె వేరన్నది మనం జ్ఞాపకముంచుకోవడం చాల ముఖ్యం. నేటి ప్రపంచ పరిస్థితిలోని విపరీతమేమిటంటే, తాత్కాలికంగానైనాసరే ప్రధాన దేశాల మధ్య-ముఖ్యంగా అమెరికా తదితర దేశాలమధ్య అఖాతం పెరిగిపోవడంతో ఈ ప్రపంచ చరిత్రశకం ప్రారంభమయింది.

ఇక ఈప్రధానాంశాల సారాంశం చూదాము. యూరోపు భూఖండంలోను, ఆసియాలోను ఉత్పత్తి బాగా తగ్గిపోయింది. పారిశ్రామిక యంత్రాది సాధనాలు, పట్టణాలు కూడ చాల విధ్వంసం పాలయ్యాయి. గ్రేట్‌బ్రిటన్‌లో ఉత్పత్తి కాస్త యెక్కువయింది. కాని ద్రవ్యస్థాయి బాగా దుర్బలపడినది. మరి అమెరికాలో ఇందుకు భిన్నంగా ఉత్పత్తి విపరీతంగా పెరిగింది. ఉత్పత్తిశక్తి హెచ్చింది. అత్యల్పకాలంలో ఇవిరెండూ బాగా పెనవేసుకున్నవి.

యుద్ధకాలంలో ప్రపంచమంతటా, జనాభా వస్తువినియోగం చాల తగ్గిపోయింది. యుద్ధ విధ్వంసనానంతరం ఎన్నోయేళ్ల తర్వాత కాని, ప్రజల వస్తువినియోజనశక్తి యుద్ధ పూర్వస్థితికిరాదు. మరి అమెరికాలో అలాకాక, ఉత్పత్తి అంత మరీఅధికంగా పెరిగింది కాబట్టి, యుద్ధావసర వస్తూత్పత్తి ఎంత బ్రహ్మాండంగా సాగినప్పటికి, పౌరోపయోగ వస్తువులను గట్టిగా కట్టుదిట్టాలు చేయవలసిన అవసరం లేకపోయింది. ఇక యుద్ధానంతరం ఇప్పుడు—ప్రజలు పూర్వంకంటె బాగా ఉండేట్టు పరిస్థితులను సర్దడంలోనే కష్టమంతా ఉన్నది.

ప్రపంచమంతటా యుద్ధ విధ్వంసనం దారుణంగా కొనసాగింది. కాని మహాసముద్రాలిప్పటికీ అమెరికాకు పెట్టనికోటలుగా కావలి కాస్తున్నవి. యుద్ధావసర వస్తూత్పత్తివరకే అమెరికా ప్రజలు యుద్ధాన్ని

రుచి చూచారు. గొప్ప త్యాగాలను వారు చేయవలసిరాలేదు. అమెరికా భూమిపై యుద్ధం సాగలేదు. బాంబింగుకూడ జరగలేదు.

అమెరికా జననష్టం అతిస్వల్పం, మరి యూరోపు ఆశియా జననష్టం అత్యధికం.

కాని మరొక యుద్ధంవస్తే ఈ ముఖ్య విభేదాలన్నీ మాయం కాగలవు. కేవలం మాటల్లో కాక వాస్తవంగా అది అమెరికాకు కూడ సర్వాంగ సంపూర్ణమైన యుద్ధమవుతుంది. మరి రెండవ యుద్ధంలో ఇందుకు తగిన అనుభవాన్ని మాత్రం అమెరికాప్రజలు గడించలేదు.

రెండవ ప్రపంచయుద్ధంలో అమెరికాస్థితి మినహాయింపు వంటిది. భావికాలంలో అది ఇక పునస్సృష్టనమివ్వదు.

145

ఆయిదో అధ్యాయం

# అమెరికాలో రానున్న సంక్షోభం

మనమింతవరకు, 1929 ఆర్థిక సంక్షోభంగూర్చి, రెండవయుద్ధం వరకు జరిగిన కాలంగూర్చి పరిశీలించాము. అందులోనే ఆ యుగానికి చెందిన ఆర్థిక పరిస్థితినంతటిని, ప్రపంచోత్పత్తి క్రమాన్ని, ప్రపంచ వాణిజ్యాన్ని! ప్రపంచ నిరుద్యోగాన్ని పరీక్షించాము.

ఈ ప్రపంచ ఆర్థికాభ్యుదయ యుగం అంతటిలోను, ధనికవిధాన పరిధిలో జరిగినంతవరకు అమెరికా ఒక్క రాజ్యంమాత్రమే—అదిచాల ప్రధానమైనదే కావచ్చు—కాని, అది యెన్నోదేశాలలో—జర్మనీ. బ్రిటన్, ఫ్రాన్సు, జపాను, ఇటలీ, ఇలావరస—ఇదీ ఒక్కటే. ఇక రానున్న సంక్షోభానికి కారణాలైన అంశాలను గురించి వివరించేటప్పుడు అమెరికాకు మరింత ప్రాముఖ్యమివ్వాలి. కారణం నేడది ఇతరధనిక రాజ్యాలన్నిటిలో ఒకటికాదు—అదే అసలు ధనికరాజ్యం. ప్రస్తుతం, ఇతర ప్రపంచమంతటిలోకంటె అమెరికాలో పారిశ్రామిక వస్తూత్పత్తి ఎక్కువ. పెట్టుబడిదారీ పద్ధతిలో జరుగుతున్నంతవరకు, మిగత అన్నిచోట్లకంటె అమెరికాలో ఈ ఉత్పత్తి అత్యధికం. రెండవయుద్ధం ముగిసిన వెంటనే మాత్రమే ఇలా జరగలేదు; రానున్న సంక్షోభయుగమంతటా పరిస్థితిఇలాగే ఉంటుంది. కాబట్టి అమెరికా పరిస్థితిని వివరించడమంటే ఒక ప్రధాన రాజ్యపరిస్థితిని వివరిస్తున్నామని మాత్రమే అర్థంకాదు, నిర్ణాయకమైన దేశాన్ని పరిశీలిస్తున్నామన్నమాట.

ప్రపంచోత్పత్తిలో అమెరికాస్థానం

నూరేళ్లుగా, అమెరికాలోని వస్తూత్పత్తి, మిగత ప్రపంచమంత టిలోకంటె అతివేగంగా అభివృద్ధి చెందుతున్నది. 1860 న ప్రపంచో త్పత్తిలో బ్రిటన్ ఫ్రాన్సులతర్వాత, అమెరికా మూడవస్థానాన్ని ఆక్రమిం చింది. 1870 లో బ్రిటన్ తర్వాత రెండవస్థాన మాక్రమించింది. 1880 కల్లా బ్రిటన్నుకూడ వెనకవేసింది. అప్పటినుంచి అమెరికాయే అగ్రేస రంగా ఉన్నది. 1860 నుండి ఆ శతాబ్ది ఆఖరుదాకా పరిస్థితెలావుందో ఇంచుమించు ఈ క్రిందిపట్టిక తెలుపుతున్నది:

ఉత్పన్నవస్తువుల వెలనుబట్టి
ప్రధాన పారిశ్రామిక దేశాలస్థానాలు *

| 1860 | 1870 | 1880 | 1890 | 1900 |
|---|---|---|---|---|
| గ్రేటు బ్రిటన్ | గ్రే. బ్రిటన్ | అమెరికా | అమెరికా | అమెరికా |
| ఫ్రాన్సు | అమెరికా | బ్రిటన్ | బ్రిటన్ | జర్మనీ |
| అమెరికా | ఫ్రాన్సు | జర్మనీ | జర్మనీ | బ్రిటన్ |
| జర్మనీ | జర్మనీ | ఫ్రాన్సు | ఫ్రాన్సు | ఫ్రాన్సు |

మొదటి యుద్ధానికిముందు, ప్రపంచోత్పత్తిలో అమెరికా భాగం మూడోవంతు—35% వంతుదాకా—ఉన్నది. యూరపియన్ దేశాలన్నిటి భాగం 53% వంతులున్నది.• మొదటియుద్ధం ముగిసినకాలంలో అమె

* Institut fuer Konjunkturforchung, Berlin, 1933, Sonderheft 31, Die Industriewirtschaft, P. 18

• అదే పుస్తకం పుట 19

రికా ఉత్పత్తి పెరుగుతున్నే వచ్చినది. 1928 కల్లా ఉత్పత్తి మొత్తం, యూరోపులోని మొత్తం ఉత్పత్తికంటె హెచ్చినది. మొత్తం ప్రపంచోత్పత్తిలో నూటికి 45 కు లెక్కింపబడినది. జర్మనీది 12 వంతులు: బ్రిటన్‌ది 9 వంతులు—దాదాపు; ఫ్రాన్సుది ఇంచుమించు 7 వంతులు; • అంటే తనకంటె రెండవ తరగతికి చెందిన ముఖ్య పారిశ్రామిక దేశాలు మూడింటిలోకంటె 60 వంతు లెక్కువ వస్తువులను అమెరికా ఉత్పత్తి చేసిన దన్నమాట.

అమెరికా ఉత్పత్తి 1929 సంక్షోభం రాగానే ఒక్క జర్మనీని మినహాయిస్తే, అన్నిచోట్లకంటె చాలతక్కువకు పడిపోయింది. 1932లో ప్రపంచోత్పత్తిలో అమెరికావంతు 34.4%కు పడిపోయింది.* సంక్షోభం తీవ్రతరమైన ఏళ్లకూ, రెండోయుద్ధ ప్రారంభానికీ మధ్యే తిరిగీ తన పూర్వ స్థితికి అమెరికా రాలేకపోయినది.

రెండవయుద్ధ ప్రారంభంనుండి, ముఖ్యంగా తాను యుద్ధంలో దిగినప్పటినుండి అమెరికా పారిశ్రామిక వస్తూత్పత్తి ఎలా పెరిగినదో పరిశీలింతాము. "యుద్ధానంతరం మార్కెట్టులు" † అనే విచారణ, అమె

---

• అదే. పుట 42. ఈసంఖ్యలు అమెరికావారిచ్చే లెక్కలతో సరిపోతున్నవి. చూ. యుద్ధానంతరం విదేశ వర్తకం—ఆగస్టు మాఫ్రీ-హాల్ బి. లారీ, ఆర్థికమాల నెం 28 (1943 అక్టో.) "డాలర్ విలువలలో లెక్కవేస్తే ప్రపంచోత్పత్తిలో దాదాపు సగందాకా (అమెరికా ఉత్పత్తి) ఉన్నది." పుట 3 అమెరికా వాణిజ్యశాఖ విదేశీ స్వదేశీ వాణిజ్యాల బ్యూరో.

* పై పుస్తకం—పుట 42

† యుద్ధానంతరం—మార్కెట్టులు స్వదేశ విదేశ వాణిజ్యసమితి అధికార సమాచారంపై తయారుచేసినది. పబ్లిక్ అఫేర్సుప్రెస్, వాషింగ్టన్, డి. సి., పుటలు 2-3

రిగా ఉత్పత్తి రెండో యుద్ధసమయంలో ఎలా జరిగిందో వివరిస్తుంది. ఈ అత్యధికోత్పత్తి, మనిషి ఉత్పత్తిశక్తి పెరగడంమీద ఎంతవరకు ఆధారపడినదో, మనుషుల సంఖ్య ఎక్కువ కావడంమీద ఎంతవరకు ఆధారపడినదో, ఈ విచారణ ప్రత్యేకించి వివరిస్తుంది.*

"అంతకుముందటి సంవత్సరా లన్నిటిలోకంటె, 1940 లో చాల వస్తువులను అమెరికా ఉత్పత్తి చేసింది. అయినప్పటికీ, ఉన్న మనుష్యబలగం అంతటిలోను 460 లక్షలమంది మాత్రమే పనులలో నున్నారు. 90లక్షలమంది నిరుద్యోగులుగా నున్నారు.... ఈ నిరుద్యోగుల సంఖ్యతోబాటు ఉద్యోగంలో ఉన్నవారిలో లక్షలమంది, చిన్నచిన్న పొలాలలోను అలాంటి ఇతరమైన చిన్నచిన్న పనులలోను ఎలాగో బతుకుతున్నారు.

"1929 లో కంటె తక్కువ జనం, తక్కువ కాలం పనిచేసి 1940లో వస్తువుల నెక్కువగా ఉత్పత్తిచేశారు. ఇందుకు ఒక కారణం ఎక్కువ శ్రమపడకుండా బాగా ఉత్పత్తిచేయ వీలయ్యే పద్ధతుల నెక్కువగా ఉపయోగించడం. జనాభా పెరగడం మూలంగా, పనులు కావలసినవారి సంఖ్య హెచ్చినది. వారి కందరికి పని దొరకక నిరుద్యోగులుగా ఉండిపోవలసి వచ్చినది. ఇందుతోపాటు మనఉత్పత్తిశక్తికి అనుగుణంగా, మన వినియోగశక్తికి తగ్గట్టుగా వాణిజ్యం పెరగలేదు....

"ఈ ఉత్పత్తిశక్తి వరుసగా పెరుగుతునే వస్తున్నది. 1940 కి 1946 మధ్యఉన్న కార్మికుల సంఖ్యకు మరో 25 లక్షల మంది చేర్చబడతారు. జనాభాలో పనిచేయగల వయసువచ్చే వారి అంచనానుబట్టి ఈ మాటంటున్నాను. ఇందులో ఆ వయసు వచ్చినవారిలో

కొందరు ఎక్కువకాలం చదవడం, త్వరలో విశ్రాంతి పుచ్చుకోవడం వేపు మ్రొగ్గుతారన్న సంగతిని గమనించే ఆలెక్క ఇవ్వబడినది. ఇంకొకటి, యుద్ధాత్పూర్వం ఉద్యోగంలో లేకుండా, యుద్ధంలో మటుకు ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలు యుద్ధంముగిశాక తిరిగి ఉద్యోగాల కాశించరు; యుద్ధానికి పూర్వం 5 లక్షలమంది సైన్యంలో ఉంటే 20 లక్షలమంది యుద్ధసమయంలో ఉంటారు-ఈ సంగతిని పై లెక్క వేయడంలో గమనించడం జరిగింది.

"నిరుద్యోగుల సంఖ్య అత్యల్పమనుకుంటే 20 లక్షలుంటుంవని అనుకున్నట్టయితే, 1940 కీ 1946 కీ మధ్య ఉద్యోగాల పెరుగుదల దాదాపు 1 కోటి....1929 నుండి 1941 దాకా 12 ఏళ్ళలోను, ఉద్యోగంలోనున్న ఒకమనిషి ఒకగంటలో చేసేఉత్పత్తి నూటికి 34 పంతులు పెరిగినది. ఇది కలిపితే, ఏటా 2 1/2% రావాలి. క్రిందటి ముప్ఫైయేళ్ళలో ఇంతమాత్రం లాభం వస్తూనే ఉండిన దనేందుకు రావలసినంత సాక్ష్యమున్నది- ఇది యుద్ధంలో పెరిగేందుకే అవకాశమున్నది కాని, తరిగే అవకాశా లేమీలేవు. మనిషి ఒకగంటలో చేయగల ఉత్పత్తి ఎక్కువయినది కాబట్టిన్నీ, కార్మికులు 1940 లో పని చేసినంతకాలం రోజుకు పనిచేస్తారనుకుంటే, ఉన్న కార్మికుల శక్తిసామర్థ్యాలు 1940 కంటె, 1946 లో సగం యెక్కువవుతుందన్నమాట. ఈ ఉత్పత్తికి డాలరువిలువ కట్టాలంటే, అది ఆనాటి ధరలమీద ఆధారపడి ఉంటుంది. 1946 ధరల్లో, జాతీయోత్పత్తి విలువ 14,200 కోట్ల డాలర్లు, 1940 లో 9,700 కోట్ల డాలర్లు. 1942 ధరలో ఉత్పత్తి విలువ 16,500 లక్షల డాలర్లు....

"1943 లో ఉత్పత్తి అయిన వస్తువుల మొత్తం, 1940 లో కంటె సగం యెక్కువ. యుద్ధం ముగిసేముందు, ఈ ఉత్పత్తి ఆధిక్యత 50% కంటె ఎక్కువయినది."

ఈ వాణిజ్యశాఖవారి అంచనా ఇతరుల ద్వారాకూడ సరైనదేనని తెలుస్తున్నది. సైమన్ కుజ్నెట్సు ఇలా రాశాడు. "ముడిసరుకుల ధరంలో మార్పులకు అనుగుణంగా సర్దుబాటు చేసినప్పటికి,....1939 నుండి 1943 నాటికి నూటికి యాభై వంతులు పెరిగినది" *

ఉత్పత్తిలో 50 వంతుల ఆధిక్యం మూలంగా, యూరోపు ఆశియాలలో యుద్ధ విధ్వంసనం జరక్కపోయి ఉండినా, ప్రపంచోత్పత్తిలో అమెరికాభాగం ఎక్కువయి ఉండేది. ఏమయినప్పటికి, 1929 కి ముందటి అభివృద్ధిదశలో కంటె ఈ ఉత్పత్తి ఎక్కువ. అప్పటిరోజుల్లో కేవలం ప్రపంచోత్పత్తిలో 40 లేక 50 వంతులవరకే అమెరికా ఉత్పత్తి ఉండినది.

ఏమైనా, నేటి ప్రపంచోత్పత్తి, ధనిక ప్రపంచోత్పత్తికి మారురూపంకాదు. మొత్తం ప్రపంచోత్పత్తిలో నాలుగోవంతునుండి, మూడో వంతుదాకా, ధనికవిధానానికి చెందినరీతులలో సాగుతున్నది. కాబట్టి. ప్రపంచోత్పత్తిలో ధనికవిధానా న్ననుసరించి నంతవరకు, అమెరికా ఉత్పత్తి మొత్తంలో 2/3 కంటె, చాల తక్కువగా లెక్కవేయవచ్చును. మరొకవిధంగా చెప్పవలసివస్తే, ఉత్పత్తిశక్తిని పూర్తిగా ఉపయోగించినట్టయితే అమెరికా వస్తూత్పత్తి మిగత ధనికప్రపంచం ఉత్పత్తికంటె రెండింతలెక్కువ,

* సైమన్ కుజ్నెట్సు, యుద్ధకాలంలో జాతీయోత్పత్తి, ఆర్థిక పరిశోధక జాతీయసమితి, న్యూయార్కు. 1945, పుట 65.

ఈ లెక్కలన్నిటిని పరిశీలించినప్పుడు, అమెరికా కేవలం ఒక ముఖ్యాంశం మాత్రమేకాక, రానున్న సంక్షోభంలో ప్రధానాంశమన్న మా సిద్ధాంతం ఋజువవుతున్నది.

సంక్షోభకారణాలు యుద్ధంమూలంగా బలపడినవి.

యుద్ధంలో అమెరికా ప్రవేశించేటప్పటికి- తాను ఉత్పత్తి చేసిన వస్తువులనెలా వదిలించుకోవాలా అన్నసమస్య ఇంకా తేలనేలేదు. శాంతి సమయ ప్రాతిపదికపై ఉత్పత్తిచేసిన వస్తువులను అమ్మేందుకు తగిన మార్కెట్టులు చూచుకోవడంకూడ అమెరికాకు కష్టతరమయినది. అంటే సంక్షోభం లోకంలో రాజుకుంటూ ఉండగా అమెరికా రెండో ప్రపంచ యుద్ధంలో ప్రవేశించింది,

ఉత్పత్తిశక్తి యుద్ధకాలంలో హెచ్చింది.

యుద్ధం జరుగుతున్నంతకాలం, మార్కెట్టులను వెదుక్కోవలసిన అవసరం లేకపోయింది. బ్రహ్మాండమైన ఆయుధసమీకరణ కార్యక్రమం మూలంగా ప్రభుత్వానికే ఉత్పత్తి అయిన వస్తువులలో సగం కావలసి వచ్చేవి. ఉత్పత్తి దారులందరికి వస్తువుల అమ్మకానికి భరోసా చిక్కింది.

ఆధునిక పారిశ్రామిక యుద్ధానికి కావలసినన్ని వస్తువుల నుత్పత్తి చేయవలసిరావడం, శాంతికాలంలో లాగా జనాభాకు కావలసిన నిత్యోపయుక్త వస్తువులను ఉత్పత్తి చేయవలసిరావడం వీనిమూలంగా పరిశ్రమలను బహుళంగా పెంచవలసి వచ్చినది. తన జనాభాకు కావలసిన వానిని

ఉత్పత్తిచేస్తూ. అత్యధికంగా ఆయుధోత్పత్తిని కూడ సాగించినదేశం—యుద్ధంలో చేరిన దేశాలలో అమెరికా ఒక్కటే. *

అప్పటికున్న ఉత్పత్తిశక్తిని సంపూర్ణంగా ఉపయోగంలోనికి తెచ్చి, నిరుద్యోగులుగా ఉంటూ వచ్చిన కోట్లకొలది కార్మికులను, లక్షలాది స్త్రీలను, యువకులను, వృద్ధులను కర్మాగారాలలోనికి తీసుకోవడం మాత్రమే చాలదు; అంతకుముందున్న ఉత్పత్తిసాధన సంపత్తిని విస్తృతపరుచుకోవడం కూడ అవసరమైనది. సైమన్ కుజ్నెట్సు అన్న మాట నిజం:— †

"రెండు యుద్ధాలకు మధ్యనున్న విభేదం నిర్మాణంలో కనిపిస్తుంది. 1914 కంటె సగానికి సగం 1918 నాటికి ఉత్పత్తి పడిపోయింది: 1939 నుండి 42 దాకా క్రమంగా పెరిగింది. 1943 లో మాత్రమే తగ్గింది."

మొదటి యుద్ధానికీ, నేటి పరిస్థితికి మధ్యనున్న విభేదం, ఇంతవరకు వివరించిన కారణాలన్నిటి మూలంగా, స్పష్టంగా కనిపిస్తున్నది. మొదటి యుద్ధానికి పూర్వం అమెరికా యంత్రసాధనాలు దాదాపు పూర్తిగా పని చేస్తుండినవి. మరిరెండో యుద్ధానికి పూర్వం స్థితి తద్ వ్యతిరేకమైనది. ఇక నిరుద్యోగం విపరీతంగా ఉన్నది. ఈ విషయమై కుజ్నెట్సు ఇలా వ్రాశారు.

---

* ధరలు మామూలుగా ఉంటాయన్న ఊహపై "పౌరులకు కావలసిన వస్తువులు 1939 లో 64,800 మిలియన్ డాలర్ల నుండి, 1943 లో 70,300 మిలియన్ డాలర్లకు పెరిగినవని కుజ్నెట్సు చెప్పినమాటపై ఇది ఆధారపడినది. —పుస్తకం క్రిందటి నోటులోనిదే.

† అదే—పుట 107

"1939 లో నిరుద్యోగుల సంఖ్య కోటి నాలుగులక్షలుగా— అంటే కొంచెం మించుమించు కార్మికుల సంఖ్యలో అయిదోవంతు —అంచనా వేయబడినది.... ఇంతగా నిరుద్యోగుల సంఖ్య ఈ దేశంలో 1914 న కనిపించదు." *

మొదటి యుద్ధకాలంలో అమెరికా ఉత్పత్తి కొద్దిగా మాత్రమే పెరిగినది; రెండో యుద్ధకాలంలో విపరీతంగా పెరిగినది. కుజ్నెట్సు ఇలా వ్రాశారు:

"సాలుసరి లెక్కలనుబట్టి, నెలసరి అంచనాలను బట్టికూడ, మొదటియుద్ధం నాటికంటె, రెండో యుద్ధకాలంలో జాతీయోత్పత్తి మూడింతలవరకు పెరిగింది." †

మొదటి యుద్ధకాలంలో ఆయుధోత్పత్తి నూటికి 29పాళ్లు అధ్యధికంగా ఉన్నదన్నమాట. మరి రెండో యుద్ధంలో అది 44 వంతులదాకా పెరిగిందని కుజ్నెట్స్ రాస్తున్నారు.* ఇంత ఆయుధోత్పత్తి జరుగుతున్నప్పటికి, ప్రజోపయోగ వస్తువుల ఉత్పత్తి కూడ పెరిగినది. ఇందుకు కారణం యంత్రాగారాల అభివృద్ధి. రెండవ యుద్ధంలో పెరిగినంతగా ఉత్పత్తి, అమెరికా చరిత్రలో మరెన్నడూ పెరగలేదు. కుజ్నెట్సు ఇలా వ్రాశాడు:

"ఇందుమూలంగా మనమొక నిర్ధారణకు రావచ్చును........ జాతీయోత్పత్తి అసలు విలువ ఒకే విధంగా బాగా పెరుగుతూ రావడం యుద్ధకాలమంతా కనిపిస్తుంది. ఇది ఆరేళ్లనుంచీ ఇలాగే

---

* అదే—పుట 101. † అదే—పుట 99.

* అదే—124 పుట.

కొనసాగుతున్నది. కాబట్టి ఇది మనదేశపు ఆధునికచరిత్రలో అతి విశిష్టమైన విజయం." *

. సారాంశమిది: యుద్ధానికి ముందు పదేళ్లుగా కొన్ని పరిశ్రమలు మూలబడి ఉన్నవి. ఆ స్థితిలో అమెరికా యుద్ధంలో ప్రవేశించింది. ఈ పరిశ్రమల నుపయోగించడమేకాక, మరికొంత కొత్త ఉత్పత్తి సాధన సంపత్తిని నిర్మించడం జరిగింది. యుద్ధం ముగిశాక, ఈ అసంఖ్యాక వస్తువులకు మార్కెట్టు చూచుకోవడం అవసరమవుతున్నది.

ఇదీ సంగ్రహంగా అమెరికా అసలుసమస్య. తప్పుడు సామ్యాలు, గాలినినాదాలతో ఈ సమస్యను కప్పిపుచ్చి లాభంలేదు. ఏదో మహా సంతృప్తితో ఫరావాలేదని చెప్పడం చాల ప్రమాదకరం. "ఎందు కంత కంగారు? వందయేళ్లుగా ధనికవిధానం క్రింది ఉత్పత్తిలో హెచ్చుతగ్గులు కనిపిస్తూనేఉన్నవి; అభ్యుదయదశ వెనకే సంక్షోభదశ వస్తున్నది. సంక్షోభ దశ తర్వాత అభ్యుదయదశ వస్తున్నది. నేటి అభ్యుదయదశ తర్వాత క్లిష్ట పరిస్థితి రాకతప్పదనుకోండి, కానీ తర్వాత తిరిగీ మంచిస్థితి రానేవస్తుంది కదా!" అని సాగదీసి లాభంలేదు.

ఇలాంటి అడియాసలు 1929 ఆర్థిక సంక్షోభంలో అన్నిచోట్లా వినిపించేవి. కాని నిజాని కాదుర్దశ తర్వాత అభ్యుదయదశ రాలేదు. రెండో యుద్ధం వచ్చేదాకా ఆ సంక్షోభదశ అలాగే ఉన్నది. పైగా సంక్షోభానికి కారణాలైన ఉత్పత్తి సాధనాల పెంపుదల మరింత యెక్కువైనది. మరి మార్కెట్టు పరిస్థితిమటుకు, యుద్ధానికి ముందటికాలంలోకంటె ఇప్పుడేమీ బాగుపడలేదు. విదేశ వ్యాపారం సంగతి మొదట పరిశీలింతాము.

---

* అదే-పుట 59

ఉత్పత్తికి తగినట్టు మార్కెట్టు విస్తారం కాలేదు.

మొదటియుద్ధం జరిగే సమయానికి, ప్రపంచంలోని ధనికవిధాన విస్తరీకరణ అంతమయ్యే స్థితికివచ్చింది. తర్వాత అత్యల్పంగామాత్రమే అది పెరిగింది.

అమెరికాలోకూడ ఇలాంటి అభివృద్ధే జరిగింది. స్వదేశం సరిహద్దులలోనే విస్తరిస్తూవచ్చిన అమెరికావిధానం వ్యాప్తికూడ అంత్యస్థితికి వచ్చింది. దానికి సరిపడేట్టు బాహ్యవ్యాప్తి జరగలేదు. 1929 సంక్షోభ కాలమంతటా అమెరికా ధనికవిధానం తనదేశంలో పెరగలేదు. అప్పటి నుంచీ—ఇంతవరకూ ఇకమీదకూడా ఈ పరిస్థితి మారుతుందనే సూచన లేవీ లేవు.

ఇప్పుడో ప్రశ్న వస్తున్నది: 19 శతాబ్ది మధ్యనుండి మొట్టమొదటి ప్రపంచ యుద్ధందాకా జరిగినకాలంలో, ఇతర పెద్ద పారిశ్రామిక దేశాలకు కొత్తమార్కెట్లు చాలబలం చేకూర్చాయి. ఇప్పుడుకూడ కొత్తమార్కెట్లు అమెరికాకు అలాంటి బలాన్ని చేకూర్చగలవా? అమెరికాలో మరో కొత్త పరిశ్రమాభివృద్ధి బ్రహ్మాండంగా కొనసాగి, ప్రపంచాన్నంతటిని ముంచి వేయగలదా? అమెరికా పెట్టుబడి, పారిశ్రామిక ఎగుమతులు, వెనుకబడిన దేశాలలోనికి ప్రవహించగలవా? తద్వారా లేబర్‌మార్కెట్టులో విక్రేతలకు అనుకూల పరిస్థితి ఏర్పడగలదా? నిరుద్యోగ నిర్మూలనం, జీతాల హెచ్చింపు, స్వదేశీ విదేశీ మార్కెట్టుల విస్తరీకరణం తద్వారా ఏర్పడగలవా?

పరిశ్రమల అభివృద్ధి అమెరికాలో పెరిగి ఇతర దేశాలకు కూడ వ్యాపించవచ్చును. కాని పూర్వం బ్రిటన్‌లోలాగా తద్వారా అమెరికా ఆర్థికవ్యవస్థ ఇందుతో మార్పుచెందగల దనుకోవడం అసాధ్యమని చెప్ప వచ్చును.

స్వదేశీ మార్కెట్టుతో పోలిస్తే, అమెరికా విదేశ వర్తకం అత్యల్పం

ఇందుకు కారణమేమిటి? పూర్వం ధనికవిధానం దిగ్విజయయాత్ర సాగించినప్పుడు, ఇతర యూరోపు పారిశ్రామిక దేశాలలోలాగా విదేశ వర్తకం, అమెరికా ఆర్థికవ్యవస్థలో ఉన్నతపాత్ర వహించడం లేదు.

ఉత్పత్తి మొత్తం తీసుకున్నప్పుడు విదేశ వర్తకం అమెరికాలో అత్యల్పపాత్ర నిర్వర్తిస్తున్నది. దాగా విదేశ వర్తకం అమెరికాలో పెంపొందినది 1929 లో. ఆ సంవత్సరం ప్రపంచ విదేశ వర్తకంలో అమెరికావంతు 13.84% మాత్రమే. బ్రిటనువంతు 13.05. మరి అమెరికా ఉత్పత్తిచూస్తే బ్రిటనుకంటె దాదాపు నాలుగింత లెక్కువ.* బ్రిటనుతో పోల్చిచూచినప్పుడు మాత్రమేకాదు, అసలే అమెరికా విదేశ వర్తకం చాల తక్కువ. 1929 ఆర్థిక సంక్షోభానికి ముందు, జర్మనీ ఫ్రాన్సుల ఉత్పత్తి మొత్తంకంటె అమెరికా ఉత్పత్తి రెండింత లెక్కువ. మరి ఆ రెండుదేశాల విదేశ వర్తకమేమో, ఎగుమతి దిగుమతులు రెండిటా కూడ, అమెరికాకంటె ఎక్కువ.

విదేశ వర్తకం బాగా జరిగిందన్న కాలంలోకూడ, మొత్తం ఉత్పత్తిలో ఎగుమతులు నూటికి పదివంతులకంటె ఎన్నడూ హెచ్చులేదు. మామూలుగా 5-8 వంతులమధ్య ఉంటూవచ్చినవి. ప్రపంచ వర్తకంలో ఇంత అల్పభాగం మూలంగా అమెరికా కొక ప్రత్యేకత ఏర్పడినది. బ్రహ్మాండంగా పెరిగిపోయిన ఉత్పత్తి సాధన సంపత్తికి, ఉత్పత్తికి తగినన్ని అనుకూలాలను కొత్తమార్కెట్టులు కల్పించగలవా అనేవిషయ విచారణకు, మనకిది ప్రాతిపదిక అన్నమాట.

---

* నానాజాతిసమితి 1937 విదేశ వర్తకం సింహావలోకనం. జినీవా, 1938 పుట 25.

భవిష్యత్తులో అమెరికా విదేశవర్తకాన్ని ఎంతవరకు పెంపొం దించుకోగలదు ? అమెరికా ఎగుమతులు—ఇందులో 80 వంతులు అరువుకౌలుకు చెందినవి. 1944 లో 14,065 మిలియన్ల డాలర్లకు పెరిగినవి. ఇతర సంవత్సరాలతో పోలిస్తే 1943 లో 12,714 మిలియన్ డాలర్లు; 1917 లో 6234 మిలియన్ డాలర్లు—ఈ సంవత్సరం మొదటి యుద్ధకాలంలోకల్లా బాగా ఎగుమతులు జరిగిన సంవత్సరం. ఇక1913కు ముందు చాలబాగా ఎగుమతులున్న సంవత్సరం 1920 లో, వీని విలువ 8,228 మిలియన్ డాలర్లు. అరువుకవులు క్రిందమాత్రమే 1944 లో ఎగుమతుల విలువ 11,287 మిలియన్ డాలర్లు.

పూర్వం ఎగుమతుల స్థితితో పోలిస్తే 1944 నాటి 14,065 మిలియన్ డాలర్ల విలువగల ఎగుమతులు చాల అధికమైన వనడం నిస్సంశయం. నేటి ప్రపంచ వాణిజ్యం మొత్తంలో పోల్చిచూచినా ఇది అధికమే. కాని ఇంతయినా అమెరికా ఉత్పత్తిలో ఇది పదోవంతుకూడ కాదు, ఇందులో నూటికి 80 వంతులు అరువుకవులుకు చెందినవి. అంటే ఈ ఎగుమతులు డబ్బువచ్చేవి కాదన్నమాట. మరి వీనితో చేర్చినా పై మొత్తం సంఖ్యకూడ చాలతక్కువే. పూర్వం ఇతర పెద్ద పారిశ్రామిక దేశాల విదేశవర్తకం ఇంత తక్కువగాలేదు.

అరువుకవులు విధానం రద్దయ్యాక, ఈ మాత్రం కూడ శాంతి సమయంలో ఉంటుందని నమ్మేందుకు వీలున్నదా ? అంటే ఈమాత్రం ఎప్పటికీ తగ్గకుండా ఉంటుందని చెప్పగలమా ? ఇదిచాల ప్రధానమైన సమస్య. ఎందుకంటే, సంధియుగంలో యుద్ధవిధ్వస్తదేశాల పునర్నిర్మాణానికై ఎక్కువ ఎగుమతులు చేయడం జరగవచ్చు. కాని అది మనకంత ప్రధానాంశం కాదు. మనప్రశ్న యేమంటే—అరువుకవులు మూలంగా

హెచ్చిన 1944 నాటి ఎగుమతి విలువ అలాగే శాశ్వతంగా ఉండగలదా అని ఆమాటను ఏ ఆర్థిక విచారణవేత్తా చెప్పలేకపోతున్నాడు—ప్రభుత్వ వాణిజ్యశాఖవారి అంచనా ప్రకారం ఎగుమతుల విలువ 7,000మిలియన్ డాలర్లు.* మరికొందరి అంచనా ప్రకారం దీనివిలువ 10,000మిలియన్ డాలర్లు. మరీ ఆశావాదులైనవారు 12 వేల మిలియన్లదాకా ఈసంఖ్యను కొనిపోతున్నారు. కాని ఈ సంఖ్యలన్నీకూడ 1944 నాటి సంఖ్యకంటె చాల దిగువనే ఉన్నవి; బాగా ఆశావాది అయినవాడు కూడ, అమెరికా తన ఉత్పత్తిశక్తిని పూరా ఉపయోగిస్తే, అందులో విదేశవర్తకం పదో వంతుకంటె చాల తక్కువలో ఉంటుందనే అంచనా వేస్తున్నాడు.

అలాంటప్పుడు మొత్తం ఉత్పత్తిలో ఎగుమతులు పదోవంతు కంటె చాల తక్కువలో ఉంటాయనే నా స్వంత అభిప్రాయం.

దీనికి కారణాలేమిటి ? ప్రపంచం యావత్తూ పారిశ్రామికం కావడం ద్వారా అమెరికా ఎగుమతుల విలువలు బాగా హెచ్చవచ్చును గదా. తద్వారా లేబర్ మార్కెట్టులో అనుకూలపరిస్థితి ఏర్పడి, స్వదేశ వర్తకంతోపాటు ఆర్థికవ్యవస్థలో అనుకూలస్థితి ఎందుకేర్పడరాదు ?

ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో పరిశ్రమలను పెంపొందించేందుకు, అమెరికా ఇప్పుడు ప్రయత్నించవచ్చును. అయినా మనమిప్పుడు కేవలం సాధారణ వైఖరులను గురించి ఆలోచించడం లేదు. తన ఉత్పత్తి ఇంత పెరిగింది కదా—మరి అమెరికా ఎగుమతు లిందుకు తగినట్టు పెరగగలవా?—ఇదే మన ఖచ్చితమైన ప్రశ్న.

---

* యుద్ధానంతరం మార్కెట్లు—పుట 5.

చైనా, ఆసియా, సోవియట్ యూనియన్లతో
వర్తకానికి అమెరికాకున్న అవకాశాలు

అమెరికా తన దేశానికి కావలసిన వస్తువులకంటె అత్యధికంగా ఉత్పత్తి చేయగలదు. ఈ ఉత్పత్తిని ఇతర దేశాలలో అమెరికా వస్తువులకున్న గిరాకీకి తగినట్టుగా హెచ్చించ వీలవుతుందా? అలా అయితే అమెరికాలోని పరిశ్రమలు మూలబడవలసిన అవసరంలేదు. పైగాపైగత ప్రపంచంలో మునుపెన్నడూ లేనంతగొప్పగా పరిశ్రమలను పెంచేందుకూ వీలవుతుంది. ఇదిసాధ్యం కాదా?

ఇలా జరిగితే చాలమంచిదే. కాని ఈ ఊహలో చాల పొరపాట్లున్నవి. ప్రపంచంలోని అనేకదేశాలు పారిశ్రామికంగా చాల వెనుకబడి ఉన్నవి. ఆదేశాల జనాభా జీవనస్థాయి అతి హీనస్థితిలోనున్నది. కాబట్టి ఈ దేశాలలోని పరిశ్రమల నిర్మాణం అమెరికాకు వచ్చే సంక్షోభంలో గొప్ప సహాయకారి కాజాలదు.

యుద్ధానంతరం పారిశ్రామిక—ఎగుమతులు కొత్తశకాన్ని నిర్మించవలసివస్తే, అవి వెళ్ళవలసిన తావులు వలసదేశాలు, అర్ధవలసదేశాలు, అర్ధస్వతంత్ర దేశాలున్నూ; అంటే ఇక పాత సామ్రాజ్యవాద వలస విధానం పూర్వంలా సాగడం అసాధ్యమవుతుంది. రెండుయుద్ధాల మధ్య కాలంలో ఏర్పడిన స్తబ్ధతపోయి, కొత్తగా పరిశ్రమలవ్యాప్తి ఆరంభమవుతుంది. అయితే, వందయేళ్ళుగా సామ్రాజ్యవాద పాలనలో, ఈ దేశాలలో జీవనస్థాయి అతి హీనస్థితిలో ఉండి, పరిశ్రమల పెరుగుదల మరీ తక్కువగా జరిగింది కాబట్టి, అభివృద్ధికున్న అవకాశాలు చాల తక్కువన్నమాట నిజం. కాబట్టి ఈ దేశాలలో పరిశ్రమల అభివృద్ధి ఆరంభమయినప్పటికి, తనకున్న బ్రహ్మాండమైన ఉత్పాదన శక్తినిబట్టి చూస్తే, అమెరికా కాట్టే ఆర్థికంగా గొప్ప అనుకూల్యం ఏర్పడదు.

ఈ మాటలోని నిజా నిజాలను అరికెలను బట్టి పరిశీలింతాము. సంక్షోభం వచ్చేందుకు క్రిందటి సంవత్సరం 1929 లో, సోవియట్ యూనియన్‌ను మినహాయిస్తే, ఆశియా మొత్తం దిగుమతుల విలువ కేవలం 4,679 మిలియన్ డాలర్లు. ఇందులో 995,300,000 జపాను దిగుమతు లిందులో చేరినవి, జపానును వదిలివేస్తే మిగత ఆశియా దిగుమతుల విలువ 3,683 మిలియన్ డాలర్లు మాత్రమే. అదే సంవత్సరం ప్రపంచం దిగుమతుల మొత్తం విలువ 35,595 మిలియన్ డాలర్లు. అంటే ప్రపంచం మొత్తం దిగుమతులలో దాదాపు పదోవంతు— 3,683 మిలియన్ డాలర్లు విలువగల వస్తువులనుమాత్రమే ప్రపంచంలోని సగం జనాభా—100 కోట్ల ప్రజలు దిగుమతి చేసుకుంటారన్నమాట.*

ఈ లెక్కలుకూడ, బాగా అభ్యుదయవంతమైన సంవత్సరానికి చెందినవన్న సంగతి జ్ఞాపకముంచుకోవాలి.

ఆసియా మొత్తంయిది పరిస్థితే, చైనాకుకూడ అన్వయిస్తుంది. చైనాలో రాజకీయంగా ఇబ్బందులేర్పడగలవన్న అంశాన్ని వాదంకోసం మనమిక్కడ వదిలిపెడదాము. ఇంతలో చైనాలో అంతర్యుద్ధం రాదని, స్థిరమైన కేంద్ర ప్రభుత్వం ఏర్పడి పెద్దపెద్ద పారిశ్రామిక ప్రణాళికలను కొనసాగిస్తుందని ఊహింతాము. భూస్వామ్యవిధానాన్ని క్రమంగా వైదొలగించుకుంటూ, వస్తారనుకుందాము. అంతేకాక ఆ కేంద్ర ప్రభుత్వం అమెరికా ఎగుమతులపై చాల ఆదుర్దా చూపుతుందని, ఈ విషయమై అమెరికాతో రాజీ కుదుర్చుకొని. అందుకు కావలసిన పెట్టుబడిని కూడ అమెరికానుండి తెప్పించుకుంటుందని ఆశింతాము.

* నానాజాతిసమితి లెక్కల పంచాంగం—1938-39 పుట 219.

ఇన్నిటిని మనం అనుకున్నప్పుడు, మనం వట్టి నిరాశావాదులమని యెవ్వరూ అనలేరు. ఇప్పుడు మరొక టనుకుందాము : చైనా దిగుమతులు (1929లో వానివిలువ 662,900,000) *అత్యనుకూలంగా, వచ్చే అయి దేళ్లలో పెరుగుతాయి. అవి మూడింత లెక్కువై ఏటా 200 మిలియన్ డాలర్ల విలువకురావచ్చు. అందులో అమెరికానుంచి వచ్చేవే సగంవరకూ ఉంటాయి అని అనుకుందాము. ఇవన్నీ ఖచ్చితంగా జరిగితే, అప్పటికి చైనాకు అమెరికా పంపే ఎగుమతుల విలువ సాలుసరి 1000 మిలియన్ డాలర్లు కాగలదు. పూర్వం చైనాకు పంపిన ఎగుమతులనుబట్టిచూస్తే ఇది చాల ఎక్కువే. 1921—25ల మధ్య వీనివిలువ సగటున 104 మిలియన్ డాలర్లు 1926-30లమధ్య 109మిలియన్ డాలర్లు. (1939: 55,600,000 డాలర్లు; 1940లో: 78 మిలియన్ డాలర్లు) † అంటే మరి పైన అనుకున్న మేరకు 1000మిలియన్ల డాలర్లకు ఎగుమతులు పెరిగితే అది మహా అధికమన్నమాట.........బాగా సమృద్ధంగాఉన్న 1929 కంటె పదింత లెక్కువన్నమాట. అంతేగాక మొత్తం అమెరికా ఎగుమతులలో లెక్కకువచ్చే మొత్తమే ఇంతఅయినప్పటికి, ఇది అమెరికా ఆర్థికవ్యవస్థకు సత్ఫలితా లివ్వగలిగినంత మొత్తంకాదు. రెండోయుద్ధం ముందటికంటె, అమెరికా ఉత్పత్తియంత్రం నేడు 40 వేలమిలియన్ల డాలర్ల విలువగల వస్తువులను, అధికంగా ఉత్పత్తి చేయగలదు. ఇందుతో పోలిస్తే పై ఆధిక్యత ఒక లెక్కలోనిదికాదు. ఈ చిన్న ఉదాహరణద్వారా, ఈ సమస్య యెంతపెద్దదో బోధపడుతుంది.

---

* నానాజాతిసమితి లెక్కల పంచాంగం, 1938-39, 210 పుట

† అమెరికా లెక్కలబుక్కు, 1942, పుట 560

మిగత ఆసియా సంగతేమిటి? సామ్రాజ్యవాదుల చేతులలోనున్న మిగత వలసప్రాంతాల సంగతేమిటి? చైనా విషయంలో మేముఉదహరించిన లెక్కలు సిద్ధాంతరీత్యా వీని విషయంలోనూ సరిపడగలవు.

1929లో అర్ధస్వతంత్ర దేశాలైన ఇరాను, సయాము, ఫిలిప్పైన్సు ఇతరబ్రిటిష్,ఫ్రెంచి, డచ్చి వలసదేశాలు కలిసి, తెప్పించుకున్న దిగుమతుల విలువ 3000 మిలియన్ డాలర్లు. * తిరిగీ ఈ మంచిస్థితి రావాలన్నా కొంతకాలంపడుతుంది, ఈస్థితి త్వరలోనే వస్తుందనుకుందాము. అప్పటికి పరిశ్రమలవ్యాప్తిప్రాతిపదికపై1929కంటె,50% పెరుగుతాయనుకుందాము. (1929లో 1500 మిలియన్ డాలర్లు). ఇందులో 2/3 అమెరికాయే పంపుతుంది అనుకుందాము. అప్పుడు చైనా జపానులను మినహాయించి, మిగత ఆసియాకంతటికీ, అమెరికా ఎగుమతుల విలువ 1000 మిలియన్ డాలర్లు పెరుగుతుంది. ఇదేమంతతక్కువమొత్తం కాదు. కాని ఇదికూడ అమెరికాఉత్పత్తితో పోలిస్తే చాలతక్కువే.

ఇంతమాత్రం జరిగినప్పటికి, అమెరికా ఎగుమతులు చాలవరకు పెరగగలవు. 1926-30 లలో ఆసియాకు అమెరికా ఎగుమతులు కేవలం 573,085,000 డాలర్లు. ఇందులో జపానుకు పంపిన వాని విలువ 246.036.000డాలర్లు. చైనాకుపంపిన వానివిలువ 109,021,000డాలర్లు. అంటే ఈసమయంలో అమెరికా ఆసియాకు పంపిన ఎగుమతులు (చైనా జపానులుతప్ప) సాలుసరి సగటున 250 మిలియన్ డాలర్లు. † స్వల్పమొత్తం మనం జ్ఞాపకం ఉంచుకుంటే, దీనివల్ల కలగబొయ్యే పెద్ద మార్పేమీ ఉండదని మనకు బోధపడుతుంది.

---

* అదే—పుట 219

† అదే—పుట 219

ఇక సోవియట్ యూనియన్‌కు అమెరికా ఎగుమతుల సంగతేమిటి? వాదంకోసం ఇక్కడకూడా, రాజకీయమైన చిక్కుల నన్నిటిని వదిలిపెట్టి, వట్టి ఆర్థిక సౌకర్యాలే ఈ ఎగుమతులను నిర్ధరిస్తాయనుకుందాము. యుద్ధం వల్ల కలిగిన భీభత్సాన్ని సరిజేసుకుని, ఆర్థిక పునర్నిర్మిర్మాణం చకచకా సాగించుకునేందుకు, సోవియట్ యూనియన్‌కు చాల భారీవస్తువులు దిగుమతి చేసుకోవడం అవసరమనుకుందాము, కాని ఆ అవసరం చాలకాలం ఉండదు. యుద్ధోత్పత్తి, శాంతికాలపు ఉత్పత్తులమధ్యే సంధియుగంలో మాత్రమే ఇది అవసరమవుతుంది. మన కీర్రాలమేకాదు, అసలు రానున్న దశఅంతా, ఆలోచనీయాంశం. యుద్ధానంతరం పునర్నిర్మాణం దశతర్వాత రష్యా చాల పారిశ్రామిక వస్తువులను దిగుమతి చేసుకోవలసి ఉంటుంది—ముఖ్యంగా క్లిష్టతరమైన భారీయంత్రాలను తెప్పించుకోవలసి ఉంటుంది. ఈ అవసరాలు తీర్చుకునేందుకు, రష్యా ప్రభుత్వం యూరోపునుండి, బ్రిటన్‌నుండి, కనడానుండి, అమెరికానుండి వానిని తెప్పించుకునేందుకు ప్రయత్నిస్తుంది. కొన్ని ప్రత్యేకించి రష్యాకు కావలసివస్తాయి. వానిలో ఎగుమతులకు మరింత అనుకూల పరిస్థితి ఏర్పడవచ్చును. కాని ఇవికూడ, అమెరికా ఉత్పత్తితో పోలిస్తే చెప్పుకోదగినంత ఉండవు.

యుద్ధానికిముందు, సోవియట్ దిగుమతుల గూర్చిన అంకెలివి: *

| | | |
|---|---|---|
| 1934............ | 119,600.000 | డాలర్లు. |
| 1935............ | 124.200,000 | ,, |
| 1936............ | 158,900,000 | ,, |
| 1937............ | 151,400,000 | ,, |
| 1938............ | 154,600,000 | ,, |
| ఇక 1929 లో.... | 453,200,000 | ,, |

* అదే—పుట 219

యుద్ధానంతర పునర్నిర్మాణకార్యక్రమం ముగిసినతర్వాత కూడ, సోవియట్ యూనియన్ దిగుమతులు 1934-38 స్థాయిలో—1929 నాటికంటె దాదాపు రెండింతలెక్కువే ఉంటాయనుకున్నట్టయితే, అప్పటికి వానిమొత్తం దాదాపు 1000 మిలియన్ డాలర్లు కాగలదు.

యుద్ధానంతరం అమెరికా, సోవియట్ రష్యా దిగుమతులలో సగం తానే పంపుతుందనుకుందాము. సంధితర్వాతనే అన్నది గమనించండి. అప్పుడు అమెరికా ఎగుమతులు ఏటాసగటున 500 మిలియన్ డాలర్లవుతుంది. పూర్వపు లెక్కలతో పోలిస్తే ఇదిచాల యెక్కువే. 1926—30 వరకు వాని సగటులెక్క 77,666,000 డాలర్లు: 1931—35 మధ్య 33,022.000 డాలర్లు. కాని ఇదికూడ అమెరికా ఉత్పాదన శక్తిదృష్ట్యా చాలతక్కువే, అందులో శతాంశమన్నమాట.

## యూరోపుతో అమెరికా వర్తకం

పైనాకు, ఆశియాకంతటికి, సోవియట్ యూనియన్‌కు అమెరికా దిగుమతులు విపరీతంగా పెరుగుతాయని అనుకున్నాము. కాని, యూరోపు విషయంలో కూడ ఇలాగే ఊహించగలమా అన్నది సందేహమే. యుద్ధ వినష్టదేశాల పునర్నిర్మాణానికై మిత్రరాజ్య సంస్థ పంపేఎగుమతుల విషయమై మనం మాట్లాడ్డంలేదు—అవి డబ్బువచ్చేవి కావు. మొదట పెట్టుబడిని ఎగుమతి చేసినప్పటికి, ఇందుతోపాటు పంపే అమెరికా ఎగుమతులను గూర్చే ఇప్పుడు మాట్లాడుతున్నాను. వీనికెప్పుడో ఒకప్పుడు డబ్బు వచ్చితీరుతుందన్నమాట. ఇలా అమెరికా ఎగుమతులు యూరోపుకు అధికంగా వెళ్ళాలంటే, ఆభాగం యుద్ధనష్టాలను త్వరగా పూడ్చుకొని, త్వరగా 1920నాటి అభ్యుదయదశ నందుకోవాలి. రానున్న సంక్షోభదశలో ఇలాంటిదేదీ జరగదని రెండుపరిస్థితులు మనకు తెలియజేస్తున్నవి.

ఒకటి—యూరోపు భూఖండంలో గొప్ప పారిశ్రామిక దేశమైన జర్మనీ విషయమై అమెరికా, బ్రిటన్, సోవియట్ యూనియన్లు ఒక నిర్ధారణకు వచ్చాయి—జర్మనీవారి శ్రామికశక్తి చాలవరకు తగ్గించాలని నిశ్చయించుకున్నాయి. ఇలాంటి విధానం దీర్ఘకాలం సాధ్యమవుతుందా? అలాంటి విధానాన్నే అనుసరిస్తారా లేదా అన్న విషయమై మనమిక్కడ చర్చించ నవసరంలేదు. ఒకటిమాత్రం నిజం. నేడు జర్మనీ పారిశ్రామికోత్పత్తి అతిహీనస్థితిలో నున్నది. ఎన్ని అనుకూలపరిస్థితులు సమకూడినప్పటికి, దాగా సంక్షోభం చెలరేగిన 1932 నాటిస్థాయి నందుకోవాలన్నప్పటికి చాలకాలం పడుతుంది. దీని ఫలితంగా పూర్వం జర్మనీ పరిశ్రమలకు చెందిన ఎగుమతులు దామాషామేరకు అమెరికాకు కూడ లభిస్తాయి. ఇక జర్మనీ చిన్నమార్కెట్టుగా మాత్రమే ఉపయోగపడుతుంది. పైగా యూరోపు గుండెకాయలాంటి జర్మనీలో పరిశ్రమలను తగ్గించడం వల్ల, మిగత యూరోపు ఆర్థికవ్యవస్థలో అనుకూల పరిస్థితులేర్పడి, పునర్నిర్మాణ కార్యక్రమం కొంత వెనుకబడవచ్చును,

రెండు—యూరోపు భూఖండమంతటా సాంఘికవిద్వేషాలు పెచ్చుపెరిగి ఉన్నవి. ఈ ధోరణి, యుద్ధం ముగిసినంతనే ఆగేదికాదు. ఈయుద్ధానంతరదశలో ఒక్క యూరపియన్ భూభాగంలోని దేశంలోకూడ ధనికవిధానం భద్రతగలదిగా లేదు. ధనికవిధానాన్ని పూర్తిగా నిర్మూలించేందుకు, కనీసం తీవ్రమైన మార్పులిందులో తీసుకొని వచ్చేందుకు, పోరాటమప్పుడే ఆరంభమై సాగుతున్నది. ఒక్కమాటలో యూరోపు, సాంఘికంగా మారుతున్నదశలో నున్నదన్నమాట.

యూరోపుఆర్థికవ్యవస్థ మరింత పెంపొందించాలంటే ఆవిషయంపై ఈ పోరాట ఫలితాలు తప్పకపడగలవు. ఈ పోరాటాలు ఆఖరుదశకు

వస్తేతప్ప, యూరోపు ఆర్థిక అభివృద్ధి చెప్పుకోదగినంత జరగదు. మరి ఆ పోరాటాలు ముగింపు కాగలవన్న ఆశలేమీలేవు.

వీటన్నిటిమూలంగా 1929 స్థాయికి ఇంతలో అమెరికా. యూరోపుకు ఎగుమతులు చేయలేదని పై కారణాలన్నిటివల్ల తేల్చుకోవచ్చును.

1926-30లమధ్య యూరోపుకు అమెరికా ఏటా పంపిన యెగుమతుల విలువ 2,236,501,000 డాలర్లు. అదేసమయంలో అమెరికా గ్రేట్ బ్రిటన్‌కు పంపిన ఎగుమతుల విలువ 837,219.000డాలర్లు; సోవియట్ యూనియన్‌కు పంపిన అమెరికా ఎగుమతుల విలువ77,666,000డాలర్లు ఇలా సగటున యూరోపుకు పంపిన అమెరికా ఎగుమతుల విలువ 1300 మిలియన్ డాలర్లు. లాటిన్ అమెరికాకు చేసిన ఎగుమతుల విలువ 851,035,000 డాలర్లు-అంటే ఇంతకంటె యూరోపుకు చేసిన ఎగుమతు రెక్కువ. ఆసియాకు పంపిన ఎగుమతులు (వానిసంఖ్య 573,085,000 డాలర్లు), ఆఫ్రికాకు పంపిన ఎగుమతులు (109,596.000 డాలర్లు.) రెండింటిని కలిపిన సంఖ్యకంటె దాదాపు రెట్టింపుగా యూరోపుకు పంపిన ఎగుమతుల విలువ కనబడుతున్నది.*

ఇక మిగత చిన్న దేశాలను గూర్చి వివరంగా మనం చర్చించ నవసరంలేదు. ఈదేశాలకు పంపే ఎగుమతులుకూడ బాగా హెచ్చగలవని భావించినప్పటికి వచ్చే గొప్ప మార్పేమీ ఉండదు. మొదటి ధనికవిధాన ప్రగతిదశలో బ్రిటన్‌లో మొదలైనవాని ఉత్పత్తికీ, ఎగుమతులకూ మధ్యనున్న దామాషా అమెరికాకు సరిపడదు. ఎగుమతులు చాల తక్కువగానే ఉండిపోగలవు.

---

*అమెరికా లెక్కల అబ్‌స్ట్రాక్టు 1942, పుట 564-66

అమెరికా ఉత్పత్తికీ—ఎగుమతులకూ మధ్యనున్న తారతమ్యం

మిగత దేశాలకు పంపే ఎగుమతులను కూడ ఇందులో మనం చేర్చుకోవచ్చును. కాని ఫలితం ఒక్కటే. 1929 లో ప్రపంచం దిగుమతుల మొత్తం 35, 595 మిలియన్ డాలర్లు. అమెరికాను మినహాయిస్తే* 31,256 మిలియన్ డాలర్లు. అయితే రెండోయుద్ధంలో అమెరికా ఉత్పత్తి 40,000 మిలియన్ డాలర్లనుండి 50,000 డాలర్లదాకా పెరిగింది. పూర్వం బాగా అభ్యుదయవంతమనుకునే 1929లో (అమెరికాను విడిచి), ప్రపంచ దిగుమతులన్నిటిని కలిపిన మొత్తంకంటె 1 1/2 ఇంత ఎక్కువన్నమాట.

ప్రపంచోత్పత్తిలో గ్రేట్‌బ్రిటన్‌భాగం ఇటీవల దాదాపు 10వంతులు. అమెరికా ఉత్పత్తితోపోలిస్తే బ్రిటన్ ఉత్పత్తి చాల నెమ్మదిగా పెరిగింది. కాని ఇందులో నాలుగోవంతు ఎగుమతులకే. కాబట్టి ఏ కొంచెం పెరుగుదలకూడ ఆదేశపు ఆర్థిక వ్యవస్థపై సత్‌ఫలితాల నిస్తూ వస్తుంది. మరి ప్రపంచోత్పత్తిలో అమెరికాభాగం 1929లోకూడ నూటికి 40 వంతులు. మరి అమెరికా ఉత్పత్తి యావత్తులోను ఎగుమతులు 5-8 వంతుల మధ్యమాత్రమే. ఈలోగా ఆ ఉత్పత్తేమో నూటికి యాభై వంతులు పెరిగింది. ఇంకొకవిధంగా చెప్పవలసివస్తే, ప్రపంచంలో సగంవంతు పారిశ్రామిక వస్తువులను ఉత్పత్తి చేస్తున్నప్పటికి, మరేయితర పారిశ్రామిక దేశంకంటె తక్కువగా ఏ కొద్దిపాటో విదేశ వర్తకం కల అమెరికా ఆర్థికవ్యవస్థలో ఈ అనంతోత్పత్తి ఆధిక్యం ఏర్పడింది.

ఈ ఆధిక్యానికి తగినట్టు, కొత్త మార్కెట్టులను ఏర్పరచుకోవాలంటే, 1928-29 కంటె 5000 మిలియన్ డాలర్లు మాత్రం ఎగుమతుల

* నానాజాతిసమితి లెక్కలు -1938-39 పుట 219

విలువ పెరిగితే చాలదు. 1500 మంది 20000 మిలియన్ డాలర్ల దాకా పెరగాలి. పెట్టుబడి ఎగుమతుల ప్రాతిపదికపై ఏళ్ళకొలది ఎగుమతుల నిలువలను సమకూర్చాలి. మిగత ప్రపంచ పరిస్థితిని గమనించినట్లయితే అటువంటి అవకాశా లేమీలేవు. అదివట్టి గాలికబురు మాత్రమే కాగలదు. కాబట్టి ఉత్పత్తికి తగినంత పెద్దయెత్తున కొత్తమార్కెట్ల ఏర్పాటు ఈ దశలో సాధ్యపడదు.*

ఇంతవరకూ అమెరికా తానుత్పత్తిచేసిన సరుకులో నూటికి 90 వంతులు స్వంతమార్కెట్టులోనే చెల్లుపెడుతున్నది. ఇప్పుడున్న విధంగా నడవాలన్నా విదేశవర్తకం బాగా పెరగాలి. ఏమైనప్పటికి అమెరికా ఆర్థిక వ్యవస్థలో, ప్రతిష్టంభనకు ఒక్క విదేశ వర్తకమే నిర్ణాయకం ఎన్నటికీ కాదు. రానున్న సంక్షోభంలోకూడా అంతే.

## అమెరికా విదేశవర్తకం పెరిగితే ఇతర దేశాలతో ఆర్థికమైన చిక్కులు త్వరగా ఏర్పడగలవు

ఇంకొకవిధంగా చూస్తే, అమెరికాకు ఇతరదేశాలతో ఆర్థిక సంబంధా లేర్పడడంవల్ల, ధనికవిధానంలో సంక్షోభానికి దారితీసే పరిస్థితులు మరింత రెచ్చిపోవచ్చును. అమెరికా ఎగుమతి పరిశ్రమలు తప్పకుండా విదేశవర్తకం పెంచుకునేందుకు ప్రయత్నిస్తాయి. మార్కెట్టుల కోసం జరిగేపోరాటం తీవ్రరూపం తాలుస్తుంది. ఈ పోరాటంలో అమెరికాకున్న అనుకూలాలు రెండు; ప్రపంచంలోకల్లా బాగా అభివృద్ధిచెందిన

* ఇది అమెరికా ఆర్థిక వ్యవస్థకంతటికీ అనువర్తిస్తుంది. ముఖ్యంగా కొన్ని పరిశ్రమలకున్న స్వదేశ వర్తకావకాశాలు బహుకొద్దిగా ఉన్నవికాబట్టి, వానిలో సంక్షోభసూచనలు తొలగించుకోవాలంటే, విదేశవర్తకాన్ని పెంపొందించడం అత్యవసరం కూడా కాగలదు.

ఉత్పత్తి సాధనసంపత్తి ఒకటి; రెండు, పెట్టుబడిని ఎగుమతిచేసి తన విదేశవర్తక స్థితిని గట్టిపరుచుకోగలదు.

చరిత్రలో మొట్టమొదటిసారిగా బ్రిటన్ ఋణగ్రస్తదేశంగా మారింది. అమెరికాతో అప్పు తీసుకొవలసినస్థితికి వచ్చింది. ఇందుకు వడ్డీలు, కింతులువగైరా క్రీ.శ. 2000సంవత్సరందాకాఅచ్చుకోవలసిఉన్నది. యుద్ధానికి పూర్వపు జీవితస్థాయిని నిలుపుకోవాలంటే, ఎగుమతులునూటికి యాభైవంతులు పెరగాలని, బ్రిటిష్ ప్రభుత్వం అప్పు తీసుకునేముందు అంచనా వేసుకున్నది. ఇందుతోపాటు, వడ్డీ, కంతులు చెల్లించాలంటే, ఎగుమతులు 75 వంతులు పెరగాలి—వస్తూత్పత్తి రెండింతలు కావాలి. ఇదంతా, ప్రపంచంలోను, తన వలసలలోను అమెరికా పోటీ చేస్తుండగా జరగాలి. కాబట్టి ఇందుకవకాశాలు చాలతక్కువ. పైగా వ్యతిరేక సూచనలు చాల ఉన్నవి. బ్రిటన్‌తోపాటు ఇతరదేశాల ఎగుమతులు పెంపుదలమూలంగా తగ్గిపోగలవు.

తనదేశంలో సంక్షోభం తగ్గించుకునేందుకు సరిపడినంత కాకున్నా, ఇతరదేశాల ఎగుమతులను దెబ్బతీసేందుకు తగినంత అమెరికా యెగుమతులు పెరగగలవు. కాబట్టి అమెరికా విదేశవర్తకం ధనికవిధానంక్రింద ఉన్న ఇతర ప్రపంచంలో సంక్షోభాన్ని రెచ్చగొట్టగలదు.

## అమెరికా స్వదేశవర్తకం

మరీ మొదటికి వచ్చాము. 1929 సంక్షోభం, కొత్తమార్కెట్టులను విరివిగా ఏర్పరచవీలులేని సమయంలో రావడంవల్ల అతి తీవ్రరూపం తాల్చింది, రెండవయుద్ధం ఆరంభమయ్యేనాటికి ఈ సంక్షోభం పూర్తిగా తొలగిపోలేదు.

యుద్ధ సమయంలోను, తర్వాతను ఈ స్థితి మారలేదు. ఇకమీద కూడ కొత్తమార్కెట్టు లేర్పడినా ఈ స్థితి మారదు.

అమెరికాలో వర్తకావకాశా లెలాఉన్నవో ఇప్పుడు పరిశీలింతాము.

1929 నాటికంటె, 1940 నాటికంటే కూడ పెరిగిన ఉత్పత్తికి తగినన్ని మార్కెట్టులు కావాలన్నదే నేటి అమెరికా పెట్టుబడిదారుల నెదుర్కొంటున్న సమస్య. "తిరిగీ పూర్వస్థితి రావాలంటే మూడు కీలకాలు" అనే తననివేదికలో యుద్ధ సమీకరణ కార్యాలయకర్త జాన్ డబ్ల్యు స్నైడర్ ఇలా వ్రాశాడు:

"మన కర్మాగారాలను దాదాపు నూటికి యాభై వంతులు పెంచాము." ఇంత బ్రహ్మాండంగా పెరిగిన ఉత్పత్తివ్యవస్థను పూర్తిగా ఉపయోగించ వీలున్నదా? పనికావాలనే వారందరికీ ఉద్యోగమివ్వ వీలున్నదా?—ఇదీ నేటిప్రధాన సమస్య. అంటే యుద్ధంలో ప్రభుత్వావసరాలతో సమానంగా, నేడు స్వదేశ మార్కెట్టులో అమ్మకాని కవకాశమున్నదా? రెండో యుద్ధానికి ముందటికంటె, ఈ శాంతిసమయంలో అమెరికాలో అమ్మకం నూటికి యాభై వంతులు పెంచవీలున్నదా? అదే నివేదికలోనే, తమ లక్ష్యాన్ని అతి సంగ్రహంగా స్నైడర్ ఇలా తెలిపాడు: "ఉత్పత్తిలో కాని, ఉద్యోగాలలో కాని పాతస్థితికి పోయేందుకు మేము చూడ్డంలేదు. పూర్వపు శాంతికాలపు స్థాయికంటె నలభై యాభై వంతులెక్కువ ఉత్పత్తిని విస్తరింపజేసేందుకే మేము ప్రయత్నిస్తున్నాము."

## సంధియుగంలో అవకాశాలు

ఈ అంశాన్ని చర్చించేప్పుడు మనమొక సంగతిని గుర్తుంచుకోవాలి. ఇప్పటి సంధిదశకూ, ఈ పునర్నిర్మాణం పూర్తిఅయిన తర్వాతి సంధియుగానికీ ఉన్నభేదాన్ని జాగర్తగా గమనించాలి.

తాత్కాలికంగా, అమెరికా మార్కెట్టులో అమ్మకాన్ని పెంచే కారణాలు కొన్ని యుద్ధమూలంగా ఏర్పడినవి. ఇవి శాశ్వతమైనవి కావు కాబట్టి, తర్వాతిపరిస్థితిని రూపొందించడంలో ఇవంత ప్రాముఖ్యం వహించవు.

మొదటిదశలో స్వదేశ వర్తకాన్ని పెంచే కారణాలు రెండు: యుద్ధ కాలంలో ప్రజలవద్ద కాస్తోకూస్తో డబ్బు నిలవ ఉన్నది, రెండోది తమ వాంఛ లాకాలంలో తీరలేదు. జనాభా వస్తు వినియోగాన్ని పెంచిన దేశం యుద్ధకాలంలో ఒక్క అమెరికాయే. అయినప్పటికి. కావలసినవన్నీ ప్రజలకు అందజేశారని చెప్పలేము. అంతవరకూ నిరుద్యోగులుగానో, అత్యల్పం రాబడిగలవారుగనో ఉన్నవారు, కాస్త కడుపునిండా తినడం ఆరంభించారు. కాబట్టి వస్తూపయోగం అమెరికాలో ఎక్కువయినది.

అయినప్పటికి, ఆదాయం ఎక్కువయినంతగా వస్తు వినియోగం ఎక్కువ కాలేదు. యుద్ధకాలంలో కొన్నివస్తువుల ఉపయోగానికి వీలులేక పోయింది. కారణం, మోటారుకార్లు, రెఫ్రిజిరేటర్లు, ఇళ్లుకడిగే యంత్రాల లాంటి వానిఉత్పత్తి ఆరోజుల్లో అసలే ఆగిపోయింది. కాబట్టి యుద్ధ కాలంలో మిగుల్చుకొన్న డబ్బువల్లా, తాత్కాలికంగా వస్తున్న డబ్బువల్ల. ప్రజలు కొన్ని వస్తువుల కొనగలుగుతారు. ఈ అమ్మకంవల్ల అమెరికా యంత్ర పరిశ్రమలకు మేలుచేకూరుతుంది.

ఈ అనుకూల పరిస్థితి ఎంతకాలం ఉంటుందో చెప్పవీలులేదు. తమ నిలువలనిలా ప్రజలెంతకాలం ఖర్చుపెట్టగలరన్న అంశంపై అది ఆధారపడి ఉంటుంది. ఆర్థికవ్యవస్థ మొత్తంపై, ఈడబ్బు నిలవజేసుకున్న వారిలో, పేదలెలాంటి దృక్పథంతో ప్రవర్తిస్తారు అన్నదానిపై ఈ అమ్మకం ఆధారపడుతుంది. 1929 సంక్షోభం తర్వాతి తమ అనుభవాలు, పున

ర్నిర్మాణ దశలోని అనుభవాలు, వారికి బ్రహ్మాండమైన నిరుద్యోగం దేశంలో ఏర్పడనున్నదని జ్ఞాపకం తేవచ్చు. అలాంటప్పుడు కాస్త చేయిబిగించి. కష్టపురోజులకై ఉన్నదల్లా దాచుదామని భావిస్తారు. కాబట్టి యుద్ధ సంపాదనల నిలువలమూలంగా జరిగే అమ్మకం తగ్గిపోగలదు.

అలాకాక ఈ నిర్మాణదశ సంతృప్తికరంగా ఏ ఒడుదుడుకులు లేకుండా నడచినట్లయితే, భావిసంక్షోభాన్ని కూర్చి భయపడనవసరంలేదని ప్రజలకు నచ్చజెప్పగలిగేట్లయితే—నిరుద్యోగులకు పూర్వంకంటె ఎక్కువ సాయపడతామని చట్టాలు చేయడంద్వారా ఈ నమ్మకం కలిగించవచ్చును- అప్పుడు వారు తాము కూడబెట్టుకున్న డబ్బును స్వేచ్ఛగా ఉపయోగించి, తమ అవసర వస్తువులను కొంటారు. అప్పుడు స్వదేశంలో అమ్మకం మరింత అనుకూలధోరణికి రాగలుగుతుంది.

ఈ సంధిదశలో స్వదేశ వర్తకాన్ని పెంచగల మరొక సాధనం పెట్టుబడి పెట్టడం. రెండో యుద్ధానికిముందు, అమెరికా ఉత్పాదన శక్తిని పూర్తిగా ఉపయోగించలేదు. మరి యుద్ధకాలంలో చాల యంత్రాగారాలు నిర్మింపబడినవి. అయినప్పటికి దేశంలోని సగంఉత్పత్తి యుద్ధానికే వినియోగింపబడుతుండడంవల్ల, చాలపెట్టుబడులు అలాగే నిలిచిపోయినవి. దీనిఫలితంగా యంత్రాలను మార్చి కొత్తవాటిని స్థాపించడం జరగలేదు. పైగా పూర్వపుస్థితిలో ఉత్పత్తి వ్యవస్థను నిలిపేందుకు తగినంత పెట్టుబడి కూడపెట్టడం జరగలేదు. ఇంతేకాక మామూలుగాజరిగే నిర్మాణాదులు కూడ యుద్ధసమయంలో ఆగిపోయినవి.

ఇందువల్ల, మొదట్లో అనుబంధంగా పెట్టవలసిన పెట్టుబడి చాల ఉంటుంది. ఇందువల్ల సంక్షోభకారిక శక్తులను కొంతదూరం నెట్టగలగవచ్చును-పూర్తిగా వానిని పారద్రోలేశక్తి వీనికి లేదనుకొండి. యుద్ధకాల

సంపాదనలో కొంతభాగం రోజువారీ ఉపయోగింపబడుతుంది; మరి కొంత యుద్ధకాలంలో ఆగిపోయిన వానికి పెట్టుబడి పెట్టడంలో వినియోగింపబడుతుంది. ఇవి రెండూ తాత్కాలికమైనవేఅయినా, ఈ సంధి సమయంలో వినియోగవస్తువులయొక్క, ఉత్పాదక వస్తువులయొక్క అమ్మకం బ్రాస్త బలపడుతుంది. వాటిశక్తి అంతవరకే. ఇందులో ఒకటోది కాని, రెండోది కాని, రెండూ కలిపికాని, విపరీతంగా పెరిగిపోయిన అమెరికా ఉత్పన్న వస్తువులకు శాశ్వతమైన మార్కెట్టును సమకూర్చలేవు.

ఉత్పాదక, వినియోగశక్తుల మధ్య అఘాతం

అమ్మకం శాశ్వతంగా నూటికి యాభైపాళ్లు పెరగాలంటే, వస్తు వినియోగం కూడ శాశ్వతంగా యాభైపాళ్లు ఎక్కువకావాలి. అప్పుడే అమెరికా ఉత్పాదక యంత్రాలు పూర్తిగా ఉపయోగంలోకి రాగలవు. అప్పుడే కార్మికులందరికి పని దొరకగలదు. సంధిదశ దాటాక, వస్తు వినియోగం నూటికి యాభైవంతులు పెరిగే అవకాశమేమైనా ఉన్నదా? అలాంటి అవకాశం చాల తక్కువనేందుకే ఎక్కువ సూచనలు కనబడుతున్నవి.

ఎందుకో చూదాము. 1929 సంక్షోభ కాలంనుండి, యుద్ధం ఆరంభమయ్యేవరకూ, ఒకమనిషి పనిచేసేగంటలో అయ్యేఉత్పత్తి, 1929 స్థాయి కంటె తక్కువలోనున్నది. మరి వినియోగం మాత్రం అసలే ఏమాత్రం హెచ్చలేదు.

యుద్ధసమయంలో ఉత్పాదనశక్తి వరుసగా పెరుగుతూ వచ్చింది, అంతకుముందు పనిచేయకుండా ఉన్న యంత్రాదుల నుపయోగించడం వల్లను, ఉత్పాదనశక్తి పెరుగుదలవల్లనూ మొత్తం మీద ఉత్పత్తి అపారంగా పెరుగుటకు కారణమైనవి. యుద్ధాత్పూర్వం కంటె, నేడు

అమెరికా పరిశ్రమలు నూటికియాభై వంతులు తక్కువగా ఉత్పత్తి చేస్తున్న వంటే ఇందుకు కారణం మూడింటరెండువంతులు శ్రమయొక్క ఉత్పాదన శక్తి పెరగడం (అంటే ఒకగంటలో పూర్వం కార్మికుడు ఉత్పత్తిచేసే వస్తువులను, మరింత తక్కువ కాలంలో నేడు చేయగలుగుతున్నాడన్న మాట—అను.) మూడోవంతేమో కార్మికుల నెక్కువచేయడం కారణం.

పూర్వం ఉన్న యంత్రాలను పరిపూర్తిగా ఉపయోగించకపోవడం వల్ల ఉత్పత్తి అంతగా ఆ కొలదియేళ్లూ పెరిగింది. ఈ యాభై వంతుల పెరిగిన ఉత్పత్తికి యుద్ధావసరాలు, ప్రభుత్వం అమ్మకం కల్పించింది. శాంతిసమయంలో ప్రజలవస్తు వినియోగశక్తి సహజంగా పెరిగితే తప్ప, ఈ యంత్రాలను పూర్తిగా పనిచేయించే అవకాశముండదు. అంటే కార్మికుల ఉత్పాదనశక్తి యెక్కువైన దామాషాకు, కూలీల జీతాలు పెరగాలి. మరొకవిధంగా చెప్పాలంటే, యుద్ధానికి పూర్వంకంటె నూటికి 30-40 వంతులు జీతాలు పెరగాలి. * అంటే ఈ హెచ్చింపు వాస్తవమైన జీతాల పెరుగుదల కావాలి. కేవలం డాలర్లను హెచ్చిస్తే చాలదు. ఎందుకంటే యుద్ధపూర్వదశతో పోలిస్తే డాలరుకున్న కొనుగోలుశక్తి బాగా పడిపోయిందిప్పుడు.

ఆర్థికాధికారం పెద్దపెద్ద కార్పొరేషన్ల చేతులోనున్న అమెరికాలో, నిజమైన జీతాలు 30—40వంతులదాకా పెరిగే అవకాశమేమైనా ఉన్నదా అంటే ఉన్నదనిచెప్పే సాహసానికే రచయితా దిగలేదు. కార్మికులందరికి పని కల్పించడంద్వారా, ఉత్పాదక యంత్రసామగ్రిని పరిపూర్తిగా ఉపయోగించడంద్వారా భావిసంక్షోభాన్ని తప్పించుకునేరీతిగా, అమెరికా ఉత్పత్తి

---

* కార్మికుల ఉత్పాదకశక్తికి అనుగుణంగా పెంచిన సంఖ్యకాదిది. ఎందుకంటే అమెరికాలో యుద్ధానంతర సైనికవ్యయం-1929-39 మధ్యకాలంలో కంటె ఎన్నో మడుగు లెక్కువ.

వ్యవస్థను పునర్నిర్మించాలని వాదించే పుస్తకాలు చాలఉన్నవి. * ఇలా జరగాలంటే, వస్తువుల అమ్మకం నూటికి యాభై వంతులు పెరగాలని వారందరు గ్రహించారు. కాని ఈ గుత్తపెట్టుబడిదారీ సమాజ వ్యవస్థలో ఇదెలా సాధ్యపడగలదు? అసలు జీతాలు 30–40దాకా పెరగడమెలాగు? ఈ ప్రశ్నలకు సక్రమమైన సమాధానం రావడం లేదు. ఏదో అమెరికా ప్రజల్లో చాలమంది హీనస్థితిలో నున్నారని, ఎన్నో అవసరా లింకా తీరడం లేదని, కాబట్టి అమ్మకం, ఇంకా బాగా పెంచవచ్చుననిమాత్రమే చెబుతారు. ఇది పాతపాటే.

ఆ తీరని అవసరాలనుగూర్చి మనకంత కాబట్టదు. వానికొక అంతమంటూ ఉండదని మనమెరుగుదుము. మనమున్న సమాజ వ్యవస్థ వ్యవధిలో, వాని నెంతవరకు తీర్చగలము; అన్నదే మన మాలోచిస్తున్న విషయం—ఇది పూర్తిగా భిన్నమైనది–జీతాలు కూలీల మొత్తంమీద ఇది ఆధారపడి ఉంటుంది.

స్వదేశం అమ్మకం దాదాపు 50 వంతులు పెరిగితేతప్ప. పరిశ్రమ లను పూర్తిగా ఉపయోగించడమనేది జరగదు. అందులో 40 వంతులు జీతాలు, కూలీలు పెరగడంవల్లనే పెంచ వీలవుతుంది. అంచనా వేసిన మిలిటరీ ఖర్చులే 10 వంతుల హెచ్చుదలకు చాలును. కాని ఇలా 50 వంతులు పెరగడం అసంభవం. కొన్నాళ్లతర్వాత క్రమంగా 1929 కీ– యుద్ధారంభానికీ మధ్యకాలంలో ఉపయోగించినంతకంటె ఎక్కువగా ఉత్పత్తి సాధన సామగ్రిని ఉపయోగించడం జరక్కపోవచ్చును. ఏమైనప్ప టికి ఇలాంటి స్థితి ఏర్పడడమంటే ఆర్థిక సంక్షోభం వచ్చినదన్నమాటే– ఈ విషయాన్ని మనం స్పష్టంగా గుర్తించాలి.

---

* ఉదాహరణకు - యుద్ధానంతరం అమ్మకం - పబ్లిక్ అఫేర్సు ప్రెస్, వాషింగ్టన్, 1945, పుట 12.

## నూతన పరిశ్రమల నిర్మాణంమట్టుకే సంక్షోభాన్ని అరికట్టలేదు

అమెరికా ధనికవిధానం భౌగోళికంగా తన సరిహద్దుల లోపల విస్తరించ వీలులేకున్నప్పటికి, "సరిహద్దులన్నే విస్తరించ" వీలుకావచ్చు కదాఅని ఒకఆక్షేపణ రావచ్చును— కొత్త ఉత్పాదక యంత్రాలతో, బలమైన నూతన పరిశ్రమలను నిర్మించడంద్వారా ఇది సాధ్యమని వారంటారు. ఇందులో అందరికీ ఉద్యోగా లివ్వవచ్చుననీ, జీతాలను, కూలీలను పెంచ డంతో తిరిగీ ఓ అభ్యుదయదశ రావచ్చుననీ అంటారువీరు. ఇలాగా పూర్వం అమెరికాలోపల ధనికవిధానం విస్తరించినప్పుడు ఏర్పడిన అనుకూలస్థితినే తిరిగీ ఏర్పరచవచ్చుననీ వీరివాదం.

ఈ అవకాశ మెంతవరకున్నదో పరిశీలింతాము. ప్రపంచంపై దిగ్విజయయాత్రకు ధనికవిధానం బయలుదేరిన యుగంలో, నూతన పరిశ్రమల నిర్మాణం ఈ విస్తరణను గమనించింది. మొదట రైల్వేల నిర్మాణం పెట్టుబడి పెట్టేందుకూ, లాభాలు తీసేందుకూ అవకాశాలు కల్పించింది. తర్వాత ఎలెక్ట్రికల్ ఇంజనీరింగు, మోటార్ ఇంజనీరింగు, రసాయన పరిశ్రమలు ఏర్పడినవి.

పరమాణువును బ్రద్దలుచేశారు. ఇందుతో విజ్ఞానాభివృద్ధిలో మన మొక నూతనశకాన్ని ప్రవేశించామని తేలుతున్నది. భవిష్యత్తులో కొత్త అవకాశాలిందుతో సమకూరగలవన్న సూచన లగపడుతున్నవి. ఉత్పత్తి వ్యవస్థ పూర్తిగా పునర్నిర్మింపబడే అవకాశం సంభవ మనిపిస్తున్నది. ఈ పునర్నిర్మాణం, నూతన పరిశ్రమల సంస్థాపన మరొక అభ్యుదయదశను కొని రాగలదా—ఆకాలం చాల నాళ్లుండగలదా ?

నూతన పరిశ్రమల సంస్థాపనవల్ల రెండు ఫలితాలు కలగగలవు. కొత్త పరిశ్రమలు కొత్త అవసరాలను కల్పిస్తాయి. అందుతో కొత్తగిరాకీ

వస్తుంది. వీనిని కొత్తవస్తువులతో తీర్చవలసి ఉంటుంది. జరిగినా జర క్కున్నా ఇదీ వాదధోరణి. కాని ముఖ్యమైన అంశంలో తప్పటడుగు వేస్తున్నది. అసలు అవసరాల సమస్యగాదు మనం పరిశీలించవలసింది. అవసరాలమీద కాదు, డబ్బిచ్చి కొనగల గిరాకీపై మార్కెట్టు ఆధార పడుతుంది. జీతాలను. కూలీలను పెంచకుండా కొత్త పరిశ్రమలు తాము ఉత్పత్తిచేసిన వస్తువులకు మార్కెట్టుసంపాదించాయంటే, పాతపరిశ్రమల నోరుగొట్టి తామాస్థానాన్ని ఆక్రమిస్తున్నాయన్నమాట. ఇలాంటి సంఘ టనకు కావలసినన్ని ఉదాహరణలున్నవి. ధనికవిధాన గత చరిత్రలో, కొత్త పరిశ్రమలు పాతవానిని పడగొట్టకుండా, కొత్తమార్కెట్టు సంపా దించగలిగాయంటే- మన విచారణలో తేలినట్టుగా ధనికవిధాన విస్తరణ యుగంలో వాని నిర్మాణం జరిగింది. వానితోపాటు జీతాల పెరుగుదల, జీవనప్రమాణం హెచ్చింపుకూడ ఆనా దేర్పడినవి.

ఈ శాస్త్రీయ పరిశోధనాయుగంలో నూతన పరిశ్రమల నిర్మాణాని కవకాశం ఉన్నదని అంగీకరింతాము. అయితే కేవలం కొత్త పరిశ్రమ లేర్పడినంత మాత్రంతో వస్తువుల వినియోగం ఎక్కువవుతుందని చెప్ప లేము. మరింత మందికి ఉద్యోగాలు చిక్కడం, లేబర్ మార్కెట్టులో విక్రేతలకు మరిన్ని అనుకూలాలేర్పడ్డం, నిజమైన కూలీలు, జీతాలు పెరగడం—ఇవన్నీ కొత్త పరిశ్రమలతోపాటు ఏర్పడాలి. అప్పుడు వస్తువు లను కొనుక్కోగల గిరాకీ ఉంటుంది—అప్పుడే వస్తువినియోగం ఎక్కువ అవుతుంది.

కొత్త పరిశ్రమల సంస్థాపన మరొకదృష్ట్యా, అమ్మకాన్ని దెబ్బతీసే రెండోఅవకాశం కూడాఉంది. ఇప్పటికున్న పరిశ్రమలశక్తి యెంత ? అందులో ఎంతవరకు ఉపయోగింపబడుతున్నది ? అనే విషయంతో నిమిత్తం లేకుండా, విరివిగా సరికొత్త పరిశ్రమలను ఏర్పాటు చేయడం

జరగవచ్చు. వాదం కోసం పరమాణు విచ్ఛేదనం బొగ్గు నూనెల వివిధోప యోగాలను మార్చి వానిని తొలగించి వేస్తుందనుకుందాము. అప్పుడు పరమాణుశక్తి నుపయోగించుకునే పరిశ్రమలను స్థాపించవచ్చును. ఇందుతో ఆ పాత పరిశ్రమలు కొన్ని మూలబడతాయి. అప్పుడు నేడున్న పరిశ్రమలు యుద్ధానికి పూర్వం కంటె యాభై వంతులెక్కువగా వస్తువుల నుత్పత్తి చేస్తాయా లేదా అన్నసమస్య రాదు. ఎందుకంటే పాతవానిలో కొంతభాగం ఎటూపనికిరాకుండా, లాభకారి కావీలులేకుండాపోతుందికదా. పైగా ఈనూతన పరిశ్రమలకు కొత్త ఉత్పత్తిసాధనాలు కావలసివస్తాయి, కొత్తపెట్టుబడి, కొత్తపనివారు కావలసివస్తారు. ఇలా కొత్తగా పెట్టుబడి పెట్టడంవల్ల తిరిగీ ఒకనూతన అభివృద్ధి తరంగం ఆర్థికవ్యవస్థ నలము కోవచ్చును.

ఈగతినర్థం చేసుకునేందుకై మొదటియుద్ధంలో కొన్ని దేశాలలో ఏం జరిగిందో జ్ఞాపకం తెచ్చుకుందాము. కొన్ని దేశాలలో ఉత్పత్తి సాధ నాలలో కొంతభాగం విధ్వంసం చేయబడినది. యుద్ధానంతరం వీనిని పునర్నిర్మించవలసి వచ్చింది. ఈదశ ఉన్నంతకాలం యంత్రాల నుత్పత్తి చేసే పరిశ్రమలకు మంచి మార్కెట్టు ఉంటుందన్నమాట; చాలమందికి పని దొరుకుతుందన్నమాట. ఇందువల్ల మొత్తం ఆర్థికవ్యవస్థలో అభ్యు దయం కనిపిస్తుంది. యంత్రనిర్మాణ పరిశ్రమలకు బాగా పని ఏర్పడింది. కార్మికులకు గిరాకీ ఏర్పడ్డంతో లేబర్‌మార్కెట్టులో వర్తకులకు అనుకూల వాతావరణం ఏర్పడింది; జీతాలు హెచ్చాయి: కాబట్టి రోజువారీ వస్తువులు ఉత్పత్తిచేసే పరిశ్రమలకుకూడ మార్కెట్టు దొరికింది,

ఇప్పుడుకూడ గత యుద్ధంలో కొన్ని దేశాలలో పరిశ్రమలు పాడయ్యాయి కాబట్టి, కొత్త పరిశ్రమల నిర్మాణానికి తావిచ్చే నూతన వైజ్ఞానిక పరిశోధనలమూలంగా అదే అభ్యుదయం రావచ్చునని ఈ వాదం

సాగింపబడుతున్నది. యుద్ధంలోలాగా పరిశ్రమలు కొన్ని విధ్వంసం కాకున్నా, కొత్త వైజ్ఞానిక పరిశోధన ఫలితాలు వీనిని నిరుపయోగం చేస్తున్నవి. యుద్ధంలో పరిశ్రమలు ధ్వంసమయితే అసలా పరిశ్రమలు రూపు మాసిపోతాయి. విజ్ఞాన శోధనవల్ల అవి, ధ్వంసం కాకున్నా వాని స్థానే ఆర్థిక సాంఘిక శూన్యత ఏర్పడుతుంది. దాని ఫలితంకూడ కొత్తవాని నిర్మాణమే.

ఈ వాదంపైనా దాని వెన్నంటిఉన్న ఆశపైనా రెండు ఆక్షేపణ లున్నవి. కొత్త వైజ్ఞానిక పరిశోధనల మూలంగా కొత్తగా పరిశ్రమలను పునర్నిర్మించడం అవసరమవుతుందని, అందుకు కొత్త పెట్టుబడి అవసర మవుతుందని, అలాంటి కొత్త పెట్టుబడీ, పాతవానిలో ఇంకా పనికివచ్చే పరిశ్రమలూ కలిసి అమెరికాఆర్థికవ్యవస్థ నంతటిని కార్యనిమగ్నం చేయ గలుగుతుంది అని ముందుగా ఋజువుకావాలి. ఇలా జరుగుతుందనేందు కింతవరకూ ఏమాత్రం ఋజువులేదు. అణుశక్తిని పరిశ్రమలలో ఉపయో గించేస్థితి వచ్చేప్పటికి చాలయేళ్లు పడుతుంది. ఎన్నో పరిశోధనలు, ప్రయోగాలు అవసరమవుతాయి. భావిసంక్షోభం మనపై విరుచుకుపడనున్న కాలంలోనే, పరిశ్రమలలో పెద్ద మార్పును, అణువిచ్ఛేదనం కొని రాగలదా అన్నది అనుమానమే.

అదీకాక అలా మూలబడే పరిశ్రమలెన్ని అనేదికూడ చూడాలి. రెండో యుద్ధకాలంలో 1915-18 నాటి యుద్ధంలోకంటె మూడింతలు అమెరికా ఉత్పత్తి పెరిగిందన్న సంగతిని గట్టిగా జ్ఞాపకం ఉంచుకోవాలి. అలాంటప్పుడు మీరు చెప్పినంత పెద్దయెత్తున కొత్త పరిశ్రమలకు అవకాశ మేర్పడాలంటే ఉన్నవానిలో చాలభాగం పాడుకావా లన్నమాట. అలా అనుకున్నప్పటికి మరొక ఆక్షేపణకూడా ఉన్నది.

## గుత్త వ్యాపారసంస్థలు సంక్షోభాన్ని రెచ్చగొడతాయి

నేటి వైజ్ఞానికాభివృద్ధి ధనికవిధానపు సరిహద్దులలోనే సాగుతున్నది. ఈ విధానంలో నేడు పారిశ్రామిక కార్యకలాపం రానురాను కేంద్రీకృత మవుతున్నది. కాబట్టి గుత్త వ్యాపారసంస్థలు, పెద్దపెద్ద కార్పొరేషన్లు ఆర్థికంగా ప్రాధాన్యం వహిస్తున్నవి. పూర్వకాలంలో కొత్త పరిశ్రమల నేర్పరచేవారు, పాత పరిశ్రమలున్నాయా పాడైపోయ్యాయా అనేఆలోచనే లేకుండా విపరీతంగా లాభాలు సంపాదించుకొనేవారు. అలాగే కొత్త వైజ్ఞానిక పరిశోధనల ఫలితంగా కొత్త పద్ధతులను పరిశ్రమలలో ప్రవేశ పెట్టినవారు, తమ పోటీదారులైన పాత పరిశ్రమలవారేమయ్యారు, వారి పరిశ్రమలు మూలబడ్డాయా, అసలు ముదనష్టం అయిపోయ్యాయా—అనే ఆదుర్దా ఏమాత్రం లేకుండా లాభాలు తీసేవారు. ఏమైనప్పటికి, ఇప్పుడా స్థితి మారినది. పాత పరిశ్రమలు నడిపే కార్పొరేషన్లూ, గుత్తవ్యాపార సంస్థలే కొత్త పరిశ్రమలను ఏర్పరచవలసి ఉన్నది. కాబట్టి పాత వాటిని వానిగతి వానిదని వీరు వదలివేయలేరు.

కొత్త పరిశోధనలవల్ల, కొత్త పరిశ్రమల నిర్మాణంవల్ల లాభాలు పొందగల గుత్తవ్యాపార సంస్థలే, పాతవి పాడైపోగా వచ్చేనష్టాన్ని భరించవలసి ఉన్నది. కాబట్టి పాతవి పూరాపాడుకాకుండా ఈ సంస్థలు చూచుకోవలసి వస్తుంది,

కాబట్టి కొత్త పరిశ్రమలవల్ల పాతవి బాగా ధ్వంసమయిపోగలవని, అందులో కొత్త పెట్టుబడికి అవకాశం, ఉద్యోగాలు, అమ్మకాలు లాభాలు ఇలా అభ్యుదయదశ తిరిగీ రాగలదనిభావించేందుకు, అవకాశం చాల తక్కువగానున్నది.

మొదటియుద్ధానికి ముందటికాలంలో సంక్షోభాన్ని నెట్టివేసేందుకు, గుత్తవ్యాపారసంస్థల కేంద్రీకరణం కారణం కాదని, ప్రపంచమంతటా ధనికవిధానం వ్యాపించడమేనని ఈ పుస్తకం మొదటిభాగంలో వివరించాము. ఇప్పుడలాంటి వ్యాపనకు అవకాశం లేదు—ఉన్నదనుకున్నా అత్యల్పాల్పంగా మాత్రమే ఉంటుంది. కాబట్టి ఈదశలో వ్యాపార కేంద్రీకరణ, సంక్షోభానికి మరింత ఉపస్కారకమే అవుతుంది. కొత్తపరిశ్రమల స్థాపనకిది అవకాశం లేకుండా చేస్తుంది. ఈ కేంద్రీకరణ ఉన్నతవర్గాల ఆర్థిక రాజకీయాధికారాన్ని బలపరుస్తుందికాబట్టి, తద్వారా కోట్లకొలది సామాన్య ప్రజలస్థితిని దుర్బలపరుస్తుందికాబట్టి, స్వదేశ మార్కెట్టు పడిపోయేందుకే కారణ మవుతుంది. కొనుగోలుశక్తి అధికసంఖ్యాక ప్రజలకు తగ్గిపోగా అమ్మకం అవకాశాలు తక్కువవుతాయి. ముక్తసరిగా చెప్పాలంటే, శ్రామికుల ఉత్పాదనశక్తి పెరుగుదలకు అనుగుణంగా, వారి జీతాలు పెరగకుండా ఆటంకపరిచేవానిలో గుత్తవ్యాపార విధానం ప్రధానమైనది.

రెండు యుద్ధాల మధ్యకాలంలోను, రెండో యుద్ధకాలంలోను గుత్తవ్యాపారం చాల పెరిగిపోయింది. ఇదేదో యాదృచ్ఛికంగా జరిగినది కాదు. ఈ యుద్ధం ఎంతవరకు పారిశ్రామికయుద్ధం కాగలదో, బ్రహ్మాండంగా ఆయుధోత్పత్తి ఎలా అవసరమో ప్రభుత్వం చాల ముందుగనే గుర్తించింది. నేటియుద్ధ తంత్రరీత్యా, ఆయుధోత్పత్తికి పెద్దపారిశ్రామిక యజమానుల సహకారం అత్యవసరం. భారీయెత్తున ఉత్పత్తి చేయడం అవసరమని గ్రహించి, ముడిసరుకులను, మనుష్యబలాన్ని పొదుపుగా వాడ్డంకోసం ఈ పద్ధతిని యుద్ధకాలంలో బాగా ఆచరణలో పెట్టారు. అయితే ఇది భారీపరిశ్రమలలోమటుకే సాధ్యమవుతుంది. కాబట్టి యుద్ధకాలంలో, బ్రహ్మాండమైన ఆయుధోత్పత్తి కోసం, గుత్తవ్యాపారసంస్థలు

బయలుదేరి విరివిగావ్యాపారం కేంద్రీకృతంకావడం జరిగింది. అమెరికాలో ఇందుకు అనుకూలాలు మరింతయెక్కువ కాబట్టి, ఈ కేంద్రీకరణ, గుత్త వ్యాపారసంస్థల నిర్మాణం మరింత త్వరగా కొనసాగింది. ప్రభుత్వం తనకు కావలసిన వస్తువులకు ఇలాంటి కార్పొరేషన్లకే ఎక్కువ "ఆర్డర్లు" ఇస్తూ వచ్చింది. ఇలాంటి సంస్థలకు కోపం తెప్పించడం ప్రభుత్వాని కిష్టంలేదు. కాబట్టి, యుద్ధకాలంలో కేంద్రీకరణకు వ్యతిరేకంగా జరిగే ప్రచారాన్ని ప్రభుత్వం ఆపివేసింది. ఇందుతో వానిస్థితి మరింత గట్టిపడింది. వారికి ఏవిధమైన ప్రమాదం కాని, నష్టం కాని వచ్చే అవకాశాలన్నీ తొలగింపబడినవి. యంత్రాదుల విస్తరణ ప్రభుత్వ సహాయంతో జరిగింది. ఈ విస్తరణమరింత కేంద్రీకరణకే తోడ్పడింది. యుద్ధకాలంలో నిర్మింపబడిన ఫాక్టరీలు వగైరాలు బ్రహ్మాండమైన ఎత్తున కొనసాగింపబడినవి. కాబట్టి అలా జరిగినది.

"ప్రభుత్వం ఆర్థికసహాయం చేసి నిర్మించిన ఫాక్టరీలు చాల పెద్దవి. వానిని ప్రభుత్వమో, పెద్ద కార్పొరేషన్లో శాంతికాలంలో లాభదాయకంగా నడపగలవు. శాఖోపశాఖలుగా కొలుదార్లనేర్పరచే పద్ధతేదైనా కనిపెడితేతప్ప చిన్నసంస్థలు వానినడపలేవు....వీనిలో సగంపంతు (డాలరు మొత్తాన్నిబట్టి) ఒకొకటి 25 మిలియన్ డాలర్లు చేస్తాయి. ఈ కొత్త ఫాక్టరీలకు అధికారంపొందిన పెట్టుబడి మొత్తం 12000 మిలియన్ డాలర్లు. ఇందులో 25 మిలియన్ డాలర్లు మాత్రమే, ఒకొక్కటి మిలియన్ డాలర్లు చేసే ఫాక్టరీల నిర్మాణానికి వేరుపరచబడినది. ఈ కొత్తవానిలో నూటికి 71, 5 మిలియన్ల విలువకలవి. నూటికి 54 పైగా ఒకొకటి 40 మిలియన్ల డాలర్లు చేసేవి. కొత్త విస్తరణలకని అధికారం పొందిన 2000

మిలియన్ డాలర్ల పెట్టుబడిలో 10 వంతుకు చెందినవి మాత్రం, ఒకొక్కటి ఒక మిలియన్ కంటె తక్కువ వెలగలవి." *

ఇక కేంద్రంనుండి ఆర్థికసాయం పొంది, స్వంతంగా పనిచేసే ఫాక్టరీలల్లోకూడ ఈ కేంద్రీకరణ ఇలాగేసాగింది.

"కేంద్రం పెట్టుబడిపెట్టి, సొంతంగా పనిచేసేకొత్తఫాక్టరీలలో మొత్తం పెట్టుబడిలో నూటికి 87 వంతులు, అయిదు మిలియన్ డాలర్లు వెలచేసే ఫాక్టరీలకు చెందినది. మిలియన్ డాలర్లకు తక్కువ వెలగల ఫాక్టరీల నిర్మాణానికి 125 మిలియన్ డాలర్లు మాత్రమే వేర్పరచబడినవి." †

ప్రభుత్వమిచ్చిన"ఆర్డర్ల"ద్వారాపెద్దపెద్దకార్పొరేషన్లలాభాలు విపరీతంగా పెరిగిపోయినవి. పన్నులన్నీపోనూ (అధికలాభాల పన్నుతోసహా) అమెరికాలో కార్పొరేషన్లన్నిటి లాభాలలెక్క ఇలాఉన్నది; 1941 లో 8,500మిలియన్ డాలర్లు: 1942లో 8,700 మిలియన్ డాలర్లు; 1943లో 9,800 మిలియన్‌డాలర్లు; 1944లో 9900మిలియన్ డాలర్లు.

ఆ ఫాక్టరీలను నడిపేందుకు వాని రిపేరులకు అత్యుదారంగా ఖర్చులు తీసివేసినా, ఇలా అధికాధికమవుతున్న లాభాలలో కొంతభాగం మాత్రమే డివిడెండ్లు పంచడానికి ఖర్చు పెట్టబడినది. ఉదాహరణకు 1944లో షేరుదార్లకు 4,500మిలియన్ డాలర్లుమాత్రమే చెల్లించబడినది. మరి 5400 మిలియన్ డాలర్లు రిజర్వు మూలధనంలో ఉంచబడినది. ఇలా

---

* యుద్ధకాలంలో నిర్మితమైన, కేంద్రం ఆర్థిక సహాయం చేసిన ఫాక్టరీలు, 1940-1944, పారోత్పత్తి పాలకసమితి, పారిశ్రామిక గణనసమితి, నవంబరు 1945, పుట 3—† అదే.

ఈ కార్పొరేషన్ల ఆర్థికస్థితి బాగా ధృవపడడంమూలంగా, ఈ కేంద్రీకరణ మరింత పెరిగేందుకు అవకాశం ఏర్పడినది. యంత్రాలకు, వాని పరికరాలకు సంబంధించిన లెక్కలనుబట్టి చూస్తే, దాదాపు 5700 మిలియన్ డాలర్లు 1945 లో కొత్త ఫాక్టరీలకై వినియోగింపబడినవి. * ఈ మొత్తంలో దాదాపు 5,300 మిలియన్ డాలర్లు, లేదా నూటికి 90 వంతులకు పైగా కార్పొరేషన్లే ఖర్చు పెట్టినట్లుగా ఈ సర్వేలు తెలుపుతున్నవి.

ఈ విపరీత లాభాలరేటు వచ్చే రెండు మూడేళ్ళలో తగ్గిపోవచ్చు. కాని యుద్ధకాలంలో ఈ గుత్తవ్యాపార విధానం కేంద్రీకరణం మరింత బలపడినది, వచ్చే సంక్షోభం ఈ కేంద్రీకరణ వాణిజ్యవిధాన దశలోనే రాగలదు.

రానున్న వ్యావసాయిక సంక్షోభం

ఉత్పత్తిదృష్ట్యా చూస్తే, సంక్షోభ కారణాలు యుద్ధకాలంలో మరింత ప్రోద్బలం పొందినవి. ఇది పారిశ్రామికోత్పత్తిలోను, వ్యవసాయిక ఉత్పత్తిలోనుకూడ సమానమే.

మొదటి యుద్ధకాలంలో పరిశ్రమలలోకాని, వ్యవసాయంలోకాని ఉత్పత్తి ఎక్కువ పెరగలేదు. రెండవ యుద్ధకాలంలో, పరిశ్రమల ఉత్పత్తి పెరిగినంతగా వ్యవసాయంలో ఉత్పత్తి పెరగలేదు. అయినప్పటికి మొదటి యుద్ధకాలంలోకంటె చాల యెక్కువగనే పెరిగినది. 1910 నుండి 1914 వరకు జరిగిన వ్యవసాయ ఉత్పత్తిని 100 అనే ప్రాతిపదికగా తీసుకున్నట్టయితే, మొదటి యుద్ధకాలంలో అభివృద్ధి ఇలా ఉంటుంది.

---

* సెక్యూరిటీస్ అండ్ ఎక్ఛేంజి కమిషన్, ఫిలడెల్ఫియా, స్టాటిస్టికల్ న్యూస్, రిలీజ్ నంబర్ 756.

1914—18 యుద్ధంలో వ్యవసాయ—ఉత్పత్తి †

| | |
|---|---|
| 1914 | 104 |
| 1915 | 104 |
| 1916 | 100 |
| 1917 | 103 |
| 1918 | 109 |

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధపూర్వస్థాయితో పోలిస్తే, ఏలాగైనా వ్యవసాయోత్పత్తి విపరీతంగా పెరిగినది. అన్ని రకాలవానిలోనూ ఈ అభివృద్ధి కనిపిస్తుంది.

వ్యవసాయోత్పత్తి సూచిక
(1935 సగటు ఉత్పత్తి—100) *

| సం॥ | మొత్తం ఉత్పత్తి | పంటలు | జీవాలు |
|---|---|---|---|
| 1939 | 106 | 107 | 106 |
| 1940 | 110 | 107 | 112 |
| 1941 | 113 | 109 | 115 |
| 1942 | 124 | 121 | 126 |
| 1943 | 128 | 114 | 137 |
| 1944 | 136 | 129 | 141 |

అంటే ఇలా వ్యవసాయోత్పత్తి మూడోభాగం ఎక్కువైనది.

* వ్యవసాయ ఆర్థికరంగంలో యుద్ధప్రభావం, వ్యవసాయార్థిక సమితి, అమెరికా వ్యవసాయశాఖ-వివిధ ప్రచురణలు నెం 567, పుట30 1943-44 నాటి

† అదే.

యుద్ధకాలంలో పౌరవస్తు వినియోగం యథాపూర్వంగా ఉండేట్టు చేశారంటే ఇదొకముఖ్యమైన కారణం దానికి. నౌకా భూసేనలకు కావలసిన వస్తువులు పంపాలి. అరువుకవులు క్రింద వస్తువులు పంపాలి. అయినప్పటికి యుద్ధం జరిగినన్నిరోజులూ, పౌరుల ఆహారం-వినియోగం, 1935-39లో తలాకెంత-సాలుసరిసగటు—ఉండినదో, అంతకంటె నూటికి 8 వంతులు, ఎక్కువకు పెరిగినది.*

ఈ ఉత్పత్తి ఆధిక్యంవల్ల వ్యవసాయం పరిస్థితి చాలవరకు బాగు పడింది. సంక్షోభంలో, పరిశ్రమలకంటె, వ్యవసాయం ముందుగా దెబ్బ తిన్నది. పరిశ్రమలలాగే ఇదీయుద్ధంనాటికి ఆదెబ్బనుండి కోలుకోలేదు. పట్ట ణాలలో హెచ్చుజీతాలు, ఎక్కువమందికి పనులుఉండడంవల్ల, వ్యవసాయ వస్తువులకు మంచి ధరలు, మంచి మార్కెట్టు ఏర్పడినది. ఇందువల్ల అమెరికాలో వ్యవసాయరీత్యా వచ్చే నిఖరాదాయం విపరీతంగా పెరిగింది. 1940—5,746మిలియన్ డాలర్లు; 1941లో 8,310 మిలియన్ డాలర్లు; 1942 లో 12,288 మిలియన్ డాలర్లు; 1943 లో 15,090 మిలియన్ డాలర్లు.† ఇందులో కొద్దిభాగంమాత్రమే తమ అప్పులు చెల్లించేందుకై అమెరికా రైతులు ఉపయోగించారు.

---

లెక్కలు, వ్యవసాయపు ఆదాయ వ్యవసాయ పట్టిక, వివిధ ప్రచురణ నెం 583, పుట 5.

* పౌరవస్తు వినియోగం- యుద్ధప్రభావం ఉత్పత్తిసమితికిచ్చిన నివేదిక—.

† యుద్ధఫలితాలు—వ్యవసాయ ద్రవ్యస్థితి, వ్యవసాయార్థికసమితి, అమెరికా వ్యవసాయశాఖ, వివిధ ప్రచురణలు, నెం 567 పుట 25.

"కౌలుదారుల భూస్వాముల నిఖరంబుఋణాలు, తాకట్టుపెట్టుకొనే వారికీ మామూలు బాకీదారులకూ ఇవ్వవలసినవి—బాగా 533 మిలియన్ డాలర్లవరకు తగ్గాయి."*

ఇక ఆదాయంలో ఎక్కువభాగం 8,000 మిలియన్ డాలర్లదాకా ంచడమో, పెట్టుబడిగా పెట్టడమో జరిగింది: "నగదు బాంకు డిపాజిట్లుగా ామెరికా సేవింగ్సు బాండులరూపేణా, గిడ్డంగు రశీదులరూపేణా ఉంచ ుడినది. మరొక 1400 మిలియన్ డాలర్లు, పొలాలలో రోజువారీ ఖర్చు ుకు పెట్టుబడిక్రింద వేచ్చింపబడినవి."†

"ఈ పెరుగుదల పళుసంపదలో చాలఎక్కువగా కనిపిస్తుంది.... పొలాలలో, ఇళ్లలో, యంత్రాలలో కనిపించదు."•

ఆర్థికస్థితిలో వచ్చిన అభ్యుదయంమూలంగా, అమెరికా రైతులు ానున్న సంక్షోభపుతుపాను నెదుర్కొ-గలుగుతారు. అయితే అధికోత్పత్తి జరిగి, వాటికి మార్కెట్టులేక సంక్షోభం రావడమనేది, పరిశ్రమలలోలాగే వ్యవసాయంలోకూడ సంభవమే. పనిచేసే మనుషులసంఖ్య తగ్గినప్పటికీ, అమెరికా వ్యవసాయంలో ఉత్పత్తిఅధికమైనది. 1943 న వ్యవసాయంలో పనిచేస్తున్నవారి సంఖ్య 8.300,000 అని అంచనా వేయబడినది—అదే సంఖ్య 1939 లో 9,200,000 మాత్రమే. పైగా 43లో పోయినవారిసానే పెట్టుకున్న వారు అంత సమర్థులు కారు. ఇక కొత్తమిషిన్లు లేవు. యుద్ధ కాలంలో వ్యవసాయ యంత్రాలలో ఏ విధమైన మంచి మార్పులుగాని రాలేదు.

* అదే, పుట 23

† అదే, పుట 30

• అదే—పుట 5

ఇప్పుడు యుద్ధంనుండీ తిరిగివచ్చినవారు తిరిగీ పొలాలలోచేరారు వ్యవసాయ యంత్రాలలో మంచిమార్పులు వస్తున్నవి. కాబట్టి ఇక వ్యవసాయోత్పత్తి కనీసం యుద్ధానికి ముందుకంటె మూడోభాగం ఎక్కువవుతుంది. సైన్యానికీ, అరువుకౌలు విధానానికీ కొనడం ప్రభుత్వం మానివేస్తే ఏం కావాలి? ఇప్పుడు విపరీతంగా వ్యవసాయ వస్తువులను ప్రభుత్వం కొంటున్నది. పట్టణాలలో సంక్షోభపు దెబ్బ తగిలినప్పుడు వీని అమ్మకం ఎలా ఉంటుంది?

యూరోపు, ఆశియాలలో చాల ప్రాంతాలలో ఆకలికి ప్రజలు మలమల మాడుతుంటే, ఆకలిచావులు తగ్గించాలని కన్నశ్రమా పడవలసి వస్తున్నప్పుడు ఈస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోలేము.

మొదట్లో ఈ బాధిత ప్రజాకోటి ఆకలితీర్చుటకై అమెరికా ధాన్యం ఉత్పత్తి నిలవలలో కొంతభాగం ఖర్చవుతుంది. కాని అదే శాశ్వతంగా ఉండదుకదా, కరల్‌బ్రాంట్ ఇలా వ్రాశాడు:

"యూరపియన వ్యవసాయ పునర్నిర్మాణదశ పూర్తికాగనే, అసలు అమెరికా వ్యవసాయ సమస్య ఏర్పడగలదు....వ్యవసాయ వస్తువులను ముఖ్యంగా ఎగుమతిచేసే దేశాలలో యంత్రాలలో వచ్చిన అభివృద్ధి కారణంగాను, ఉత్పాదనశక్తి అధికం కావడం మూలంగాను, యుద్ధంముగిశాక, కొన్నియేళ్ళలోనే ధాన్యంఉత్పత్తి పంపకాలలో విపరీతమైన వ్యత్యాసం ఏర్పడగలదు....ఆహారోపయోగాన్ని మరీ విస్తరింపచేయడం సాధ్యం కాదుకాబట్టి, వైజ్ఞానికాభివృద్ధివల్ల ఎంత ఉత్పత్తి, ఎక్కువవుతున్నదో, అందుకు తగినంత ఆహారోపయోగం ఎక్కువ చేయలేము కాబట్టి,

పొలాలలో పనిచేస్తున్నవారి సంఖ్య దామాషా మేఱకు తగ్గవలసి ఉంటుంది. గ్రామీణ దారిద్ర్యా న్నెదుర్కొనేందుకు ఇదొక్కటే మార్గం." *

ఇతర ఆర్థికరంగాలలో అభ్యుదయస్థితి ఉండి, అందులోకి ఎక్కువ మంది మనుషులను తీసుకోగలిగితే ఇది పరిష్కారమార్గమే కావచ్చు. అంటే ఈలోగా అమెరికా పరిశ్రమలలో మంచి అభివృద్ధి ఏర్పడి, అది చాలకాలందాకా ఉండే అవకాశం ఉంటే పైచెప్పినది పరిష్కారమార్గం కాగలదు.

ఏమైనా అలాంటి అవకాశం ఏమాత్రం ఉండేట్టు కనిపించదు. అమెరికా ఆర్థికవ్యవస్థ యావత్తూ సంక్షోభానికి గురికాబోతున్నది. వచ్చే సంక్షోభదశలో అమెరికా వ్యవసాయం కూడ తగుల్కొననున్న దనేందుకు చాల సూచన లిప్పుడే కనబడుతున్నవి. పల్లెల నుండి జనం పట్టణాలకు విపరీతంగా వలసపొయ్యే అవకాశం కూడ ఆట్టే కనిపించదు. కాబట్టి ఈ విధంగా వ్యవసాయ సంక్షోభ పరిష్కారం సాగదు.

1929 సంక్షోభం అతి తీవ్రతరమనేందుకు కారణాలలో ఒకటి,అది పరిశ్రమలలోనేకాక, వ్యవసాయరంగానికి కూడ వ్యాపించడం. ఈసారి కూడ అమెరికా వ్యవసాయం ఇందుకు బలికాగలదు. అది తిరిగీ పరిశ్రమల సంక్షోభాన్ని, పట్టణాల విషమస్థితిని మరింత క్లిష్టతరం చేయగలదు.

---

* కరల్ బ్రాంట్. ప్రపంచ వ్యవసాయ పునర్నిర్మాణం, న్యూయార్కు 1951, పుటలు 401, 403, 404.

ఇంతకూ సారాంశమిది: అమెరికా ఆర్థిక గతినిప్పటిలాగే అ వదిలిపెడితే, 1929 సంక్షోభం కంటె అధ్వాన్నం రాకున్నా, ఆమాత్ర తీవ్రమైన సంక్షోభం వచ్చితీరుతుంది.

గత సంక్షోభం కొత్తమార్కెట్టుల అవకాశంలేని దశలోవచ్చిం అంత క్లిష్టదశ ధనికవాదమింకెన్నడూ అనుభవించలేదు. ఆయుధోత్ప బ్రహ్మాండంగా సాగుతున్న (జర్మనీలాంటి) చోట్లతప్పితే, రెండోయుద్ధ వచ్చేవరకూ ఏదేశంలోను ధనికవిధానం ఈ సంక్షోభాన్నుండి తప్పిం కొనలేకపోయినది, ఈ యుగమంతటా (ఇంతకుముందు మినహాయిం తప్పితే) శాశ్వతంగా పట్టుకున్న నిరుద్యోగవ్యాప్తికి పెట్టుబడిదారీ విధాన చికిత్స చేసుకొనలేకపోయినది,

నేడు అమెరికా ఉత్పత్తి యంత్రశక్తి 1929 కంటె, 1940 ( కంటె అత్యధికమైనది. అప్పటికంటె కొత్తమార్కెట్టుల కవకాశముంద కాని, తద్వారా సంక్షోభం రాకుండా చేయవచ్చునని కాని, వస్తే కనీస దాని తీవ్రతను తగ్గించ వీలవుతుందని కాని అనుకొనేందు కేమాత్ర అవకాశంలేదు, ఈసారి యుద్ధంలో కొన్ని అనుకూలా లేర్పడినవి. అ. పౌరవస్తూపయోగంలో తగ్గుదల, పెట్టుబడిదారుల పెట్టుబడికి వాయిదా పడడం, అమెరికా రైతులఆర్థికస్థితి బాగుపడడం-ఇవి. ఏమైనప్పటికీ ఇ సంక్షోభాన్ని కొంతకాలం ముందుకు నెట్టగలవేమో కాని, అస దానిని ఆపలేవు.

పరిశ్రమలు పూర్వం కంటె ఇప్పుడు నూటికి 50 వంతు లెక్కు వస్తువుల నుత్పత్తిచేస్తున్నవి. వ్యవసాయోత్పత్తి నేడు 33 1/3 ఎక్కు వయినది. వీటన్నిటికి బజారులో అమ్మకానికి మార్గం దొరకాలంటే కార్మికులయొక్క, మధ్య తరగతులయొక్క కొనుగోలుశక్తి పెరగాలి అంటే జనసామాన్య జీవనస్థాయి చాల పెంపొందాలి. అయితే అమెరికా

సంఘవ్యవస్థ పూర్తిగా గుత్తవ్యాపార సంస్థలతోను, ట్రస్టులతోను, కార్పొరేషన్లతోను నిండిపోయి ఉన్నది. యుద్ధకాలంలో ఏర్పడిన కొన్ని పరిస్థితులవల్ల, వీని ఆర్థికాధికారం మరింత పెచ్చుపెరిగినది.

ఆర్థిక ప్రణాళికపై ఆధారపడిన సోషలిస్టు సమాజంలో అయితే ఇది సులభమైన సమస్యే. పెట్టుబడిని, వస్తూపయోగాన్ని కూడ ఎక్కువ చేయవచ్చును. అధికోత్పత్తికి తగినంతగా జనుల వస్తువినియోగాన్ని పెంచవచ్చును. కాని అమెరికా అలాంటి సోషలిస్టుదేశం కాదు. గుత్తపెట్టుబడిదారీవ్యవస్థ ఇక్కడనున్నది. కాబట్టి సోషలిస్టు పరిష్కారమార్గం ఇక్కడ పనికిరాదు.

అయితే మరి ఆర్థిక సంక్షోభం తప్పనిసరేనా? దీన్ని తప్పించుకునేందుకు వీలులేదా? సాంఘికపతనానికి, ఆర్థిక సంక్షోభానికి, అనంత నిరుద్యోగానికి దారితీసేవిధంగా శ్రామికుల ఉత్పాదనశక్తి పెరక్కుండా అరికట్టేశక్తి ఏదీలేదా? విస్తృతమవుతున్న ఆర్థికవ్యవస్థను చక్కగా అదుపాజ్ఞలలో నుంచుకొని నడపగలసమర్థతను యుద్ధకాలంలో ప్రదర్శించిన ప్రభుత్వం, శాంతికాలంలో కూడ ఆర్థికవిధానాన్ని తన అధికారంలోనికి తీసుకొని కొత్త పద్ధతులలో నడపడం తన కర్తవ్యమని భావించవలదా?

192

## ఆరో అధ్యాయం

# రాజ్యాంగం, ఆర్థికవ్యవస్థ, సంక్షోభం

ప్రభుత్వ ఆర్థిక కార్యకలాపాలు. ఆర్థికవ్యవస్థపై ప్రభుత్వాధికారం రెండో యుద్ధఫలితంగా ఎక్కువయినవి. ఆ యుద్ధం పరిశ్రమల, ఫాక్టరీల యుద్ధం. నిజానికి మొత్తం ఆర్థిక వ్యవస్థ కంతటికీ చెందిన యుద్ధం ఇందులో చేరిన దేశాలన్నీ, అమెరికాకూడ-అందుకై తమకున్న సహజ సంపద నంతటిని సమీకరించవలసివచ్చినది. కాబట్టి అంతకుముందెన్నడూ లేనంత ఎక్కువగా, ఆర్థిక కలాపాలలో ప్రభుత్వం జోక్యం కల్పించుకొనవలసి వచ్చినది,

యుద్ధకాలంలో పెట్టుబడిలో చాలభాగాన్ని తానుపెట్టి, ఉత్పత్తిపై ప్రభుత్వం పెత్తనం వహించినది. జీతాలను, ధరలను నిర్ధరిస్తూవచ్చినది. మనుష్య బలంపైన, ముడి సరుకులపైన సర్వాధికారం వహించినది. ప్రభుత్వ జోక్యంవల్ల నిరుద్యోగం సమసిపోయినది. ఈ అపూర్వస్థితి ఒక్క అమెరికాకు మాత్రమే చెందినది కాదు, బ్రిటిష్ ప్రభుత్వంకూడ ఇలాగే చేసినది. చాలయేళ్లుగా పెచ్చుపెరిగిన నిరుద్యోగాన్ని తొలగించి పనులివ్వ గలిగినది. 1933—39 ల మధ్య అమెరికాలో ఏటా పెరుగుతూ వచ్చిన నిరుద్యోగుల సంఖ్య కోటీ నాలుగు లక్షలకు వచ్చినది. ఇంత సంఖ్యను తొలగించి అందరికీ ప్రభుత్వం పనులివ్వగలిగినది. ఇలా తమకిష్టమైతే ఏమాత్రం చేయగలరో ప్రభుత్వాలు బహిర్గతమొనర్చినవి. పనిచేయదలచుకున్న ప్రతివారికి పని కల్పించగలిగి

వి. అయితే యుద్ధకాలంలో (జర్మనీలో యుద్ధఆర్థిక విధానంమూలంగా
అంతకుముందుగనే) ప్రభుత్వాలకొక అవకాశం దొరికింది—విపరీతంగా
యుధోత్పత్తి, యుద్ధానికి చెందిన ఇతరకార్యక్రమం జరుగుతున్న రోజు
వి. ఈ యుద్ధోత్పత్తి ప్రాతిపదికపై, ప్రతిచోటా ప్రభుత్వాలు ఆర్థిక
వ్యవస్థను తమ చేతనుంచుకొని, ఎక్కువగా ఉత్పత్తి చేయబడే సరుకుల
అమ్మకానికి ప్రభుత్వాలే హామీ నివ్వగలిగినవి.

## ప్రభుత్వ జోక్యం అవసరం

మొదటియుద్ధం వచ్చేముందు, విపరీతంగా శాశ్వతంగా నిరుద్యోగ వ్యాధి ప్రబలలేదు. కాబట్టి యుద్ధం ముగిసిన వెంటనే ప్రభుత్వాలు ఆర్థిక వ్యవస్థపై తమ పెత్తనాన్ని వదులుకుంటాయని అమెరికాప్రజలూ, ఇతర ప్రజలూకూడ భావించారు. ఈసారి యుద్ధానికిముందు సంక్షోభంలో, చాల కాలం విపరీతంగా నిరుద్యోగం ప్రబలింది. యుద్ధం వచ్చినప్పుడే ఈదశ చాలమందికి తప్పినది. యుద్ధోత్పత్తి ప్రాతిపదికపై యుద్ధకాలంలో ప్రభుత్వం శాశ్వత నిరుద్యోగాన్ని తొలగించగలదని ప్రజలు మొత్తంమీద గ్రహించారు.

తిరిగీ పాత సంక్షోభమో కొత్త సంక్షోభమో వస్తుందని జనం భయపడేకొద్దీ, ప్రభుత్వజోక్యాన్ని అర్థిస్తారు. రానున్నసంక్షోభాన్ని, నిరుద్యోగాన్నితొలగించగలసామర్థ్యం తనకున్నట్లు ప్రభుత్వం యుద్ధకాలంలో రుజువుచేసినందువల్ల వీరికోరిక బలవత్తర మవుతున్నది. ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వం జోక్యం తీసుకోవాలన్న ఈ వాంఛే, గత యుద్ధానంతరస్థితికీ నేటికీ మధ్యనున్న విభేదానికి నిదర్శనం. ఆరోజుల్లో ఆర్థిక సంక్షోభం అంటే అదో తాత్కాలిక ఆటంకమని, అది ధనిక వ్యవస్థనే మూలచ్ఛేదం చేసే అవకాశం ఎక్కడాలేదని భావించేవారు. ప్రభుత్వ జోక్యం అవసరం

లేకుండానే ఆర్థికవ్యవస్థ ఆఖరుకు సంక్షోభాన్ని నెట్టివేయగలిగేది. పూర్వం కంటె అధికమైన అభ్యుదయదశ తిరిగివచ్చేది.

ధనికవిధానంసంక్షోభంనుండి తనంతటతాను తిరిగి కోలుకోగలదన్న విశ్వాసాన్ని ప్రజలు నేడు కోల్పోయారు. ఇప్పుడు పూర్తిగా పనుల్లోఉన్న ప్పటికీ సంక్షోభం రానున్నదని భయపడుతున్నారు; ప్రభుత్వ జోక్యాన్ని అభ్యర్థిస్తున్నారు. అంటే ఇది ధనికవిధాన చరిత్రలో కొత్తది. ధనిక విధానగతిలో మనమొక నూతన దశలో ప్రవేశిస్తున్నా మనేందు కిది స్పష్టమైన సూచన.

రాజ్యాంగమూ, పెట్టుబడీ

ఏవిధమైన ప్రభుత్వజోక్యం వాంఛింపబడుతున్నది? ధనికవిధానాన్ని పూర్తిగా నిర్మూలించాలన్న కోరికలేకుండా, కొన్ని అంశాలలో దానిని సంస్కరించా లనేవారు మితవాదులు. రెండోయుద్ధానికి ముందు ఆంగ్లో శాక్సన్ దేశాలలో వ్యక్తిగతమైన పెట్టుబడి చాల తక్కువని వీరంటారు. కైన్సు అనుచరులన్నట్టు సంపాదనకూ, పెట్టుబడికీ మధ్య చాల అంతర మున్నది. యుద్ధకాలంలో ప్రభుత్వం అధికంగా పెట్టుబడి పెట్టినది. పరోక్షంగా మిగత పెట్టుబడికికూడ ప్రోత్సాహమిచ్చింది.

నేటి పరిస్థితి ఏమిటి? ఈ సంధిదశ ముగిసి, యుద్ధకాలంలో ఆగి పోయిన వ్యక్తిగతమైన పెట్టుబడులు తిరిగి ఆరంభమైతే ఏం జరుగు తుంది? వ్యక్తుల అధీనంలోనున్న ధనికవిధానశాఖ, తిరిగి పెద్దగా పెట్టు బడి పెట్టేందుకు విముఖత చూపినదనుకుందాం. అప్పుడు భారీ పరిశ్రమల వ్యాపారం బాగా పడిపోతుంది. అందుతోపాటు మిగతశాఖలలోను ప్రతి ష్టంభనవచ్చి నిరుద్యోగం పెద్దఎత్తున ఏర్పడితే ఏమవుతుంది?

ఇలాంటిస్థితిలోనే ప్రభుత్వజోక్యాన్ని అభ్యర్థించడం జరుగుతుంది. వ్యక్తుల పెట్టుబడితోపాటు ప్రభుత్వం కూడ పెట్టుబడిపెట్టి, అందరికీ పని దొరికేట్టుగా, సాంఘిక ఉత్పత్తిశక్తి, పూర్తిగా వినియోగపడేటట్టుగా ప్రభుత్వం చూడాలి. మొదట్లో ఈ పరిష్కారం చాల సులభంగాను, చక్కగాను కనిపిస్తుంది. కాని కాస్త నెమ్మదిగా ఆలోచిస్తే బోధపడే దేమిటి? నేటి పెట్టుబడిదారీ విధానం విఫలమయినదని అధికారరీత్యా అంగీకరించడమన్నమాట. అతి విషమదశలో తన అస్తిత్వాన్ని రుజువు పరచుకోవలసినదశలో, అదిచేతకానితనం చూపినదన్నమాట. అందులోను ఇది తాత్కాలికం కాదు, శాశ్వతమైనది కూడ. ఇందుకు ఫలితమేమిటి? ధనికవాదాన్ని మార్చడానికి జరిగేపోరాటంలో కొత్త దశ ప్రారంభమైన దన్నమాట. ధనికవిధాన చరిత్రలో, ఇంత పెద్దయెత్తున శాంతిసమయంలో ప్రభుత్వంజోక్యం కలిగించుకోవడమనేది ఎన్నడూలేదు. యుద్ధసమయంలో నంటే, ఏకైక విజయలక్ష్యంతో సంఘంలోని వివిధవర్గాలను సమీకరించ వచ్చు. పెట్టుబడినేకాక, ఆర్థిక వ్యవస్థనంతటిని ప్రభుత్వం తన చేతిలో నుంచుకొనవచ్చును. శాంతిసమయంలోని స్థితి వేరు.

అతి నిరంకుశ నాజీప్రభుత్వం కూడ ఇంతకుమించి ఎన్నడూ వెళ్ల లేదు. శాంతిసమయంలోకూడ పెట్టుబడిపైన పెత్తనం వహించి,ఉత్పత్తిని పెంచినమాట వాస్తవమే. కాని, అందుకు వీలుకల్పించిన కారణం— ఆయుధోత్పత్తే, ఆర్థిక వ్యవస్థలో అప్పుడు ప్రధానంగా నున్నది. ఫాసిస్టు ప్రభుత్వాలు కాని, ధనిక ప్రజాప్రభుత్వాలు కాని ఎన్నడూ శాంతిసమయంలో నిరుద్యోగ నివారణకై పెట్టుబడిపై పెత్తనం వహించడమనేది జరగలేదు. కాబట్టి ఏ ధనిక ప్రభుత్వమైనా ఇలా చేయదలచుకుంటే, అదో కొత్తదారి తొక్కాలి. అంతకుముందు, ఇలాంటి అనుభవమున్న దేశమేదీ ఉండదు గనక అది నలుగుడుబడినదారి కాకపోతుంది.

ప్రభుత్వం అత్యధికంగా పెట్టుబడి పెట్టాలనేవారుకూడ, నేటిస్థితికి దారితీసిన కారణాల విషయంలో ఏకీభవించరు. వీరందరూ అంగీకరించే దొక్కటే–1929 సంక్షోభకాలంనుండి రెండోయుద్ధం నాటివరకు, పెద్ద పెట్టుబడిదారీ దేశాలన్నీకూడ సంక్షోభాన్ని తొలగించుకోలేకపోయినవి. అందుతోపాటు వచ్చిన విపరీత నిరుద్యోగాన్ని నిర్మూలించుకోలేక పోయినవి. యుద్ధోత్పత్తి, ఆయుధమహోత్పత్తి మూలంగానే దీనిని కొంతకాలం అరికట్టగలిగినవి. కాబట్టి యుద్ధానంతరం ఈ దుస్థితని రూపుమాపలేపు—ఇంతవరకూ వీరంగీకరిస్తారు, కాని ఈ స్థితికి దారితీసిన కారణాల విషయంలో వీరేకీభవించరు. ధనికవిధానంలో మార్పుతప్పదు, సంక్షోభం రానురాను తీవ్రమవుతూవస్తుంది-అనే అంశాలగూర్చి వీరు పరిశీలించి యెరుగరు. కాబట్టే ప్రభుత్వం, ఆర్థికవ్యవస్థలో తాత్కాలికంగా మాత్రమే జోక్యం తీసుకోవాలా లేక దాదాపు శాశ్వతంగానా అనేప్రధాన సమస్యను వీరు దాటవేస్తున్నారు.

ఇలాగే, వ్యక్తుల పెట్టుబడికి చెందిన ఆర్థికరంగానికి, ప్రభుత్వానికి చెందిన ఆర్థికశాఖకూ ఎలాంటి సంబంధ బాంధవ్యాలుండాలి?-అనే ప్రధాన విషయంపైకూడ వీరొక నిశ్చయానికి రాలేకపోతున్నారు. ఇదే అసలు సమస్య. ఇందునుగూర్చి సిద్ధాంతీకరించేందుకు వెనకటి అనుభవమేమీలేదు. ఇంతదాకా పెద్దయెత్తున ధనికప్రభుత్వం శాంతిసమయంలో పెట్టుబడి పెట్టడమనేదే జరగలేదుకదా. కాని ఈ విషయమై ఒకటిరెండు పుస్తకాలున్నవి. రెండుయుద్ధాల మధ్యకాలంలోను, యుద్ధకాలంలోను ఒకవిధమైన సాంఘిక భద్రతను కాపాడుకోగలిగిన రెండుపెద్ద పారిశ్రామికదేశాలు బ్రిటనూ, అమెరికాయున్నూ. అయితే 1921 నుండి రెండోయుద్ధం దాకా బ్రిటన్ బ్రహ్మాండమైన నిరుద్యోగంతో పీడింపబడుతూ వచ్చింది. కాబట్టి

అక్కడే తొలుత, ప్రభుత్వ పెట్టుబడిని వ్యక్తుల మూలధనంతో కలపడం గూర్చి హృదయపూర్వకమైన చర్చ ఆరంభమైనది.

గ్రేట్ బ్రిటన్‌లోకూడ రాజకీయ కార్మికవర్గోద్యమం చాలకాలం క్రితమే ఆరంభమైనది. మొదటి యుద్ధానికిముందు-కన్సర్వేటివ్‌పార్టీకంటె, లిబరల్‌పార్టీకంటె లేబర్‌పార్టీ చిన్నది. రెండు యుద్ధాల మధ్యకాలంలో ప్రధానపార్టీలు రెంటిలో ఒకటిగా (ఇంకొకటి కన్సర్వేటివ్‌పార్టీ) తయారయినది. గతయుద్ధంలో బ్రిటన్‌సమిష్టిప్రభుత్వం నడిపినది. అందులో ముఖ్యంగా కన్సర్వేటివ్‌లూ లేబర్‌పార్టీవారూ ఉండేవారు. తిరిగీ యుద్ధానంతరం శాశ్వత నిరుద్యోగంతో శ్రామికులు బాధపడకుండా తగుచర్యలు ప్రభుత్వం తీసుకోవాలని లేబర్‌పార్టీవారు పట్టుబట్టారు.

## ఉద్యోగ విధానంపై బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటన

ఇందువల్లనే యుద్ధం ముగిసేముందు బ్రిటిష్ ప్రభుత్వం ఉద్యోగ విధానంగూర్చి ఒక అధికార ప్రకటన చేశారు. పెట్టుబడి విషయంలో వ్యక్తియాజమాన్యంక్రిందనున్న ఆర్థికవ్యవస్థకూ ప్రభుత్వానికీ-మధ్యనున్న సంబంధాలనుగూర్చిన వివరాలతో ఒక పుస్తకం వెలువడేందుకుకూడ ఇదే కారణం. సర్ విలియం బీవరిడ్జి ఆ పుస్తకం వ్రాశాడు—పేరు: "స్వతంత్ర సమాజంలో అందరికీ పని". పెద్ద పెట్టుబడులద్వారా ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థ కార్యకలాపాలలో జోక్యం తీసుకోవాలన్న వాంఛవల్ల వచ్చే సమస్యలన్నిటిని ఈ రెండు ప్రచురణలూ చర్చిస్తాయి.

బ్రిటిష్ ప్రభుత్వపత్రం ప్రారంభంలో ఇలా ఉంది:*

* ఉద్యోగవిధానం—రాజుగారి పత్రాల అధికారి అనుమతితో ప్రచురింపబడినది.

"యుద్ధానంతరం ఎక్కువమందికి ఉద్యోగాలుండేట్టు చూచే బాధ్యతను ప్రభుత్వం అంగీకరిస్తున్నది—ఇది తన ప్రధానాశయాలలో ఒకటిగా ఉంచుకునేందుకుకూడ అంగీకరిస్తున్నది."

ఇందుకై ఆర్థిక ప్రధానోద్యోగులను తయారుచేయ నిర్ణయించుకున్నట్లు ఆ పత్రం తెలుపుతున్నది.

"ఆర్థిక ధోరణులను గమనించి, వానిగతిని వివరించేందుకూ, వానినిగూర్చి ఆయా మంత్రి శాఖలకు నివేదించుకునేందుకున్నూ శాశ్వతంగా సమర్థులైన కేంద్రోద్యోగులు కొందరిని, నియమించేందుకు ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది:"

ఉద్యోగాలు విరివిగా శాశ్వతంగా ఉండేట్టు చూసే బాధ్యతను ప్రభుత్వ మెందుకు తీసుకుంటున్నదో ప్రభుత్వపత్రం ఇలా వివరిస్తున్నది:

"సంక్షోభప్రమాద నివారణకై ప్రప్రథమంలోనే చర్య తీసుకునే బాధ్యలనికమీద ప్రభుత్వం తనపై వేసుకుంటున్నది. అంటే ఇందుమూలంగా ప్రభుత్వానికొక కొత్తబాధ్యత ఏర్పడుతున్నది. ఒకకొత్తదృష్టి ఏర్పడుతున్నది. ప్రతిసారి సంక్షోభంవచ్చినప్పుడూ, దానంతటదే సరిపడుతుందని ఒకప్పుడు భావించేవారు. ధరలూ, జీతాలూ పడిపోతాయి కాబట్టి, ధరల తగ్గుదల గిరాకీ నెక్కువ చేస్తుందని అలా అందరికీ ఉద్యోగాలు దొరుకుతాయని అనుకునేవారు. ఆధునిక పరిస్థితులలో ఈ స్వయంచికిత్సాక్రమం సాధ్యమనుకున్నప్పటికి ఎంతోకాలం పడుతుంది. పైగా ఇందుతోపాటు విపరీతమైన అధ్వాన్నస్థితి ఏర్పడుతుంది. ముఖ్యంగా మనలాంటి చిక్కైన పారిశ్రామికసమాజంలో ఇలా దానంతట అది పరిష్కారమయ్యేందుకు ఎంతకాలమో పడుతుంది."

చర్చిల్ నాయకత్వంక్రింద ఎక్కువమంది టోరీలతోకూడిన బ్రిటిష్ సమిష్టిప్రభుత్వం, పెట్టుబడిదారీ విధానంలో గొప్పమార్పు వచ్చినదని స్పష్టంగా ఖచ్చితంగా ఒప్పుకుంటున్నదన్నమాట. "ప్రతిసారి సంక్షోభం వచ్చినప్పుడూ, దానంతటదే సరిపడుతుందని, ఒకప్పుడు భావించేవారు." కాని రెండు యుద్ధాలమధ్య ఇరవైఏళ్ళ అనుభవం తర్వాత, బాధ్యతగల బ్రిటిష్ వర్గాలవారు అనుకుంటున్నదేమంటే: "ఈ స్వయం చికిత్సాక్రమం సాధ్యమనుకున్నప్పటికి ఎంతోకాలం పడుతుంది. పైగా ఇందుతోపాటు విపరీతమైన అధ్వాన్నస్థితి ఏర్పడుతుంది."

పెట్టుబడిదారీ విధానం తనకుతానుగా ఆర్థికసంక్షోభా న్నెదుర్కొన లేదని, అందువల్ల ప్రభుత్వంపై కొత్తగా గొప్పబాధ్యత పడుతున్నదనీ, ఆర్థికవ్యవస్థ కార్యక్రమంలో జోక్యం తీసుకోవలసిన అవసరమేర్పడు తున్నదని, కన్సర్వేటివ్ నాయకత్వం క్రిందనున్న బ్రిటిష్ సంయుక్త ప్రభుత్వం అంగీకరించక తప్పలేదంటే, ఇదొక ధనికచరిత్రలో ప్రధానాం శంగా ఈ రచయిత భావిస్తున్నాడు. ఈ ప్రభుత్వపత్రంలోని ప్రతిపాదనలు నేటిపరిస్థితి నెదుర్కొనుటకు చాలినంతలేవన్న అంశం దీనిప్రాముఖ్యతను తగ్గించలేదు.

వ్యక్తిగతమైన పెట్టుబడులు చాలినంత లేకపోవడం విపరీతమైన నిరుద్యోగానికి కారణమని ప్రభుత్వపత్రం నమ్ముతున్నది:

> "బాగా అభివృద్ధిచెందిన పారిశ్రామికదేశాలలో వ్యక్తిగతమైన పెట్టుబడిపైన అయ్యేఖర్చే, మొత్తం ఖర్చులోని అస్థిరతకు మామూలు కారణం అవుతుంది."

వ్యక్తులు పెట్టుబడిపెట్టే విషయంలో ప్రభుత్వ జోక్యాన్ని ఈ ప్రకటన ఒప్పుకోడంలేదు.

"మొత్తం ఖర్చులో పూర్తిగా అస్థిరంగా ఉన్నది ఈ వ్యక్తిగత పెట్టుబడీ, విదేశంనిల్వలూ అనేవి. ఒకఅదుపులో ఉంచుకునేందుకు కూడ వీలులేనివి."

ఈ వ్యక్తిగతమైన పెట్టుబడి అస్థిరమైనప్పుడు, వానిని అదుపులో పెట్టడం కష్టతరమైనప్పుడు, పెద్ద పెట్టుబడులలో ప్రభుత్వం జోక్యం తీసుకోవలసి వస్తుంది. కాబట్టి ఇంతవరకూ అవలంబిస్తూ వచ్చిన పద్ధతి వ్యతిరేకమైన పద్ధతిని ఇకమీద ప్రభుత్వం అనుసరించవలసి ఉంటుంది

"పూర్వం ప్రభుత్వం పెట్టుబడిఖర్చు చాల ఒడుదుడుకులుగా ఉండేది. సంక్షోభసమయంలో తమ ఆదాయం తగ్గిపోయినప్పుడు, పెట్టుబడిఖర్చును తగ్గించుకోవడం మంచిదని ప్రభుత్వోద్యోగులు భావించడం ముఖ్యంగా ఇందుకు కారణం."

ఇకమీద ఇలాకాదు. వ్యక్తిగతమైన పెట్టుబడి తగ్గిపోతే, ప్రభుత్వం తానే పెట్టుబడిపెట్టి ఆ అఖాతాన్ని పూడ్చివేస్తుంది.

"తప్పనిసరిగా వచ్చేసొంత పెట్టుబడులలోని ఒడుదుడుకులను తొలగించుకునేందుకు ప్రభుత్వం ఎప్పుడు, ఎంతపెట్టుబడిపెట్టాలో జాగ్రత్తగా లెక్కవెయ్యాలి....సంక్షోభ ప్రారంభంలో సొంతపెట్టుబడి పతనం కా నారంభించినప్పుడు, ప్రభుత్వ పెట్టుబడిలో స్థిరత్వాన్ని నిలబెట్టడం సాధ్యమవుతుంది. కాని ఇంతమాత్రమే చాలక పోవచ్చును; పనులందరికీ యధావిధిగా ఉండేట్టు చూడాలంటే, ప్రభుత్వ పెట్టుబడి. వ్యక్తుల పెట్టుబడి తగ్గినప్పుడు పెరగాలి. అభ్యుదయదశలో అది హెచ్చినప్పుడు ప్రభుత్వపెట్టుబడి తగ్గాలి."

ఈ కార్యక్రమాన్ని నడపడంలో ప్రభుత్వం పాతకాలపు ఆదాయ వ్యయపట్టిక తయారుచేసే పద్ధతిని వదులుకోవాలి. ఖర్చును బాగా తగ్గించి,

ప్రతి ఆర్థిక సంవత్సరాంతంలోను ఆదాయవ్యయాలను సరిచేయజూచే పాత పద్ధతిని మార్చుకోవాలి. చేయగలవారందరికీ పనికల్పించే ప్రభుత్వ పెట్టుబడిపద్ధతి—కేవలం జమాఖర్చు సమానంగా ఉంచే సాలుసరి బడ్జెటుకంటె చాల ముఖ్యమైనది.

రెండు యుద్ధాలమధ్య ఆర్థికసంక్షోభ దంష్ట్రలనుండి బ్రిటన్ తప్పించుకోలేకపోయినది. అభ్యుదయవంతమనుకునే దశలోకూడ పదిలక్షలకు పైగా నిరుద్యోగుల సంఖ్య ఉంటూవచ్చింది. ఇందుమూలంగా బ్రిటిషు ప్రజల దృక్పథంలో అతి ప్రధానమైన మార్పు వచ్చినది. ఎక్కువభాగం కన్సర్వేటివ్‌లతో నిండిన ప్రభుత్వం తన అధికారపత్రంలో పాతపద్ధతిలో ధనికవిధానం నడవవీలులేదని బాహాటంగా అంగీకరిస్తున్నది. విషమ దశలో తన అస్తిత్వాన్ని ధనికవిధానం నిలబెట్టుకోలేదని, అందువల్ల పరిస్థితులను చక్కబెట్టుకునేందుకు ప్రభుత్వం జోక్యం కల్పించుకోవాలని ఇరవై యేళ్ల అనుభవంవల్ల తెలుసుకొన్నది.

వ్యక్తిగతంగా పెట్టుబడిదారులపైన వారి ఆర్థిక వ్యవహారాలపైన అనవసర జోక్యం మానివేయాలి. తాను వారికి చెందని ఇతరమైనవానిలో పెట్టుబడిపెట్టాలి—ఇది ప్రభుత్వ ప్రకటనలో కేవలం యాదృచ్ఛికమైనది కాదు. ప్రధానమైన లోపం.

సర్ విలియం బీవరిడ్జి తన పుస్తకంలో ఇలా వ్రాశాడు:

"సొంత పెట్టుబడి అస్థిరమైనదని గట్టిగా ఖండించడమనేది, నిశితంగాచూస్తే ప్రభుత్వ పత్రంలో కనిపించదు. సొంతపెట్టుబడి తగ్గినప్పుడు ప్రభుత్వ పెట్టుబడి హెచ్చాలనీ, అది హెచ్చినప్పుడు తమపెట్టుబడిని ప్రభుత్వం తగ్గించుకోవాలనిమాత్రమే కోరుతుంది. ప్రభుత్వ పెట్టుబడిని ఎక్కువ చేయడం లేదు. స్థానికాధికారులు

పెట్టుబడి పెట్టేవిషయంలో కేంద్ర ప్రభుత్వానికి ఎక్కువ అధికారా లుండాలని చెప్పసాహసించడం లేదు. కాబట్టి ఈపత్రం వివరించే విధానం ప్రభుత్వం కొన్నిపనులు కల్పించాలనే ధోరణికి చెందినదేకాని, అందరికీపని ఎలాకల్పించాలో తెల్పేదికాదు. ప్రైవేటు పెట్టుబడి తగ్గినప్పుడు సిద్ధంగా ప్రభుత్వం పనులు కల్పిం చేందుకొక అయిదేళ్ళ ప్లానుండాలని సూచించడం కంటె ఇందులో ఎక్కువేమీ లేదు. ఆపను లవసరమైనప్పుడు ప్రభుత్వం ఆరంభించాలి అనేలాంటిది కాదిది:" *

## బీవరిడ్జి ప్రతిపాదనలు

ప్రైవేటు వ్యాపారస్తుల నొక్కమాటఅనకుండా సర్వాధికారంతో వదలివెయ్యాలి; అందుకు వంతపాటగా మాత్రమే ప్రభుత్వం పెట్టుబడి పెట్టాలి—ఇదీ ప్రభుత్వపత్ర ప్రతిపాదన. ఈ ముఖ్యవిషయంలో బీవరిడ్జి ప్రతిపాదన లెంతో అభ్యుదయవంతమైనవి, ఈ విషయంలో మనఅభిప్రా యాలను పూర్తిగా మార్చుకోవాలని ఆయనంటున్నాడు. ఇప్పటినుంచి ఆర్థికవ్యవస్థలో ప్రధానసమస్య—అందరికీ పనికల్పించడం-అన్నదికావాలి. ఇదెప్పుడు సాధ్యమవుతుంది ? ఉన్న మనుష్యశక్తినంతటిని ఉపయోగించు కునేరీతిగా ఉత్పత్తివ్యవస్థను వ్యక్తిగతంగా ఎవరూ కల్పించలేరని ఆయన అంటున్నాడు:

"ఈ నివేదికలో కేంద్రీకృతమైన అంశమిది: సర్వకాల సర్వా వస్థల్లోను, బ్రిటనులో దొరికే మానవశక్తినంతటిని పనికి ఉపయో

---

* స్వతంత్ర సమాజంలో అందరికీపని—సర్ విలియం బీవరిడ్జి, నార్టన్ అండ్ కో., న్యూయార్కు, 1945, అమెరికన్ ప్రచురణ.

గించేందుకు తగినవ్యవస్థ నేర్పరిచేబాధ్యతను బ్రిటిష్‌ప్రజలు, తమ ప్రభుత్వంపై వెయ్యాలి." (పుట. 135)

అయితే ప్రభుత్వం ఈ కర్తవ్యాన్ని నెరవేర్చగలగాలంటే, కొత్త రకమైన బడ్జెటు అవసరమవుతుంది.

"ఈ కొత్తబడ్జెట్ విధానం యొక్క సారాంశం ఏమిటి? దేశంలో ఉన్న మనుష్యబలాన్ని అనుసరించి ఇది తయారుచేయబడుతుంది కాని, డబ్బునుబట్టి కాదు, అంటే బెవిరిడ్జిగారి మాటల్లో ఇది ప్రజల ఆదాయ వ్యయపట్టిక." (పుట.136)

ఇలా మిగత అన్నిటికంటె మనుష్య బలమన్నది ప్రధానాంశం అవుతుంది. పూర్వపురోజుల్లోని లక్ష్యమేమిటంటే....

"....తప్పనిసరైన ఖర్చులకోసమని, ప్రభుత్వం తనఖర్చును బాగా తగ్గించి ఉంచుకోవాలి; రెండోది, ప్రతిఏటా ప్రభుత్వం ఆదాయమూ ఖర్చూ సరిపోతుండాలి. పాతకాలపు ఆర్థికసిద్ధాంతానుగుణంగా అందరికీ పని ఏర్పడుతుందనే ఊహమీద ఆధారపడి బయలుదేరినవే ఈ సూత్రాలు." (పుట-136)

ఏమైనప్పటికి, అందరికి ఉద్యోగాలు దొరుకుతాయన్న ఊహకు కారణం లేనందువల్ల, అందుకై ప్రభుత్వం భారీయెత్తున పెట్టుబడి పెట్టవలసి ఉన్నది అన్నప్పుడు, మరో ముఖ్యమైన సమస్య బయలుదేరుతున్నది; ఈ కొత్తగా ప్రభుత్వం పెట్టే పెట్టుబడికీ, అంతకుముందే ఉన్న వ్యక్తిగతమైన పెట్టుబడికీమధ్య ఎలాంటి సంబంధం ఉండాలి? వ్యక్తిగతమైన పెట్టుబడి చాలదని స్పష్టపడినతర్వాత తాత్కాలికంగా ఖాళీ భర్తీచేసేందుకు మాత్రమే ప్రభుత్వం పనిచేయాలా? ఈ ప్రశ్నలకు సర

విలియం తన పుస్తకంలో స్పష్టమైన, ఖచ్చితమైన సమాధానం వివరం చెప్పాడు. ఉదాహరణకు, ఆయన ఇలా అన్నారు :

"వ్యక్తిగతంగా పెట్టేపెట్టుబడిలో హెచ్చుతగ్గులు, ఒడుదుడుకులు కలుగుతుండగా దానినాపకుండా, అందుకు తగినట్టు ప్రభుత్వం పనులను తగ్గిస్తూ, హెచ్చిస్తూ ఉండాలన్న దృక్పథాన్ని నిరాకరిస్తున్నాము,"

ఇలాగాక ప్రభుత్వమొక కొత్తసంస్థను "జాతీయ పెట్టుబడిబోర్డు (నేషనల్ ఇన్వెస్టుమెంట్ బోర్డు) అన్నదాని నేర్పరచాలని ఈయనసలహ ఇచ్చాడు. ఈ సమితి కార్యకలాపాలనిలా ఆయన వివరించాడు:

"సంగతి సందర్భాలు కనుక్కొని, ప్రభుత్వ, వ్యక్తిగత పరిశ్రమల రెంటికీ పాటుపడుతూ, తన పెట్టుబడిని ఒక పద్ధతిలో నిర్ణయిస్తూ ఈ సంస్థ పనిచేయాలి. ఇందుకు తగిన అధికారం దీనికుండాలి. ఈ సంస్థే ఒకజాతీయ ప్రణాళికను తయారుచెయ్యాలి. దానిని పార్లమెంటు ఆమోదించిన తర్వాత, ఈసమితికి అమలు జరిపే అధికారముండాలి. ఏదో ఒక మొత్తాన్ని నిర్ణయించి, అంతకు పైబడిన పెట్టుబడిపెట్టే పరిశ్రమలు, పని ఆరంభించక పూర్వమే ఆ ప్రణాళికను గూర్చిన పూర్తి వివరాలను ఈ సంస్థకు విధిగా పంపేట్టు చెయ్యాలి. వ్యక్తిగతంగా పెట్టుబడి సవిధంగా, ఎంత వేనిలో వినియోగింపబడుతున్నదో సంపూర్ణంగా తెలుసుకున్న తర్వాతనే ఆర్థికమంత్రి ప్రభుత్వ పెట్టుబడికి చెందిన కార్యప్రణాళికను నిర్ణయించుకునేందుకు వీలుండాలి. ఈ నివేదికలో ఊహించిన పరిస్థితులలో, మొత్తం దేశం పెట్టుబడిలో వ్యక్తుల పెట్టుబడి నాలుగోవంతుకంటె మించదు. ఇందులో సగంవంతు మూడు

వేల ఫాక్టరీలకు చెంది ఉంటుంది. ఈ ఫాక్టరీలు మొత్తం దేశంలోని సంస్థలలో నూటికి రెండోవంతుకంటె తక్కువన్నమాట." (పుట-177)

అంటే సర్‌విలియం దృష్టిలో ప్రభుత్వం దేశమంతటి పెట్టుబడిలో నూటికి 75 వంతులు పెట్టాలి; వ్యక్తిగత ఆర్థికరంగానికి మిగిలిన నాలుగోవంతు వదిలిపెట్టాలి. ఇంతకంటె ఆయన ముందుకు వెళ్ళాడుకూడ;

"వ్యక్తుల పెట్టుబడిని స్థిరపరచడం కోసం, ఒక క్రమపద్ధతిలో నడపడం కోసం ఈ బోర్డుకు ఏదో అధికారముండాలి. ఆ అధికారానికి తగిన రక్షణ ఉండాలి, పెట్టుబడిని తాను స్వయంగా అదుపాజ్ఞలలో పెట్టగలగాలి. ఏదోఒక ప్రణాళికను పంపితే ఆ పెట్టుబడిని తగ్గించడానికి లేదా ఆపివేసేందుకు బోర్డుకు అధికారముండాలి." (178-పుట)

అంటే వ్యక్తిగతమైన పెట్టుబడికి చేతకానప్పుడు, ఆ ఖాళీనిభర్తీ చేసేందుకు ప్రభుత్వం తాత్కాలికంగా పనిచేయాలని ఈయన ఉద్దేశం కాదు. పైగా ప్రభుత్వమే నిర్ణాయకం కావాలి, ప్రభుత్వమే మూడువంతులు పెట్టుబడి పెట్టాలి; మిగత నాలుగోవంతుకూడ తన అదుపాజ్ఞలలోనే ఉంచుకోవాలి. ఇంతపెద్ద పెట్టుబడి కార్యక్రమం నిర్వర్తించాలంటే ఆర్థికరంగంలో ప్రభుత్వం—ఏవో కొన్ని పనులను తా నేర్పాటుచేయడం వరకే తన చర్యలను సంకుచితపరచుకొన వీలులేదు. కాబట్టే అంతకన్న ముఖ్యమైన, భిన్నమైన కర్తవ్యాన్ని ప్రభుత్వం నిర్వర్తించాలని సర్‌విలియం అంటున్నాడు. ఇప్పుడో రెండు మూడేళ్ల సంధిదశ బ్రిటన్‌లో ఉంటుందని, తర్వాత పునర్నిర్మాణదశ ఇరవై యేళ్లదాకా కొనసాగుతుందని ఆయన

అంచనావేశాడు. ఈ దశలోనే ప్రభుత్వం. భారీమెత్తున పెట్టుబడిపెట్టి దేశంలోని ఉత్పత్తి సంపదను నిర్మించడంలో నాయకత్వం వహించాలి

"ఈ విధానం సారాంశమేమిటంటే, ఒక దీర్ఘకాల ప్రణాళిక ప్రకారం పనిచెయ్యాలి; సాంఘికావసరాలను ప్రధానంగా దృష్టిలో నుంచుకొని, ఆర్థికవ్యవస్థకు స్థిరత్వం చేకూర్చి విస్తరింపజేసే ఉద్దేశంతో ఆ ప్రణాళికను అమలుజరపాలి." (పుట-29-30)

ఈ ప్రభుత్వం పెట్టుబడి కార్యక్రమ స్వభావ మెలాంటిది ?

"దేనిని మొదట అమలుజరపాలి—అంటే ఏది తక్షణావసరం అనేవిషయంలో వివిధసంఘాలు, లేదా ఒకేసంఘం వివిధసమయాలలో వేరువేరు అభిప్రాయాలను ప్రకటించవచ్చును. ఈ నివేదిక బ్రిటన్‌లో యుద్ధం ముగిసినవెంటనే తక్షణావసరాలుగా ఈక్రింది వానిని ప్రతిపాదిస్తున్నది: ఒకవేపు బ్రహ్మాండమైన సాంఘిక పీడనగా పరిణమించిన అసంతృప్తి, వ్యాధులు, అజ్ఞానం, దరిద్రం అనేవానిపై సమిష్టి పోరాటం సాగించాలి. మరొకవేపున, వ్యక్తులచేతులలో నున్నప్పటికి, ప్రభుత్వంచేతిలో నున్నప్పటికి బ్రిటిష్ పరిశ్రమలను సర్వాంగ సంపూర్ణంగా నూతన పరికరాలతో, మంచి యంత్రాలతో నింపాలి. తద్వారా జీవనస్థాయి క్రమాభివృద్ధి చెందేలా చూడాలి. ఇక్కడ పరిశ్రమలంటే అందులోవ్యవసాయాన్నికూడ చేర్చుకోవాలి." (పుట-31)

ఫాక్టరీల నిర్మాణంగూర్చి చెబుతున్నప్పుడు, ప్రభుత్వం పలుకుబడి యెంతవరకుండాలని సర్ విలియం అనుకుంటున్నాడో మనకు స్పష్టపడుతుంది :

"విపరీతమైన నిరుద్యోగాలపై పోరాటం కొనసాగించేందుకు, పట్టణాలలో ప్రజల ఒత్తిడిని తగ్గించేందుకు పరిశ్రమల నేస్థలంలో ఉంచాలి అనే విషయంలోకూడ ప్రభుత్వానికి అధికారం ఉండక తప్పదు." (పుట-170)

అంటే ధనికవ్యవస్థ యావత్తూ నేడు ఒకసంధిదశలో నున్నదని ఏదో ఒకదాని నిర్ణయించుకోవలసి ఉన్నదని బీవరిడ్జి అభిప్రాయమైనట్టు మనకు పై వాక్యాలవల్ల అవగతమవుతున్నది. ప్రత్యేక సంస్కరణలు, ప్రత్యేక కార్యాచరణలు ఇక ఏమాత్రం చాలవని ఆయన అభిప్రాయపడుతున్నాడు. ఆర్ధికరంగంలోనికి ముఖ్యభాగంలో పైని స్వేచ్ఛావ్యాపారాన్ని నిలుపుకోవాలంటే, అందులో ప్రభుత్వ మొక నూతన కర్తవ్యాలకు పూనుకోవాలి. ఆర్ధిక రాజకీయాలలో ప్రభుత్వానికి నాయకత్వముండాలి. ఆర్థికాభివృద్ధి ఇలా జరగాలని స్థూలంగా ప్రభుత్వం నిశ్చయించగలగాలి. కాబట్టి వ్యక్తుల పెట్టబడిలోపాటు ఆర్థికవ్యవస్థ యావత్తుకూ ప్రభుత్వం ఒక ప్రణాళికను తయారుచెయ్యాలి. అసలు పెట్టుబడిలో మూడోవంతు ప్రభుత్వమేపెట్టాలి. మిగిలిన వ్యక్తుల నాలుగోవంతు పెట్టుబడిపై కూడ అధికారం వహించాలి. ఇందుతోపాటు పరిశ్రమలెచ్చట ఏర్పరచాలన్న విషయంలోకూడ ప్రభుత్వానికే నిర్ణయాధికారం ఉండాలి.

ప్రభుత్వం పెట్టుబడినిగూర్చిన సర్ విలియం ప్రతిపాదనలను రెండు విధాలా పరిశీలింతాము; నేటి సంఘ వ్యవస్థలోని వర్గపరిస్థితిపై అదెలా ప్రతిఫలిస్తుంది అనేది ఒకటి. ఇందువల్ల వ్యక్తిగత ధనికవిధానరంగంలో ఆర్థికంగా ఎలాంటి ఫలితాలు వస్తాయి—అనేది రెండవది:

## వర్గబల తారతమ్యం—ప్రభుత్వం పెట్టుబడి

మొదటిఅంశాన్ని తీసుకుందాము; నేటి సంఘవ్యవస్థలోని వర్గపరిస్థితిపై దీనిఫలిత మెలా ఉంటుంది? అందరికీ ఉద్యోగాలు కల్పించడం కోసం—అంటే నేటి ధనికవిధాన ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వం జోక్యం తీసుకోవాలని సర్ విలియం భావం. ప్రతికార్మికునికి ఒకఉద్యోగమివ్వాలని ప్రభుత్వం కల్పించుకోవాలి అంటే ఆయన మాటలలోనే "లేబర్ మార్కెట్టును కొనుక్కునే మార్కెట్టుగాకాక, అమ్మే మార్కెట్టుగా" చేయడం కోసం ఈ పనిచెయ్యాలి

ఇలా జరిగితే కార్మికుల సాంఘికస్థానం తీవ్రంగా మారుతుంది. నేడున్న వర్గసంబంధాలు, వర్గకలహక్రమం పూర్తిగా మారిపోతుంది. నిరుద్యోగం గొప్పపీడగా సర్ విలియం నివేదికలో చాలచోట్ల చెబుతాడు. కాని. ధనికసమాజంలో ఇదంతకంటె తీవ్రమైనదన్న అంశా న్నాయన గమనించరేదు. నిరుద్యోగానికి కొన్ని నిర్ణీతశక్తులున్నవి. దీనినొక శతాబ్దం క్రితమే సోషలిస్టులు గుర్తించారు. పారిశ్రామిక మూలబలగం గూర్చి. అంటే నిరుద్యోగం గూర్చి కరల్‌మార్క్సు దస్ క్రాపిటల్‌లో చాల ముఖ్యమైన అధ్యాయం వ్రాశాడు. ధనిక వాదా న్నేదోవిధంగా సమర్థింపజూచే వారిటీవల ధనికసమాజంలో నిరుద్యోగ ప్రాముఖ్యాన్ని కాదనడం మామూలుగా జరుగుతున్నది. కాని గ్రేట్‌బ్రిటన్‌లో నేటిచర్చలలో ఖచ్చితంగా, మోటుగాకూడ దీని ప్రాముఖ్యం గుర్తించడం జరుగుతున్నది. టైమ్సులో పడిన ఒక వ్యాసాన్ని సర్ విలియమ్ ఉటంకించాడు. (పుట-195)

"స్వేచ్ఛావ్యాపార విధానంలో నిరుద్యోగమేదో యాదృచ్ఛికంగా ఏర్పడిన మచ్చకాదు. పైగా ఈ వ్యవస్థ ప్రధానాంశాలలో ఇది ఒకటి. దీనికొాక ప్రత్యేక విధినిర్వహణ బాధ్యతఉన్నది.

నిరుద్యోగ ప్రథమవిధి (ఇదెల్లప్పుడూ బాహాటంగానో ప్రచ్ఛన్నంగానో ఉంటూనే ఉంటుంది) మనిషిపై యజమాని అధికారాన్ని నిలబెడుతుంది, యజమాని ఇలా అనగలిగే స్థితిలో ఉంటాడు: నీకీపని ఇష్టం లేకపోతే వెళ్లు—చాలమంది వచ్చేవాళ్లున్నారు. మీరు నన్ను పనిలో ఉంచుకోవడం ఇష్టం లేకపోతే పోనీండి—నన్ను పనిలోకి తీసుకునేవారు చాలమంది ఉన్నారు—అని ఆ మనిషికూడ అనగలిగే పరిస్థితి ఉంటే ఎంతోమార్పు రాగలదు....శాంతి సమయంలో అందరికీ ఉద్యోగాలుండనే ఉంటే, తాను కేవలం ఫాక్టరీ లాభానికై పనిచేస్తున్నానని కార్మికుని కోభావం ఏర్పడుతుంది. తనకు కొత్తగా ఏర్పడిన జీవితభద్రత నుపయోగించకుండా ఎందుకుండా లనుకుంటాడు. తనకు దొరికే ప్రతి అవకాశాన్నీ ఉపయోగించుకుంటాడు—ఇందుకు ప్రతిగా అతని నరికట్టే దింకేమీ లేకపోతుంది."

ఈ జీవితభద్రత కార్మికులెలా ఉపయోగించుకుంటారో అదే వ్యాసంలోనే టైమ్సు పత్రిక వ్రాసింది:

"స్వేచ్ఛగా జీతాలకై బేరం చేయడమనే ఇప్పటి అలవాటు, అందరికీ పనులు దొరికేటప్పుడు కూడ కొనసాగినదంటే, జీతాలూరికే పెంచేందుకు ఒత్తిడి యెక్కువవుతుంది. ఇప్పటికే ఈ స్థితి కనిపిస్తున్నది. కాని దేశభక్తిని పురికొల్పి దీనిని ఒకహద్దులో ఉంచ వీలవుతున్నది. మరి శాంతికాలంలో ధరలతోపాటు జీతాలు పెరగడమనేది దీర్ఘవ్యాధిగా పరిణమించవచ్చును." (పుట-198)

శాశ్వతంగా అందరికీ ఉద్యోగాలు ప్రభుత్వజోక్యం వల్ల తప్పక దొరకడం సంభవించి, కార్మికులు జీతాలు పెంచాలని వరుసగా వాంఛిస్తూ వస్తే, ఏమవుతుందప్పుడు?

మరీ అమాయికంగా సర్ విలియం అంటాడు: "ఇందుమూలంగా పరిశ్రమల మొత్తం ఉత్పత్తిలో అధికాధిక భాగం కార్మికులకు చేరికే అవకాశం కలిగితే అదిమంచి ఫలితమే కదా." (పుట-199) హృదయం కల ఉదారవాది అయిన పండితుని అభిప్రాయ మిది. కాని ఈ విషయంలో తమవర్గ ప్రయోజనాలను గుర్తించిన టోరీల అభిప్రాయ మిదికాదు. మొత్తం సాంఘిక ఉత్పత్తిలో, కార్మికవర్గానికి ఎక్కువభాగా న్నిచ్చేందుకు దారితీసే, ఏ ఆర్థిక విధానాన్ని కాని వారు బలపరచరు.

అంతేకాదు, పాలకవర్గం పోగొట్టుకోవలసిన దింకనూ ఉన్నది. సర్ విలియం ప్రతిపాదనలను బట్టి ప్రభుత్వం అధికభాగం పెట్టుబడి పెట్టడం సంభవిస్తే, ఆర్థికగతిలో ప్రభుత్వమే ప్రధాన నిర్ణాయకశక్తిగా పరిణమిస్తుంది; కొంత ప్రత్యక్షంగాను, కొంత పరోక్షంగాను ఉత్పత్తిని కూడ తన అదుపాజ్ఞలలో ఉంచుకొంటుంది. అంటే తప్పనిసరిగా సంఘంలో, పాలకవర్గాల వ్యవహారాలు సన్నగిల్లిపోతాయి. అంతేకాక, పని కావలసిన కార్మికులకంటె ఎక్కువ పనులను, ప్రభుత్వం, తానే పెట్టుబడిపెట్టి పరిశ్రమలను నడుపుతూ కల్పించగలిగినదంటే, తద్వారా కార్మికులకు నిరుద్యోగభయం తొలగిపోయినదంటే, మొత్తం ఉత్పత్తిలో కార్మికుల పాలు పెరగడమేకాక, వారి సాంఘికస్థాయి యావత్తూ బాగు పడుతుంది. ఇంతవరకు సంఘంలో ఆర్థికంగాను, రాజకీయంగాను నాయకులుగా నున్నవారు రెండువిధాలా దెబ్బతింటారు: ఒకవేపు తమకున్న ఆర్థికవిధులు కొన్ని నిర్మూలమవుతాయి. మరొకవేపు కార్మికవర్గం ఆర్థికంగాను, రాజకీయంగాను బలపడుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, బీవరిడ్జి ప్రణాళికలో సోషలిజం లేకపోయినా, సోషలిస్టు వ్యవస్థ కావాలనే సాంఘిక శక్తులకు మంచి బలమిచ్చేందుకీ ప్రణాళిక దారితీస్తుంది.

తన ప్రతిపాదనల ఫలితాలనుగూర్చి సర్ విలియం పూర్తిగా తెలుసుకున్నట్టు కనబడదు. ఆయ నిలా వ్రాశాడు:

"ఈ నివేదికలో వివరించిన విధానం సోషలిస్టు—కాపిటలిస్టు వివాదాన్ని దాటవేస్తున్నది. వెంటనే సోషలిజం ఏర్పడాలనేవారు, ఎన్నటికీ సోషలిజం రానేకూడ దనేవారూ, అనుభవాన్ని బట్టి ప్రభుత్వ—వ్యక్తిగత వ్యాపార విధానాన్ని వాటివాటి గుణావగుణాలనుబట్టి నిర్ణయించుకుందామనేవారూ—ఇలాంటి విభిన్నదృక్పథాలు గలవా రందరుకూడ దీని నంగీకరించవచ్చును." (పుట 191-192)

ఈ అంశంతో మేమేమాత్రం ఏకీభవించం. ఈ నివేదికను సోషలిస్టులు అంగీకరించవచ్చును—ఇది సోషలిజానికి మారే సంధిదశ అని వారు తప్పక భావించవచ్చును. ఇక కొన్నాళ్లు దీనిననుసరించి చూదాం అనుకునే ఉదారవాదులూ దీని నంగీకరించవచ్చును. అయితే "ఎన్నటికీ సోషలిజం రానే కూడదనేవారు" మటుకు చాలవరకు కంగీకరించరు. కారణం: ఈ ప్రణాళిక చెప్పినట్లు, ప్రభుత్వం కొన్ని విధులకు దోహకొన్నట్టయితే, తామింతవరకు నిర్వర్తిస్తున్న కొన్ని విధులకు నీళ్లు వదులుకోవలసి వస్తుంది—పైగా కార్మికుల సాంఘికస్థాయి మరింత బలపడుతుంది. సంఘంలోని వర్గసంబంధాలు అభ్యుదయ అతివాద సోషలిస్టు వర్గాలకు అనుకూలంగాను, అభివృద్ధినిరోధక, ధనికశక్తులకు వ్యతిరేకంగాను మారిపోతాయి. ఇక్కడే ప్రధానసమస్య అంతర్గర్భితమై ఉన్నది. ఈ కారణం వల్లనే, చర్చిల్ నాయకత్వం క్రింద ఉండిన బ్రిటిష్ సంయుక్త ప్రభుత్వం బీవరిడ్జి నివేదిక నంగీకరించలేదు. అందువల్లనే ముఖ్యంగా ధనికవర్గాల పలుకుబడిలో ఉన్న ఏ ప్రభుత్వమూ దీని నంగీకరించలేదు. *

---

* ఈ సంగతిని పూర్తిగా సర్ విలియం గ్రహించలేదు. ఇది కాకతాళీయం కాదు. ఆర్థిక విభాగాలను గూర్చి తన పుస్తకంలో చాలా వ్రాశాడు కాని వర్గాలగూర్చి

కాబట్టే పెట్టుబడిలో నాయకత్వపాత్రను బ్రిటిష్ ప్రభుత్వ పత్రం ప్రభుత్వం చేతిలో పెట్టలేకపోయినది. ఈ ప్రభుత్వ పత్రం అందరికి ఉద్యోగా లుండేలాచూడ్డం ప్రభుత్వ బాధ్యత అన్న సూత్రాన్ని అంగీకరించింది. అయితే మామూలుగా ఉత్పాదకోద్యోగా లనుకునేవానిద్వారా ఉద్యోగాలు కల్పించడం ద్వారా కాక, ఎక్కువగా ప్రభుత్వ పరిశ్రమల మూలంగా ఈపని జరగాలని చూస్తున్నది. అంటే సొంత యాజమాన్యంక్రింద పరిశ్రమలలో ఉద్యోగం దొరక్కపోతే, అలాంటి ఉద్యోగాన్నే ప్రభుత్వం క్రింద కార్మికుడు సంపాదించుకోలేకపోతాడు. అంటే నేడున్న వర్గ సంబంధాలలో పెద్దమార్పులు వచ్చే ప్రతిపాదన లేవీ ఈ ప్రభుత్వ పత్రంలో లేవు—

ఆర్థిక వ్యవస్థలో—ప్రభుత్వ పెట్టుబడివల్ల వచ్చేమార్పు

వర్గ సంబంధాలలో మార్పులు తేవడం అలావుంచి, పెట్టుబడి పెట్టడంలో ప్రభుత్వం ఎక్కువభాగం-బీవరిడ్జి చెప్పినట్లు మూడువంతులు చేతనుంచుకొని, నాలుగో వంతుమీద అధికారం ఉంచుకొనేంత—తీసుకున్నట్టయితే, మొత్తం ఆర్థికవ్యవస్థలో పెద్దయెత్తున కాకపోయినప్పటికి-కొన్నిమార్పులు రాగలవు.

---

వర్గపోరాటం గూర్చి తక్కువ వ్రాశాడు. స్వదేశ విదేశనీతుల రెండిటా ఇంతే. దేశీయ విధానంలో మాడండి, తన పుస్తకం మొత్తంమీద ఒక్కచోట కాని మార్క్సు పేరుగాని, సంక్షోభం నిరుద్యోగాల గూర్చి చర్చించే ఒక సోషలిస్టు పుస్తకం పేరుగాని ఆయన ఎత్తలేదు. ఇక విదేశాంగ విధానంలో ఈ పుస్తకం పొడవునా ఒక్కచోటగాని "సామ్రాజ్యవాదం" "ఇండియా"లగూర్చి ఒక్కమాటలేదు-ఇవి గమనించవలసిన విషయాలు. అమెరికా ప్రణాళిక కర్తలకంటె ఇతను అభ్యుదయవాది. నిరుద్యోగం నిర్మూలించే ఏదైనా యావత్తు-సొంత,ప్రభుత్వ-ఆర్థిక వ్యవస్థకూ చెందినదని గ్రహించాడు. కాని ఈయన ఉదారవాద దృష్టి-ఇందులో కార్మికవర్గమెంత లాభ పడుతుందో గ్రహించనివ్వనీలేదు.

బ్రిటన్‌లో సొంత పెట్టుబడినిగూర్చి విచారణ జరపగా, పూర్తిగా ఉద్యోగాలు దొరకాలంటే 1,000 మిలియన్ పౌన్లింకా పెట్టుబడి పెట్టాలి అని తేలుతుందిఅని మాటవరసకు అనుకుందాం. అప్పుడు ఈ ఖాళీని భర్తీ చేయడంకోసం ప్రభుత్వం బడ్జెటులో ఖర్చు పద్దువేయాలి. ఆసుపత్రులు, రిజర్వాయిర్లు, రోడ్లు, ఇళ్లు ఇలాంటి ప్రభుత్వ పనులకై ఈ డబ్బు ఖర్చు పెట్టాలి. ఇలాంటి పెట్టుబడి సహజంగా, దానికి కావలసిన ముడిసరుకు ధరల నెక్కువచేస్తుంది. ప్రభుత్వం ధరలు కంట్రోలుచేస్తేతప్ప, లేకపోతే మామూలు ధరలకంటె అవి పెరిగిపోతాయి. అలాంటి ముడిసరుకులు సొంతంగా పనిచేసే మిగతపరిశ్రమలకుకూడ కావలసి ఉంటాయి. అంటే పెద్దగా ప్రభుత్వం పెట్టుబడిపెడితే ప్రభుత్వేతర రంగంలోనున్న ధరలలో తప్పకుండా పెరుగుదల వస్తుంది.

ఈ ఆర్థికప్రభావం ఒక్క ముడిసరుకుల ధరలపైనేకాక మరింత పైకి వ్యాపిస్తుంది. ఉదాహరణకు, ఇందువల్ల జీతాలస్థాయి మారుతుంది. జీతాల పెరుగుదల కొంతకారణం లేబర్ మార్కెట్టుపై ఆధారపడి ఉంటుం దని ముందే అనుకున్నాము. నిరుద్యోగాన్ని నిర్మూలించి, లక్షలాది కార్మికులను శాశ్వతంగా ఈ ప్రణాళికమూలంగా ప్రభుత్వం పనుల్లో ఉంచుకోగలిగితే, ఆ కార్మికుల పరిస్థితి అందువల్ల మారుతుంది. అదీకాక, దీనిఫలితంగా ప్రభుత్వేతర పరిశ్రమల్లో పనిచేసే కార్మికులస్థితి—ముఖ్యంగా వారి జీతాలస్థాయి మారుతుంది,

ఈ ప్రభుత్వపెట్టుబడి కార్యక్రమం సర్ విలియం చెప్పినంతదాకా వెళ్లడమే జరిగితే, ఎలాగూ తమ కిక పని దొరికితీరుతుందని కార్మికులకు తెలిసిపోతుంది. యజమానులు పనులిచ్చినా ఇవ్వకపోయినా వారికి నిరుద్యోగం వస్తుందని భయపడవలసిన పనిఉండదు. లేబర్ మార్కెట్టులో కార్మికులస్థితి బాగా గట్టిపడుతుంది. అందుతో జీతాలు హెచ్చుచేసుకునే

లపు ప్రయత్నాలకు ఆనుకూల్యం కలుగుతుంది—వారి జీతాలు తగ్గించాలనే యజమానుల ప్రయత్నాలకు విఘాతం జరుగుతుంది. ఇలా ప్రభుత్వ మూలధన విస్తరీకరణ కార్యక్రమం ముడిసరుకుల ధరలనేకాక, జీతాల రేటునుకూడ మారుస్తుంది. ఇంతేకాక వ్యవసాయపు పంటల ధరల నెక్కువచేసి, జీవిత వ్యయాన్ని పెంచుతుంది. ప్రభుత్వం అందరికీ పనులివ్వగలిగినప్పుడు, తానే ధరలు కంట్రోలుచేస్తేతప్ప, లేకపోతే ధాన్యం ధరలు హెచ్చుతాయి.

ఇలా జరిగినప్పుడు, ప్రభుత్వానికి చెందని సొంత వ్యాపార రంగంలో లాభాలపైకూడ దీనిఫలితం కనిపిస్తుంది. మరి లాభాల అవకాశమే యజమానులు పెట్టుబడి పెట్టేందుకు కారణం. మనమిప్పు డెక్కడికి వచ్చాము? సొంత పెట్టుబడులేవో మార్చరాని, తగ్గించరాని మొత్తాలని, ప్రభుత్వం చేయగలిగిందల్లా, అది చాలనప్పుడు, తానూ కొంత పెట్టుబడి పెట్టడంమాత్రమేనని అనుకోవడంలో అర్థం లేదు. వ్యక్తుల పెట్టుబడి పెరుగుదల-తరుగుదలలకు లాభాలెంత వస్తాయనేదే కీలకం. పైగా ముడి సరుకులధరలు, ధాన్యం ధరలు, జీతాల రేటు——వీనిపైకూడ ఈ పెట్టుబడి ఆధారపడి ఉంటుంది.—అంటే ఇవన్నీ ప్రభుత్వ పెట్టుబడి మూలంగా మారేవే నన్నమాట. మరి అలాంటప్పుడు, ప్రభుత్వం వ్యక్తుల పెట్టుబడి చాలని ఖాళీని భర్తీచేయడంకోసం పెడితే, అది అసలు వ్యక్తుల పెట్టుబడి మరింత తగ్గడానికే దారితీస్తుంది. ప్రభుత్వరంగంలో ప్రణాళికాబద్ధమైన ఆర్థికవ్యవస్థ నేర్పరిస్తే, ప్రభుత్వేతర ఆర్థికరంగంలో ఆవ్యవస్థ యొక్క ప్రణాళికారాహిత్యం మరింత ఎక్కువవుతుంది.

ప్రభుత్వ పెట్టుబడికీ, వ్యక్తుల పెట్టుబడికీ మధ్య ఏ కంచుగోడా ఉండదు. పైగా అవిరెండూ చాల సన్నిహితమై సమ్మిళితమై ఉంటాయి.

ఎటా కొంత పెట్టుబడి పెట్టాలనుకుంటే ఆ ప్రభుత్వ విధానం, కేవలం సొంత పెట్టుబడికి తోడుగా ఉండడంతో ఆగదు. ఇదిలా జరిగినా సొంత పెట్టుబడి ఉన్నదున్నంతా ఉంటుందనుకోవడం వట్టి ఊహే కాగలదు. ఒకతూరి పెట్టుబడిపెట్టడానికే ప్రభుత్వం ఆరంభిస్తే, అంతతో ఆగదు. మరింత ముందుకుపోతుంది. అంటే ప్రభుత్వాన్ని దొరకబుచ్చుకునేందుకై జరిగే పోరాటంలో, ఇందుతో ఒక నూతనదశ ఆరంభమవుతుంది.

ఆర్థికరంగంలో ప్రభుత్వ మిలా జోక్యం కల్పించుకుంటుందని అనుకునేందుకు అవకాశమేమీలేదు. బ్రిటన్‌లో లేబర్‌పార్టీ అధికారంలో నున్నది. అది ప్రభుత్వ పత్రంలోనున్నట్టుగాని, బీవరిడ్జి నివేదికలో ఉన్నట్టుగాని ఈ కార్యక్రమానికి పూనుకోలేదు. మరొకవిధంగా ఆర్థికరంగంపై ప్రభుత్వాధికారం హెచ్చేరీతిగా చూస్తున్నది. నిరుద్యోగం అంతగా లేనప్పుడు, త్వరలో వచ్చేసూచనలుకూడ లేనప్పుడు వీరీపద్ధతి ననుసరించారు—కొన్ని కీలక పరిశ్రమలు జాతీయం చేయాలన్నదే బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించిన విధానం. కాబట్టి సర్ విలియం ప్రతిపాదించినట్టి సోషలిజం—కాపిటలిజం వినాదాన్ని దాటవేయక, సోషలిజంవేపు బ్రిటిష్ ఆర్థిక విధానాన్ని నడిపేందుకు బుద్ధిపూర్వకంగా పూనుకున్నది.

నేటి బ్రిటన్ పరిస్థితిలో అది విజయవంతమవుతుందా కాదా అన్న విషయంతో మనకు ప్రసక్తిలేదు. ఇంతకూ మనం గ్రహించవలసిన విషయమిది: ఆర్థికసంక్షోభం రాకుండా చేసేందుకు, కనీసం దాని తీవ్రతను తగ్గించేందుకు బ్రిటన్‌లో అధికారులు తీసుకుంటున్న చర్యలు ధనికవ్యవస్థ పునాదులనే కదిలించివేసేవిగా నున్నవి. ఇందుతో ఇంగ్లాండులో వర్గ కలహం ఇప్పటికే ఒక అంతస్తుకు వచ్చినది.

## సంక్షోభాన్ని తప్పించుకొనేందుకు గట్టి ప్రతిక్రియలేవీ అమెరికాలో కనిపించవు

అమెరికాలో మరి బ్రిటిష్ సంయుక్త ప్రభుత్వపత్రం ప్రతిపాదనం మాత్రంకూడ ఆలోచనకు రాలేదు. ఇంత విభేదానికి కారణమైన కారణా లేవి?

బ్రిటన్‌లో రెండు ప్రపంచ యుద్ధాలకుమధ్య, 1921—39 వరకు శాశ్వతంగా విపరీతమైన నిరుద్యోగం వ్యాపించింది—వీరిసంఖ్య లక్షలకు మించిపోయింది. ఈ పరిస్థితి కన్సర్వేటివ్ ప్రభుత్వంక్రింద చాలకాలం వరకు—మధ్యలో కొంతకాలం లేబర్ ప్రభుత్వంక్రిందను-కొనసాగినది. నిరుద్యోగ నిర్మూలనకీ కన్సర్వేటివ్ ప్రభుత్వా లేమిచేయలేదు. ఇక రూజ్వెల్టు న్యూడీలుద్వారా అమెరికాలో ఇంతకంటె తక్కువే జరిగిందనుకొండి.

ఇలా ఇరవై యేళ్ళదాకా అభ్యుదయదశ బ్రిటన్‌లో తల సూపలేదు. ఈ పరిస్థితిలోనే ప్రభుత్వ పత్రంలోని ప్రతిపాదనలు ప్రకటితమైనవి. దానం తటనే ధనికవిధానం తెప్పరిల్లుకుంటుందనే విశ్వాసం అంతరించిపోయింది. అందరినుండీ, ప్రభుత్వం ఇందులో జోక్యం తీసుకోవాలన్న వాంఛ విశ్వజనీనమై వినబడసాగినది. ఈ సర్వసామాన్య వాంఛ రాజకీయంగా రూపొందినది. ఇందుకు కారణం, బ్రిటిష్ కార్మికవర్గం తరతరాలుగా రాజకీయంగా, ఆర్థికంగా కూడ నిర్మాణయుతమై ఉన్నది. కాబట్టే ధనిక విధానం మార్పుకోసం తీసుకోవలసిన చర్యలకిది కేంద్రంగా పరిణ మించినది.

మరి అమెరికాలో ఆర్థిక, రాజకీయ వాతావరణం చాల విభిన్న మైనది. అమెరికా ధనికవాదం కూడ, 1929 సంక్షోభాన్ని సంతృప్తి కరంగా నెట్టివేయలేక పోయినమాట వాస్తవమే. కాని 1929 కి ముందు

అమెరికాలో ఆర్థికాభ్యుదయ్య దశ చాలకాలం నడిచినది. ఇలా, అమెరికన్లకు సంబంధించినంతవరకు, రెండుయుద్ధాలకు మధ్యకాలం మరీ ఆర్థిక ప్రతిష్టంభన దశకాదు—తర్వాత అందరితోపాటు అమెరికాకూడ సంక్షోభాన్ని రుచి చూచిందనుకొండి. ఇందుకు తోడు, ఇదే సమయంలో రూజ్వెల్టు ప్రభుత్వం అధికారంలోకి వచ్చి "న్యూడీల్"ను అమలు పరచినది. ఈ సంస్కరణ ఆర్థికవ్యవస్థపై కొన్ని విషయాలలో ప్రభుత్వం యొక్క పలుకుబడిని యెక్కువ చేసినది.

న్యూడీలుద్వారా అమెరికా ధనికవాదం, ఆర్థికసంక్షోభాన్ని తప్పించుకోలేకపోయినదని అభివృద్ధినిరోధక వర్గాలవారు పదేపదే వాదిస్తుంటారు. ప్రభుత్వజోక్యం వల్ల ఆటంకం లేకపోయినట్టయితే, ధనికవిధానం సంక్షోభాన్ని పూర్తిగానిర్మూలించి, ఉద్యోగాలందరికీ కల్పించి నూతనఅభ్యుదయ దశను కొనివచ్చి ఉండేదని వీరివాదం. ఇప్పటికీ ఈ వాదాన్ని బలపరిచేవారు ఉన్నారంటే, అందుకు కారణమిది. అమెరికా ఆర్థికవ్యవస్థ ఇరవై యేళ్ళదాకా ప్రతిష్టంభితం కాలేదు. 1929 తర్వాతనే విపరీతమైన నిరుద్యోగం వ్యాపించింది. కాబట్టి ఇదేదో తాత్కాలికోపద్రవమేనని భావించడ మింకా జరుగుతున్నది,

ధనిక విధానానుగుణమైన ఉత్పత్తి, చరిత్రలో ఒక దశనప్పుడే అందుకొన్నదని, అందరికీ పనులుకల్పించే దశ గడచిపోయినదనీ, తిరిగీ నిరుద్యోగ ప్రమాదం రానున్నదనీ, అది ఈసారి తాత్కాలికంకాక శాశ్వతమనీ భావించడం సర్వసాధారణమైనది. ఈ భావా లిప్పటికే అమెరికా సామాన్య ప్రజలలో వ్యాపించినవి—కాని అవి ఇంకా రూపొందలేదు. అవింకా స్థిరంగా పాదుకొనలేదు. ధనికవిధానం క్రింద ఇదంతా తప్పనిసరి అన్న దృఢాభిప్రాయరూపం వానికింకా రాలేదు.

తిరిగి సంక్షోభం రానున్నదని అమెరికా ప్రజ ఇప్పటికే భయపడుతున్నారు. కాని, నేటి అమెరికా ఆర్థిక విధానంలో అది తప్పనిసరి అన్న మాటను వారు గుర్తించడం లేదు. సంక్షోభం తర్వాత తిరిగీ అభ్యుదయ దశ తప్పకుండా వస్తుందన్న మాట అబద్ధమని వారు గుర్తించడం లేదు. 1929 లో తమ అనుభవాలను మరచి తిరిగీ అభ్యుదయ దశ వస్తుందను కుంటున్నారు. ఇంతవరకూ వీరు, ధనికవాదం తనంతటతాను ప్రతిష్టంభన నుంచి కోలుకోగలదన్న భావంతో ఏకీభవిస్తున్నారు.

ఇలా బ్రిటన్‌కూ అమెరికాకూ ఆర్ధికపరిస్థితిలో చాలభేద మున్నది. రాజకీయంగా ఆభేదం మరింత యెక్కువగానున్నది. బ్రిటన్‌లో లేబర్ పార్టీ, ధనికవిధానం పునాదులలో మార్పులు తెచ్చేందుకు పనిచేస్తున్నది. ఆర్ధిక పునాదులలో మార్పులు అవసరమన్న భావాన్ని అక్కడి ప్రజలు అందరూ అంగీకరిస్తున్నారు—ఇందుకు అక్కడ చిరకాలంనుంచీ ఉన్న రాజకీయ కార్మికవర్గోద్యమం కారణం.

అందుకు వ్యతిరేకమైన పరిస్థితి అమెరికాలో కనిపిస్తుంది, ఇంకా ధనికవిధానం వృద్ధిపొందగలదని, సంక్షోభంనుండి తనంతటతానే కోలుకో గలదని ఆమెరికా ప్రజలు భావిస్తున్నారనేందుకు నిదర్శనం—నేటికీఅక్కడ ఉన్న రెండు ధనికపార్టీలకు ప్రతిపక్షంగా మూడో పక్షం ఒక్కటీ పుట్టుకరాలేదు. అమెరికా బలవత్తరమైన గుత్తవ్యాపార సంస్థలున్న దేశం- యుద్ధంలో కార్మికసంఘాలు చాల బలపడినప్పటికీ, ఇప్పటికీ అక్కడ లేబర్‌పార్టీలేదు. అసలొక్క సోషలిస్టు దినపత్రికకూడా లేదు.

ధనికవిధానానికి వ్యతిరేకమైన అతివాదశక్తులు రాజకీయంగాచక్కగా సమీకృతులు కాలేదు. ఇంతలో అవుతారన్న ఆశాలేదు. కాబట్టి అక్కడి ప్రజల దృక్పథం ఇలాఉంది. సంక్షోభానికి వ్యతిరేకచర్యలు తీసుకునేందుకు

గాని, వస్తే కనీసం దానితీవ్రతను తగ్గించేందుకు గాని, ప్రభుత్వం అవసర చర్యలను తీసుకొనాలి అని. ప్రభుత్వంపై ఒత్తిడి తేగల కేంద్రమొక్కటీ లేదు. పైగా ఆర్థికవ్యవస్థపై ప్రభుత్వానికెక్కువ అధికారం ఉండరాదనే శక్తులకే ఇంకా ఎక్కువ ప్రాపకమున్నది. కార్మికవర్గం రాజకీయంగా సమైకృతం కాలేదు. కార్మికవర్గంలో అధికభాగంపై అమెరికా ధనికుల కింకా పలుకుబడి ఉన్నది. అమెరికా మధ్య తరగతులపైకూడ ధనిక స్వాముల పలుకుబడి ఇంకా విపరీతంగా నున్నది.

కీలకపరిశ్రమలను జాతీయం చేయాలనే బ్రిటిష్ లేబర్‌పార్టీ కార్య క్రమంలాంటిది అమెరికాలో లేదు. ఈ ప్రశ్నను చర్చించడమే అరుదు. బీవరిడ్జి ప్రణాళిక నిక్కడ ఏప్రధాన రాజకీయపక్షంకూడ అంగీకరించలేదు. ప్రభుత్వం ఉద్యోగాలు కల్పించేందుకు బాధ్యత తీసుకొనాలనే వారుకూడ దీనిని నిరాకరిస్తున్నారు, అందరికీ ఉద్యోగాలు చేకూర్చడం ప్రభుత్వ బాధ్యత అని, స్వేచ్ఛావ్యాపారవిధాన మైనప్పటికి, సంక్షోభాన్ని ఆపలేదని చెబుతుంది కాబట్టి, బ్రిటిష్ ప్రభుత్వ నివేదికకూడ వీరికి మరీ అతివాద ధోరణి అనిపిస్తున్నది.

సొంత వ్యాపారస్తులు పెట్టేపెట్టుబడి, పనివారందరికి పనికల్పించ గలుగుతున్నదా లేదా అని ప్రభుత్వం గమనించాలని, అలాంటప్పుడు ప్రభుత్వం తన పెట్టుబడితో కొత్త పను లారంభించాలని మాత్రమే— ఇక్కడి అతివాద ప్రతిపాదన లనబడేవి సూచిస్తున్నవి. వాగ్నర్ ముర్రేబిల్లు మొదటి చిత్తుకాపీలాంటిది కూడ అమెరికా శాసనసభ్యుల దృష్టిలో మరీ అతివాదధోరణిలో నున్నది. బిల్లు ఆఖరుముసాయిదాలో అందరికీ ఉద్యో గాలు కల్పించాలన్నమాట తొలగించివేయబడినది. ఏదో చెప్పగా వారు చెప్పినదేమంటే "సాధ్యమైనంత యెక్కువమందికి పనులు కల్పించడం, ఉత్పత్తిని కొనుగోలుశక్తిని పెంచడం ఇవి ప్రభుత్వ బాధ్యతలు"అనిఏదో

చచ్చుగా ఒక వాక్యమందులో ఉన్నది. మహాదారుణంగా రానున్న సంక్షోభ ప్రాంగణంలో ఉండగా అమెరికాధోరణి ఇలా ఉన్నది.

కాబట్టి అతి బలవత్తరమైన దేశంలో ప్రభుత్వం సంక్షోభ నివారణార్థం ఆర్థికవ్యవస్థలో కల్పించుకోవడమనే అవకాశంలేదు. అంటే అర్థమేమిటి ? సంక్షోభకారక శక్తులన్నీ, వృద్ధిచెందుతాయి, నిరాఘాటంగా తమపని తాముసాగించ మొదలిడుతాయి. 1929కి కారణమైనశక్తులు మరి కొన్ని నూతన అంశాలతో బలపడి వెలువడగలవు. కొంతకాలం దాక, దాపుడుధనం మూలంగా వస్తుపులకు గిరాకీ, దాపుడు పెట్టుబడిని శాంతి సమయంలో వెచ్చించడం అనేవి కనిపించినా, వీనికెదురుతిరిగే కారణాలూ ఉన్నవి. అయితే ఇవి తమపని ముగించగనే ఇక సంక్షోభ కారకశక్తులు దారుణరూపంతో విరుచుకపడగలవు. అంటే త్వరలోనే సంక్షోభం మన దేశంలో దారుణంగా పైబడనున్న దన్నమాట.

సంక్షోభం వచ్చేదాకనైనా, అభ్యుదయ దశ ఉంటుందని - యాదాలాభంగానైనా అనుకోవీలులేదు. నోట్లముమ్మరం ఈసారి బాగా అణచే ప్రయత్నం జరిగినప్పటికీ, నేడది మరీ బలపడుతున్నది. ధరలు విపరీతంగా పెరిగినట్లయితే, దానివెంట చిన్న ఆర్థికదుస్థితి ఏర్పడి, తిరిగీ అదే అభ్యుదయదశ—మొదటియుద్ధం జరిగిన వెంటనేవలెనే కొనసాగవచ్చును.

అలాంటి నోట్లముమ్మరంతో ఏర్పడే తాత్కాలిక ఆర్థికదుస్థితిని గూర్చికాదు, మనమిక్కడ మాట్లాడుతున్నది, అసలుభావి మహాసంక్షోభాన్నిగూర్చే.

221

ఏడో అధ్యాయం

# ప్రపంచ రాజకీయ పరిస్థితి, రానున్న సంక్షోభం

రానున్న సంక్షోభం అమెరికాలో ఎలాంటి ఫలితాల నిస్తుందో—వానిని గురించి చర్చించేముందు, ఆ సంక్షోభం ఎలాంటి రాజకీయ, ఆర్థిక వాతావరణంలో సంభవిస్తుందో మనం కొంత తెలుసుకోవాలి. 1929 నాటి పరిస్థితికీ దీనికీ ఉన్న విభేదమేమిటో బోధపరుచుకోవాలి.

ముఖ్యంగా మూడు విభేదాలున్నవి:

(1) 1929సంక్షోభం వచ్చేటప్పటికే సోవియట్ యూనియన్ ఒక ప్రధాన రాజ్యంగా ఏర్పడినది. మరి వచ్చే సంక్షోభకాలంలో అమెరికా రష్యా రెండుమాత్రమే ప్రపంచంలోని అగ్రరాజ్యాలుగా నిలువగలవు.

(2)1929 సంక్షోభం వచ్చేనాటికే, యూరోపులోని ప్రధాన పారిశ్రామికరాజ్యాలు సాంఘికంగా సంచలించి పోయిఉన్నవి. అయినప్పటికి ధనికవిధానం సంక్షోభంనుండి బతికి బయటపడగలిగినది. ఏమైనప్పటికి, రానున్న సంక్షోభంనాటికి యూరోపు భూభాగంలో చాల ప్రదేశాలలో ధనికవిధానం నిర్మూలితమైపోయి ఉంటుంది. మరికొన్నిట తన అస్తిత్వంకోసమే అది తన్నుకుంటూ ఉండవలసివస్తుంది. 1929నాటికి అమెరికా తనలాంటి ఇతర ధనికరాజ్యా లన్నిటిలోనూ తానూ ఒకటి మాత్రమే. మరి ఈ దఫా, ధనికవిధానం కదలిపోకుండానో, ప్రమాద

స్థితిలో లేకుండానో ఉన్న దేశాలలో ఒక్క అమెరికాయే మిగులు యుంది.

(3) 1929 సంక్షోభకాలమంతటిలోను, సామ్రాజ్యదేశాలు తమవలస దేశాలపై తమపెత్తనాన్నింకా నిలుపుకోగలిగినవి. ప్రపంచంలో సగం జనాభా వలసదేశాలలో, అర్థవలసదేశాలలో నివసిస్తూ ఉండినది. మరి రానున్న సంక్షోభంనాటికి చాలదేశాలలో సామ్రాజ్యవాదపాలన అంతరించిపోయి ఉంటుంది. మరికొన్నిట కొనప్రాణంతో కొట్టుకుంటూ ఉంటుంది.

## సోవియట్ యూనియన్ పెంపుదల

1929నాటికి సోవియట్ యూనియన్ అప్పుడప్పుడే మొదటి పంచవర్ష ప్రణాళికను అమలుజరిపేందుకు ఆరంభించినది. ప్రధానంగా వ్యవసాయదేశంగా ఉన్నదల్లా పారిశ్రామికదేశంగా మారుతున్నది. అపుడప్పుడే ప్రథమ మహా యుద్ధంలోను, అంతర్యుద్ధంలోను దేశంలో ఏర్పడిన భీభత్సాన్ని చక్కబెట్టుకుంటున్నది. 1914 ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో జారిస్టు రష్యాది ఏనూటికి నాలుగు వంతులో మాత్రమే ఉండినది. 1929 సంక్షోభం ఆరంభమైనప్పటికి, సోవియట్ యూనియన్ భాగం 4.5%గా నున్నది. అంటే సోవియట్ పారిశ్రామికోత్పత్తి అప్పటికింకా ప్రపంచోత్పత్తిలో గొప్పపాత్రను నిర్వహించడం లేదు, ఇందువల్ల ఒకభాగంలోని ఆర్థికవిధానం సంక్షోభ సంపర్కం లేకుండా తప్పుకోవడం అందువల్ల సంక్షోభగతిలో మార్పు రావడంఅంటూ లేకపోయినది.

సంక్షోభ సమయంలో రష్యాలోని అభివృద్ధి ఇతర దేశాలలోకంటె విభిన్నంగా నున్నది. అన్ని ధనికరాజ్యాలలోను పారిశ్రామికోత్పత్తి బాగా పడిపోయినది. కాని సోవియట్ యూనియన్‌లో సంక్షోభ కాలంలోని ఏ

సంవత్సరంలోకూడ తగ్గలేదు సరికదా, ఏటేటా క్రమంగా పెరుగుతూనే వచ్చింది. నిరుద్యోగాన్నప్పుడే సోవియట్ నిర్మూలించగలిగింది. మిగత ధనిక రాజ్యాలలో నిరుద్యోగగతి అధ్వాన్నమవుతూవస్తుండగా, సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగ సమస్యే రాలేదు. సంక్షోభ సమయంలోగాని, నాజీఆక్రమణకు ముందుగాని.నాజీఆక్రమణ ప్రారంభంలోకాని సోవియట్ యూనియన్‌లో నిరుద్యోగమనేది లేదు. అంటే ఆయుధోత్పత్తి ఆర్థిక వ్యవస్థలో అట్టే పెద్ద పాత్రనేమీ నిర్వహించని దశలోనే నిరుద్యోగం లేదన్నమాట.

1929 నాటినుండి నాజీలు సోవియట్‌యూనియన్‌పై దాడిచేసే నాటిదాకా ఉన్న మధ్యకాలంలో చాల పంచవర్షప్రణాళికలు అమలు జరుపబడినవి. ఆకాలంలో పారిశ్రామికోత్పత్తి పెద్దయెత్తున పెంపొందినది. మిగత ప్రపంచంలో ఎక్కడగూడ ఇంతవేగంగా, అధికంగా పెరగడం సంభవించలేదు—సోవియట్ పారిశ్రామికాభివృద్ధిని గూర్చి, సక్రమంగా జర్మన్ ఆర్థిక పరిశోధనాలయం నివేదికలను ప్రచురిస్తూ రావడం గమనించదగిన అంశం. ఈనివేదిక ననుసరించి, ప్రపంచ వస్తూత్పత్తిలో సోవియట్‌యూనియన్‌భాగం 1939 కంతా నూటికి 12 వంతులు పెరిగింది.*

ఈ పెరుగుదలే పూర్వపు యూరోపురాజ్యాల పరస్పర తారతమ్యానికీ. నేటి తారతమ్యానికీ మధ్య విభిన్నతకు ప్రధానమైన కారణం. ఆ రోజుల్లో జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సులకంటె జారిస్టు రష్యా వస్తూత్పత్తిలో

---

*"ప్రధాన వస్తువుల ఉత్పత్తిలో, సోవియట్ యూనియన్, ప్రపంచోత్పత్తిలో తనభాగం తాను సంపాదించుకున్నది. చాలరంగాలలో అగ్రరాజ్యాల ప్రథమ శ్రేణికి చెందినది....యుద్ధభీభత్సంవల్ల కలిగిన నష్టాన్ని భర్తీ చేసుకోవలసిన సోవియట్ వస్తూత్పత్తి, యుద్ధానంతరం బాగా పెరిగినది. మామూలుగా ప్రపంచంలో సగటున

చాల వెనుకబడి ఉన్నది. ఆనాటి జర్మనీ పారిశ్రామికంగా జారుకాలపు రష్యాకంటె అత్యధికమైన ఉన్నతస్థాయిలో నున్నది. వట్టిలెక్ఖలలో, జర్మనీ భారీపరిశ్రమల ఉత్పత్తి, జారు రష్యాకంటె నాలుగైదింత లెక్కువగా ఉండినది. కాబట్టే ప్రాచ్యరంగంలో జర్మనీ మొదటిప్రపంచయుద్ధపు రోజుల్లో ఎన్నడూ తనసేనల్లో మూడోవంతుకంటె ఎక్కువ ఉంచవలసిన అవసరం లేకుండాపోయినది (ఒకొకప్పుడు అయిదోవంతుకంటె ఎక్కువ ఉంచవలసిన అవసరంలేక పోయినది కూడ), ఈ రంగాన్నెప్పుడూ అప్రధానంగానే చూచేవారు. ఇంత చిన్న సేనాబలం కూడ, మరి జారిస్టురష్యాపై ఎన్నో సైనికవిజయాలను సాధించగలిగినది.

రెండవ ప్రపంచయుద్ధంలోని సైనికపరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నమైనది. ఈలోగా పారిశ్రామికంగా వచ్చినమార్పు నిది ప్రతిబింబిస్తున్నది. రెండో ప్రపంచ యుద్ధం ఆరంభమయ్యేనాటికి, నాజీజర్మనీ పారిశ్రామికోత్పత్తి, 1929కంటె నూటికి 33 1/3 వంతులు అధికమయినది. మరి జర్మనీ సోవియట్‌రష్యాపై దాడిచేసినప్పుడు, తన దేశంలోని పారిశ్రామికోత్పత్తేకాక, యూరోపు భూఖండంలోని పారిశ్రామికోత్పత్తిలో చెప్పుకోదగినంత ఎక్కువ భాగం జర్మనీ కైవసమైనది. ఆ ఉత్పత్తిని జర్మనీ తన ఆర్థికవ్యవస్థలోని భాగంగా చేసివేసుకున్నది. అయినప్పటికి సోవియట్ యూనియన్ పారిశ్రామికస్థాయి తద్వారా సైనికస్థాయి కూడ బాగా బలపడినది. ఏతత్ఫలితంగా, సోవియట్ యూనియన్‌పై జర్మనీ, తన యావత్సైనిక శక్తిలో 4/5 వంతులు ఉపయోగించినప్పటికి, సైనిక

---

జరిగే అభివృద్ధిగతికంటె సోవియట్ ఉత్పత్తి అభివృద్ధి అతి వేగంగా సాగినదని గుర్తించవచ్చును....ఇందుతో ప్రపంచోత్పత్తిలో సోవియట్ భాగం ఎక్కువయినది. అంచనాలనుబట్టి 1938లో ఈభాగం 11.5% 1939లో 12%కు పెరిగినది.”

బర్లిన్ ఆర్థిక పరిశోధనాలయం, ఏప్రెల్ 30, 1940.

విజయాన్ని సాధించలేక పోయినది. రష్యా సైనికబలం అంత అత్యధికంగా ఉన్నదికాబట్టే, నాజీజర్మనీ ప్రాచ్యరంగంలో తన సేనలలో అర్ధభాగాన్ని ఉంచడం తప్పనిసరియైనది. ఆఖరున సోవియట్ సేనలు నాజీ సేనలను జర్మనీలోనికి తరుముకొనిపోయి ఓడించినవి.

యుద్ధానికి పూర్వంకూడ సోవియట్ ఉత్పత్తి, బ్రిటన్‌కంటెను, ఫ్రాన్సుకంటెను గూడ హెచ్చినది. కాబట్టి ప్రపంచ పారిశ్రామిక వస్తూత్పత్తిలో అమెరికా, జర్మనీల తర్వాత సోవియట్ మూడవస్థానాన్ని ఆక్రమించింది. యుద్ధ మికవస్తుందనగా సోవియట్ దేశపు బొగ్గు, ఇనుము, ఉక్కు-ఉత్పత్తి జర్మనీని మినహాయిస్తే యూరోపు భూఖండం మొత్తం మీద అయ్యే ఉత్పత్తితో సమానంగా కొనసాగింది.

* బొగ్గు ఉత్పత్తి (వెయ్యి టన్నులలో) 1938 లో

| | | |
|---|---|---|
| జర్మనీ మినహా యూరోపు భూఖండం | .... | 154,342 |
| సోవియట్ యూనియన్ | .... | 132,888 |

ఉక్కు ఉత్పత్తి (వెయ్యి గ్రాసు టన్నులలో) 1938 లో

| | | |
|---|---|---|
| జర్మనీ మినహా యూరోపు భూఖండం | .... | 18,267 |
| సోవియట్ యూనియన్ | .... | 18,000 |

ముడి ఇనుము ఉత్పత్తి (వెయ్యి గ్రాసు టన్నులలో) 1938 లో

| | | |
|---|---|---|
| జర్మనీ మినహా యూరోపు భూఖండం | .... | 15,351 |
| సోవియట్ యూనియన్ | .... | 14,600 |

* ఈ అంకెలు నానాజాతిసమితి లెక్కల సాలుసరి ప్రచురణ 1942—44 పుట 153, 158, 159 నుండి గ్రహించబడినవి.

రెండో మహాయుద్ధ ఫలితంగా యూరోపులోను, ఆసియాలోను ప్రపంచంలోనుకూడ సోవియట్ యూనియన్ స్థానం చాల బలపడినది. యుద్ధం ఏళ్లకాలది ఆ ప్రాంతంలోనే జరగడం మూలంగా, సోవియట్ యూనియన్‌లో అనేక ప్రాంతాలు విధ్వంసమయిన వన్నమాట నిజం. యుద్ధ ప్రారంభంలో జర్మన్‌లు సోవియట్ ప్రాంతం లోపలికి చొచ్చుకొని పోయారు. అప్పుడు సోవియట్, భూదగ్ధ విధానా న్నవలంబించి జర్మన్లకేమీ దక్కకుండా చేసేందుకు ప్రయత్నించింది. యుద్ధం ముగిసేకాలానికి, జర్మన్లు ఒక రాష్ట్రంనుంచి, మరొక రాష్ట్రానికి తిరోగమనం చేయవలసి వచ్చినది. అప్పుడు వారు, తాము పోతూపోతూ దొరికినదానినల్లా ధ్వంసం చేస్తూవెళ్లారు.

మరొకవేపేమో, యుద్ధం జరుగుతుండగనే సోవియట్ పరిశ్రమలను మొత్తంగా తూర్పునకు ప్రభుత్వం తరలించినది. జర్మన్లు ఆక్రమించే అవకాశం ఏమాత్రంలేని ఆసియా రాష్ట్రాలలో పారిశ్రామికాభివృద్ధి విపరీతంగా కొనసాగింపబడినది. వీటన్నిటికంటె ముఖ్యంగా మొదటి యుద్ధం తర్వాతికంటె ఇప్పుడు సోవియట్ ప్రభుత్వానికి పునర్నిర్మాణావకాశా లెక్కుడుగా నున్నవి. మొదటియుద్ధం తర్వాత దీర్ఘకాలం అంతర్యుద్ధం ద్వారాను, విప్లవం ద్వారాను యుద్ధ విధ్వంసనం మరింత భీభత్సంగా తయారయినది. పారిశ్రామిక, వ్యావసాయిక వస్తూత్పత్తి అతి హీనస్థితికి పడిపోయినది. ఇందువల్ల పునర్నిర్మాణం చాలకాలం ఆపబడడమే కాక, అందుకు కావలసిన నిపుణులైన శ్రామికులు, ఇంజనీర్లు కరవయ్యారు. ఇందుకుతోడు కొత్తగా వచ్చిన విప్లవప్రభుత్వానికి ఆర్థిక వ్యవస్థను నడపడంలో, పెద్దయెత్తున ప్రణాళికలు వెయ్యడంలో, అనుభవంలేదు. ఆ సమయంలో కూడ సోవియట్ ప్రభుత్వానికి విదేశాల నుంచి సహాయం అత్యల్పంగా వచ్చినది. కాబట్టి పారిశ్రామిక నిర్మాణాన్ని,

పౌరోపయోగ వస్తువుల ఉత్పత్తి సరికట్టి కొనసాగించవలసి వచ్చినది. ఇన్ని ఇబ్బందులున్నప్పటికి, అంతర్యుద్ధం ముగిసిన అయిదేళ్ళలోనే సోవియట్ యూనియన్ ఉత్పత్తి తిరిగి 1913 నాటి అంకెలను అందుకో గలిగినది.

నేటి పరిస్థితి అంతకంటె సోవియట్‌కు అనుకూలంగా నున్నవి. ఇప్పటికీ ఆశియాప్రాంతాలలో యుద్ధం దెబ్బతగలని పెద్ద పరిశ్రమ లున్నవి. ఇందుకుతోడు, లక్షలకొలది ఆయాప్రత్యేకశాఖలలో నిపుణు లైనవారూ, ఇంజనీయర్లూ ఉన్నారు. పైగా అంతర్యుద్ధ ప్రమాద మేమీలేదు; అందుకు విరుద్ధంగా ప్రభుత్వం మరింత భద్రంగా సుప్రతి ష్ఠితమై ఉన్నది. ఇక ఆఖరున, సువిశాల ప్రాంతాలలో ఆర్థిక నిర్మాణ ప్రణాళికలను పెద్దయెత్తున నడిపిన పదిహేనేళ్ళ అనుభవం సోవియట్ ప్రభుత్వానికున్నది. ఇదిచాల ముఖ్యమైనది.

యుద్ధం ముగిసిన వెంటనే, సోవియట్ ప్రభుత్వం ఒక క్రొత్త పంచవర్ష ప్రణాళికను ప్రకటించింది. రెండోయుద్ధం ఆరంభమయ్యే ముందున్న ఉత్పత్తి స్థాయినందుకునేందుకు, దానిని దాటి ముందుకు వెళ్ళేందుకు కూడ ఈ 1946-50 ప్రణాళిక ఉద్దేశించబడినది. ఈ గొప్ప లక్ష్యం సాధింపబడగలదన్న సూచనలు చాల కనబడుతున్నవి. రెండో యుద్ధానికిముందు సోవియట్, ప్రపంచపారిశ్రామిక రాజ్యాలలో మూడవది- అమెరికా, జర్మనీల తర్వాతిదిగా ఉండినది. నేడు దాని పునర్నిర్మాణం పూర్తిగా కొనసాగకముందే, అమెరికా తర్వాత అది, రెండవస్థానాన్ని ఆక్రమిస్తున్నది.

## యూరోపులో సోవియట్ ఒక్కటే అగ్రరాజ్యం

యూరోపు అగ్రరాజ్యాలలో సోవియట్ కూడ ఒకటి మాత్రమే కాదు, నేడది యూరోపు ఖండమంతటిలోను ఏకైక అగ్రరాజ్యం. దీనికి

జర్మనీకి మధ్యనున్న దేశాలన్ని కూడ దాదాపు దాని పలుకుబడిలో నున్నవి—పోలెండు, హంగేరీ, జెకొస్లొవేకియా, బాల్కన్ రాజ్యాలు (గ్రీసు తప్ప) బల్గేరియా, రుమేనియా, యుగోస్లేవియా— ("ఈ పుస్తకం వ్రాశాక ఈదేశం అమెరికావేపు తిరిగిపోయింది—అను.")

ఇటీవరి యుద్ధఫలితంగా వచ్చిన ప్రాదేశిక లాభాలుకాక, సోవియట్ యూనియన్ పలుకుబడి యూరోపులో—పూర్వం 9 కోట్ల ప్రజలుండిన ప్రాంతంలో నేడు వ్యాపించియున్నది. *

ఈ దేశాలు పారిశ్రామికంగా వివిధశ్రేణులకు చెందినవి. ఉదాహరణకు జెకొస్లొవేకియా యూరోపులోని ప్రధాన పారిశ్రామిక దేశాలవలె అత్యున్నతశ్రేణికి చెందినది, మరి బాల్కన్ రాజ్యాలేమో బాగా వెనుకబడి ఉన్నవి. 1929 ఆర్థిక సంక్షోభంలో ప్రపంచోత్పత్తిలో ఈ రాజ్యాల పాలు ఈ క్రిందివిధంగా నున్నది:

ఇప్పుడు పోలెండులో కలిపిన జర్మన్ భాగాలలోని ఉత్పత్తిని కూడ ఇందులో కలపాలి—ఇందులో పైసైలీషియా కూడ ఉన్నది. ఆ ప్రాంతం పారిశ్రామికంగా చాల అభివృద్ధి చేందినది. అదే సంవత్సరం (1928) ప్రపంచోత్పత్తిలో సోవియట్ యూనియన్ భాగం 4,56%గా

---

* సోవియట్ పలుకుబడి క్రిందనున్న దేశాలు

| | |
|---|---|
| బల్గేరియా | 60,78,000 |
| రుమేనియా | 1,80,53,000 |
| యుగోస్లేవియా | 1,39,34,000 |
| పోలెండు | 3,26,19,000 |
| హంగేరి | 86,88,000 |
| జెకొస్లొవేకియా | 1,47,29,000 |

నానాజాతిసమితి సాలుసరి లెక్కలు 1938–39 (పుట 18)

| దేశం | 1928 లో ఆ దేశపు ప్రపంచోత్పత్తిలో భాగం |
|---|---|
| జెకొస్లొవేకియా | 1.6% |
| పోలెండు | 0.75% |
| హంగేరీ | 0.36% |
| యుగొస్లేవియా | 0.45% |
| రుమేనియా | 0.3% |
| బల్గేరియా | 0.1% |
| మొత్తం | 3.56 |

ఉండినది. మరొక విధంగా చెప్పవలసివస్తే, యుద్ధఫలితంగా తనకూ జర్మనీకీ మధ్యనున్న దేశాల ఉత్పత్తి యెక్కువగా నేడు సోవియట్ అదుపాజ్ఞలలోనికి వచ్చినది. ఈదేశాల ఉత్పత్తి, దాదాపు ప్రపంచోత్పత్తిలో తన భాగంతో సరిసమానం.

ఈ ప్రాంతాలలో సోవియట్ పలుకుబడి యేయేవిధంగా ప్రకటితమవుతుంది అనే విషయం పరిశీలించడం మన పనికాదు. అవి ముందు ముందెలా ఉత్పత్తిని పెంచుకోగలవని ఊహించడం కూడ మనపనికాదు. ఇందులో మనం గమనించవలసిన ముఖ్యవిషయం ఒక్కటే–యూరోపు భూఖండంలో నేడు చెప్పుకోదగినంత ప్రాంతం సోవియట్ పలుకుబడి క్రింద ఉన్నది. ఇది ధనికవిధానపు హద్దులనుండి తప్పుకున్నది.

రానున్న సంక్షోభం, పోయినదానికంటె ఎక్కువగా సోవియట్ యూనియన్ను బాధించవచ్చుననేందుకు చాల అవకాశమున్నది. 1929

నాటికంటె సోవియట్‌కూ ఇతర ధనిక రాజ్యాలతో ఉన్న సంబంధం కొంత ఎక్కువ కావచ్చుకాని, తన ఆర్థిక వ్యవస్థ దెబ్బతినకుండా చేసేందుకు తగినంతఎక్కువగామాత్ర ముండదు. ఇందుకుతోడు, తనకీ ధనికప్రాంత సంక్షోభం తాకకుండాఉండేందుకు తగినంతగా యూరోపులో తన పలుకుబడి విస్తరించ వీలుకావచ్చును. అలా జరిగినప్పుడు యూరోపులో అధికభాగం, సంక్షోభ కారణాలైన ధనికవిధాన సూత్రాలకు లోబడిఉండదు.

యుద్ధానంతరదశలో సోవియట్‌కూ జర్మనీకీ మధ్యనున్న దేశాలు సోవియట్‌తో లావాదేవీలు పెంచుకోగలవు. పారిశ్రామికంగా బాగా అభివృద్ధిచెందిన జెకొస్లొవేకియాలాంటి దేశం, మాటకు, సోవియట్‌తో వ్యాపారం పెంచుకోవచ్చును. బ్రహ్మాండమైన పునర్నిర్మాణ కార్యక్రమం ఆరంభించిన సోవియట్ తనకు స్థిరమైన మార్కెట్టుగా ఉపయోగపడ గలదు. ఎటూ వచ్చేసంక్షోభం ఆ మార్కెట్టునేమీ సంచలింపజేయలేదు. వ్యవసాయం ప్రధాన దేశాలుగా ఉంటూవచ్చిన బాల్కన్ దేశాలలో భూస్వామ్యవిధానం ఒకసారి నిర్మూలింపబడగనే, అవి క్రమంగా అక్కడి జీవనస్థాయిని పెంచగలిగాయి. తద్వారా సోవియట్‌తో విదేశ వర్తకాన్ని పెంచుకోగలుగుతాయి.

ఇలా ఈ ప్రధానమైన యూరోపు భూభాగం ఆర్థిక సంక్షోభానికి గురికాకుండా పోతూవస్తుంది. పశ్చిమధనికరాజ్యాలలోకంటె ఈప్రాంతంలో సంక్షోభ నష్టాలు తక్కువగా కనిపిస్తాయి. కాని, ఈ ప్రాంతానికే సోవియట్ పలుకుబడి ఆగిపోలేదు, మరింత విశాల ప్రాంతాని కది వ్యాపిస్తున్నది. జర్మనీలో చాలభాగం వారిపలుకుబడిలోనికి వెళ్లగలదు.

## జర్మనీలో ధనికవిధానం . ఇక ఆపే కొనసాగదు

1929సంక్షోభంలో అమెరికా తర్వాత జర్మనీ గొప్ప పారిశ్రామిక రాజ్యం. ఇతర దేశాలకంటె అప్పుడు జర్మనీయే ఎక్కువ దెబ్బతిన్నది. ఆ సంక్షోభం తర్వాత తత్ఫలితంగా నేషనల్ సోషలిస్టుల తిరుగుబాటు విజయవంతంఅయినది. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందటి కాలంలో కాక, రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో యూరోపులో సాంఘిక భద్రతలేదు. వాస్తవంలో ఈ సమయంలో సాంఘిక విద్వేషాలు మరింత బలపడినవి. ముఖ్యంగా జర్మనీలో అవి అతితీవ్రమై నాజీపార్టీ విజయానికి, నిరంకుశ రాజ్యస్థాపనకు, రెండవయుద్ధ ప్రారంభానికికూడ దారితీసినవి.

నాజీజర్మనీ ఆరంభించిన యుద్ధం తన సంపూర్ణ పరాజయంతో ముగిసినది. ప్రపంచాధిపత్యానికై జర్మనీ ఆరంభించిన తీవ్రచర్య పూర్తిగా విఫలమయినది. ఇప్పుడా దేశమంతటిని విజయవంతమైనరాజ్యాల సేనలు ఆక్రమించిఉన్నవి. తూర్పు రాష్ట్రాలలో కొంతభాగం జర్మనీ పోగొట్టు కొన్నది. తనయంత్రాలలోను, ఫాక్టరీలలోను, పరిశ్రమలలోను కొంత భాగం పోగొట్టుకొన్నది. మొదటి యుద్ధంలో జర్మనీ పరాజితంకాగానే, ఏర్పడినస్థితి వేరు. అప్పటికది పారిశ్రామికంగా ప్రధానతవహిస్తూనే ఉండి నది. కొన్నాళ్లలోనే అది కోలుకొని. 1929కల్లా ప్రధాన రాజ్యంగా మారి నది. ఇప్పుడుమటుకు తాత్కాలికంగానైనాసరే జర్మనీ పారిశ్రామికప్రధాన రాజ్యాల శ్రేణిలోనుండి బహిష్కృతమైనది. వచ్చే సంక్షోభ సమయంలో దానిస్థాయి ఎలా ఉంటుందో ఇప్పుడే చెప్పడం సాధ్యంకాదు.

జర్మనీ యూరోపు భూఖండంలో కేంద్రం లాంటిది. వివిధశక్తుల బలాబల తారతమ్యంలో దాని పలుకుబడే నిర్ణాయకంగా ఉంటూవచ్చింది. రెండవ ప్రపంచ యుద్ధానికిపూర్వం, సోవియట్‌కంటె బలంగల జర్మనీ,

పూర్తిగా ఇప్పుడు సోవియట్ పలుకుబడి క్రిందికి వచ్చినదంటే, సోవియటున కెంతో బలం చేకూరుతుంది. అలాకాక గుత్తవ్యాపారసంస్థల పలుకుబడి క్రిందికి, ముఖ్యంగా అమెరికా క్రిందికి జర్మనీ వచ్చినట్లయితే యూరోపులో ఈ శక్తులబలం అధికతరమవుతుంది. ఈ దేశ ప్రాముఖ్యతనుబట్టే దాని భవిష్యత్తు విషయమై, విజేతృ రాజ్యాలింకా ఏసమాధానానికీ రాలేదు. ఒక్క విషయంలోమాత్రమే వారందరూ ఏకీభవిస్తున్నారు: జర్మనీ పారిశ్రామిక బలాన్ని తాత్కాలికంగానైనాసరే చాలభాగం తగ్గించాలి.

గెలిచిన దేశాలకున్న విభిన్న ప్రయోజనాల ఫలితంగా, ముఖ్యంగా అమెరికా సోవియట్ యూనియన్‌ల మధ్యనున్న విభేదాల మూలంగా, జర్మనీ భావిస్థితి ఇంకా అస్పష్టంగా ఉన్నది. దానిని గురించి జోస్యం చెప్పడం కష్టం. అయితే ఒకటిమాత్రం ఇప్పటికే స్పష్టంగా కనిపిస్తున్నది: 1929 సంక్షోభం నాడున్నలాంటి ధనికవాదబద్ధమైన జర్మనీ అలా తిరిగీ పునరుజ్జీవితం కాలేదు. రష్యాఆక్రమిత ప్రాంతంలో ధనికవాద పునరుద్ధరణ ఇక జరగదని ఇప్పటికే తేలిపోయింది. జర్మనీలో పాత ధనికులయొక్క. అభివృద్ధి నిరోధకులయొక్క అధికారానికి మూలమైన సాంఘిక పునాదులను క్రమంగా విధ్వంసం చేసేందుకై రష్యన్లు పూనుకున్నారు. రష్యన్ల మాట జరిగే ప్రాంతంలో అంతటా భూస్వామ్య విధానం నిర్మూలితమవుతున్నది. రష్యాప్రాంతంలో పాత జర్మన్ భూస్వాము(జంకర్లు)లప్పుడే తమభూమిని పోగొట్టుకున్నారు. వీటన్నిటికిపైన, పెట్టుబడిదారులు అనే వారిని తొలగించివేసి, ప్రణాళికాబద్ధమైన ఉత్పత్తిని ప్రవేశపెడుతున్నారు. అపఖ్యాతిపాలైన "రెండు వందల కుటుంబాలు" రష్యా ప్రాంతంలో ఇక లేవు. జర్మనీలో ఏప్రాంతంలోనైనా అవి తిరిగీ తలయెత్తడం గగనమవుతుంది.

మిగత జర్మనీని అమెరికా, బ్రిటన్, ఫ్రెంచి రాజ్యాల సేనలు ఆక్రమించినవి. ఆక్రమిత రాజ్యాల ఆర్థిక విధానాలలో ఏకత్వం లేదు. బ్రిటన్‌లోను, ఫ్రాన్సులోను, అమెరికాలో ఉన్న విరుద్ధ సాంఘికవర్గాల తారతమ్యంలో హెచ్చుతగ్గులుండడం ఇందుకు కారణం. ఈ మూడు రాజ్యాల ప్రయోజనాలు జర్మనీ విషయంలో విభిన్నమైనవి. కాబట్టి పశ్చిమ జర్మనీలోకూడ పాత ధనికపద్ధతి ఏర్పాటవుతుందని చెప్పలేము. విదేశాంగ నీతికి చెందిన కారణాలేకాక దేశీయ పరిస్థితికి చెందిన కారణాలు కూడ ఉన్నవి. ధనికవిధానం తనచర్యల కొనసాగించేందుకు పునాదిగా స్థిరమైన సాంఘికవర్గాలు—ముఖ్యంగా మధ్యతరగతులు ఉండవలెను. మరి రెండవ యుద్ధానికిపూర్వమే, ఈ తరగతులు బాగా కదలిపోయినవి. మొదటి యుద్ధం తర్వాతవచ్చిన నోట్లముమ్మరందశలో మధ్యతరగతులు చాల బాధపడినవి; 1929 సంక్షోభంలో వారు తిరిగీ బాధపడ్డారు. దానితర్వాత వచ్చిన నాజీల "యుద్ధ ఆర్థికవిధానం" మూలంగా, వారు మరింత దుర్బల పడ్డారు. 1933 నుండి 1939 వరకు నాజీపాలన జరుగుతున్న రోజుల్లో జర్మనీలోనిఆస్తివంతులసంఖ్య విపరీతవేగంతో తగ్గిపోతూవచ్చింది.*

రెండో యుద్ధానంతరం వచ్చేనోట్ల ముమ్మరం కూడ, వీరిపై మరింత దారుణంగా దెబ్బ తీయగలదు. పైగా, ఎన్నో జర్మన్‌పట్టణాలు, పరిశ్రమలు విధ్వంసనం కావడం వల్ల, తూర్పు ప్రాంతాలనుండి జనం బలాత్కారంగా తరలింపబడడం వల్ల, చాలమంది ప్రజలు తమకున్న దానినంతటిని పారపోసుకున్నారు. ఇందుతో జర్మనీల ఆస్తిపై మమకారం చాలవరకు సంచలించిపోయినది.

ఇందువల్ల విదేశాంగ నీతినిబట్టి, దేశీయఆర్థికకారణాలను బట్టికూడ, జర్మనీలో ధనికవిధానం పూర్వరూపంతో అంతబలంగా ఏ ప్రాంతంలోగాని కొనసాగే అవకాశం కనిపించదు. అమెరికాలో

సంక్షోభం పొడచూపేలోగా జర్మనీ పునర్నిర్మాణం బహుశా పూర్తికాదు ఈ పునర్నిర్మాణ కాలంలో, జర్మనీలో ఏదో ఒకవిధమైన ఆర్థిక ప్రణాళిక ప్రారంభం కావచ్చు. సాధ్యమైనంతవరకు జర్మనీ జీవనస్థాయికీ యూరోపులోని జీవనస్థాయికీ మధ్య అంతరువు లేకుండా చేయడమే ఈ ప్రణాళిక లక్ష్యం కావచ్చును.

## సంక్షోభంలో ధనికేతరోత్పత్తి

ధనికవిధానం ప్రధానంగాగల ప్రపంచంలో యెన్నో ధనిక రాజ్యాలను 1929 సంక్షోభం దెబ్బగొట్టింది. మరి ప్రపంచోత్పత్తిలో అప్పటికింకా నూటికి నాలుగువంతులైనా లేని సోవియట్ యూనియన్ ఒక్కటే, మరి ఏమాత్రం దెబ్బతినకుండా ఉన్నది. ఈతూరి వచ్చే సంక్షోభంలోకూడ రష్యా ఏమాత్రం దెబ్బతినదు. అంతేకాక పూర్వం కంటె నాలుగయిదంత లెక్కువబలంతో నిలబడగలదు. ఇందుకుతోడు, తనకూ జర్మనీకీ మధ్యనున్న దేశాలు, చాలభాగం సోవియట్ పలుకుబడిలో ఉంటాయి. అవికూడ ఎక్కువ దెబ్బతినవు. ఇక జర్మనీలోనే ఏవిధమైన లిబరల్ కాపిటలిజమూ అధికారంలో ఉండదు. ఏదోఒక విధమైన ప్రణాళికాబద్ధమైన ప్రభుత్వ ఆర్థికవ్యవస్థ ఏర్పడి, ప్రజల నిత్యావసరాలు తీర్చేందుకు ప్రయత్నిస్తూంటుంది.

అంటే, రెండోయుద్ధానికి ముందు ప్రపంచోత్పత్తిలో నాలుగోవంతు ఉత్పత్తి చేస్తూవచ్చిన ప్రాంతంలో వచ్చే సంక్షోభ ప్రాబల్యం యేమీ ఉండదు. ఈలోగా ఫ్రాన్సులో ప్రణాళికాబద్ధమైన ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థ ఏర్పడితే—అందుకు చాల అవకాశం ఉన్నది—ఇక సంక్షోభం బారికిపడని ప్రాంతం, దాదాపు ప్రపంచోత్పత్తిలో మూడవవంతు ఉత్పత్తి చేసేదిగా ఉంటుంది.

పూర్వపు ఆర్థిక సంక్షోభ సమయాలలో, కొన్ని ప్రాంతాలు దెబ్బ నకుండా ఉండేవి. కానిఅవి ధనికవాదమింకా వ్యాపించనట్టి, పారిశ్రామి ంగా వెనకబడినట్టి ప్రాంతాలు. ఇకవచ్చే సంక్షోభంలో, సువిశాలమూ, ారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందినదీ అయినప్రాంతం దెబ్బతినకుండా ండగలదు. ఇది ధనికచరిత్రలో ప్రథమం కాగలదు కూడ. ఒకప్పుడు నికవాదమున్న ఈ ప్రాంతంలో ఒకకొత్త సాంఘికవ్యవస్థ అభివృద్ధి ెందుతూ వస్తుంది. కనీసం పాతకాలపు ఉదార ధనికపద్ధతి ఇక ఉండదు. ఈ రంగం ఒకేవిధమైనది కాదు. ఇది వ్లాడికోస్టాక్‌నుంచి రైనునదికు వ్యాపించి ఉంటుంది. వచ్చే సంక్షోభం ప్రారంభమయ్యేనాటికి ఇదిమరింత దూరం వ్యాపిస్తుందేమో చెప్పలేము.

ఫ్రాన్సులోను, పశ్చిమ యూరోపులోను సాంఘిక సంచలనం

పశ్చిమ యూరోపులోకూడ, ధనికవర్గాలు తిరిగీ తమ పూర్వస్థితి నందుకుంటారనే సూచన అంతగాలేదు. రెండు యుద్ధాలకుమధ్య బాగా ఏర్పడి, రెండోయుద్ధంతో బాగా దెబ్బతిపోయిన సాంఘికశిథిలావస్థ అలాగేకొనసాగుతున్నది. పశ్చిమయూరోపుదేశాలన్నీ, జర్మనీ యుద్ధఆర్థిక వ్యవస్థ గుప్పిటిలోనికి కొనిరాబడినవి. దాని ఫలితంగా. సామాన్యంగా జరిగుతూ వచ్చే సాంఘికవర్గ వినిమయం తీవ్రపడినది. యుద్ధం మూలం గాను,నాజీపాలన మూలంగాను మధ్యతరగతుల తమఆస్తులలో చాలభాగం పోగొట్టుకున్నారు. ఇప్పుడు (1946) లో తీవ్రంగా వ్యాపిస్తున్న నోట్ల ముమ్మరం మూలంగా వీరివద్ద మిగిలిన కాస్తా కూస్తా ఉండిపోతూంది. పైగా అభివృద్ధి నిరోధకవర్గాలు, గుంపులు, బాగా పేరు చెడగొట్టు కున్నవి. ఈ వర్గాలవారు యుద్ధకాలంలో నాజీలతోను, వారియుద్ధ యంత్రంతోను చేతులు కలిపినవారు. అలాగే యుద్ధానికి ముందు.

విప్లవాలకుపెంచి నాజీ జర్మనీని సంతృప్తి పరచేందుకై నానా గడ్డికరచి ఘనులుకూడ వీరే.

యూరోపులో అతివాదం వేపు మొల్లిమొగ్గుతున్నదనేందు కిః నిదర్శనాలు. వచ్చేఆర్థిక సంక్షోభకాలంలో ఈ వైఖరి ఎంత బలపడుతుంది, ఎంతమూరం వెడుతుంది అనేది ఇప్పుడే చెప్పలేము. ఈదేశాలు తమ భవిష్యత్తుకు తాము బాధ్యులు కారిక—కాబట్టే ఈ విషయమై ఏదీ చెప్పడానికీ సాధ్యం కాదుమరి.

ఇక కొన్నిఏళ్ల వరకైనా, యూరోపులో జర్మనీ ఏ స్వతంత్ర రాజకీయపాత్రనూ నిర్వహించలేదు. మిగిలినదల్లా అగ్రరాజ్యం ఇక్కడ. సోవియట్ యూనియన్ ఒక్కటే. మరి చిన్నరాజ్యాలు కొన్నిఉన్నా యనుకొండి. నాజీపాలన, యుద్ధం వీనిలో చాలకాలం తగుల్కొన్నందు వల్ల ఈ దేశాలలో ప్రధానమైన ఫ్రాన్సు—ఆర్థికంగా విపరీతమైన ఇబ్బందులను తప్పించుకొనవలసి ఉన్నది.

అమెరికాలో పరిస్థితివేరు. నేడున్న గుత్తవ్యాపార విధానంలో, విపరీతంగా పెరిగిన ఉత్పత్తికి తగినమార్కెట్టు సంపాదించుకొనాలి. సంధిదశ దాటినతర్వాత అధికోత్పత్తి, నిరుద్యోగం పెరుగుతుంది. మరొకవేపు పై యూరపియన్ దేశాలలో అవసరాలకు చాలనిరీతిగా అత్యల్పంగా ఉత్పత్తి కొనసాగుతుంది.

సాంఘికభద్రత మంచిస్థాయిలోనున్న ధనికదేశం అమెరికా; ఇది యూరోపుకు సాయపడాలి. ఫ్రాన్సులో ధనికవిధానం, మొదటి యుద్ధానికి తర్వాత, అది జరుగుతున్నప్పుడు ఉన్నంత భద్రంగా నేడున్నట్టయితే, అప్పుడు అమెరికా సాహాయం కేవలం ఆర్థికమైనదిమాత్రమే కాగలదు. అయితే, ఫ్రాన్సులోని ధనికవిధానం చాలవరకు కదిలిపోయిందికాబట్టి,

ఏవర్తనకోసం బయలుదేరిన ఉద్యమం రాను రాను బలపడుతున్నది కాబట్టి, అమెరికా సహాయం కేవలం ఆర్థికంగామాత్రమే కాదు—అది ప్రధాన రాజకీయ సహాయం. ఫ్రాన్సులోనే ధనికవాదం నిర్మూలితమై పోయినదంటే, ఇక యూరోపు భూఖండంలో మరెక్కడా అదిఉండలేదు. కాబట్టి, అమెరికా విదేశాంగనీతిని రూపొందించడంలో గుత్తవ్యాపారుల ప్రత్తనం కొనసాగుతున్నన్నినాళ్లూ, తమ దేశంలో ధనికవాదాన్ని దృఢమైన పునాదిపై నిలిపేందుకు అమెరికా తప్పక సాయపడుతుందని ఫ్రెంచి ధనికవర్గాలవారు విశ్వసిస్తారు.

ప్రపంచ అగ్రరాజ్యాల విదేశాంగనీతిలో నేడుయూరోపు భూఖండం అతి ప్రధానమైన కేంద్రంగా నున్నది. ఈ భాగం భవిష్యత్తు తమకు చాల ముఖ్యమైనది-కాబట్టి దానిని తమ ప్రయోజనాల కనుగుణంగా మార్చు కుందామని ప్రతి అగ్రరాజ్యమూ ప్రయత్నిస్తుంది.

యూరోపులో జర్మనీ పరాజయంద్వారా ఏర్పడిన ఖాళీ స్థలాన్ని భర్తీ చేయడంలో, అమెరికా సోవియట్ యూనియన్లు రెండూ జోక్యం కల్పించుకోవాలని తమ సాయశక్తులా పనిచేస్తున్నాయి. అయితే బ్రిటనుకు కూడ ఇందులో చేయి లేకపోలేదు.

ధనికవాదానికీ, సామ్యవాదానికీ నడుమ బ్రిటన్

యూరోపులో రానున్న అభ్యుదయ—అభివృద్ధి నిరోధక శక్తుల పోరాటంలో, సోవియట్‌రష్యా ప్రోత్సాహంగల కమ్యూనిస్టు పార్టీలకు సోషలిస్టు పార్టీలకు మధ్య జరిగే పోరాటంలో, బ్రిటన్‌పలుకుబడి, తన ద్వీపం సరిహద్దులనుదాటి యూరోపు భవిష్యత్తంతటిపై తన ప్రభావాన్ని నెఱపగలదు.

నేటి బ్రిటిష్ పరిస్థితినిగూర్చి సంగ్రహంగానైనాసరే చర్చించేంః కిది తావుకాదు. మనం చేయగలిగిందల్లా ఇంతవరకే—బ్రిటన్ స్థితిం వచ్చేమార్పు, ప్రపంచ రాజకీయ వాతావరణాన్నెలా మార్పుచేయగలదు? రానున్న సంక్షోభాన్ని పాత సంక్షోభంకంటే పూర్తిగా భిన్నమైనదానిగా యెలా చేయగలదు? ఇదే మనమిక్కడ పరిశీలించవలసిన అంశం.

తరతరాలుగా వచ్చిన అభివృద్ధిమూలంగా, బ్రిటన్, పెట్టుబడిని ఎగుమతిచేయడంలో ప్రపంచంలోకంతటికీ అగ్రరాజ్యంగాతయారయినది మొదటి యుద్ధానికిముందు బ్రిటన్ మొత్తం విదేశాలలో పెట్టిన పెట్టుబడి మిగత దేశాలన్నీచేరి విదేశాలలో పెట్టిన పెట్టుబడితో దాదాపు సమానం. అయినప్పటికి, యుద్ధానంతరంనుంచి, 1929 సంక్షోభం వచ్చేలోగా బ్రిటన్, అమెరికాకంటె ఈ విషయంలో వెనుకబడిపోయినది. పరి పెట్టుబడిమటుకు 1914 లో ఎంతున్నదో 1929 లో కూడా అంతే ఉన్నదనుకొండి.

అలా బ్రిటన్ సంక్షోభ కాలానికి, విదేశాలలో చాల పెట్టుబడి పెట్టిఉన్నది. ఇది ఒక కవచంలాగా సంక్షోభం తాకిడి తనకు తగులకుండా పనికివచ్చింది. రెండో ప్రపంచయుద్ధ ప్రారంభంలో, బ్రిటన్ పాతపెట్టుబడి అలాగేఉన్నది. దానిమొత్తం దాదాపు 400కోట్ల పౌన్ల బంగారం, దీనిమీద వచ్చే పెద్దరాబడి, తన వాణిజ్యనావలద్వారా ప్రయాణీకులవల్ల, సరుకులవల్ల వచ్చేఆదాయం, అదృశ్యంగాఉన్న ఎగుమతులు—ఇవన్నీ తాను దిగుమతి చేసుకోవలసి వచ్చే ఆహారపదార్థాలకు ముడిసరుకులకు తగినంత యెక్కువగా ఉన్నందువల్ల, దాని వ్యాపారం నిలవలూ, విదేశాల కివ్వ వలసినడబ్బూ ఇవన్నీ సంతృప్తికరంగా ఉంచినవి. రెండు యుద్ధాల మధ్య తన పెట్టుబడిలోని మొత్తాన్ని తీసుకోవలసిన అవసరం బ్రిటనుకు ఏర్పడలేదు.

రెండోయుద్ధంలో ప్రధానమైనమార్పు వచ్చినది. యుద్ధం జరుగు చుండగా, తనవిదేశీ పెట్టుబడులను రాబట్టుకొని, తన దిగుమతులను చెల్లించుకొనవలసి వచ్చినది. ఇదికాక, బ్రిటన్ తాను ఇండియాకూ, ఇతర అధినివేశాలకూ అప్పుపడిపోయినది. యుద్ధంలో బ్రిటన్ ఆర్థిక స్థితి ఎంత అధ్వాన్నస్థితికి వెళ్లిందంటే, అమెరికాతో అప్పుచేసుకొనవలసి వచ్చింది. యుద్ధఆర్థికవ్యవస్థను శాంతికాలానుగుణంగా మార్చేందుకై, బ్రిటన్ అమెరికాతో తీసుకున్న అప్పు ఇంచుమించు 400 కోట్ల డాలర్లు.

మొదటి యుద్ధం తర్వాత, ఋణ దాతృస్థానాన్ని, పెట్టుబడి ఎగుమతిదారుగా తనకున్న స్థానాన్ని జర్మనీ కోల్పోయినది. మొదటియుద్ధ సమయంలోను, ఫ్రాన్సుకూడ పెట్టుబడి ఎగుమతిలో క్రమంగా హీనస్థితికి వచ్చినది. మరి ఇప్పుడు, బ్రిటన్, చరిత్రలో మొట్టమొదటిసారిగా, ఋణ దాతృస్థానాన్ని గోల్పోయింది. ఇక పెట్టుబడిని తానేపంపి, విదేశ వస్తికాన్ని పెంపొందించుకుంటూ రాలేదిక — ఈ నూతన దశలోనికి బ్రిటన్ ప్రవేశించింది. ఇంతదాకా సంక్షోభ సమయాల్లో ఆదుకుంటూ వచ్చిన ఆర్థిక మూలధనం లేకుండానే ఈ దశలోనికి బ్రిటన్ అడుగు పెట్టినది.

ఈసారి యుద్ధంలో బ్రిటన్ ఉత్పత్తి, యూరోపుఖండంతో కాని, అమెరికాతోకాని సాదృశ్యం చూపవీలులేనిది. యుద్ధం ఎక్కువగా యూరోపులోనే కొనసాగింది. అక్కడే విధ్వంసం ఎక్కువగా జరిగింది. ఇందువల్ల ఉత్పత్తి బాగా పడిపోయింది. అమెరికాలో ప్రత్యక్షంగా యుద్ధవిధ్వంసనం జరగలేదు. ఉత్పత్తి పెరిగినది. బ్రిటన్‌లో విమాన దాడుల మూలంగా ఎక్కువ విధ్వంసనం జరిగినప్పటికి, శత్రువుదేశంలో కాలుపెట్టలేదు. అక్కడ ఉత్పత్తివ్యవస్థ కుంటుపడినదంటే అందుకు

యుద్ధపు పరోక్షకారణాలే మూలం. బ్రిటన్ తనయొక్క ఉత్పత్తి సాధ సంపత్తిని, మనుష్యబలాన్ని సంపూర్ణంగా ఉపయోగించుకున్నది ఇందువల్ల ఉత్పత్తి, శాంతి సమయాలలోని స్థాయిని దాటిపోయినది అయితే ఎంత పెరిగినా, ప్రజలకు దినావసరాలైన వస్తువులను కావలసినన్ని అందివ్వలేకపోయినది. యుద్ధ ఉత్పత్తి ఎక్కువేగాని, శాంతికా అవసరాలలో దాదాపు 1/5 వస్తువినియోగం తగ్గించివేయడం జరిగింది మామూలు వస్తూపయోగం 1938 లో 100 అని ప్రాతిపదికగా తీసుకుంటే అది 1940 కంతా 88 కి పడిపోయింది. 1941 కు 81 కి, 1942 ు 80 కి, 1943 కు 78 కి పడిపోయినది. 1944 లో మటుకు కొద్దిగ 80 కి పెరిగింది. *యుద్ధకాలంలో యూరోపంత తగ్గక, అమెరికాలోలాగ అంత హెచ్చక, బ్రిటన్ ఉత్పత్తి, మధ్యే మార్గం అవలంబించింది. అలాగే బ్రిటన్‌లోని సాంఘిక సంబంధాలుకూడ ప్రత్యేకమైనవి; అమెరికా యూరోపులోని సాంఘిక సంబంధాల కంటె భిన్నమైనవి.

జనాభా దామాషాలో ఇంత తక్కువ రైతులున్న దేశం బ్రిటన్ కంటె మరొకటి లేదు. నూటికి పదిమంది మాత్రమే పొలంమీద పని చేసేవారున్నారు. పారిశ్రామికకార్మికవర్గం జనాభాలో అత్యధిక సంఖ్యతోనున్న అగ్రరాజ్యం బ్రిటనొక్కటే.

అమెరికాతో బ్రిటన్‌కు ఒక విషయంలో సామ్యమున్నది—రెండు యుద్ధాల మధ్యకాలంలో చెప్పుకోదగ్గ సాంఘికభద్రత బ్రిటన్‌లోనూ ఉన్నది. మధ్యతరగతులు యూరోపు ఇతరదేశాలలోవలె అంత దెబ్బతినలేదు. అంతగా వారు కార్మికులుగా మారడం కూడ జరుగలేదు. రెండుయుద్ధాల

---

* యుద్ధద్రవ్యమూలాల వివరణ, 1938-44, జాతీయాదాయ వ్యయాల అంచనా—లండన్, రాజుగారి స్టేషనరీ ఆఫీసు, cmd 6623, పుట 18.

మధ్యనో, ఈ యుద్ధం ముగిశాకనో, ఎప్పుడో ఒకప్పుడు యూరపియన్ దేశాలలో నోట్ల ముమ్మరం చెబ్బతీసింది. కాని అలా బ్రిటన్‌లో జరక్క పోవడమే అక్కడి మధ్యతరగతులు కార్మికులుగా మారకపోయేందుకు కారణం. కాబట్టే ఈ కష్టాలను గట్టెక్కేప్పటికి మధ్య తరగతులు పూర్తిగా నిరాధారస్థితిలో లేరు. బ్రిటిష్‌సామ్రాజ్యంలో తనకున్న అనుకూల పరిస్థితి బ్రిటనుకు మరింత ప్రోద్బలమిచ్చినది.

ఈ అనుకూలా లున్నప్పటికి బ్రిటిష్ ధనికవాదం ఆర్థికరంగా లన్నిటిలోను అభ్యుదయ పంతంకాలేదు. 1929 సంక్షోభకాలంలోను, అంతకు ముందు, తర్వాతను, బ్రిటిష్ సాంఘిక జీవనంలో శాశ్వత నిరుద్యోగ సమస్య విడవకుండా కనిపిస్తూ వచ్చినది. ఈ కాలమంతటా (మధ్యే అత్యల్పమైన వ్యవధితో) కన్సర్వేటివ్ పార్టీఅధికారంలో ఉన్నది. వీరు ఇరవైయేళ్లదాకా కొనసాగిన (రెండోయుద్ధం వచ్చినప్పుడు మాత్రమే మాయమైనట్టి—) నిరుద్యోగాన్ని నిర్మూలించేందుకు తామేమీ చేయలేదు. వీరు 1945 ఎన్నికలలో అపజయం పొందేందు కిదికూడా ఒకముఖ్య కారణమే. సోషలిస్టు కార్యక్రమాన్ని బాహాటంగా ప్రకటించిన లేబర్‌పార్టీ ఎన్నికల్లో గెలిచింది. అత్యధిక సంఖ్యతో పార్లమెంటుకు వెళ్లింది. ఇంగ్లీషు చరిత్రలో ఇలా జరగడం ఇదే మొదటిసారి,

యుద్ధంవల్ల ప్రభుత్వానికెక్కువ అధికారాలున్న సమయంలో లేబర్‌పార్టీ అధికారంలోనికి వచ్చినది. అవసరమైనప్పుడు ప్రభుత్వమెంత వరకు పనిచేయగలదో అమెరికాలాగే బ్రిటన్‌కూడ యుద్ధసమయంలో ప్రదర్శించింది. జాతీయ జీవనం, శ్రమ—వీనిపై సర్వాధికారిగా వ్యవహరించినది; పెట్టుబడినెలా ఎక్కడ ఎంతపెట్టాలో చూపెట్టింది, ఉత్పత్తిని నడిపించింది. మనుష్యబలం, జీతాలు, ధరలు వీటన్నిటిలోను తనదే ఆఖరుమాటగా వ్యవహరించింది. ఈ అధికారం అమెరికాలో త్వరలోనే

తొలగించి వేయబడినది—బ్రిటన్‌లో అలా జరగలేదు. యుద్ధసమాప్తి నుంచి, భావిసంక్షోభ ప్రారంభందాకా నడిచే మధ్యకాలంలో బ్రిటనులో జరగనున్న కార్యసరణి ఇలా ఉంటుంది: ఆర్థికరంగంలో ప్రభుత్వానికి చెందినపానిని విస్తరింపజేసేందుకు, మొత్తం ఆర్థికవ్యవస్థపై ప్రభుత్వం యొక్క పెత్తనాన్ని ఎక్కువ చేసేందుకు, రాజ్యాంగంలో కార్మికవర్గం యొక్క రాజకీయస్థితిని బలపరచేందుకు తీవ్రంగా పోరాటం సాగుతుంది.

ఏమి జరిగినప్పటికి, రానున్న సంక్షోభప్రమాదాన్ని గమనించకుండా దేశాన్ని, దానిగతికి దానిని వదిలిపెట్టే ప్రభుత్వంమాత్రం, అక్కడ రాపనేందుకు తగినన్ని సూచనలు కనిపిస్తున్నవి. 1929 నాటి సంక్షోభం లాంటిదిక రాకూడదని బ్రిటిషుప్రజలు దృఢంగా నిశ్చయించుకున్నారు. కాబట్టి దాని ప్రమాదాన్ని తొలగించుకునేందుకైన ప్రభుత్వ చర్యలను వారు సమర్థిస్తారు.

ఇప్పుడే యింతకంటె ఎక్కువ చెప్పడం సాధ్యంకాదు. క్రమక్రమంగా కొంతకొంత పరిశ్రమలు జాతీయంచేస్తూ, కార్మికవర్గం పలుకుబడిని రాజకీయంగా ఆర్థికంగా ఎక్కువచేసే పనిలో వీరెంతవరకు కృతార్థులు కాగలరో మనకు తెలీదు. ఈ విషయంలో లేబర్‌పార్టీ కార్యక్రమం సఫలమైతే, దాని ప్రభావం దేశపుహద్దులకు వెలుపలిదాక ప్రసరించగలదు. అలాకాక ఈ మార్గంలో గమనం మందగిస్తే, మొదటి యుద్ధం తర్వాత జర్మన్‌సోషల్ డెమాక్రాట్లలాగా, ఫ్రాన్సులోప్రజాసంఘటనలాగా లేబర్‌పార్టీవారుకూడ పరాజితులయితే, యూరోపులోని సోషలిస్టు శక్తులన్నీకూడ ఈ పరాజయంలో ఎంతో ఒకంత భాగంపంచుకోవలసి వస్తుంది. ఇకతర్వాత యూరోపులో అభివృద్ధినిరోధక శక్తులకూ, కమ్యూనిజానికీ మధ్య చావుబతుకుల పోరాటం కొనసాగుతుంది. ఈ పోరాటం మూలంగా పశ్చిమ యూరోపులో అట్లాంటిక్ తీరందాకా సోవియట్

పలుకుబడి వ్యాపిస్తుంది—ఈ పోరాటం త్వరలోనే యుద్ధానికి దారితీయ వచ్చునుకూడ.

ఈ సమస్యను సమగ్రంగా పరిశీలించడం మనఉద్దేశం కాదిక్కడ. అలాగే లేబర్‌పార్టీ కార్యక్రమం విఫలమవుతుందా, విజయవంతమవు తుందాఅని జోస్యం చెప్పడంకూడ మనఉద్దేశం కాదు. మరి ఈ రెండు అంశాలనూ మనం తప్పక గుర్తించితీరాలి.

యూరోపు భూఖండంగూర్చి, ముఖ్యంగా ఫ్రాన్సునుగూర్చి చెప్పిన మాటలు బ్రిటన్‌కుకూడ ఇంచుమించు వర్తిస్తాయి. దేశాన్ని సాంఘికంగా మార్చడంకోసం బ్రిటన్‌లో కార్మికవర్గం టోరీలతోను, అభివృద్ధినిరోధక శక్తులతోను పోరాటం సాగించవలసి వస్తుంది. ఈ ప్రత్యక్ష విరోధుల తోనేకాక, ఈ శక్తులకు అమెరికా సాయపడ్డంవల్ల వచ్చే ఇబ్బందులను కూడ వీరు ప్రతిఘటించవలసి ఉంటుంది. ప్రధాన పరిశ్రమలను జాతీయం చేసేందుకు ప్రయత్నించినప్పుడల్లా టోరీలు వ్యతిరేకించి, ఆప్రయత్నాన్ని పాడుచేసేందుకు ప్రయత్నిస్తారు. ఇందులో టోరీలకు అమెరికా ధనిక శక్తులు సాయపడుతాయి. బ్రిటన్‌లోని సోషలిస్టుప్రయోగ, పరీక్షలకై తామెందుకు డబ్బు కొల్లబెట్టాలని వీరు గోలపెడతారు. ఈ సాకుతో జోక్యం తీసుకుంటూ దాన్ని సమర్థించుకుంటారు. రెండు యుద్ధాలమధ్య, ఇటీవలియుద్ధకాలంలోను తన ఆర్థిక సంపత్తిని బ్రిటన్, చాలభాగం కోల్పోవడంవల్ల, బ్రిటిష్ టోరీల పక్షంగా అమెరికా జోక్యం తీసుకుంటే అది చాలపనిచేయగలుగుతుంది,

ఇంకొకటి—లేబర్‌పార్టీ అధికారంలో ఉన్నప్పటికీ బ్రిటన్ ఇంకా సామ్రాజ్యదేశం; సామ్రాజ్యంలో బ్రిటన్‌కెన్నో అనుకులాలున్నవి. వీనివల్ల వచ్చే లాభాలను కార్మికవర్గంకూడ అనుభవిస్తున్నది. కాబట్టి నిజంగా

సోషలిస్టు కార్యక్రమం విజయవంతం కావాలంటే, లేబర్‌పార్టీ బ్రిటిష్ కాపిటలిజాన్ని, సామ్రాజ్యవాదాన్నికూడా నిర్మూలించ సమకట్టాలి. భారత దేశాన్ని స్వతంత్రం చేయాలన్న కార్యక్రమంతో లేబర్ ప్రభుత్వం ఒక అడుగు ముందుకువేసింది. సామ్రాజ్యవాద నిర్మూలనలో ఇది ప్రథమ సోపానం కావచ్చును—

కాని ఇది ప్రథమ సోపానంమాత్రమే. తన వలసదేశాలను వదులు కోవడంవల్ల మొదట ఆర్థికంగా చాలనష్టం, తద్వారా బ్రిటిషు కార్మికవర్గ జీవనస్థాయి తక్కువ కావడం జరుగుతుంది. నేడున్న ఆర్థిక దుస్థితిలో, సోషలిస్టు కార్యక్రమ నిర్వహణకై అమెరికా ధనికప్రాపకంగల టోరీలను ప్రతిఘటిస్తూ, అదేసమయంలో తమకార్మికుల జీవనస్థాయిని హీనపరచినా సరేనని. సామ్రాజ్యాన్ని వదులుకునేంత బలం లేబర్‌పార్టీకి ఉన్నదాఅనేది సందేహం.

ఏమైనప్పటికి బ్రిటన్‌లో తన కార్యక్రమ నిర్వహణకై లేబర్‌పార్టీ జరిపేపోరాటం, ఇతర యూరోపురాజ్యాలలో కార్మికులునడిపేపోరాటాలు— ఇవి, అమెరికాలో సంక్షోభం ఎలాంటి రాజకీయ వాతావరణంలో రానున్నదో సూచిస్తాయి. వాటి ఫలితమెలాఉన్నా 1929 సంక్షోభానికీ రానున్నదానికీ ఉన్నభేదాన్నిమటుకు ఇవి బాగా తెలియజేస్తాయి. రానున్న సంక్షోభంలో సాంఘికమైనమార్పు తేవాలన్నది బ్రిటన్‌లోనూ యూరోపు లోనుకూడ ప్రధాన కార్యక్రమంగా ఉంటుంది. సిద్ధాంతప్రాయంగాకాదు, అసలు వర్గశక్తులు అధికారంకోసం జరిపే పోరాటంలో ఇది ప్రధానమైన కార్యక్రమ మవుతుంది.

## ఆసియా పరిస్థితిలో మార్పు

ఆసియాలోకూడ పరిస్థితి ముఖ్యమైన మార్పులను పొందినది. గత సంక్షోభంలో ఆసియాలో పెత్తనమున్న దేశాలు రెండు—బ్రిటనూ, జపానూ-ఆరోజుల్లో సోవియట్ యూనియన్‌కాని, అమెరికాకాని ఎక్కువ కలుగజేసుకోలేదు. బ్రిటన్, ఫ్రాన్సు, హాలెండు క్రిందనున్న వలసలలో ఇప్పటితోపోలిస్తే శాంతిభద్రతలుండినవి. అర్ధవలసదేశంగా ఉన్న చైనాలో తమ పలుకుబడిని పెంచుకునేందుకై సామ్రాజ్య ప్రభుత్వాలు ఒకదానిపై నొకటి కుట్రలుపన్నుతూ ఉండినవి. చిరకాల దాస్యంతో ఆసియాలో ఆర్థికాభివృద్ధి దాదాపు ప్రతిష్టంభించిపోయినది. విదేశ సామ్రాజ్యవాదమూ, దేశీయ జమీందారీవర్గమూ చేసుకున్నమైత్రి, దేశీయ ప్రజల తలలపై ఒతి భారంగాపడి, అభివృద్ధినంతటిని అరికట్టింది.

గత సంక్షోభంనుంచి రెండోయుద్ధం ఆరంభందాకానూ, ముఖ్యంగా యుద్ధఫలితంగాను ఆశియాలోని పరిస్థితి పూర్తిగా మారిపోయినది. అక్కడ వస్తున్న మహత్తరమైన మార్పులను ప్రపంచం గమనిస్తున్నది. దీని ప్రాముఖ్యాన్ని నొక్కిచెప్పడం అతిశయోక్తి కాదు. ఈ ధోరణిని సూచించే అంశాలప్పుడే స్పష్టంగా కనిపిస్తున్నవి.

## జపాను ఓటమి,
## రాజకీయంగా, ఆర్థికంగా ఒక ఖాళీని ఏర్పరిచింది

యాభైయేళ్లు అవిచ్ఛిన్నంగా విస్తరిస్తూ, సామ్రాజ్య విజయాలు సాధిస్తూవచ్చిన జపాను తుదకు పరాజితమయినది. తన సామ్రాజ్యమునూ, ఆశియాలో తనకున్న అనుకూలస్థానాలనూ ధారవోసుకున్నది. తనదేశమూ తన వలసలూకూడ అన్యోన్య పోషకాలుగా ఆర్థికాభివృద్ధి చెందడంపైనే పెద్ద పారిశ్రామిక రాజ్యం కావాలన్న తన ఆశ భంగపడి ఉన్నది, తన

సామ్రాజ్యం పోవడంతో, ఇది మూడవశ్రేణికిచెందిన రాజ్యంగా మారిపోయినది. యూరోపులో జర్మనీ ఓటమితో ఖాళీ ఏర్పడినట్లే, జపాను పరాజయం, పసిఫిక్కులో ఖాళీస్థలాన్ని వదిలివేసినది. నిజానికి జపాను పరాజయం రెండుచోట్ల ఖాళీస్థలం వదిలివేసినది. ఒకటి— పూర్వం జపాను సామ్రాజ్యవాద పీడనకులోనైన దేశాలు. రెండు, పూర్వం ఆశియా అంతటా జపాను బలపరుస్తూ వచ్చిన అభివృద్ధినిరోధక భూస్వామివర్గం.

జపాను సైనికపతనంవల్లను, రెండోయుద్ధ ఫలితాలవల్లను ఏర్పడిన ఈ ఖాళీని భర్తీ చేసేదేమిటి? మూడు కొత్తశక్తులు కనిపిస్తున్నవి. (1) సోవియట్ యూనియన్, (2) జపానువగైరా విదేశ సామ్రాజ్య వాదులతో పూర్వం నలగదొక్కబడిన దేశాలుచేసే విదేశపాలన సంపర్క నిర్మూలన కృషి; (3) అమెరికా:

## భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో సోవియట్ యూనియన్ పురోగతి

1939 తర్వాత ఆశియాలో వచ్చిన పెద్దమార్పు—సోవియట్ యూనియన్ బ్రహ్మాండంగా బలపడడం. ఇప్పుడు ప్రపంచంలో నున్న రెండుప్రధాన రాజ్యాలలోను, సోవియట్ యూనియన్ ఒకటి కావడం, తప్పనిసరిగా ఆశియాలో సోవియట్ స్థానానికి ప్రోది చేకూరుస్తుంది. గత యుద్ధంలో రష్యన్లు, యుద్ధ తంత్రానుకూలంగా తమ పరిశ్రమలను పెక్కింటిని తమ ఆశియా రాష్ట్రాలలోనికి మార్చారు. అక్కడ అంతకు ముందే ఉన్నవానిని బాగా పెంచారు. ఇవి యూరోపు రష్యాకు దూరం గనక, జర్మనీదాడికి బలికావని ఇక్కడ పరిశ్రమలను వారు పెంచారు. సోవియట్ పునర్నిర్మాణ కార్యక్రమంలో ఈ పరిశ్రమలను తిరిగి

యూరోపు ప్రాంతాలకు మార్చేసుద్ది కనిపించదు. యూరపియన్ రష్యాలో పునర్నిర్మాణం కొనసాగుతుంది కాని, ఆశియా రష్యానోరుగొట్టి కాదు—అక్కడి పరిశ్రమలక్కడే ఉంటాయి—మరికొన్నిటిని అభివృద్ధి పరుస్తున్నారు కూడ.

రెండవప్రపంచ యుద్ధానికిముందు, ఆశియా సోవియట్ రష్యాలో 4 కోట్లమంది ప్రజలు నివసించేవారు. జపాను, దాని వలసలను వదిలి పెడితే, మిగత ఆశియా ప్రాంతంలో 100 కోట్లమంది ప్రజలున్నారు. వారి ప్రాంతాల్లో తరతరాల దాస్యంవల్ల పారిశ్రామికాభివృద్ధి కుంటుపడినది. రష్యన్ ప్రభుత్వమింకా తన ఆశియా ప్రాంతాల పరిశ్రమల పునర్నిర్మాణ కార్యక్రమం పూర్తిచేయలేదు. అయినప్పటికి ఆ ప్రాంతాలలోని నాలుగు కోట్ల ప్రజలు, ఇతర ప్రాంతాల 100 కోట్ల ప్రజలెంత పారిశ్రామికంగా ఉత్పత్తి చేయగలిగారో అంతా తాము ఉత్పత్తిచేయగలిగారు. అంటే సోవియట్ ఆశియాలోని ఉత్పత్తి దామాషా చైనా, ఇండియా, బర్మా, సయాములలో కంటె చాలయెక్కువ—రెంటికీ పోలికే లేదన్నమాట.

ఈ విషయంలో సోవియట్‌కున్న ఆసియాలోని స్థానం, యూరోపులోని తన స్థానంకంటె పూర్తిగా భిన్నమైనది. రెండు యుద్ధాలమధ్య, సోవియట్ యూనియన్ పారిశ్రామికోత్పత్తిలో బ్రిటన్‌నూ, ఫ్రాన్సునూ వెనుకవేసినది. కాని మొత్తంగాకాక, జనాభా దామాషాతో (తల 1 కి ఉత్పత్తి) లెక్కవేస్తే బ్రిటన్ ఫ్రాన్సులకంటె చాల వెనుకబడి ఉన్నది. యూరోపులోకంటె సోవియట్‌లో జీవనస్థాయికూడ వెనుకబడిఉన్నది. (ఇందుకు కారణం వారు బుద్ధిపూర్వకంగా తమ భారీపరిశ్రమలను ఎక్కువ చేసుకుంటూ ఇతర వస్తుపరిశ్రమలను తగ్గించుకున్నారు) జీవనస్థాయి ఎక్కువగా ఉన్నందువల్ల యూరోపులో సోవియట్ యూనియన్ పలుకుబడి చాల తగ్గినది.

మరి ఆసియాలో పరిస్థితి ఇందుకు పూర్తిగా భిన్నంగా నున్నది ఏ విధంగాచూచినా జనాభా దామాషాతోగాని, మొత్తం సంఖ్యతోగాని- సోవియట్ ఆసియాప్రాంతాల పారిశ్రామికోత్పత్తి దరిదాపులకుకూడ-ఏ ఇతర ఆసియాదేశపు ఉత్పత్తి రాలేదు. ఈప్రాంతాల పరిశ్రమలు యుద్ధానికై పనిచేయ నవసరంలేనికాలంలో, అవి జీవితావసరవస్తువుల ఉత్పత్తినారంభిస్తే, అక్కడి జీవితస్థాయి మిగత వలసలలోకంటెను, ఇప్పుడిప్పుడే స్వతంత్రహక్కు మాకున్నదంటూ జబ్బచరిచే అర్ధవలసలలోకంటెను కూడ విపరీతంగా పెరిగిపోగలదు.

సోవియట్ ఆసియాలో పారిశ్రామికాభివృద్ధి అతిత్వరితగమనంతో సాగినది. 1929 లో మొత్తం సోవియట్ పారిశ్రామికోత్పత్తి జారునాటి ఉత్పత్తికంటె ఏమంత ఎక్కువకాదు. కాని 1929 లో నాజీ దురాక్రమణ రోజులమధ్య విపరీతంగా అభివృద్ధిచెందినది. తనకున్న సహజసంపదనే ఉపయోగించి, విదేశీ పెట్టుబడితో అవసరంలేకుండా ఆశియాప్రాంతంలోని పారిశ్రామికోత్పత్తి వృద్ధిచేయబడినది. ఇంమతోపాటు అక్కడిభూస్వామ్య విధానం పూర్తిగా నిర్మూలింపబడినది. వలసలలో యూరోపు జపాను సామ్రాజ్యవాదులవలె వీరు చేయలేదు. లక్షలాది పేదరైతులను పీడించే పరాన్నభుక్కులైన భూస్వాములు సోవియట్ ఆసియాలో లేరు. మంచూరియాలో జపానువారివలె, రష్యన్లు తామేదో యజమానులమన్నట్లుగా ప్రవర్తించలేదిక్కడ. అక్కడి ప్రజలనే పారిశ్రామిక కార్మికులుగా, ఇంజనీయర్లుగా శిక్షణగరపి ఈపరిశ్రమాభివృద్ధి కార్యక్రమం కొనసాగింపబడినది. జారుపరిపాలనక్రింద బానిసలుగానుండిన ఆసియా ఆదిమవాసులు వారే పూనుకుని సోవియట్ ఆసియా ప్రాంతాలలో భూస్వామ్యవిధానాన్ని నిర్మూలించివేశారు; తమ పరిశ్రమలను ప్రభుత్వ ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానపు ప్రాతిపదికపై నిర్మించుకున్నారు. జారుకాలంలో వారికి చదవనూ

రాయనూకూడ రాదు. ఇంత త్వరలో వారు నిరక్షరాస్యతను రూపుమాపు కొని, ఆధునిక పరిశ్రమలకు అవసరమైన యోగ్యతలను సంపాదించు కున్నారు.

యూరోపులోలాగే ఆసియాలోకూడ ప్రపంచంలో ప్రధాన అగ్ర రాజ్యం సోవియట్ యూనియన్. యూరోపులో జర్మనీ ప్రధానత పోయి నట్టే ఆసియాలో జపాను పని ముగిసినది. మరి యూరోపులో చాలకాలం తర్వాత పరిశ్రమాభివృద్ధి ఆరంభించడంవల్ల, బాగా పారిశ్రామికంగా పెరి గిన దేశాలకంటె వెనుకబడిఉన్న రష్యా ఆసియాలో విభిన్నస్థితిలోనున్నది. అక్కడ సోవియట్ ఒక్క అగ్రరాజ్యం మాత్రమేకాదు. అసలు పారి శ్రామికాభివృద్ధికి అంకురార్పణ చేసిన దేశం-సోవియట్ యూనియన్. ఆసియా ప్రజలుకూడ ఆధునిక పరిశ్రమలలో, శాస్త్రనైపుణ్యంలో ఆరితేరి తమ జీవనస్థాయిని పెంచుకునేందుకు సమర్థులని వాస్తవాంశాలద్వారాను, నిదర్శనాలద్వారాను ప్రపంచజనాభాలో అధిక సంఖ్యాకులైన ఆసియా వాసులకు బోధించిన దేశం సోవియట్ యూనియన్.

సోవియట్ యూనియన్‌కు ప్రక్కనే జర్మనీ చైనాలు రెండూ ఉన్నవి. నేడీదేశపు పలుకుబడి జర్మనీ చైనాల దాటిపోతున్నది. అయితే జర్మనీ దాటితే పారిశ్రామికంగా బాగావృద్ధిచెందినదేశాలు కనిపిస్తాయి. చైనా దాటితే సాంఘికంగా, పారిశ్రామికంగా వెనుకబడిన దేశాలు ఎదురు పడతాయి. అంతేగాక జర్మనీ దాటితే, ఫ్రెంచి విప్లవంనుంచి రాజకీయ వైయక్తిక స్వాతంత్ర్యాల సంప్రదాయాలు నేర్చుకున్నదేశాలు తగుల్తాయి. లక్షలకొలది ప్రజలు సోవియట్ ప్రభుత్వపు కేంద్రీకరణ పద్ధతిని నిరాక రిస్తారు, కాని అది చైనాదాటివెడితే, సామ్రాజ్యవాద—భూస్వామ్య విధానాల చేతిలో నలిగిపోయిన ప్రజలు కనిపిస్తారు; శతాబ్దులకొలది పీస

రాజకీయ మైనదిగాని, వైయక్తిక మైనదిగాని స్వతంత్రమంటే ఏమిటో ఎరుగరు. సోవియట్ ఆశియా ప్రజలకంటె మరీ వెనుకబడిన ప్రజలు వీరు.

ఆశియా అంతటా నివసించే అభ్యుదయ కాముకుల ఆశయాలు కొంతవరకు సోవియట్ ఆశియాలో నెరవేరినవి. పరాన్నభుక్కులైన భూస్వాములను మొదలంటా నిర్మూలించడం జరిగింది. బ్రహ్మాండమైన పరిశ్రమాభివృద్ధి జరిగినది. జీవితస్థాయి పెరిగేందుకు పునాదులప్పుడే వేయబడినవి. ఆధునిక పరిశ్రమలలో తమపాత్ర నిర్వహించేందుకు ప్రజలు విద్యావంతులయ్యారు, సుశిక్షితులయ్యారు—ఇవన్నీకూడ విదేశీ పెట్టుబడి సాయం లేకనే కొనసాగింపబడినవి.

ఆశియాలో ఏమేమి చెయ్యవలసివున్నదో సోవియట్ ఆచరణలో చేసి చూపించినది. సోవియట్ సరిహద్దులోనున్న చైనాలో ఈ ప్రదర్శన ప్రాముఖ్యతను స్పష్టంగా తెలుసుకోవచ్చును. ఈ సరిహద్దు మూడువేల మైళ్ల పొడవునా ఉన్నది. దీనికి ఒకవేపున, అభివృద్ధినిరోధక భూస్వామి వర్గం నిర్మూలితమైనది. పరిశ్రమాభివృద్ధి మహావేగంతో ముందుకు సాగుతున్నది. జీవితస్థాయి పెరుగుతున్నది. ఇందుమూలంగా చైనా వారికి పుస్తకాలు పనిలేదు, వ్యాసాలు పనిలేదు, పత్రికలవసరం లేదు. ఈ సరిహద్దు అవతలికీ ఇవతలికీ ఉన్నభేదం వారికెవరో చెప్పవలసిన అవసరం లేకపోయింది. స్వయంగా కళ్ళారా అదేదో వారు చూడసాగారు.

## సామ్రాజ్య పీడనపై పోరాటం

సామ్రాజ్యవాద శృంఖలాలను తెంచుకునేందుకై, ఆశియా ప్రజలు సాగిస్తున్న పోరాటంలోకూడ పెద్దమార్పు వచ్చినది. ఈ పోరాటచరిత్ర

సుదీర్ఘమైనది, రెండోయుద్ధ ఫలితంగా ఈ పోరాటం తీవ్రగతితో పురోగమించి, ఆశయసాధన ప్రాంగణంలోనికి ప్రవేశించినది. పూర్వం జపాను సామ్రాజ్యవాద పీడనకు గురిఅయిన వలసదేశ ప్రజలు, జపాను సామ్రాజ్యవాదానికి మాత్రమే విరోధులు కారు—వారి అసలు సామ్రాజ్యవాదానికే—అది ఏదేశందైనా సరే—ప్రతికక్షులుగా తయారయినారు. జపాను సామ్రాజ్యవాదంపై చైనా నడిపిన దీర్ఘసంగ్రామం, తుట్టతుదకు విజయాంకితమైనది—ఇదిఒక్క జపానుకేకాక, వివిధ సామ్రాజ్యవాద రూపాలకు కూడా మర్మాఘాతమైనది.

దూరప్రాచ్యంలోని ఫ్రెంచి, డచ్చి సామ్రాజ్యాలు, ఏమంత ప్రతిఘటనా లేకనే జపానుచేతిలో పడినవి. అంతదాకా ఈ పాలకుల చేతులలోపడి నానాబాధ పడుతున్న ప్రజలు, తమ పీడకులెంత దుర్బలులో ఇందుతో పసికట్టారు. ఈ పాఠాన్ని వారు మఱచిపోలేరు. యుద్ధానంతరం డచ్చి, ఫ్రెంచి వలసలలోని ప్రజలు స్వతంత్రానికి మరింత దగ్గరకు వచ్చారు.

అయితే అత్యంత ముఖ్యమైన విషయం బ్రిటిష్ ఇండియాలో ఏమి జరుగుతున్నది అన్నదే. ఇంగ్లాండులో లేబర్‌పార్టీ విజయం, ఇండియా ఎడల బ్రిటిష్ విధానంలో మార్పుతెచ్చింది. ప్రపంచచరిత్రపై ఇదెంత గాఢముద్ర వేయగలదో అప్పుడే అంచనావేయలేము. ఇండియా ప్రాముఖ్యాన్ని వదిలి వెళ్ళేందుకు నిర్ణయించినా సరే లేబర్‌పార్టీ స్వతంత్ర మిచ్చేందుకు సిద్ధపడినది. చరిత్ర తనకిచ్చిన ఈ అవకాశాన్ని భారత దేశం ఉపయోగించుకోగలిగితే ఇది ఆశియాలోని వలసవిధాన వ్యవస్థకే ప్రాణాంతకమైన ఆఘాతం కాగలదు—సంక్షోభానికి ముందున్న ఈకొలది యేళ్లలోను, ఇదంత నిర్ణాయకశక్తిగా లేదు, కాని కాలక్రమేణా,

ప్రపంచ జనాభాలో అయిదోవంతున్న ప్రదేశం నూతన స్వతంత్ర రాజకీయశక్తిగా తయారుకావడం, చాల ప్రధానమైన అంశం కాగలదు

## ఆసియాలో అమెరికా ఒక నూతనశక్తి

రెండుయుద్ధాల మధ్యకాలంలో, ప్రత్యేకించి 1929 సంక్షోభ కాలంలో, ఆశియాలో ఇతర రాజ్యాలెన్నిటిలోనో అమెరికాకూడ ఒకటిగా మాత్రమే ఉన్నది. కాని భావిసంక్షోభ కాలంలో మధ్యప్రాచ్యంలో మూడు ముఖ్యశక్తులలో తానూ ఒకటి కాగలదు—సోవియట్ యూనియన్ ఒకటి, ఆశియారాజ్యాలు రెండు, అమెరికా మూడు.

అమెరికాపై జపాను దాడిచేసేందుకు ప్రధాన కారణాలలో ఒకటి-చైనాలో తనకో ప్రత్యేకస్థానం ఉండాలన్న తన వాంఛను—అమెరికా గుర్తించకపోవడమే.

యూరోపులో నాజీజర్మనీతో పోరాడుతూ యుద్ధభారాన్ని ముఖ్యంగా సోవియట్టే భరించింది. విపరీత నష్టాలకు గురియయినది. పసిఫిక్కులో జపాను యుద్ధభారాన్ని ప్రధానంగా మోసినది అమెరికా. కాబట్టి జపాను పరాజితమై, దాని సామ్రాజ్యం విచ్ఛిన్నంకాగనే ఆ ఖాళీస్థలంలో ప్రవేశించింది అమెరికా. అయినప్పటికి జపాను పరాజయంతో ఏర్పడిన రాజకీయ శూన్యస్థానం, జపానుక్రింద త్రొక్కుడుపడిన వారిపైనేకాక ఆశియా వాసిన ప్రజలందరిమీదా తన ప్రభావాన్ని నెరపగలదు.

సోవియట్ వలె ఆశియాఅగ్రరాజ్యంగా అమెరికా ఇందులో ప్రవేశించడం లేదు—పసిఫిక్కు రాజ్యంగా ప్రవేశిస్తున్నది. బ్రిటన్‌వలె పెద్ద ఆశియా సామ్రాజ్యవాద ప్రభుత్వంగా కాక, కొన్నిప్రత్యేక కారణాల వల్ల సామ్రాజ్యం లేనిగొప్ప పారిశ్రామిక ధనికరాజ్యంగా ఆశియాలో అడుగుపెడుతున్నది. పైగా మహోన్నత పారిశ్రామిక దేశమిది—ఇతర

యూరపియన్ రాజ్యాలకువలె దీనికి పరిశ్రమాభివృద్ధి నరికట్టాలన్న చింత దు—తన బ్రహ్మాండమైన ఉత్పత్తి వ్యవస్థ తయారుచేసే సరుకులకు మార్కెట్టు వెదుక్కోవడమే అమెరికాకున్న వాంఛ. అయినప్పటికి ని విదేశాంగ విధానాన్ని, అభివృద్ధి నిరోధకులైన గుత్తవ్యాపార శక్తులే ర్ణయిస్తున్నవి.

• 1929 నాటికీ నేటికీ, ఆశియా పరిస్థితిలో వచ్చినమార్పును గురించి పనంచేసిన పరిశీలన, చాలసంగ్రహమైనదే కాని అంతమాత్రం మనకిక్కడ చాలును. అమెరికాలో రానున్న సంక్షోభం, ఎలాంటి ప్రపంచ వాతావర ణంలో రాగలదో ఇది తెలుపుతుంది.

ఇంతవరకు మనంచెప్పుకున్న సంగతుల సారాంశ మిది: తరతరా లుగా ఏగొప్పసంక్షోభానికీ గురికాని ప్రపంచధనికవిధాన చట్రంలో, 1929 సంక్షోభంలోనికి అమెరికా ప్రవేశించింది. అమెరికా, ఇతర దేశాలుకూడ అప్పుడు సాంఘికభద్రత ననుభవిస్తున్నవి. వచ్చే సంక్షోభంలో సాంఘిక భద్రతగల దొక్క అమెరికామాత్రమే కావచ్చును. అప్పటికి సోవియట్ కేవలం ప్రపంచోత్పత్తిలో 4%గాక అంతకు మూడునాలుగింతలు ఉత్పత్తి చేసేస్థితిలో ఉంటుంది. తన మిత్రరాజ్యాలతో చేరి ప్రపంచోత్పత్తిలో దాదాపు 1/5వంతుపై నిది అధికారం వహించగలదు.

యూరపియన్ రాజ్యాలక్రింది ఆసియా వలస ప్రాంతాలు 1929 సంక్షోభానికి ఆహుతయినవి. అయినా అప్పటికి సామ్రాజ్యాలకు దాన్ని తప్పించుకొని, వలసలను పీడించగల శక్తిసామర్థ్యా లుండినవి. 1929 సంక్షోభంలోనికి జపాను ప్రవేశించినప్పుడు, తాను విపరీతంగా ఆయుధాల నుత్పత్తి చేస్తున్నది. ఆసియా భూఖండంలో తన సామ్రాజ్యాన్ని మరింత విస్తరించుకునేందుకిది ఆధారంగా ఉంచుకొన్నది.

మరి వచ్చే సంక్షోభంనాటికి ఆసియాలో జపాను సామ్రాజ్యవాదం ఘోరంగా పరాజితమై ఉంటుంది. చైనా స్వతంత్రమై ఉంటుంది. ఆసియాలో సోవియట్ స్థానం విపరీతంగా బలపడిఉంటుంది. యూరోపు ప్రభుత్వాల ప్రతిష్ఠ బాగా తగ్గిపోయి ఉంటుంది. బ్రిటిషు విధానం మారి ఉంటుంది. ఆసియా ప్రజలు అలాగే ఇక బానిసలుగా ఉండిపోతారన్న నిర్ధారణ ఏమాత్రంనిజంకాదు. పైగా ఆప్రజలెంతో చైతన్యవంతులై, రాజకీయార్థిక స్వాతంత్ర్యంకోసం భూస్వామ్యవిధానంపై సామ్రాజ్య విధానంపై పోరాటం సాగిస్తున్నారు.

1929తర్వాత ఆసియాలోను, యూరోపులోను కూడ సోవియట్ స్థితిలో పెద్ద మార్పువచ్చినది. ఇది వచ్చే సంక్షోభంలో ప్రాముఖ్యత వహించగలదు.

అమెరికా తన విదేశరాజకీయస్థితిలో మార్పులవల్ల ఇదంతా చూస్తూ ఊరికే కూచోదన్నది సుస్పష్టమే—ఆసియాలోను యూరోపులోను కూడ భావినిర్ణయాలను తన ప్రయోజనాల కనుగుణంగా రూపొందించుకునేందుకై తన బలాన్నంటితని అమెరికా వినియోగిస్తుంది.

ఎనిమిదో అధ్యాయం

# రానున్న సంక్షోభం: ప్రపంచానికొక గండం

సంక్షోభం వచ్చేదాకా, జరుగుతున్న ఈ కాలంలో అమెరికా, పూర్వం యుద్ధకాలంలో నిర్వర్తించిన కర్తవ్యాలెన్నిటినో వదులుకుంటుంది. బ్రహ్మాండంగా పెట్టుబడి పెట్టడం, ఉత్పత్తిపై పెత్తనం-ఇలాంటివి మానుకుంటుంది. పైగా సంక్షోభం రాకముందే, అనేక కారణాలవల్ల ఆర్థిక వ్యవహారాలలో ప్రభుత్వం పలుకుబడి ఎక్కువై బలపడుతుంది, 1920 సంక్షోభం కంటె, ఏమైనప్పటికి, ఇది ఎక్కువ ప్రాముఖ్యం వహిస్తుంది.

ఒకటి: విదేశ రాజకీయాలలో మొదటిసారిగా మనం ప్రపంచ చరిత్ర శకంలో ప్రవేశించాము. ఈ నూతన శకంలోనికి ప్రపంచ పారిశ్రామిక దేశాలలో అగ్రేసరమై అమెరికా ప్రవేశిస్తున్నది. ఇది ఈనాడే కాదు, సంక్షోభం వచ్చేవరకూ, వచ్చాక కూడ ఇలాగే ఉండగలదు. ఇంత బలవత్తరమైన రాజ్యపు విదేశాంగనీతి, ఇతరదేశాల అభివృద్ధిపై తన ప్రభావాన్ని నెరపక తప్పదు. మొదటిసారిగా, అమెరికా విదేశాంగ నీతి తనదేశ భవిష్యత్తును నిర్ణయించేదిగా, ప్రతి అమెరికాపౌరుని భవిష్య న్నిర్ణాయకంగా మారగలదు. దీని ఆచరణ, పూర్వం కంటె నేడుప్రధాన మవుతున్నది కాబట్టి రాజ్యాంగాన్ని బలప్రపూర్ణం చేయడం అవసరం.

రెండు: శాంతికాలంలో కంటె ఎక్కువగా నున్న సైనికబలం, రాజ్యాంగస్థితిని బలపూరితం చేస్తుంది.

మూడు: అమెరికా ఇకమీద ప్రపంచ విపణివీధిలో గొప్పపాత్రను నిర్వహిస్తుంది. అందలి పరిస్థితి 1929 నాటికంటె చాలమార్పు చెందినది, కారణం మిగత ప్రపంచంలో ఆర్థిక జీవితంపై ప్రభుత్వ పెత్తనం ఎక్కువవుతుంది. విదేశ వ్యాపారం. దాని విధానం మీద సహజంగా ప్రభుత్వాధికారం పెరుగుతుంది. తన విదేశవర్తక విస్తరణ కార్యక్రమంలో, ప్రభుత్వమే విదేశ వాణిజ్యాదులు నడుపుతుండే దేశాలతో అమెరికా, పోటీ చేయవలసి వస్తుంది. అందుతో అమెరికాలో విదేశవర్తకం ప్రభుత్వం కిందికి ఎక్కువగా రాగలదు.

ఇవేకాక, అసలు దేశంలోని ఆర్థికగతే, ఈ ధోరణికి ప్రోది చేయవచ్చును. శాంతికాలంలో ఎన్నడూ లేనంతగా, జాతీయాదాయంలో ప్రభుత్వవ్యయమే ఎక్కువఖర్చుపద్దు కాగలదు. అందుతో ఆర్థిక వ్యవహారాలలో ప్రభుత్వ పెత్తనం పెరుగగలదు. అమెరికా యుద్ధవ్యయంలో సగంవరకూ, అప్పులద్వారా తెచ్చిపెట్టినదే. అందువల్ల వడ్డీమొత్తం, రుణతులచెల్లింపు పూర్వం కంటె చాల యెక్కువగా ఉండగలవు. యుద్ధ వీరులకిచ్చే పెన్షన్లు వగైరాలు యుద్ధాత్ పూర్వం కంటె ఎక్కువవుతాయి. యుద్ధకాలంలో కంటె చాల తగ్గినా. యుద్ధపూర్వం కంటె చాలఅధికంగా నౌకాసైనికవ్యయా లుంటాయి.

ప్రభుత్వవ్యయగతినిప్పుడే చెప్పడంసాధ్యంకాదు.లెవిస్ ఎ. కిమ్మెల్ ఒక అంచనా వేశాడు. యుద్ధానికిముందటి 1940 సంవత్సర వ్యయంతో

ద్ధానంతరపు 1949 సంవత్సర వ్యయాన్ని పోల్చాడు * 1946 శాంతి
ంవత్సరమనుకొని దానితర్వాత రెండేళ్లకు యుద్ధానంతరం సంవత్స
ారంభమని అంచనా వేశాడు.

ాతీయాదాయంలో—ప్రభుత్వ వ్యయం
949 ఆర్థిక సంవత్సరం అంచనా - 1940 తో పోల్చి

1 జాతీయాదాయం—ప్రభుత్వవ్యయం
(బిలియన్ డాలర్లలో)

| | 1940 | 1949 |
|---|---|---|
| జాతీయాదాయం | 76 | 130 |
| ప్రభుత్వ వ్యయం: కేంద్రం | 8.5 | 22.3 |
| రాష్ట్రం | 3.3 | 4.4 |
| స్థానికం | 5.6 | 6.8 |
| మొత్తం | 17.4 | 33.5 |
| పెన్షన్లు వగైరా | 6 | 2 |
| మొత్తం ఖర్చు | 18 | 35.5 |

మనకీ అంకెలు ఖచ్చితంగా తేలనక్కరలేదు. ఏ ధోరణిలో గాలి వీస్తున్నదో తెలిస్తేచాలు. ప్రపంచమంతటిలోలాగే, జాతీయాదాయంలో ప్రభుత్వభాగం అధికతర మవుతున్నది. కిమ్మెల్ అంచనానుబట్టి కేంద్ర వ్యయం 11.2నుండి 17.2- నూటికి యాభైవంతులు—పెరగవచ్చును.

* లెవిస్ ఎ. కిమ్మెల్, యుద్ధానంతర ద్రవ్యావసరాలు. బ్రూకింగ్సు విద్యాలయం, వాషింగ్టన్, డి. సి., పుట 158.

17

2. జాతీయాదాయంలో ప్రభుత్వవ్యయం దామాషా

| | నూటికి | నూటికి |
|---|---|---|
| కేంద్రం | 11.2 | 17.2 |
| రాష్ట్రం | 4.3 | 3.4 |
| స్థానికం | 7.4 | 5.2 |
| మొత్తం | 22.9 | 25.8 |
| మొత్తం అన్నీకలిపి | 23.7 | 27.3 |

సంక్షోభ నివారణకు పెట్టుబడిరూపంలో ప్రభుత్వం పెట్టేధనంతో నిమిత్తం లేకుండా ఇదింత ఎక్కువగా పెరిగినది. మంచి వ్యాపారం జరిగే సుభిక్షమైన సంవత్సరానికే అంచనా వేశారు. 1949 లో పెద్ద నిరుద్యోగసమస్య ఉండదు.

ప్రభుత్వపాత్ర బహుళత అభ్యుదయమైతీరవలసిన పనిలేదు

నేటిదశలో అమెరికాలోను, ఇతర ప్రపంచంలోనుకూడ ప్రభుత్వ పాత్ర ఎక్కువకావడం, లేదా ముందటికారణాలవల్ల త్వరలోకానుండడం, ఈ క్రింది కారణాలవల్ల చాల ప్రధానమైన అంశం. ఇందుమూలంగా అమెరికాలో నేడు ప్రచురితమవుతున్న భ్రమలెన్నో తొలగిపోగలవు. గత పదేళ్ల అనుభవాలదృష్ట్యా వీనిని సులువుగా అర్థం చేసుకొనవచ్చును.

ఆర్థిక వ్యవహారాలలో ప్రభుత్వజోక్యం ఎక్కువకారాదని, బడ్జెటులో నష్టంవచ్చే ఖర్చుచేయరాదని. ఆర్థికవిధానంపై పెత్తనం ఉండాలన్న సూత్రంపై నడవడం ప్రభుత్వానికి తగదని, "న్యూడీలు"కాలంలో అభివృద్ధినిరోధకు లడ్డుపడ్డారు. మరొకవేపు, అభ్యుదయకాముకులు దీనికి

స్వాగతమిచ్చారు. ఇందువల్ల ఆర్థిక వ్యవహారాలలో ప్రభుత్వ జోక్యమనేది తప్పకుండా అభ్యుదయవంతమన్న భావం ఏర్పడింది.

ఇది చాల ప్రమాదకరమైన భ్రమ. ఇదిలాఉంటే చాల దుష్ఫలితాల నివ్వగలదు. ప్రభుత్వాన్ని బలప్రపూర్ణం చేయడమంటూనే అది అభ్యుదయవంతం అనరాదు. దీనికి రుజువు కావలిస్తే నాజీ జర్మనీని చూపవచ్చు. అక్కడ ప్రభుత్వ సంస్థలు, మిలిటరీ, భూస్వాములు వీరే దేశాన్ని పాలించేవారు. ఈ విధానం అభివృద్ధినిరోధకమూ విప్లవ ప్రతికూలమూ, సామ్రాజ్యవాద దుర్గంధపూరితమూ, దురాక్రమణావిష్టమూ కూడ.

ప్రభుత్వాధికార ప్రాబల్యం అభ్యుదయపంథమా కాదా అనేది, ప్రభుత్వం ఏ వర్గాలచేతిలోనున్నది అనేదానిపై ఆధారపడుతుంది—ఈ సామాన్య విషయాన్ని నొక్కిచెప్పడం దురదృష్టవశాత్తు అవసరమవు తున్నది. ఇది నాజీ జర్మనీలో సుస్పష్టమేకాని, అమెరికాలోకూడ అంత స్పష్టమూనని చెప్పవచ్చును.

మిగత అన్ని దేశాలలోలాగే అమెరికాలో ప్రభుత్వ కార్యకలాపం విస్తరించేసమస్య ప్రజల నెదుర్కొంటున్నది. ధనికవిధానాభివృద్ధి సహజ సిద్ధమని తలంచుతూవచ్చిన మునుపటికాలంలో, ఆర్థికరంగంలో ప్రభుత్వ ప్రత్యక్షజోక్యం చాలతక్కువ. ఉన్నత పెట్టుబడిదారీవర్గం, తానే ప్రభుత్వ కార్యకలాపాలను పూర్తిగానడుపుతున్నప్పటికి, వర్గాలమధ్య-లేదా వర్గాలకు అతీతంగా తాను ఏదో స్వతంత్ర సంస్థ అన్నట్టుగా నటించేది. అయితే సాంఘిక వైషమ్యాలు తీవ్రతరమవుతున్నకొద్దీ ప్రభుత్వం ఆర్థిక వ్యవహారాలలో ఎక్కువజోక్యం తీసుకోవలసి వస్తుంది. అప్పుడు తామే పూర్తిగా పెత్తనం వహించేందుకు పెద్ద పెట్టుబడిదారులుకూడ గట్టిగా పోరాడ వలసి వస్తుంది.

అంటే ఈ శకంలో ప్రభుత్వంపై ప్రత్యక్షాధికారం కోసం ముఖ్యంగా వర్గకలహం కొనసాగింపబడుతుంది. ఇందులో అభివృద్ధి నిరోధకులే గెలిస్తే మిగతచోట్లలాగే ఇక్కడా ప్రభుత్వాధికార ప్రాబల్యం అభివృద్ధికరం కాకపోతుంది.

సంక్షోభం రాకపూర్వమే ప్రభుత్వంపై ప్రత్యక్షాధికారంకోసంజరిపే పోరాటమే అమెరికాలో ప్రాధాన్యమవుతుంది. అయితే సంక్షోభం రానే వచ్చినప్పుడు మరింత తీవ్రతరమవుతుంది-సంక్షోభంనుండి బతికి బయట పడ్డం ఎలాగు? అనే ప్రధాన సమస్యదృష్ట్యా అప్పుడు దేశీయ విదేశీయ విధానాలను నిర్ణయించవలసి ఉంటుందికదా.

ప్రస్తుతం గుత్తవ్యాపారస్తులు, పెద్ద పెట్టుబడిదారులు అమెరికాలో చాల బలవంతులుగానున్నారు. అతివాదులు, అభ్యుదయకాములు, లిబరల్ వర్గాలవారు,కార్మికులు, అభ్యుదయకర్షకులూ చాల దుర్బలులుగానున్నారు. ఇంతదాకా వీరు కలిసికట్టుగాకాక ఏదో ఎవరికివారు ప్రభుత్వంపై ఒత్తిడి తేవడానికి ప్రయత్నిస్తుండడంవల్ల అందరూ దుర్బలులుగా నున్నారు.

భావిసంక్షోభం అమెరికాలో వర్గాల బలాబలాలు

రానున్న సంక్షోభంలో సాంఘికశక్తుల బలాబల తారతమ్యమెలా ఉంటుంది? అప్పటికీ పెట్టుబడిదారుల ప్రాబల్యమేఉండి, తమప్రయోజనాల కనుగుణమైన విధానాన్నే అనుసరించేట్టు ఒత్తిడితేగలరా? తమవిధానాన్ని పూరా అమలుజరిపింపలేకపోయినా, అభివృద్ధి నిరోధకుల శక్తి నదుపులో ఉంచగలిగేంతమటుకు, బలం, అభ్యుదయశక్తులకు ఉంటుందా?

ఈ విషయమై ఇప్పుడే ఇలాంటి పరిశీలన జరపడం సరికాదని, ఇందుకు కావలసిన విషయసామగ్రి మనవద్దనున్నది అత్యల్పమని ఆక్షేపించవచ్చును. ఈ పుస్తకం ప్రకటితమయ్యేటప్పటికి (1947) మామూలు గిరాకీకితోడు యుద్ధంలో మిగుల్చుకొన్న నిలవలద్వారా గిరాకీ ఉంటుంది కాబట్టి, సంక్షోభ కారణాలన్నీ అప్పుడే ఏర్పడవు కాబట్టి, నేటి వర్గ సంబంధాలన్నీ గట్టిగా ఏర్పడలేదుకాబట్టి, ధనిక అభివృద్ధి నిరోధకుల శక్తులయొక్క, అతివాద అభ్యుదయ శక్తులయొక్క బలాబలాల తారతమ్యం, సంక్షోభంలో ఎలా ఉంటుందో ఇప్పుడే చర్చించడం, పట్టి ఊహాగానంమాత్రమే కాగలదు. కాని ఈ ఆక్షేపణలోఉన్న సత్యాన్ని గమనిస్తూనే, ఏమైనప్పటికి మనం అలాంటి వివరణను చేయవలసి వస్తుంది. అందుకు కారణం ప్రధానమైనకొన్ని అంశాలు, రానున్న సంక్షోభం ప్రపంచ చరిత్రలో అతి ప్రమాదకరమైన ఘట్టమని సూచిస్తున్నవి కాబట్టే.

మొదటి యుద్ధాన్నిగూర్చి "యుద్ధాలకు స్వస్తిచెప్పే యుద్ధం"అని పదేపదే ప్రస్తావించేవారు. ఇది "ఆఖరి యుద్ధం" అని అందరూ భావించేవారు. అయినప్పటికి నేడు ప్రపంచ ప్రజలు సందేహగ్రస్తులుగానున్నారు. మొదటియుద్ధం వచ్చినప్పుడు వారు విభ్రాంతులయ్యారు. కాని రెండో యుద్ధం వచ్చేందుకు చాలకాలంముందే అది వస్తుందని వారెరుగుదురు. అలాగే భావిసంక్షోభాన్నిగూర్చికూడ "తప్పదు-పునకర్మ మిది" అనుకునే స్థితికి వచ్చారుప్రజలు. రెండోయుద్ధం ముగిసినా ఇదే ఆఖరు యుద్ధమన్న భావం వారికిలేదు, పైగా మూడోయుద్ధం తప్పక వస్తుందని అనుకుంటున్నారు. అందరూ యుద్ధానికి అవకాశం ఉందనుకుంటున్నారు. చాలమంది బహుశా తప్పదనుకుంటున్నారు. కొందరు తప్పక వచ్చితీరుతుందనుకుంటున్నారు. పరమాణుయుగంలో వచ్చే ఈ మూడోయుద్ధం మూలంగా,

ప్రపంచం నిర్ధూమధామ మయిపోయి, రాక్షసశక్తులు విజయవంతమై ప్రపంచం చరిత్రహీనమైన అంధయుగంలోనికి వెళ్ళిపోవచ్చును.

మూడోయుద్ధం వస్తుందా రాదా అన్నసంగతి, చాలవరకు—ఆఖరు వరకుకూడ-భావిఅమెరికా ఆర్థిక, సైనిక, విదేశాంగనీతులపై ఆధారపడి ఉంటుంది, నేటిశక్తుల పరస్పర సంబంధంలో అమెరికా స్థానం చాల ముఖ్యమైనది. కాబట్టి భావిసంక్షోభకాలంలోని అమెరికావిధానం, అమెరికా స్థితికేగాక, ప్రపంచగతికే చాలకాలందాకా ముఖ్య ప్రవర్తకంకావచ్చును.

ధనిక గుత్త వ్యాపారశక్తులకూ, తమవైపు వీరు లాక్కో-వీలైన మధ్యతరగతులకూ—అటు అతివాద అభ్యుదయశక్తులకూ మధ్య ఉన్న తారతమ్యంపై అమెరికావిధానం ఆధారపడి ఉంటుంది.. ఈ వర్గశక్తుల బలాబల తారతమ్యం ప్రపంచ చరిత్రకే ప్రధానమయినదికాబట్టి, నేడే వీనిని ఖచ్చితంగా అంచనావేయలేమని తెలిసే, మనం ఎరిగినంతవరకు అంచనావేయక తప్పదు. పైగా ఇలాంటి వివరణ కొన్ని భ్రమలను తొలగించడంద్వారా అభ్యుదయ శక్తులకు బలం చేకూర్చవచ్చును. వీరికున్న ప్రధాన లోపం ఏమిటంటే, మరీ అత్యాశావాదం, సంక్షోభకారక శక్తుల బలాన్ని గుర్తించకపోవడం, ఈ సంక్షోభంద్వారా విదేశ స్వదేశ రాజకీయాలలో వచ్చే ప్రమాదా లెంతబలమైనవో గుర్తించకపోవడం ఇవీ వీరి లోపాలు.

అభ్యుదయ శక్తులకున్న అనుకూలాలు

వచ్చే సంక్షోభ సమయంలో అతివాద, అభ్యుదయశక్తులు అమెరికాలో బలపడతాయనేందుకు చాల సూచన లగపడుతున్నవి. వానిలోఉన్న ప్రధానమైన లోపం ఏమిటంటే, అమెరికా కార్మికవర్గం కార్మిక సంఘా

ంలో అధికంగా సమీకృతమైనప్పటికి, అది రాజకీయంగా సమీకృతం కాలేదు. 19 శతాబ్దిలోని బ్రిటిష్ కార్మికవర్గంవలెనే తమ వాంఛలన్నిటిని పెద్ద బూర్జువాపార్టీలు రెండిటిద్వారాను ప్రకటితం చేయాలని ఆశిస్తున్నది. కార్మికవర్గం, దాని నాయకులు కూడ బూర్జువాసమాజపుహద్దుల లోపలనే ఆలోచన చేస్తున్నారు. బూర్జువావర్గంతోపాటు, వీరూ మరొక దీర్ఘకాల అభ్యుదయదశ రావచ్చునని, వస్తుందనికూడ భావిస్తున్నారు: ఇక ఆఖరున ఆర్థికరంగంలో ప్రభుత్వ జోక్యం కావాలని ఈ కార్మికులు కోరుతున్నప్పటికి, ప్రభుత్వపాత్రను రెండవదిగనే భావిస్తున్నారు. వీటిన్నిటిలోను భావి సంక్షోభం తీవ్రమైనమార్పులు కొనిరావచ్చును.

ఒకేతరంవారు రెండు ప్రపంచ యుద్ధాలను అనుభవించారని మామూలుగా చెబుతుంటారు. వచ్చేశకంలో ఒకేతరంవారు దారుణమైన రెండు సంక్షోభాలను రుచిచూస్తారు. అందులో అత్యల్ప వ్యవధితో ఇవి రాగలవు. వారు రెండవ సంక్షోభాన్ని అనుభవిస్తున్నప్పుడు, ఇది మొదటిదేనని, కేవలం రెండోయుద్ధం దీనిని కొన్నాళ్లు ఆపివేసినదేకాని, అసలది పోనేలేదని వారు కనుక్కోగలుగుతారు.

చాలమంది ప్రజలదృష్టిలో, 1929సంక్షోభం ఏదో ప్రకృతిసిద్ధమైన ఈతిబాధలా విరుచుకపడింది. తుపానులు, భూకంపాలలాగే దీనినుండి రక్షించుకునే ఉపాయమే లేదన్ననమ్మకం వ్యాపించింది. అమెరికా కార్మికవర్గానికిదొక విచిత్రమైన అంశం. వందయేళ్లు వారు సర్వ సౌభాగ్యాన్ని చూచారు. కాబట్టే ఇదేదో ఆకస్మికంగా వచ్చినదని, ఇకమీద రావని వారనుకుంటున్నారు. కాబట్టే వారిదృక్పథంలో ఎలాటి ప్రధానమైన మార్పూ రాలేదు.

కాబట్టి ఆ సంక్షోభం తిరిగి వచ్చినప్పుడు—ముఖ్యంగా త్వరలో అంత తీవ్రంగాను వచ్చినప్పుడు—పరిస్థితి పూర్తిగా మారిపోగలదు. ధనికవాదంలో ఆర్థికాభ్యుదయం సర్వదా ఉంటుందని, సంక్షోభం ఏదో అసాధారణ రూపమైన మినహాయింపుమాత్రమేనని అమెరికాప్రజలిక నమ్మకం మానివేస్తారు. పైగా సంక్షోభం ధనికవాదంలో మామూలుగా వస్తూంటుందని, పూర్వంలోలాగా ఏదో కొన్నాళ్లు అభ్యుదయం ఆగిపోవడంమాత్రంకాదని, ఇకమీద వచ్చే సంక్షోభాలు 1929 నాటికంటె తీవ్రంగానూ, మరింత విశ్వజనీనంగానూ ఉంటాయని గ్రహిస్తారు. కాబట్టి ఏ సాయమూలేకనే ధనికవాదం తెప్పరిల్లుకుని లేస్తుందన్న విశ్వాసం ప్రజలు కోల్పోతారు. పైగా రెండు సంక్షోభాలనూ, మధ్యలో రెండో యుద్ధాన్నీ చూచిన ప్రజలు సంక్షోభమొక ఈతిబాధ అనీ, దాని నాప వీలులేదనీ భావించడం మానివేస్తారు.

రానున్న సంక్షోభంలో అమెరికా ప్రజల మనస్తత్వం 1929 నాటి కంటె పూర్తిగా భిన్నంగా ఉంటుంది. ఇదేసమాజవ్యవస్థే, పనిచేయదలచుకున్న వారందరికీ పని కల్పించగలదని, రెండోయుద్ధంలో వారు తెలుసుకున్నారు. వచ్చే సంక్షోభంలోగా దాని నివారణోపాయాలను వెదకి, తగిన చర్యలను ప్రభుత్వం తీసుకునేట్టు చేయగల ఐక్యత, సంఘటితశక్తి అమెరికా ప్రజలకు లేకపోతే, ఇక సంక్షోభం తీరా వచ్చిపడ్డాక, తీవ్రమైన సంక్షోభ ప్రతీకారచర్యలు తీసుకోవాలని ఒత్తిడి తేవడం మొదలుపెడతారు— అప్పుడు లక్షలకొలది నిరుద్యోగులు తయారవుతారుకదా.

వచ్చే సంక్షోభంలో అత్యాశావాదం 1929సంక్షోభంలా ప్రచారంలో ఉండదు. అదేదో మినహాయింపని, అరుదుగా ఒకతూరి వచ్చినదని ఎవరినీ ఒప్పించడమిక సాధ్యంకాదు. ఈ సంక్షోభాలు సామాన్యమైపోయాయని వారుగుర్తిస్తారు. అభ్యుదయదశలాగే, ధనికవాద వ్యవస్థలో

ఇదితప్పని ఈతిబాధఅని చెబితే, రెండోయుద్ధం అనుభవంతర్వాత వారది నమ్మరు. అంత తెలివితక్కువగా వారిని ఒప్పించ పూనుకుంటే వారు వెంటనే ఇలా సమాధానమిస్తారు: 1929 సంక్షోభంఅంత పెద్దవీ, భావి సంక్షోభంలాంటివీ ధనికవాదంలో తప్పించరాని ఈతిబాధలయినట్టయితే, ఆ పాడు సమాజవ్యవస్థ విచ్ఛిన్నమైపోనీండి అంటారు; అలాంటివి సహజంకాని సాంఘికవ్యవస్థ నేర్పరుచుకుందాం పట్టండి అంటారు. ఈ హేతువాదదృష్టికి మరొకఅంశం బలం కలిగిస్తుంది. సోవియట్ సమాజ వ్యవస్థ 25 ఏళ్లుగా ఏ విధమైన సంక్షోభం లేకుండా నడుస్తున్నదికదా అన్నదే ఈ అంశం.

ప్రపంచ ఆర్థిక సంక్షోభం 1929 లో విరుచుకుపడినప్పుడు, రష్యన్లప్పుడప్పుడే మొదటియుద్ధం, అంతర్యుద్ధం వీనిమూలంగా కలిగిన నష్టాన్ని పూడ్చుకోగలుగుతున్నారు. వారి ఆర్థికవ్యవస్థ సంక్షోభంతో దెబ్బ తినకుండాఉన్నదంటే, అదంతగా ధనికదేశాలలోని కార్మికులపై గాఢమైన ముద్రను వేయలేదు. ఈలోగా పరిస్థితి చాలమారినది. యూరోపులోను, ఆసియాలోనుకూడ సోవియట్ రష్యా ప్రపంచ అగ్రరాజ్యంగా తయారయి నది. పూర్వానుభవాలన్నీ, 1929 సంక్షోభంవరెనే వచ్చే సంక్షోభంలోకూడ సోవియట్ ఆర్థికవ్యవస్థ దెబ్బతినదని మనకు సూచిస్తున్నవి. సంక్షోభ ఫలితంగా అక్కడ నిరుద్యోగంరాదు. పైగా దాని ఉత్పత్తి మొత్తం యథారీతిగానే అధికమవుతూంటుంది.

ఇప్పుడు అమెరికాలో సంక్షోభ ఫలితంగా ఉత్పత్తిబాగాపడిపోయి, నిరుద్యోగం విపరీతంకాగా అదేసమయంలో సోవియట్, నిరుద్యోగ బాధ లేక ఉత్పత్తి నధికం చేసుకుంటూ ఉన్నదంటే, ధనికవాదానికీ సంక్షోభానికీ మధ్యనున్న సంబంధం ధనిక రాజ్యాలలోని కోట్లాది ప్రజలకు మరింత

స్పష్టతరం కాగలదు. సంక్షోభాలు, భూకంపాలలాంటివి కావని, ధనిక వ్యవస్థకు చెందిన పరిస్థితులే ఇందుకు కారణమని ప్రజలు గుర్తిస్తారు, ధనికవ్యవస్థ తప్పనిసరిగా సంక్షోభానికి దారితీస్తుందని, దాని నెదుర్కొనేందుకు మరిన్ని ఇబ్బందులే కల్పిస్తుందని వారు తెలుసుకుంటారు. దీని ఫలితంగా అసలు ధనికవ్యవస్థ అవసరాన్ని, ఆవశ్యకతనుగూర్చే వారు సందేహించడం ఆరంభిస్తారు. ఏమైనప్పటికి, అమెరికా ప్రజలు తమ వ్యవస్థకంటె సోవియట్ వ్యవస్థనే అభిలషిస్తారనిఅనలేము-కారణం తమకంటె అక్కడివారి జీవనస్థాయి చాల తక్కువగా ఉన్నది. ఈ యుద్ధ విధ్వంసనాన్ని పూడ్చుకొని, పరిశ్రమలు జీవితావసర వస్తువులను ఉత్పత్తి చేయనారంభించినప్పటికి, సోవియట్ జీవనస్థాయి, అమెరికాలోకంటె చాల తక్కువలో ఉంటుంది.

ఈ రెంటికీఉన్న తారతమ్యం చాల ఎక్కువ. సంక్షోభ కాలంలో అమెరికాలో నిరుద్యోగం ఎంతపెరిగినా పనిలేనివారుకూడ, నిరుద్యోగభృతి ద్వారాను ప్రభుత్వ పనులద్వారాను వచ్చే మొత్తంతో సోవియట్‌లో ఉద్యోగంలోఉన్న కార్మికులకంటె ఎక్కువస్థాయిలో బ్రతుకవచ్చును. ఇందుకొక ప్రధాన ప్రపంచ చారిత్రక సంఘటన కారణం. అదేమిటంటే, మార్క్సు ఇతర సోషలిస్టులు చాలమంది అనుకున్నట్టుకాక సోషలిజం బాగా అభివృద్ధి చెందిన ధనికదేశంలో రాలేదు. మరి కాపిటలిజం అతి దుర్బలంగా ఉన్నచోట, పారిశ్రామికంగా వెనుకబడిఉన్న రష్యాలో ధనిక విధానం విచ్ఛిన్నమై సోషలిజం వచ్చినది.

పారిశ్రామికంగా బాగా అభివృద్ధిచెందిన దేశంలో—అమెరికా జీవనస్థాయికంటె తక్కువకాని జీవనస్థాయిగల దేశంలో సోషలిజం విజయవంతమయిన దనుకొండి. ఇలాంటిచోట ఆర్థిక సంక్షోభం ఏమీ చేయలేక పోయినదనుకొండి. అది తప్పదు గనక అక్కడ నిరుద్యోగం

కానరాదు. ఉత్పత్తి బాగా పెరిగిపోతూ వస్తుంది. జీవనస్థాయి క్రమంగా ఎక్కువవుతూ వస్తుంది. అలాంటప్పుడు సహజంగా ఈనిదర్శనం అమెరికాపై ఎక్కువ పనిచేస్తుంది. అక్కడి కార్మికులయొక్క, అతివాద, అభ్యుదయ వర్గాలయొక్కబలం, సంక్షోభకాలంలో అత్యధికమవుతుంది. ఏమైనప్పటికి, రష్యావంటి ప్రపంచంలోని అగ్రరాజ్యమొకటి, అమెరికా ప్రక్కనే, సంక్షోభ ఫలితాలకు దూరంగా ఉంటున్నప్పటికి, ఆ నిదర్శనంతోనే సంక్షోభమనేది ప్రకృతిసిద్ధమయినది కాదని ధనికరాజ్యాలలోని కార్మికులకు చూపుతున్నప్పటికి, రష్యా ప్రజల జీవనస్థాయి తక్కువగా ఉన్నందువల్ల ఈ ఉదాహరణ దుర్బల మయిపోతుంది.

ఉదాహరణకు, బ్రిటిష్ లేబర్ ప్రభుత్వం అనుసరించే ఆర్థికవిధానంవల్ల, సంక్షోభంనుండి బ్రిటన్ తప్పించుకోగలుగుతుందనుకొండి. క్రమక్రమంగా సోషలిజం అమలుపరచాలనే విధానం విజయవంతమై, అమెరికా సంక్షోభంలో గిలగిల తన్నుకుంటుండగా బ్రిటన్ దానికెరిగాదనుకొండి. అతివర్గాల నాయకత్వంక్రింద, ప్రణాళికాబద్ధమైన ప్రభుత్వ ఆర్థికవ్యవస్థ పునాదిపై ఉత్పత్తి ఎక్కువై, జీవనప్రమాణం పెరుగుతుందనుకొండి—అప్పుడు అమెరికాలోని వర్గశక్తుల సంబంధాలలో పెద్ద మార్పు రాగలదు, అలాంటిది జరిగే అవకాశం ఉన్నది కాని, జరుగుతుందని చెప్పలేము. కాబట్టి వచ్చే సంక్షోభంలో అమెరికాలోని అభ్యుదయ శక్తులకు విదేశపరిస్థితుల సాయం ఎక్కువరాదు—వారు తమ స్వశక్తిపైనే చాలవరకు ఆధారపడవలసి వస్తుంది.

ప్రపంచ చారిత్రక గమనంలో ఒక్క అంశంమటుకు అమెరికా అభ్యుదయ శక్తులకు సాయపడవచ్చును. ఇటలీలోకాక—అదంత ముఖ్యంకాదు—ఫాసిస్టు విప్లవప్రతీఘాతచర్యలు మొదట జర్మనీలో గెలు

పొందాయి. నాజీజర్మనీ సంపూర్ణపరాజయంతో విప్లవ ప్రతీఘాతుకు కంచుకోటలాంటి నాజీ నిరంకుశ ప్రభుత్వం హతమారిపోయింది.

సాంఘిక వైరుధ్యాలు ముఖ్యంగా జర్మనీలో ఎందుకు తీవ్రపై నవో మనం చూచాము. ఈ విద్వేషాలు రెచ్చిపోవడం, 1929 లో ఆరంభమైన సంక్షోభకాలంలో నాజీ విజయానికి ప్రాతిపదిక అయినది

నాజీ జర్మనీ అపజయమూ, పతనమూ, జపాను పరాజయమూ పతనమూ కేవలం జర్మనీ, జపానులలోని నిరంకుశ ప్రభుత్వాలకు మాత్రమే ఆఘాతంకాదు. అంతకుముందున్న అన్నిరూపాలలోను, ప్రపంచ ఫాసిజం సంపూర్తిగా అపజయం చెందినదన్నమాట. ఈ పరాజయంమూలంగా యూరోపులో అభ్యుదయ ఉద్యమం పెరుగుతున్నది. ఇక సంక్షోభసమయంలో, ఫాసిజం అడుగుపెట్టనిచోటకూడ అది కనిపించకూడదు.

ఫాసిజాన్ని వివరంగా పరిశీలించడం ఈ పుస్తకం ఉద్దేశంకాదు. ఈ ప్రస్తుత ధనస్వామ్యదశలో ఫాసిస్టు వైఖరుల నెలాంటిశక్తులు బల పరుస్తాయో చర్చించడంకూడ మన ఉద్దేశంకాదు. నేషనల్ సోషలిజంలో గాని, ఫాసిజంలోగాని, నిర్ణాయక శక్తులు జాతీయమైనవిగావు. ఏతెగలకు చెందినవీ కావు. కేవలం అవి సాంఘికమైనవి. ఫాసిస్టు వైఖరులు మిగత అన్ని ధనికరాజ్యాల్లోను, అమెరికాలోకూడ పనిచేస్తున్నాయని మాత్రం ఇక్కడచెబితే చాలును. వాదంకోసమని, అలాంటి ఫాసిస్టు నిరంకుశరాజ్యాంగం భావిసంక్షోభకాలందాకా ఎక్కడా ఏర్పడలేదను కుందాం. అలాంటి పరిస్థితిలో అమెరికాఅభివృద్ధినిరోధకులు సంక్షోభాన్ని, తద్వారా రెచ్చిపోయిన సంఘవైషమ్యాలను తొలగించేందుకై ఫాసిస్టురాజ్యం నెలకొల్ప ప్రయత్నించేవారు, అలాంటి రాజ్యంలో

ఎత్తవ్యాపార సంస్థలు మరింతబాహాటంగా ప్రత్యక్షంగా దేశ, విదేశ తులను తమ చేతులలో ఉంచుకొన జూచేవారు.

నేటి మన సమాజవ్యవస్థలో నిత్యం నిశితమవుతున్న సంఘ వైషమ్యాలను విప్లవ ప్రతీఘాత చర్యలద్వారా ఎదుర్కొనే ఫాసిస్టు ఉద్యమాలన్నీ ఇక విఫలమయిపోయ్యాయి. భావి సంక్షోభం మనకింకా దూరంలో ఉన్నది—కాని ఫాసిస్టు నిరంకుశ ప్రభుత్వాలిప్పటికే విధ్వంసం చేయబడినవి. తన ఉద్దేశాలను కప్పిపుచ్చుకునేందుకై ఫాసిజం ఉపయోగించిన సిద్ధాంతపు బండారం బయటపడిపోయింది. రెండో యుద్ధంలో జయం పొందిన పెట్టుబడిదారీ దేశాలకు ఈ అంశాలకు చాల పలుకుబడి ఉంటుంది. కాబట్టి, భావిసంక్షోభదశలో ఫాసిస్టుశక్తులు తిరిగి తలయెత్తేందుకు అవకాశమున్నప్పటికీ, వానికి తగిన రాజకీయ, సంస్థాత్మక నిర్మాణరూప మొకటి సంపాదించుకోవడం చాల కష్టతరం కాగలదు.

ఇంతకూ సారాంశమిది: అమెరికాలోని అభ్యుదయశక్తుల స్థితి బలపడేందుకు, ఈ క్రింది మూడు అంశాలు కారణమవుతాయి:

(1) రానున్న సంక్షోభంలో, సంక్షోభ నివారణకు ధనికవర్గాలేమీ చేయలేరని ప్రజలూరకే చూస్తూకూచోరు. యుద్ధంలో పాల్గొని, తిరిగి నిరుద్యోగం వాతబడినతరంవారు సంక్షోభం ప్రకృతిసిద్ధమయినదని, దీని నాటంకపరచేందుకేమీ సాధనంలేదని నమ్మనే నమ్మరు.

(2) సంక్షోభంకాని, నిరుద్యోగంకాని సోవియట్ ప్రాంతంలో లేదని మరొకతూరి సోవియట్ రష్యా ప్రపంచానికి చాటగలదు. అయితే అమెరికాకంటె ఇతర ధనిక రాజ్యాలకంటె అక్కడి జీవనస్థాయి తక్కువవడంవల్ల ఈ ప్రదర్శన ప్రాబల్యం కొంత దెబ్బతింటుంది.

(3) జర్మనీ జపాను నిరంకుశప్రభుత్వాలు పరిపూర్తిగా పరాజయం పొంది, విధ్వంస మయిపోయ్యాయి. ఆ ఫాసిస్టు హింసాత్మకయంత్రం ప్రపంచమంతటా తుత్తునియలై పోయినది. కాబట్టి, ఇప్పుడు అమెరికా లోను, ఇతరచోట్లనుడున్న అభివృద్ధినిరోధకవర్గాలు ఫాసిస్టుపద్ధతులతో సంక్షోభ ఫలితాలైన సాంఘికవైషమ్యాలకు జవాబివ్వలేవు.

## భావి సంక్షోభంలో—అభ్యుదయ విధానం అరుదుకావచ్చు

ఏమైనప్పటికి సంక్షోభం వచ్చినప్పుడు, అభ్యుదయపంథా నవలంబింపజేసే శక్తిసామర్థ్యాలు అతివాదశక్తులకు చేకూరగలవని ఇందువల్ల అర్థం చేసుకోరాదు. అమెరికాలోని గుత్తవ్యాపారస్తులు వారి ఉపగ్రహాలు చాల బలవంతులుగా ఉంటారుగాబట్టి, వారితోపాటు తాము కొంతపాత్ర నిర్వహించగలిగితే అభ్యుదయ శక్తుల కదే పదివేలు. భావి సంక్షోభపు మొదటిరోజులకీ అంశం ముఖ్యంగా అన్వయిస్తుంది,

కార్మికులు. రైతులు, పట్టణాలలోని మధ్యతరగతులు, ఉదారవాదులైన మేధావులుకలిసి, ఒకటిగా పనిచేసేందుకు ప్రాతిపదికకాగల సామాన్య కార్యక్రమాన్ని అభ్యుదయవర్గాలు తయారుచేయగలరా ? ఈ అంశం మీదనే అమెరికాలోని వర్గశక్తుల తారతమ్యం తర్వాతికాలంలో ఆధారపడి ఉంటుంది.

సంక్షోభం చాలకాలం ఉంటుంది, తీవ్రంగానూ ఉంటుంది. అభివృద్ధినిరోధక శక్తులెలాగూ తమ సమస్యలను ఫాసిస్టు పద్ధతులతో పరిష్కరించుకోలేరు. కాబట్టి గత అనుభవంపై ఒక నిర్మాణాత్మక కార్యపథకాన్ని అభ్యుదయవర్గాలవారు తయారుచేయగలగాలి.

అయితే వారలా చేయలేకపోతే, సాధారణ పద్ధతులతో సంక్షోభాన్నెదుర్కోలేని గుత్తవ్యాపారస్తులు, పెట్టుబడిదారులు బ్రహ్మాండమైన

త్పాదకోత్పత్తికి ఆరంభిస్తారు. తమ ఇబ్బందులనుండి గట్టెక్కేందుకు పరాక్రమణ వాంఛాప్రేరితమైన విదేశాంగనీతి నవలంబిస్తారు. ప్రపంచ చరిత్రలో అభివృద్ధి నిరోధకులిలా చాలసార్లుచేయడం చూచాము. అది వారికి మామూలు. ఇలాంటిదే జరిగితే మూడవ ప్రపంచయుద్ధం తప్పనిసరి అన్నమాట.

## సంక్షోభానికి అభివృద్ధి నిరోధకుల పరిష్కారం

గుత్తవ్యాపారస్తులు—పెట్టుబడిదారులు సంక్షోభాన్నిక సామాన్య ఆర్థికపద్ధతులలో శాశ్వతంగా అరికట్టలేరని చెప్పాము, అదెందుకో ఈ పుస్తకం వివరించింది.

ప్రభుత్వం అభ్యుదయవంతమైన ఆర్థికవిధానాన్నవలంబించి, తీవ్రమైన నిరోధకచర్యలను తీసుకుంటేతప్ప, సంక్షోభం రాకతప్పదని అందుకు హేతువులేమో వివరించాము. 1929 లో లాగే, ఈతూరికూడ సంక్షోభాన్నుంచి ధనికవాదం తనంతటతానే తనబలంతో తప్పించుకో పలసివస్తుంది కనుక, పై హేతువులే అందుకు తీవ్రమైన ఆటంకం కాగలవు.

ఇలా, ధనికవాదం తనంతటతాను బయటపడ్డం చాల కష్టతరం. కాని స్వదేశంలో రాజకీయపరిస్థితి మరీ అతివాదులవేపు మొగ్గకుండా ఉంటంకోసం, అభివృద్ధి నిరోధకవర్గాలు, సంక్షోభాన్ని తొలగించుకొనేం దుకు తమ సాయశక్తులా పోరాడుతారు. యూరోపులో మొదటిసారిగా సాంఘికశాసనాలు చేయడం మొదలుపెట్టినప్పుడు, వీనిని ఆధునికులైన కన్సర్వేటివ్‌లు, విప్లవంరాకుండా ఆపే భీమా ప్రీమియంలాంటివని అన్నారు. ఈసారి సంక్షోభంపచ్చినప్పుడు, అమెరికా సాంఘిక శాసనాలు మరొక అడుగు ముందుకుపోవచ్చును. అలాగే వీధులలోని లక్షలాది

నిరుద్యోగులకు పని కలిగించడంకోసం ప్రభుత్వం పనుల నారంభించవచ్చును. ఏమైనప్పటికి, కాలం గడిచినకొద్దీ ఇలాంటి అతుకులతో సంక్షోభాన్ని తొలగించుకోవడం సాధ్యంకాకపోతుంది. మరింత సమర్థములైన మార్గాలను, సాధనాలను వెమకవలసిఉంటుంది, అమెరికా అభివృద్ధి నిరోధలకులకిక మిగిలినది ఒకే ఒక్క-మార్గం—నూతన అమెరికా మార్కు "యుద్ధ ఆర్థిక విధానం" అమలుజరపాలి. అది ప్రపంచశాంతికి విధ్వంసన హేతువు కాగలదు.

## అమెరికా "యుద్ధఆర్థిక విధానం"

"యుద్ధ అర్థిక విధానం" (Wehrwirtschaft)అనేది మొదట నాజీ జర్మనీలో కనుగొనబడినది, జర్మనీ సైనిక ప్రధాన కార్యాలయం మొదట యుద్ధంలో నేర్చుకున్న పాఠాల సారాంశమందులోఉన్నది. ఆధునిక పారిశ్రామిక యుద్ధంలో, కేవలం సైనిక సమీకరణం చాలదు అన్నదే వీరు నేర్చుకున్నపాఠం. ఆధునిక యుద్ధంలో సైనిక సన్నాహాలతోపాటు, పారిశ్రామిక సన్నాహాలు కూడ చేయాలి. అంటే శాంతిసమయంలో పరిశ్రమలలో తగినంత భాగాన్ని ఆయుధోత్పత్తికై అట్టిపెట్టవలసి వస్తుంది. ఈ పద్ధతివల్ల కేవలం సైనిక సన్నద్ధతలాగే కాక, యుద్ధార్థమైన పరిశ్రమల సమీకరణంలోకూడ శత్రువులకంటె తనకొక మంచి అవకాశం ఏర్పడుతుందని జర్మనీ భావించింది. రెండోయుద్ధం జర్మనీ "యుద్ధ ఆర్థిక విధానానికి" స్వస్తి చెప్పినది కాని, ఆ విధాన శకాన్ని శాశ్వతంగా ముగించలేదు.

రెండోయుద్ధానికి అమెరికా సైనికంగాను, పారిశ్రామికంగాను కూడ సిద్ధమై ఉండలేదు. ఇందువల్ల గొప్ప ప్రమాదాలు కలగలేదంటే అందుకు కారణం బ్రిటన్‌ను జర్మనీ జయించలేకపోయింది. పైగా అమెరికాపై

ంటె ముందే సోవియట్ పై దాడిచేసింది. కాబట్టి ప్రాచ్యరంగంలో తన సేనలలో ఎక్కువభాగాన్ని, జర్మనీ కేంద్రీకరించవలసి వచ్చినది. మిగత రంగాలన్నింటిలో ఎంత నష్టపడిందో అంతా ఈ ఒక్క రంగంలోనే జర్మనీ నష్టపడినది.* తన అసంసిద్ధతవల్ల దారుణమైన ఫలితాలేర్పడక పోయినందుకు మరొకకారణం ఆకాలపు యుద్ధతంత్రరీత్యా అప్పటికింకా అట్లాంటిక్కు, పసిఫిక్కు మహాసముద్రాలు దృఢమైన అగడ్తలుగా ఉన్నవి.

నేటి ఆటంబాంబు యుగంలో భౌగోళిక పరిస్థితులపై ఆధారపడిన రక్షణ ఎన్ని రక్షణాయుధాలు తయారయినప్పటికి, నిష్ప్రయోజనం కాగలదు. విశ్వజనీనంగా బయలుదేరిన సాంఘిక వైషమ్యాలవల్ల, శాశ్వత శాంతికేమీ స్థానం దొరకడంలేదు. కాబట్టి సాంఘిక సంచలనాలతో కదలిపోతున్న ప్రపంచంలో, పూర్వంఉన్న భౌగోళిక రక్షణకూడ లేనప్పుడు, అమెరికా సైనికదృక్పథం చాలమారవలసి ఉంటుంది. రెండు యుద్ధాల మధ్యకాలంలోను రెండోయుద్ధపు ప్రారంభదశలోను ఉన్న రీతిగా అమెరికా నేటి శాంతి సమయంలోకూడ అంత సంసిద్ధంగా ఉండ వీలుండదు.

సైనికంగాను, పారిశ్రామికంగాను అది సర్వదా సన్నద్ధమైఉండాలి. కాబట్టి ఈ అణుయుగానికి, అమెరికా ప్రత్యేక పరిస్థితులకు తగినట్టుగా ఒక కొత్తరకపు సైనికసన్నాహం బయలుదేరుతుంది. మామూలుగా చరిత్రలో ఒక కొత్తఆయుధంవస్తే వెంటనే అది పాతదానిని త్రోసివేసి, ఆ స్థానాన్ని ఆక్రమిస్తుంది. కాని ఈతూరి అలాకాకుండా ఆటంబాంబు,

---

* అమెరికా సైన్యాధికారి జనరల్ మార్షల్ యుద్ధమంత్రి కిచ్చిన రిపోర్టు (1943 జులై 1నుండి జూన్ 30, 1945 కు) పుట 1

వైమానికుడేలేని విమానాలు, రాడర్-వీనితోపాటు పాతకాలపు ఆయుధాలు కూడ ఉండనే ఉంటాయి.' ఈవిధంగా పాతవానినికూడ చాలకాలందాకా ఉంచుకోదగిన సత్తాసారం అమెరికాకున్నది.

యుద్ధకాలంలోని అత్యధికదశతో పోలిస్తే, నేడు అమెరికా సైనిక బలాలు చాల తగ్గింపబడినవి. కాని ఎంత తగ్గించినా, పూర్వం శాంతి సమయంలో ఎన్నడూ లేనంత అధికంగా ఈ సేనా నివేశనాలుండి తీరగలవు.

ఈ సైనికులకు అత్యాధునికమైన ఆయుధాలివ్వాలి. ఆయుధ నిర్మాణంలో మహోన్నతమైన అభివృద్ధి వచ్చినది. ఈ వృద్ధి మరింత వేగంగా ముందుకు వెళ్ళగలదనేందుకు చాల సూచనలున్నవి. ఇందువల్ల ఆధునికాయుధాలు త్వరలో మూలబడి, కొత్తవానిని తయారుచేసి యివ్వవలసి వస్తుంది. జాతీయ ఆర్థికరంగంలో ఎక్కువభాగం ఈ ఆయుధాల నిర్మాణానికై మీదుకట్టవలసి ఉంటుంది. ఇవి అత్యాధునికంగా తయారుకావాలంటే, విపరీతమైన పరిశోధనలు, ప్రయోగాలు కొనసాగించవలసి ఉంటుంది.

రాజ్యాంగంలో ఎవరధికారులైనా అమెరికాలో ఈ ఆర్థికవ్యవస్థలోని సైనికవిభాగ సమీకరణేమో తప్పదు. అయితే ఆ అధికారులరంగును బట్టి ఆ సమీకరణ ఆధిక్యం ఆధారపడి ఉంటుంది. ఇంతకు ముందొకసారి మనం కిమ్మెల్ పుస్తకంనుంచి ఉటంకించాము. ఈయన లెక్కలప్రకారం* 1940 లో అమెరికా సైనికవ్యయం 6939 మిలియన్ డాలర్లకూ, 8711 మిలియన్ డాలర్లకూమధ్య ఉండవచ్చును. ఈ ఖర్చు 1940 లో 1546 మిలియన్ డాలర్లుగా ఉండేది. ఆయన అంచనానుబట్టి అమెరికా రెండో

---

* లెవిస్ ఎ. కిమ్మెల్, యుద్ధానంతర ఆర్థికావసరాలు పుట—9.

యుద్ధంలో ప్రవేశించకమునుపు మిలిటరీ ఖర్చుకంటె, యుద్ధానంతరం మామూలు పరిస్థితిలో అయిదారింత లెక్కువగా ఉంటుందన్నమాట. ఇది ప్రత్యక్ష సైనికవ్యయం. ఇదికాక అణుయుగంలో అంతర్జాతీయ ఆయుధోత్పత్తి పందేలలో అయ్యేఖర్చు ఇందులో చేరలేదు. ఇదికూడ సంక్షోభం అసలురాని మామూలు కాలానికి చెందిన అంచనా.

హెన్రీ వాలెస్ అంచనాకూడ ఇలాగేఉన్నది:

"మన మింతకుముందెన్నడూ అనుకోనంతగా గొప్ప శాంతి కాలపు సైన్యాన్ని, నౌకాబలాన్ని మనం పోషించవలసిఉంటుంది. ఇందుకు ఫెడరల్ బడ్జెటులో 5-10 బిలియన్ డాలర్లు ఖర్చుచేయవలసి ఉంటుంది."*

రెండోయుద్ధం ముగిశాక, రెండోయేడు—1946జులైలో ఆరంభమయ్యే ఆర్థిక సంవత్సరంలో మిలిటరీ ఖర్చు కిమ్మెల్, వాలెస్ అంచనాలను మించిపోగలదు. ఆ మొత్తం 12 మిలియర్డు డాలర్ల కేమాత్రం తగ్గదు.

"జులై ఒకటినుండిఆరంభమయ్యే ఆర్థిక సంవత్సరానికి యుద్ధశాఖ కయ్యే ఖర్చులకు 7, 246, 335, 200 డాలర్లు కావాలని ప్రసిడెంటు ట్రూమన్ కాంగ్రెసుకు అంచనా వేసి పంపాడు."

1947 రివైజ్డు అంచనాలు సంగ్రహంగా ఇలాఉన్నవి:

| | | |
|---|---|---|
| జీతాలు, ప్రయాణ ఖర్చులు | .... | డా. 2,594,967,000 |
| క్వార్టర్ మాస్టర్ సర్వీస్ | .... | 621.505,100 |
| యాన సౌకర్యాల దళం.... | .... | 509,911,000 |

* హెన్రీ ఎ. వాలెస్, ఆరుకోట్ల ఉద్యోగాలు, న్యూయార్కు పుట 74.

| | | |
|---|---|---|
| సిగ్నల్ కోర్ | .... | 104,083,000 |
| విమానదళాలు | .... | 1,200,000,000 |
| వైద్యశాఖ | .... | 69,500,000 |
| ఇంజనీర్ సర్వీస్ | .... | 802,724,500 |
| ఆర్డినెన్సుశాఖ | .... | 338,607,000 |
| కెమికల్ వార్ ఫేర్ సర్వీస్ | .... | 26.104,000 |
| నేషనల్‌గార్డు, రిజర్వు, R. O. T. C. | .... | 182, 782. 000 |
| ఆక్రమిత ప్రాంతాలలో ప్రభుత్వం, పునరావాసం | .... | 500.000,000 |
| అణుశాఖ | .... | 200.000,000 |
| చిల్లర రకరకాల ఖర్చు | .... | 96,151,600 |
| | * మొత్తం డా. | 7,246,335,200 |

"నౌకాదళం నుండి ఈయేడు 4,639,659,000 డాలర్లు తీసుకోవలెనని అప్రొప్రియేషన్ కమిటీ సిఫారసు చేసింది. ఖజానానుండి నగదు 4,139,659,000 డాలర్లు తీసుకొనడం ద్వారాను, నౌకాదళ నిధినుండి 500,000,000 డాలర్లు ట్రాన్స్ఫర్ చేయడంద్వారాను ఈ మొత్తాన్ని సరిపుచ్చాలని ఆ కమిటీ సిఫారసు చేసింది." †

ప్రత్యేకం కొన్ని పద్దులలో మార్పులుండవచ్చును. కాని శాంతి వచ్చాక రెండోయేట, మొత్తం మిలిటరీ ఖర్చు బహుశా 12 మిలియర్డు డాలర్లకు తక్కువకాదు.

---

* న్యూయార్కు టైమ్సు, మంగళవారం, మే 7, 1946.

† న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూను, మే22, 1946.

అమెరికా ఆర్థికవ్యవస్థపరిమితిలో ఈ మిలిటరీబడ్జెటు వ్యవహార మెలావుంటుంది.

1929 సంక్షోభానికి ముందు, బాగా అభ్యుదయ వంతంగా ఉన్న సంవత్సరంలో, అమెరికా ఎగుమతుల మొత్తం 5 వేల మిలియన్ డాలర్లు. అందరికీ పనికల్పిస్తే, మామూలు అమెరికా ఎగుమతులు, సుదాపు 7000 మిలియన్ డాలర్లు విలువగలవని, వాణిజ్యశాఖ అంచనా వేసింది. అంటే శాంతి సమయంలో, మామూలు అమెరికా ఎగుమతుల మొత్తం విలువకంటె, అమెరికా 12 మిలియర్డు డాలర్ల మిలిటరీ ఖర్చు అత్యధికమన్నమాట. ఈ దశలో ఎగుమతు లెంత ఎక్కువవుతాయని అంచనా వేస్తున్నారో అంతకంటె కూడ ఈ ఖర్చెక్కువన్నమాట.

సంక్షోభం రాకముందే ఎక్కువ చేయబడిన ఖర్చు, సంక్షోభ సమయంలో కూడ అలాగే ఉంటుందని మన మూహించవచ్చును. పూర్వపు సంక్షోభాలలో, ఇతరదేశాల మిలిటరీ ఖర్చులవలెకాక, ఈ ఖర్చు సంక్షోభం వల్ల తగ్గడమంటూ ఉండదు. కాబట్టి ఈ అంకెలు మరింత అధికం కావచ్చును. ఆయుధాలకోసం సర్వదా వస్తున్న "ఆర్డర్లు" వివిధ పరిశ్రమలకు తగిన మార్కెట్టును గారంటీ చేయగలవు. కాబట్టి సంక్షోభ ఫలితాలు, వీనిపై అంతగా పడకుండా కొంతరక్షణ ఉంటుంది. పైగా, ఆయుధశాఖలో పనిచేస్తుండే కార్మికులు, సంక్షోభకాలంలోకూడ తమ ఉద్యోగాల నుంచుకోగలుగుతారు. వారి జీతాలఖర్చు, అందువల్ల ఏర్పడేగిరాకీ వీనిద్వారా, సంక్షోభ దుష్ఫలితాలనుండి జీవితావసర వస్తూత్పత్తి చేసే పరిశ్రమలుకూడ కొంతవరకు తప్పింపబడతాయి.

ఇలా అమెరికా లేబర్‌మార్కెట్టులో, ఆయుధోత్పత్తి నిమగ్నులయిన లక్షలాది కార్మికులవల్ల, పరోక్షంగా ఇందువల్ల బతికేవారివల్ల,

ఒత్తిడి తగ్గుతుంది. కాబట్టి మొత్తంపద్దులు సూచించేంతకన్న అధికంగా ఈ ఆయుధోత్పత్తి ప్రభావం ఆర్థికరంగంలో కనిపిస్తుంది. కాని ఇంత పెద్ద మొత్తం ఖర్చుపెట్టినా, పరోక్షప్రత్యక్షఫలితాలెన్నిఉన్నా, మహాద్రవంలా వచ్చే సంక్షోభాన్ని ప్రతిఘటించ గలంతశక్తి దీనికుండదు 1929 సంక్షోభంలోను, అమెరికా ఉత్పత్తి, ధరలలోనే కాక బరువులో కూడ సగానికి సగం పడిపోయింది. ఆ తగ్గుదల మూడోవంతుకంటె మించదనుకున్నప్పటికి, ఆ విపరీతమైన లోటును 12000 మిలియన్ డాలర్ల మిలిటరీ బడ్జెటు భర్తీ చేయలేదు.

ఇందువల్ల ఏర్పడే ప్రమాదస్థితేమిటంటే, ఈ యుద్ధసన్నాహాల ఖర్చును మరింత పెంచుదామని, మిలటరీ బడ్జెట్టును మరింత హెచ్చిందామని, ఆయుధాల ఉత్పత్తిని ఇంకింత అధికం చేదామనీ ప్రాకులాడడం జరుగుతుంది. ఆఖరుకిది యుద్ధోత్పత్తి ఆర్థికవిధానంక్రింద మారుతుంది. ఇప్పటికి అమెరికాలో సంక్షోభ సూచనలున్నవి గనుక, ఈ కార్యగతి మహాప్రమాదకరంగా పరిణమించవచ్చును. యుద్ధప్రమాదాన్ని కూడ ఈ అమెరికా యుద్ధసన్నద్ధత ప్రకోపింప జేయవచ్చును.

హిట్లర్ జర్మనీలో రాజ్యానికి రాగానే, అతివాద అభ్యుదయవర్గాల వారిభావన, నాజీజర్మనీ ముందు రెండు చెడుదారులున్నవనీ, ఏదోఒక దాని ననుసరించకతప్పదనిన్నీ. అవి: యుద్ధమో, ఆర్థికసంక్షోభమో. వారు దూరదృష్టి గలవారని చరిత్ర రుజువు చేసినది. సంక్షోభం వచ్చింది, తద్వారా నాజీలు అధికారంలోకి వచ్చారు. తర్వాత యుద్ధం వచ్చింది, అయితే తక్షణమే రాలేదు.

నాజీలు అధికారంలోకి వచ్చాక, ఆరున్నర సంవత్సరాలు యుద్ధ సన్నాహాలు జరిగాయి. ఇందుతో జర్మనీ ఉత్పత్తి—అటు అమెరికా

ఉత్పత్తి తగ్గుతుండగా—పెరిగిపోయింది. రెండోయుద్ధానికి ముందే జర్మనీలో నిరుద్యోగ సమస్య తొలగిపోయింది. అంతేకాదు జర్మనీ సైనికబలం కేవలం 10, 15 లక్షలు మాత్రమే ఉండగనే ఒకప్పుడు—1938-39 చలికాలంలో—మనుష్యబలం తక్కువ వచ్చినది కూడ.

అంటే, యుద్ధమూ, యుద్ధ ఆర్థికవిధానమూ అమెరికా ఉత్పత్తిని పెంచినట్టే, జర్మనీలో యుద్ధోత్పత్తి విధానం శాంతిసమయంలో ఉత్పత్తిని పెంచింది.

శాంతి సమయంలో అక్కడిలాగే, ఆ పరిస్థితే ఇక్కడ పునః ప్రత్యక్షం కావచ్చునన్న ప్రమాదమున్నది.

నేడీప్రమాద మంతస్పష్టంగా కనిపించడం లేదు. యుద్ధంలో ఉపయోగించుకో వీలులేని వస్తువులకై ఎగబడడం నేడు జరుగుతున్నది. యుద్ధంలో వాయిదాపడిన పెట్టుబడుల వినియోగం కూడ జోరుగా నేడు కొనసాగుతున్నది. ఇందుమూలంగా, ఆయుధోత్పత్తి శాఖ పలుకుబడి అంతగా కనిపించదు—దానిమీద ఆధారపడకనే ఆర్థికవ్యవస్థ మొత్తంమీద సౌభాగ్యవంతం కాగలదు.

సంక్షోభకారక శక్తులు బలంగా పనిచేయడం ఆరంభించాక ఏర్పడే పరిస్థితేమిటి? సంక్షోభ ప్రతిఘటనోపాయాల నవలంబించకుండా, ప్రభుత్వాన్ని అటకాయించేశక్తి అభివృద్ధి నిరోధకవర్గాలకున్నట్టయితే ఏం జరుగుతుంది? సంక్షోభం వచ్చినప్పుడు కేవలం వ్యతిరేక విధానం మాత్రమే, అవలంబించడం వల్ల అతివాదశక్తులు బలపడతాయేమోనని ఈ అభివృద్ధి నిరోధకులు భయపడినట్టయితే ఏం కావాలి?

అలా జరిగినప్పుడు. వారు విపరీతంగా మిలిటరీ బడ్జెట్టును, ఆయుధవ్యయాన్ని విస్తరింప జేయవచ్చును. అంటే సంక్షోభ ఫలితాల

నెదుర్కొనేందుకై వారు, అమెరికా యుద్ధసన్నాహ కార్యక్రమాన్ని యుద్ధఆర్థికవిధానం క్రింద మార్చివేయవచ్చును.

ఇదిచాల సులువే—కారణం, ఈ ఖర్చు కేవలం మిలిటరీ ఖర్చు కాదు. నేటి పరిస్థితిలో, మిలిటరీ ఖర్చు ఆర్థిక ప్రయోజనాలను కూడ సాధిస్తుంది. కాబట్టి దానిని మిలటరీ బడ్జెట్టులో చేర్చనక్కరలేదు. యుద్ధ కాలపు అనుభవాన్ని ఆధారంగా చేసుకొని, ఇంతకుముందు తాను ఉత్పత్తి చేయనట్టి ఇకమీద ఉత్పత్తిచేయవీలులేనట్టి, లేదా ఉత్పత్తిచేయుటకు ఇష్టం లేనట్టి ముడిసరుకులను అమెరికా ప్రభుత్వం భారీయెత్తున నిలవచేయ వచ్చును. ఇంతకు పూర్వం ఉత్పత్తిచేయని కొన్ని ముడిసరుకులను, ప్రభుత్వం సబ్సిడీలిచ్చి ఇకపై ఉత్పత్తి చేయవచ్చును—అలా ఇతరచోట్ల చౌకగా తయారయ్యే వీనిని ప్రభుత్వసాయంతో ఉత్పత్తిచేసి ధర సరిపుచ్చ వచ్చును. ఆటంబాంబు ప్రమాదముందంటూ, పరిశ్రమలను భూగర్భంలో ఏర్పరచేందుకో, వానిని—వానిలో పనిచేసే శ్రామికులను వికేంద్రీక రించేందుకో—తగిన చర్యలను తీసుకోవచ్చును. ఇవన్నీకాక, సైనికంగానే కాక, శాంతికాలపు పరిశ్రమలకు, ఆర్థిక ప్రయోజనాలకు పనికివచ్చేట్టు బ్రహ్మాండమైన శాస్త్రీయపరిశోధనా కార్యక్రమాన్ని అమలులోపెట్టవచ్చును. నేడిలా ఆర్థికసైనికచర్య లొకదానిలో ఒకటి కలిసిపోయి ఉండడంవల్ల, ఈ మొత్తం రంగంలో మాంచి అభివృద్ధి తే వీలున్నది. అదిప్పుడే బాహాటంగా బయలుపడకుండా చూడవీలున్నది. ఇలాగే యుద్ధోత్పత్తి విధానంగా మారి, విశ్వరూపం తాల్చి, ఆఖరున సంక్షోభ పరిస్థితులపై తన ప్రభావాన్ని ప్రకటింపవచ్చును.

తొలుతప్రవేశ పెట్టబడినప్పుడు ఈ జర్మనీ బ్రాండు యుద్ధోత్పత్తి విధానంలో ఉన్న లోపాలను, అవగుణాలను అమెరికాలో తగ్గించుకో వచ్చును—అవి అలాగే ఉంటే దాని ప్రారంభమే అమెరికాలో సాధ్యం

గాకపోవచ్చును. జర్మనీలో ఈ విధానంతోపాటు విధిగా సైనికశిక్షణ, ముసలివాళ్ళను కూడ ఇందులో చేర్చుకోవడం జరిగింది. శాంతి సమయంలో—జాతినంతటిని సైనికంగా చేసివేయడం, జర్మనీ యుద్ధ కార్యాలయం ఏర్పాటు, సైనికుడూ, అతనివృత్తీ మహామహిమాన్వితాలన్న సిద్ధాంత ప్రచారం—ఇవన్నీ ఒక్కమాటుగా బయలుదేరాయి.

అలాంటి ఏ విధానం అమెరికాలో సాధ్యం కాదు. యుద్ధ కాలంలో కూడ, అమెరికా సైనికులు మిలిటరీ దుస్తులలో ఉన్నపౌరులే. ఆ సంగతిని వారొక్క క్షణం మరువలేరు. అత్యధిక సంఖ్యాక ప్రజ, దేశాన్ని సైనికం చేసేందుకు, సైనికుడూ యుద్ధమూ మహామహిమా న్వితమని ప్రచురించేందుకు వ్యతిరేకులుగా ఉంటారు. యుద్ధంముగియగనే, సైనికులను తమ ఇళ్లకు వెంటనే పంపాలన్న మహోద్యమం బయలు దేరింది. అదే అమెరికా ప్రజలవైఖరిని వేనోళ్ల చాటుతున్నది. కాబట్టి యుద్ధఆర్థిక విధానం, జర్మనీ పద్ధతిలోనే రావాలంటేమటుకు, దేశంలో పెద్ద ప్రతిఘటన బయలుదేరుతుంది. అభ్యుదయశక్తుల పలుకుబడిని మించిన దిది. ఇందుతో అసలావిధానం ప్రవేశపెట్టడమే అసాధ్యమయి పోతుంది.

కాని నేడున్న ప్రమాదం, ముఖ్యంగా భావిసంక్షోభంలో ఏర్పడ నున్న ప్రమాదపరిస్థితి ఏమిటంటే, ఈయుద్ధోత్పత్తివిధానం కొత్తరూపాల నెత్తుతుంది. ఆటంబాంబు మూలంగా యుద్ధతంత్ర నైపుణి ఎంత అఖం డంగా మారుతున్నదో మనకు తెలుస్తున్నది. ఇందుమూలంగా యుద్ధో త్పత్తివిధాన కేంద్రం, మిలిటరీనుండి పరిశ్రమలకు-అందులోను ప్రయోగ శాలలోనికి మార్చబడినది, అదేసమయంలో శుద్ధసైనిక సన్నాహసమస్య వెనుకబడినది. కాబట్టి శాంతిసమయంలో పెద్ద సైన్యాన్ని ఉంచుకొనక పోయినప్పటికి, జాతినంతటిని సైనికీకరణం చేయకపోయినప్పటికి, సైని

కునిమహిమను, యుద్ధమహిమను బ్రహ్మాండంచేసి ప్రస్తుతించనప్పటికి ఈ కొత్తరకపు యుద్ధోత్పత్తివిధానాన్ని నడపవీలున్నది. ఇలాంటిది నడుస్తున్నప్పుడు ప్రజలలో అధికసంఖ్యాకులు శాంతిసమయంలోని తమ పనులు తాము చూచుకుంటూ ఇందులో జోక్యం కలుగజేసుకోకుండా ఉండిపోతారు.

ఇందువల్ల, అమెరికాప్రజల్లో అనేకమంది యుద్ధవిముఖులైనందువల్ల ఈయుద్ధోత్పత్తి విధానవ్యాప్తి అరికట్టబడుతుందని చెప్పవీలులేదు. ఈ సంగతినెంత త్వరగాగ్రహిస్తే అంత మంచిది. ప్రజావిముఖత పాతకాలపు సైనిక సన్నాహాలమీదేగాని, ఈ కొత్తపద్ధతిమీదకాదు. ఆధునిక యుద్ధతంత్ర నిపుణులా పాతపద్ధతిని బలపరచడం లేదు. ఇప్పటి పద్ధతి మిలిటరీకి చెందినట్టే కనిపించదు. నేటి పారిశ్రామిక ప్రగతి చాల చిక్కులతో కూడుకున్నది. అందులోను ఈ అణుయుగంలో, అందులో పనిచేస్తున్నవారికే తెలియకుండా ఈ యుద్ధోత్పత్తి విధానం కొనసాగించవీలున్నది.

ఈ విషయంలో చక్కని నిదర్శనం, మొదట ఆటం బాంబుల ఉత్పత్తి. అసోసియేటెడ్ ప్రెస్‌ద్వారాచేసే యుద్ధశాఖ ప్రకటనలోనుండి కొన్ని భాగాల నుదరిస్తున్నాను:

"పూర్వం ఓకుచెట్లతో. దేవదారుచెట్లతో మాత్రమే నిండిపోయి, అక్కడక్కడా చదురుగా పొలాలున్న స్థలంలో, గత మూడేళ్ళలోను, ప్రపంచంలోని మహానగరాలలో ఒక నగరం నిర్మింపబడినది. నాక్సువిల్లీకి 18 మైళ్ళ దూరంలో ఓక్‌రిడ్జి అనే పట్టణం, శూన్యంలోనుంచీ ఈ మూడేళ్ళలోనూ టెన్నెసీలోని అయిదో మహానగరంగా తయారయినది. దీనిజనాభా 75,000.

ఇంతేకాక అమెరికా చారిత్రక పట్టణాలలో ఇదొకటై వెలసినది. రెండో మహా యుద్ధంలోని మహా రహస్య ప్రణాళికలలో నొకటి ఇక్కడే ఏర్పరుపబడినది. 200 కోట్ల డాలర్ల ఆటంబాంబు నిర్మాణ కార్యక్రమానికి ఓక్‌రిడ్జి గుండెకాయ. యుద్ధ రహస్యాలలో అతి గుప్తంగా ఉంచబడినది. ఓక్‌రిడ్జి నిర్మితమైన ప్రాంతానికి వెలుపల కొందరికిమాత్రమే—ఇక దేశం మొత్తంమీద మరికొందరికి మాత్రమే-ఈ పట్టణంగూర్చి, అందులో నిర్మితమైన రహస్య పారిశ్రామిక పథకంగూర్చి తెలుసు. ఈ పట్టణంలోని జనాభాతోపాటు, నాక్సువిల్లీ జనాభాలో 200 మంది, ఏదో రహస్య యుద్ధపథకం చుట్టూరా ఈపట్టణం నిర్మితమవుతుందని యెరుగుదురు. ఇలాంటి వానినిగూర్చి గుసగుసలు పోరాదని గుర్తించి, వారు రక్షణభద్రత విషయంలో సహకారంచేశారు. ఈ నిర్మాణంలో పనిచేసిన వేలకొలది కార్మికులు, పనిముగిసి తమ ప్రాంతాలకు వెళ్లాకకూడ, దీని విషయమై బహిరంగంగా బయటివారితో చర్చించడం మాని వేశారు.

"ఓక్‌రిడ్జి ఎన్నోవిధాలుగా విశిష్టమైన పట్టణం. ఇలాంటి గుప్త పట్టణాలు మరికొన్ని ఉన్నవి. కాని ఇంత ఒత్తిడితో, ఇంత రహస్యంగా గబగబా పెరిగిపోయిన పట్టణం మరొకటిలేదు. ఇంతకూ చెప్పవచ్చినదేమంటే, ఏ కొందరు ముఖ్యులోతప్ప ఆ పట్టణ నివాసులకే ఈపట్టణమెందుకు నిర్మితమైనదో, ఇందులోని బ్రహ్మాండమైన యంత్రాగారాలు వేనిని ఉత్పత్తి చేస్తున్నవో తెలియదు. కార్మికుల కుటుంబాలకేకాదు, అసలు పనిచేస్తున్న కార్మికులకే తెలియదు. పనంతా వేరువేరు విభాగాలుగాచేసి వేయబడినది. కాబట్టి

ఏ విభాగంలో పనిచేసేవానికి ఆ తనభాగం సంగతే తెలుసు. ఇదంతా ఎందులోని అంశమో అతనెరుగడు.

"ఈ పథకంగూర్చి పూర్తిగా ముఖ్యులైన వైజ్ఞానికులకు, ఇంజనీయర్లకు, సైనికాధికారులకుమాత్రమే వివరాలు తెలుసు-అవి కూడ మినహాయింపుతోనే. ఒకయంత్రాని కధికారి ఉన్నాడంటే, అతనికీ ప్రక్కనున్న యంత్రం అధికారికీ సంబంధం ఉండదు. అక్కడేమి చేస్తున్నారో అతనెరుగడు .... ఇది వాస్తవమా అనిపిస్తుంది....విపరీతంగా విద్యుచ్ఛక్తి నుపయోగించి పనిచేస్తున్న ఈరాక్షసయంత్రా లేమిఉత్పత్తిచేస్తున్నవో కార్మికులెరుగరు. అసలు తామేదైనా ఉత్పత్తిచేస్తున్నారో లేదోకూడ అత్యధిక సంఖ్యాకులకు తెలియదు. బ్రహ్మాండంగా వస్తుసామగ్రి ఫాక్టరీలలోనికి రావడం వారు చూస్తున్నారుకాని, బయటకేమీ వెళ్లుతున్నట్టు కనిపించలేదు. ఇదేదోచిత్రంగా ఉండేది. పవలూరాత్రీ బ్రహ్మాండమైన యంత్రాలు పనిచేస్తుండడం, మరి ఉత్పత్తిచేసిందేమి కనిపించకపోవడం— స్వప్నప్రాయంగా ఉండినది."

దీనికి వేరే వివరణ అక్కరలేదు. నిజమే యుద్ధసమయంలో రహస్యాన్ని దాచడం సులభం. కాని శాంతిసమయంలో కూడ రహస్యావసరం గూర్చి కారణాలు చెప్పవచ్చును: ఆయుధోత్పత్తిలో ఇతరదేశాల పోటీలో నెగ్గడం కోసం, ఆధునికంగా ఉత్పత్తిచేసే ఆయుధాల విషయం రహస్యంగా ఉంచడం అవసరమని చెప్పవచ్చును.

ఇంతకూ తేలినదేమిటి ? రానున్న సంక్షోభాన్ని తొలగించేందుకై, పెద్దయెత్తున ప్రభుత్వం జోక్యం తీసుకోకపోయినట్టయితే, ఈ విధంగా ఉద్యోగాలు కల్పించేందుకై, యుద్ధోత్పత్తి విధానం అమలులోనికి

-వచ్చును. ఈ యుద్ధోత్పత్తిలో, ఆయుధ నిర్మాణం మరీ పెరిగిపోతే, -ందుమూలంగా తగ్గడంపోయి, అసలు యుద్ధప్రమాదం మరింత హెచ్చు -ావచ్చును. అందరికీ ఉద్యోగాలు దొరకాలనే (ఫుల్ ఎంప్లాయ్‌మెంటు) -ిల్లును బలపరుస్తూ, కాంగ్రెసుకిలా ట్రూమన్ సందేశం పంపాడు: * 'అమెరికాలో అందరికీ ఉద్యోగాలున్నవంటే, అంతర్జాతీయంగా మరింత -ద్రత, ప్రపంచ శాశ్వత శాంతికి మరికొంత అవకాశం ఒనగూడు -ుందన్నమాట."

ఈమాట నిజమే. కాని ఉద్యోగాలందరికీ కల్పించలేకున్నా, లేదా శాంతిసమయంలో విపరీతమయిన ఆయుధోత్పత్తి కార్యక్రమం ద్వారా ఉద్యోగాలు కల్పించినా "ప్రపంచ శాశ్వతశాంతికి మరికొంత అవకాశం" అన్నమాట చాలాపరిమితం కాగలదు. అంటే, మామూలు ఆర్థికపద్ధతులతో అందరికీ ఉద్యోగాలు కల్పించగలిగితే తప్ప, యుద్ధప్రమాదం మరింత హెచ్చిపోతుంది.

అభ్యుదయ పంథాలో ప్రభుత్వం కలుగజేసుకొనడం అనే మిగిలిన ఏకైకమార్గంలో సంక్షోభాన్ని తప్పించేందుకు, లేదా నిర్మూలించేందుకు ప్రయత్నించకుండా, అమెరికాలోని ధనికులూ గుత్తవ్యాపారస్తులూ యుద్ధోత్పత్తివిధాన విస్తరణకై ప్రాకులాడ్డం ఎందుకు? ఈ సమస్య అలాగే ఉండిపోతున్నది, దీనికి సమాధానం స్పష్టమే మిలిటరీ ఆయుధ నిర్మాణం, యుద్ధోత్పత్తి విధానం వీనిలోఏదైనా తమ పలుకుబడి మరింత బలపడుతుంది. మరి గట్టిగా ప్రభుత్వం ఏ సంక్షోభ నివారణ కార్యక్రమా న్నవలంబించినా తమ అధికారం దుర్బలమవుతుంది.

* న్యూయార్కు-టైమ్సు, శుక్రవారం, సెప్టెంబరు 7,1945 నుంచి ఉద్ధృతం.

యుద్ధోత్పత్తి, కేవలం సైనికంగా ఉన్నంతవరకు, ప్రపంచంలో అన్నిచోట్లవలెనే అమెరికాలో కూడ, అభివృద్ధి నిరోధకవర్గాల స్థితిని గట్టిపరుస్తుంది. జనంలో మామూలు మనుషులను తీసుకున్నట్టయితే- వారికంటె సైన్యంలోనివారు మరింత మితవాదులవేపు మొగ్గుతారు. ఇది మామూలుగా గత శతాబ్దంలో యూరోపులోను, అమెరికాలోను కూడ పదేపదే ఋజువయిన విషయం. కాబట్టి మిలటరీరంగంలో ఏ విస్తరణ వచ్చినా పెట్టుబడిదారీవర్గమే బలపడుతుంది.

పైగా అమెరికా ఆయుధోత్పత్తి రంగం, కార్మికవర్గస్థితిని బలపరుస్తుందనేందుకు కూడ అవకాశం తక్కువ. బాగా నిరుద్యోగం ప్రబలిన రోజుల్లో ఇది ఆరంభమవుతుంది బహుశా. కాబట్టి, ఇందుమూలంగా నిరుద్యోగం తగ్గవచ్చు. కాని, ఆగిపోదు.

ఇక ఆఖరుమాట, యుద్ధోత్పత్తి విధానం యజమానుల అధికారాల నెక్కువగా పరిమితం చేయకనే అమలుజరుపవచ్చును. అలాగే అది అమలుజరుగుతుందని మనం నమ్మవచ్చును. ఈ విధానంలో యజమానులు కేవలం కార్యకర్తలుగా ఉండరు—మరి ప్రభుత్వం అధికంగా పెట్టుబడి పెట్టేవిధానంలో వారు కేవలం ఏజంట్లుగా తయారుకావలసి వస్తుంది.

ఇలాంటప్పుడు అమెరికా ధనికవర్గం ఈ రెంటిలో ఏదో ఒకటి ఎన్నుకోవాలన్నప్పుడు, యుద్ధోత్పత్తి విధానాన్నే సహజంగా ఎన్నుకుంటారు. పూర్వంలాగా శాంతిసమయంలో యుద్ధసన్నాహాలేమీ చేయకుండా చిక్కిపోరాదనీ అదనీ, ఇదనీ, లక్షవాదాలు చెబుతారు. అన్ని రకాల జాతీయభావాలనూ రేపుతారు. కొత్త విదేశాంగ విధానాన్ని వ్యాపింపజేయడం కోసం, అమెరికా యుద్ధోత్పత్తి విధానాన్ని వ్యాపింపజేయడం కోసం తమచేతనైనంతా చేస్తారు. ఈ విదేశాంగనీతి ఏవైపు

మొగ్గుతున్నదో, ఇంకా ఖ్యానిసంక్షోభం విరుచుకపడకముందే—తద్వారా అంతర్జాతీయ రాజకీయ పరిస్థితి పూర్తిగా తెచ్చిపోకముందే-మనకుసూచనా ప్రాయంగా కనిపిస్తూనే ఉన్నది.

## అమెరికా కొత్త సామ్రాజ్యవాదం

అమెరికా ప్రత్యేకపరిస్థితి, అణుయుగారంభం పుణ్యమా అని, మనం పూర్వం ఎరుగున్నవిధంగా కాక, అమెరికా యుద్ధోత్పత్తి విధానం కొత్తరూపంలో ప్రవర్తిల్లగలదు. అమెరికా కొత్త సామ్రాజ్యవాదం సంగతికూడ ఇంతే. ఇలా కొత్తరూపాన్ని ధరించేందుకు రెండు ప్రధానమయిన కారణాలున్నవి:

(1) తమ వలసలను విస్తరించుకున్నప్పుడు, పాత ధనికరాజ్యాల వలెకాక, నేటి అమెరికా ఆర్థిక—సాంఘిక—పరిస్థితి భిన్నంగా ఉన్నది;

(2) నేటి అమెరికా ఆర్థికవ్యవస్థ, పూర్తిగా భిన్నమైన ప్రపంచ చరిత్ర ఘట్టంలో సామ్రాజ్యవాద దశలో ప్రవేశిస్తున్నది: ఈ ఘట్టంలో అసలు ధనికవాదం అస్తిత్వాన్నే దెబ్బకొట్టే పోరాటం, మిగతప్రపంచంలో కొత్తదశలో, ముఖ్యమైనదశలో ప్రవేశించినది,

పాతకాలపు ధనికరాజ్యాలు సామ్రాజ్యవిస్తరణ నారంభించినప్పుడు, అదేదో ధనికవాద దిగ్విజయయాత్రగా కనిపించినది. పైగా అనేక ముఖ్య ధనికదేశాలు ఒకేతూరి ఈవిస్తరణ నారంభించినవి. ఈకాలంలో వచ్చిన సామ్రాజ్యాలు, ధనికవాద అభ్యుదయదశలో ఆరంభమైనవి. అప్పుడు తన అస్తిత్వానికై ధనికవాదం పోరాడవలసిన అవసరంలేదు. కడపటిది మరీ ముఖ్యవిషయ మొకటుంది. ఆర్థిక సంక్షోభా లేవో తాత్కాలికవ్యవధానంగా మాత్రమే ఉన్నరోజులవి.

ఈ కాలంలో అమెరికా తన సరిహద్దులనుదాటి సామ్రాజ్యాన్ని విస్తరించుకోవాలనే దృష్టిలోలేదు. అయినప్పటికి అమెరికా గొప్ప ధన స్వాములు, వివిధ దేశాలలో తమకు ప్రత్యేక స్థానాలు సంపాదించుకుంటూ వచ్చారు. కొన్ని ముడిసరుకులను పూర్తిగా తామే గుత్తకు తీసుకుంటూ వచ్చారు. ఇలాంటివాని మూలంగా అమెరికా విధానం యూరపియన్ సామ్రాజ్యవాదులకంటె భిన్నంగా ఏమీలేదు. కాని ఆమెరికా ఆర్థిక వ్యవస్థలో ఈ విదేశ స్థావరాల వ్యాపనం చాల అల్పమైనది మాత్రమే.

నేటి ప్రపంచ దశ వేరు. అమెరికా, ప్రపంచంలోని వస్తూత్పత్తిలో సగం తానేచేస్తూ, విదేశాల నాక్రమించాలని చూస్తున్నది. ఇది ధనికవిధాన అభ్యుదయదశలో, ఇతర వివిధ ధనిక రాజ్యాలతోపాటు ఒకేమారుగా జరగడంలేదు. ప్రపంచంలో అనేకభాగాలలో ధనికవిధానం రూపుమాసి పోయినదశలో కొన్నిదేశాలలో అది నిర్మూలనం కానున్నదశలో, మిగత వానిలో చావుబతుకుల పోరాటం నడుపుతున్నదశలో, మరికొన్ని విపరీత మైన సాంఘిక మార్పులను పొందుతున్నదశలో ఈ అమెరికా విదేశ విస్తరణ ఆరంభమైనది.

ఇందువల్ల అమెరికాలోను, వాని విదేశాంగనీతిలోను ఎలాంటి మార్పు రాగలదు ?

పాతకాలపు సామ్రాజ్యవాద లక్షణాలు కొన్ని ప్రస్తుతం అనవసర మయ్యాయికాబట్టి, వానిసమస్యరాదు. పైగా అమెరికా సామ్రాజ్యవాదానికి, పాత సామ్రాజ్యవాదాలకువలె వలసప్రాంతాలు అక్కరలేదు. తమసరుకుల నమ్ముకోవడం కోసం, యూరపియన్ సామ్రాజ్యవాదాలు వలసప్రాంతాల నాక్రమించుకొని, తమకు అనుకూలస్థానం సంపాదించుకొని అక్కడ పరిశ్రమలు వృద్ధికాకుండా ఆపుతూ ఆటంకపరుస్తూ వచ్చాయి. అమెరికా

అలాంటి వలసదేశాలను ఏర్పరచుకోనక్కరలేదు. తమ ఉత్పత్తి మరీ బ్రహ్మాండంగా పెరిగి, అతిసమర్థంగా తయారయినందువల్ల, తమ సరుకుల అమ్మకానికి వేరేదేశాలలో అధికారం వీరికక్కరలేదు.

యూరపియన్ సామ్రాజ్యాల విచ్ఛిత్తి లేదా, అవి దుర్బలం కావడమే ఇంకా అమెరికాకిష్టం. ఎందుకంటే, అవి తమ ప్రత్యేక సౌకర్యాలను కోలుపోయినట్టయితే, అమెరికా దేశపు ఎగుమతి సరుకులకు లాభం కలగవచ్చును. యూరోపు, జపాను సామ్రాజ్యవాద సంబంధాలు సడలడం అమెరికాకెంతో ఇష్టం. నేటిదశలో అమెరికా ఇతర సామ్రాజ్యవాద బంధనాలకు వ్యతిరేకంగా ఉన్నదంటే, అదిఅసలు సామ్రాజ్యతత్వానికే విరుద్ధమైనదని అర్థంకాదు, అసలు సమస్యను గందరగోళపరుస్తుంది. కాబట్టి, అమెరికా, సామ్రాజ్య విరుద్ధమన్న భ్రమను మనమెంత త్వరగా పోగొట్టుకున్నట్టయితే అంతమంచిది. అమెరికా సామ్రాజ్యవాదానికి విరుద్ధమైనది కాదు. తనకు నేటిపరిస్థితిలో అవసరం కాని సామ్రాజ్యవాద రూపాలను మాత్రమే అమెరికా వ్యతిరేకిస్తున్నది.

అమెరికా కీనాడు అవసరమైన సామ్రాజ్యరూపమేది? తన సామ్రాజ్యవాదవిధానం చేకూర్చవలసిన ప్రాథమిక సౌకర్యాలేమిటి అన్నది విచారింతాము.

ప్రపంచ అగ్రరాజ్యయుగంలో నేడు, అమెరికా, సామ్రాజ్యవాద రూపాన్ని ధరిస్తున్నది, తానూఒక బలవత్తరమైన అగ్రరాజ్యం, తనప్రపంచ అగ్రరాజ్యస్థితిని బలపరచుకొనేరీతిగా ముందు తనవిధానాన్ని దిద్దుకుంటుంది. ఇది పూర్తిగా సైనికదృష్టితోనే కాదు. నిజమే రెండోయుద్ధంలో తాను గెలుచుకున్న ద్వీపసమూహాలలో తనసైనిక స్థితిని దృఢపరుచుకుంటుందన్నమాట సరే, వీనిద్వారా తనవిదేశ స్థావరాలను—దెబ్బతీసేందుకు,

దెబ్బ తట్టుకునేందుకు కూడ—బలపరచుకుంటుందన్న మాటా సరే అయితే మనం గమనించవలసిన ముఖ్యవిషయ మిదికాదు.

అమెరికాకు మిత్రరాజ్యాలు కావాలి

ప్రపంచ ప్రధానరాజ్యంగా తనస్థితిని బలపరుచుకునేందుకు. విదేశాలలో మిత్రులను సంపాదించుకోవడం అమెరికాకు అవసరం.

నేటి పరిస్థితి చూడండి: సోవియట్ వ్యవస్థ విజయప్రదంగా వర్ధిల్లుతూవస్తే, యూరోపులో ధనికవ్యవస్థ అస్తిత్వానికే ప్రమాదం వస్తుంటే, జాతీయ విప్లవోద్యమాలు వలసదేశాలలోను, అర్ధవలసంలోను విజృంభిస్తూ వస్తే, అమెరికాలోని గుత్తవ్యాపార విధానం ఏకాకి అయి పోతుంది. ఇది ఇలాగే కొనసాగితే, అమెరికాలో అతివాద శక్తులు, అమెరికాను ఈ దారిలోనికే ఈడ్చుకురావడానికి ప్రయత్నించే ప్రమాదమున్నది.

నేటి ప్రపంచ చరిత్ర యుగంలో, అగ్రరాజ్యాల యుగంలో అమెరికా విదేశాంగనీతి, ప్రపంచం అతివాద శక్తులవేపు మొగ్గకుండా ఆపేందుకు ప్రయత్నిస్తుంది. లేకపోతే ఆధోరణి అసలే నిర్మూలిం చేందుకు పనిచేస్తుంది. వచ్చేదశ అంతటిలోను అమెరికా విదేశాంగ విధానం ఎలా పనిచేస్తుందంటే, తన సైనిక పారిశ్రామిక, ధనబలా న్నంతటిని యూరోపులోని అభివృద్ధినిరోధక శక్తులవేపు, మహాఅయితే మితవాద శక్తులవేపు ఒడ్డుతుంది. అక్కడి అతివాద శక్తులను ప్రతి ఘటించి సోషలిజంవేపు పురోగమించకుండా చేసేందుకు, కనీసం పురోగతి వేగాన్ని బాగా తగ్గించేటందుకు, పై అభివృద్ధినిరోధక శక్తులకు సంపూర్ణ సహాయం చేస్తుంది. ఇంతేకాక, ఏ దేశాలలోనయితే, ధనికవిధానం

ర్తిగా వ్యాపించలేదో, అలాంటిచోట, ఈ అమెరికా విదేశాంగనీతి అభ్యుదయ వ్యతిరేకులైన, సంఘ వ్యతిరేకులైన శక్తులను బలపరుస్తూ వస్తుంది.

వెనుకబడిన వలసప్రాంతాల విషయంలో కొన్నిధనికరాజ్యాలు అవలంబించే, ఆర్థిక—విదేశాంగ విధానాలను సామ్రాజ్యవాదమని పూర్వకాలం పిలిచేవారు; వానినే అమెరికా సామ్రాజ్యవాదం, వెనుకబడిన ప్రాంతాలకే గాక, పారిశ్రామికంగా బాగా వృద్ధిచెందిన ప్రాంతాల విషయంలోకూడ ప్రవర్తింపజేస్తుంది. తాముస్వతంత్ర దేశాలుగానేఉంటూ, సైనిక, పారిశ్రామిక, ద్రవ్యవిషయాలలో విశ్వరూపం వహించినట్టి తనతో, ప్రతిముఖ్యవిషయంలోను, ముఖ్యంగా ధనికవిధాన భావిగతి ఏమిటి అనే సమస్యలో తన చుట్టూ ఉన్న దేశాలు సంప్రతించాలని అమెరికా కోరుతున్నది.

చాల యూరపియన్ దేశాలలో ధనికవాదం పునాదులు కదిలాయి. అక్కడ అభివృద్ధి నిరోధకులైన పెట్టుబడిదారీవర్గాలకు అమెరికాఇస్తున్న సాయమే లేకపోతే, వచ్చే ఆర్థికసంక్షోభంనాటికి యూరోపులో ధనికవాదమే ఉండదు. అయినప్పటికి, ప్రస్తుత పరిస్థితెలా ఉన్నదో దానిని గూర్చే మనం మాటాడుదాము, అమెరికా పుణ్యమా అంటూ యూరోపులో ధనికవాదం మరి కొంతకాలం ప్రవర్తిల్లుతూనే ఉంటుంది. ఇందువల్ల ధనికవిధాన వ్యతిరేక సంగ్రామంలో యూరోపులోని అభ్యుదయశక్తులు అక్కడి ధనికులైన "రెండువందల కుటుంబాలను" వారి అనుచరులను మాత్రమేకాక, అమెరికా సహాయాన్నికూడ ప్రతిఘటించవలసి వస్తుంది.

యూరోపుదేశాలు ఆర్థికంగా ఈడిగిలబడినవి. జర్మనీ పరిశ్రమ విధ్వంసనంతో, తమ నిర్మాణ కార్యక్రమం చాల కుంటువడినది. వారికి సహాయంకావాలి. ఇప్పటి పరిస్థితిలో అమెరికా ఒక్కటే సహాయమివ్వగల స్థితిలోనున్నది. అమెరికాలో గుత్తవ్యాపారులైన పెట్టుబడిదారుల

మాట జరుగుతున్నంతకాలం, ఈ సహాయానికి వారు పెట్టే షరతు సుస్పష్టమే: సోషలిస్టు పద్ధతులను ప్రయోగించి చూచేందుకై మేవ సహాయం చేయము అని అమెరికాపాలకవర్గం అంటుంది.

యూరోపులో అధికసంఖ్యాకులైన ప్రజల అభీష్టానికి విరుద్ధంగా అభివృద్ధి నిరోధకులైన వారిని అధికారంలో ఉంచేందుకు, అమెరికా త పారిశ్రామికఆర్థికసంపత్తి సంతతిని ఉపయోగిస్తుంది. ఈ వర్గం సహాయమే లేకపోతే క్షాలవాహినిలో కొట్టుకొనిపోగలదు. కాని పా శ్రామికంగా వెనకబడిన వలస-అర్ధవలస దేశాలలో అమెరికా సామ్రాజ్య వాదమెలా ప్రవర్తిస్తుందో స్పష్టంగా తెలియదు. ఎందుచేత?

ఆసియాను తీసుకొండి. అక్కడి పరిశ్రమల నిర్మాణానికి అమె రికా అనుకూలమే. బ్రహ్మాండంగా పెరిగిపోయిన తన యంత్రాలకు మార్కెట్టుకావాలి. కాని ఆసియాలో నిజమైన పరిశ్రమల నిర్మాణం, తమ దేశంలోని మార్కెట్టులు ముందు బలపడితేనే సాధ్యంకాగలదు. ఇందుకు మొట్టమొదట ఆ దేశీయుల జీవనస్థాయి పెరగాలి, మరి ఇందుకేమో అక్కడి భూస్వామ్యవిధానం నాశమవ్వాలి. అక్కడ భూస్వామ్యవిధానం ఉన్నంతకాలం ప్రజల జీవనస్థాయి ఏమాత్రం పెరగదు. అమెరికా సహాయమున్నా అక్కడ పారిశ్రామికాభివృద్ధి సువ్యాప్తం కాదు. యూరోపురాజ్యాల వలస ప్రాంతాలలోవలెనే అదిత్వరలోనే ఆగిపోగలదు. మరి ఇలాంటప్పుడు, ఆసియాదేశాలలో ఏ వర్గాలతో తాను సహకరించాలి. ఎవరిమీద ఆధారపడి పనిచెయ్యాలి అన్నది అమెరికా నిర్ణయించుకోవలసి ఉంటుంది.

అమెరికా యంత్రాలకు కొత్తమార్కెట్టు కావాలంటే, పారిశ్రామి కంగా వెనుకబడిఉన్నట్టి, జమీందారీ వ్యవస్థక్రిందఉన్న దేశాలలో, తీవ్ర

ున సాంఘికమార్పులు రావాలి. ఆసియాలో భారీయెత్తున పరిశ్రమలను ంచాలని నిజంగానే అమెరికాకు ఆదుర్దాఉంటే. భూస్వామ్యవిధాన ర్మూలనంలో. అక్కడి అభ్యుదయ శక్తులతో సహకారం చెయ్యాలి. ందుకై అమెరికాలో కొన్నిశక్తులు ఒత్తిడితెస్తున్నవి. అమెరికా రాజ య పరిస్థితిలో మార్పురాకుండా. ఈ ఒత్తిడి తగినంత బలం సంపా ంచుకోగలదా అన్నది అనుమానమనైనా కనీసం చెప్పితీరాలి.

ప్రపంచమంతటా తమ సామ్రాజ్యాలను విస్తరించడం ఒకప్పుడు యూరోపు సామ్రాజ్య ప్రభుత్వాలకు ఆర్థికంగా అతి ముఖ్యమైన పని. అమెరికాతోపోలిస్తే వారిఉత్పత్తియంత్రాలేమో తక్కువా, సామ్రాజ్యమూ, ాని విస్తరణావకాశాలూ చాల ఎక్కువానున్నా. రమ ఉత్పత్తిలో విదేశ వర్తకం. హెచ్చుభాగంగా ఉండేది. మరి అమెరికాలో నేడేమో విపరీతమైన ఉత్పత్తిశక్తి ఉన్నది. మరి దాని విదేశవర్తకమేమో ఉత్పత్తితో పోలిస్తే మరీ తక్కువగానున్నది. కాబట్టి వెనుకబడిన దేశాలలో బాగా పరిశ్రమలు నిర్మించినా అవంత గొప్ప పాత్రను నిర్వహించలేవు.

ఆసియాలో కొత్త మార్కెట్టు అవకాశాలను గూర్చి అయిదో అధ్యాయంలో లెక్ఖలిచ్చాము. అమెరికా విదేశ వర్తకం ఎంత పెరిగినా. దానిఉత్పత్తి పెరుగుదలకు సమానంగా ఎన్నటికీ పెరగలేవని ఆ లెక్ఖలలో తేలినది. పైగా ఆసియాలోను యూరోపులోనుకూడ బ్రహ్మాండమైన సాంఘిక విప్లవాలు చెలరేగుతున్నవి. ఇందుమూలంగా ఆసియాఅభివృద్ధికి సాయపడ్డంకాక, దానినరికట్టేందుకే అమెరికావిధాన నిర్మాతలైన అభివృద్ధి నిరోధకులు ఉత్సాహం చూపుతున్నారు.

కాబట్టే, కొన్ని పరిశ్రమల ఒత్తిడి ఎంత ఉన్నప్పటికి, అమెరికా వెనుకబడిన దేశాలలో పరిశ్రమల నభివృద్ధి పరిచేందుకు తీవ్రంగా ప్రయ

త్సించదు. అమెరికాలో రాజకీయంగా ముఖ్యమైనమార్పులు రాకుండా పాతఅభివృద్ధి నిరోధక ధనస్వాములే అధికారంలో ఉంటే ఆశియాలోః వెనుకబడిన దేశాలలో భూస్వామ్య విధానంపై పోరాటంజరిపే అభ్యుదయ శక్తులకు అమెరికా విధానం సాయపడదు.

యూరోపులో ఇక అమెరికా, సోషలిస్టు ఉద్యమాలకు విరుద్ధంగా ధనస్వాములను బలపరుస్తుందనడంలో ఏమీ అనుమానం అక్కరలేదు అలాగే ఆశియాలోకూడ జరుగవచ్చుననేందుకు కావలసినన్ని కారణా లున్నవి—కాని ఇందువల్ల అమెరికాలోని ఎగుమతి పరిశ్రమలు కొన్ని దెబ్బతింటాయి కాబట్టి, ఈ పరిస్థితి అంతస్పష్టంగా లేదు.

ఇలా అమెరికాలో, ఒకకొత్త సామ్రాజ్యవాదం వృద్ధిచెందుతూ ఉన్నది. అయితే ఇక పాతకాలపు సామ్రాజ్యవాదం నిర్మూలనమైనట్టేనని భావించ వీలులేదు, కాని త్వరలోనే జపాను వలసలలోను బ్రిటిష్ ఇండియాలోను ఇది నిర్మూలితం కాగలదనడంలో సందేహం లేదు. ఆశియా ఆఫ్రికాలలోని మిగతవలస ప్రాంతాలలోకూడ బాగా ఈ విధానం కుదుళ్లు కదిలిపోతాయి. అయినా కదిలినంత మాత్రాన అది సర్వనాశ మైనదని అర్థం కాదు. ఇందుతో ఇకమీద కొత్త అమెరికా సామ్రాజ్య వాదం, పాతయూరోపు సామ్రాజ్యవాదమూ రెండూ, ఒకదానిప్రక్క నొకటి ప్రవర్తిల్లగల వన్నమాట.

ఏమైనప్పటికి, ఈ కొత్తరకపు సామ్రాజ్యవాదం, ఇప్పుడిప్పుడే వృద్ధిచెందసాగినది—ఇదింకా నిర్ణీత సంపూర్ణ స్వరూపం ధరించలేదు. కొంతకాలంనుండే అమెరికా, ప్రపంచ అగ్రరాజ్యంగా తయారయినది. ఇంకా ఈ నూతనస్థితి కవసరమైన సంస్థల ఏర్పాటు పూర్తికాలేదు. అమెరికా విధానం పూర్తిగా పునర్నిర్ణీతం కావాలి—నాయంతటనేను ఉండి పోతాననే స్వాతంత్ర్యం నిర్మూలితం కావాలి. నేటికీ చక్కని కేంద్రీకృత

ప్రభుత్వానికి, తగిన అంగాలన్నీ రూపొందని దేశంలో ఇదంతా జరగాలి. అమెరికా స్వదేశపాలన, ధనికభూస్వాముల చేతిలోనే ఉంటుందని అనుకున్నట్టయితే, అప్పుడు కొత్త అమెరికా సామ్రాజ్యవాదరూపం సుస్పష్టమే. అయితే అమెరికా విదేశ రాజకీయాలలో ప్రతిఎత్తూ ఇందులో ఇముడుతుందని చెప్పలేము.

ప్రతిచోటా సోషలిస్టులకు విరుద్ధంగా, అభివృద్ధి నిరోధకులను బలపరచాలనే నిర్ణయంతోనే అమెరికా, పని చేస్తుందనుకోవడం పరీపొరపాటు కాగలదు. ఇలాంటి విస్పష్టమైన ఖచ్చితమైన రూపాన్నది ఇంకా అందుకోలేదు. ఎప్పటికప్పుడు, ఆయాదేశాలలోని ధనికఅభివృద్ధి నిరోధకశక్తులను బలపరచాలనే సామాన్య వాంఛతో చాలతప్పులు చేస్తున్నది—అయినా పరిస్థితింకా స్పష్టంకాలేదు. అలాంటి విధానానికి తగిన సంస్థానిర్మాణం యావత్తూ, ఇంకా ఏర్పడలేదు. కాబట్టి ఈ ధోరణిలో నడవవచ్చుననేందుకు తగిన సూచనలున్నవని మాత్రమే మన మనుకోవాలి. దీనిని మరీ అతిశయోక్తిగా తప్పకుండా ఇదే జరిగి తీరుతుందని చెప్పలేము.

ఇలా అమెరికా విదేశాంగ విధానం ప్రధానంగా, ప్రపంచధోరణి ననుసరించక, పదేపదే దానికి వ్యతిరేకంగా నడుస్తుంది కాబట్టి, ప్రపంచ గతిని మార్చేందుకు తన అధికారాన్ని వినియోగించ సిద్ధమవుతున్నది. కాబట్టి, యుద్ధం మూలంగా అన్నీతేల్చివేసుకోవాలనే స్థితికిది ప్రోత్సాహకమవుతుంది.

ఈ స్థితిని మూడు ముఖ్యమైన అంశాలక్రింద సంగ్రహించవచ్చును.

(1) అమెరికా ధనికవర్గాల దేశీయ ఆర్థిక కార్యక్రమం, భా సంక్షోభాన్ని అరికట్టలేదు. సంక్షోభమే వస్తే, వారు చేయగలిగేదల్లా పాతకాలపు ధోరణిలో ప్రభుత్వపు పనులను కొన్నిటిని ఏర్పాటు చేయడం మాత్రమే. తమ ప్రాణాన్ని దుర్బలపరచకుండా, కార్మిక స్థితిని బలపరచకుండా ఉండేరీతిగా మాత్రమే ప్రభుత్వం జోక్యం తీసుకొనేందుకు అంగీకరిస్తారు.

(2) అయినాకూడ, ఈ ఆర్థిక కార్యక్రమం, ఆర్థికాభివృద్ధిలో ఏ పెద్దమార్పునూ తేలేదు. ప్రభుత్వ జోక్యాన్ని పూర్తిగాకాదనే ధోరణి మూలంగా, మధ్యతరగతులపై అతివాదుల పలుకుబడి త్వరగా పెరిగేందుకు వీలేర్పడవచ్చు. ఇలాగే బ్రిటన్‌లో జరిగినది. కాబట్టి ధనికులు ఆర్థిక కార్యక్రమంతోపాటు సైనిక, పారిశ్రామిక, ప్రాయోగిక రంగాలను బలపరుస్తారు. దీనిని క్రమంగా యుద్ధోత్పత్తి విధానం క్రింద తయారుచేస్తారు. ఇందుతో అందరికీ కాకున్నా, ఎక్కువ మందికైనా పని దొరికేట్టు చూదామనుకుంటారు.

(3) విదేశాంగ వ్యవహారాలలో, వీరు అమెరికా సైనిక, ఆర్థిక, పారిశ్రామిక బలాన్నంతటిని ఉపయోగించి, కొత్తరకపు సామ్రాజ్య వాదం అవలంబింపజేస్తారు. విదేశాలలోని అభివృద్ధినిరోధక, ధనిక శక్తులనన్నిటిని బలపరుస్తూ విదేశమిత్రులను సంపాదించుకునేందుకు ప్రయత్నిస్తారు. ఆర్థిక సంక్షోభం రాకకు చాలముందే అమలు జరపబడే ఈ కార్యక్రమం మూలంగా, అంతర్జాతీయ రాజకీయ విద్వేషాలు మరింత రెచ్చిపోతాయి. ఇందుతో అమెరికా ఉత్పత్తి వ్యవస్థ ఏర్పడేందుకుతగిన వాతావరణం ఏర్పడుతుంది.

ఆర్థిక సంక్షోభం—అభ్యుదయ కార్యక్రమం

అలాంటి కార్యక్రమమింకా బహిరంగంకాకున్నా, అంతర్గర్భితంగా ఆ ప్రమాదం ఉన్నది. వీటికి వ్యతిరేక చర్యలను సాధ్యమైనంత త్వరలో జరపాలి. వీటన్నిటికంటె పైన, అతివాద అభ్యుదయశక్తులేకమై, ఒక సామాన్యకార్యక్రమాన్ని తయారుచేసి, అమెరికా ప్రజల ముందుంచాలి. పరిస్థితి చాలప్రమాదకరంగా ఉన్నది. ఆశావాదానికి అవకాశంలేదు. ఉన్నదున్నట్టు చెప్పకోవాలి. వారి కార్యక్రమం సమగ్రంగా ఉండాలి. దేశీయ ఆర్థిక ప్రయత్నాలూ సైనిక, ఆయుధాది సమస్యలూ, విదేశాంగ నీతీ ఇవన్నీ అందులో చర్చించబడాలి. అతివాద, అభ్యుదయ శక్తులన్నిటి సమీకరణకు ఇది చేయూతకావాలి.

రెండుయుద్ధాల మధ్యకాలంలో యూరోపు కార్మికవర్గోద్యమంలో వచ్చిన పెద్ద లోపమొకటున్నది. కార్మికవర్గ స్థాయిని మాత్రమే వారు చూచుకున్నారు. వారి జీవనస్థాయి, జీతాలు వగైరాలు పెరగడంకోసం చూచారు. ఇలాంటివెన్నిచేసినా విదేశాంగనీతి, సైన్యం, సామ్రాజ్యవాదం లాంటి ప్రధాన సమస్యలనుగూర్చె వారేమీచెయ్యలేదు. ఇందువల్ల కార్మికవర్గం సంఘంలోని ఒకభాగంగూర్చి తప్పితే ఆలోచించదని, యూరోపులోని అభివృద్ధి నిరోధకులనే అవకాశంచిక్కినది—నిజానికి కార్మికవర్గం జాతి ప్రయోజనాలన్నిటికి ప్రాతినిధ్యం వహిస్తున్నది. అమెరికాలోని కార్మికులూ, అతివాదులూ, యూరోపు రాజకీయానుభవంనుండీ పాఠం నేర్చుకోవలసి ఉన్నది. దేశీయ—ఆర్థిక వ్యవహారాలు, ఆయుధాలు, విదేశీ రాజకీయాలు—ఈ మూటినీ సంపూర్ణంగా ఇముడ్చుకొని తయారుచేసిన కార్యక్రమం ఒక్కటుంటేతప్ప, వీరిపోరాటం ఇప్పుడుగాని, వచ్చే సంక్షోభంలోగాని విజయవంతం కానేరదు.

## ఆర్థిక కార్యక్రమం

ఆర్థిక కార్యక్రమాన్ని నిశ్చయించుకునేటప్పుడు, ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి; 1929నాటి సంక్షోభ తీవ్రత, యాదృచ్ఛికమైనది కాదు. అదేదో ప్రత్యేకంగా అప్పుడే వచ్చినది కాదు. అమెరికా నేడొక కొత్త దశలోనికి ప్రవేశించినది. ఇందులో సంక్షోభం తప్పనిసరిగా పూర్వంకంటె, మరింత తీవ్రతరం కాగలదు. ప్రభుత్వం తీవ్రంగా జోక్యం కలిగించుకుంటేతప్ప, శాశ్వతంగా అనేక లక్షలమంది నిరుద్యోగులు కావడం సర్వసాధారణం కాగలదు.

ఇంకొక సంగతినికూడ మనసులోనుంచుకొని ఆర్థిక కార్యక్రమం నిశ్చితంకావాలి: నేటిరూపంలో అమెరికా గుత్తవ్యాపారుల ధనికవిధానం, 1929 ఆర్థిక సంక్షోభపరీక్షకు తాళలేకపోయినది. ఇక రాబోయేసంక్షోభాన్ని జయప్రదంగా ఎదుర్కొంటుందనే అవకాశం మరింత తక్కువగానున్నది. అంతేకాక మనం గుర్తించవలసిన మరొక విషయం: వచ్చే సంక్షోభకాలంనాటికి ఇంకా అభివృద్ధి నిరోధక ధనికవర్గం. చాల బల సంపన్నంగా ఉండగలదని, అమెరికా సమాజాన్ని సోషలిస్టు పునాదిపై. మార్చేందుకు తగినబలం అతివాద అభ్యుదయవర్గాలకు ఉండదని కూడ మనం గ్రహించాలి.

కాబట్టి, సంక్షోభంలోని ఆర్థిక కార్యక్రమం వాస్తవిక దృష్టితో వెంటనే తనలక్ష్యంగా ఉంచుకోవలసిందల్లా, గుత్త వ్యాపార సంస్థలను బలహీనపరచడం, మరేమో వ్యతిరేకశక్తులకు తగినంతబలాన్నివ్వడం— ఇవీ దాని లక్ష్యంకావాలి. బ్రిటిష్ ప్రభుత్వ శ్వేత పత్రంలోను, బీవరిడ్జి ప్రణాళికలోనుఉన్న ప్రధానసూత్రాలను కొన్నిటిని ఇందులో చేర్చవచ్చును. ధనికవిధానం అందరికీ ఉద్యోగాలు కల్పించలేక పోయిందికాబట్టి, అందుకు ప్రభుత్వం బాధ్యత తీసుకొనాలి.

అందరికీ ఉద్యోగాలు కల్పించే బాధ్యత నొకటినే ప్రభుత్వం ప్రకటిస్తే చాలదు. కార్యక్రమం మరింత ముందుకు వెళ్లాలి. ఇందు కనుగుణంగా, ఆర్థికవ్యవస్థకంతటికి తగిన ప్రతిపాదనలను కూడ చెయ్యాలి. ఇందుకై ప్రభుత్వం తీసుకొనే చర్యలు, కేవలం ప్రభుత్వపు పనులు ఏర్పాటిచేయడంతో పరిమితంకాదని, స్పష్టంగా ప్రభుత్వం ప్రకటించాలి. మామూలు ధనికసంస్థలలో పనిచేసేవారికంటె హీన స్థితిలో ఏమాత్రం ఉంచకుండా, కార్మికులకు పనులుకల్పిస్తూ, పెద్దఎత్తున తాను చాలపెట్టుబడి పెట్టాలి. వీధుల్లో పనుల్లేక పడిఉన్న నిరుద్యోగులను తీసుకోవడంతో మాత్రమే ప్రభుత్వజోక్యం ఆగకూడదు. తగిన జీతాలతో ఉత్పత్తికి కారణమైన ఉద్యోగాలు వారికిచ్చి. తమకేదోభిక్షం పెడుతున్నది ప్రభుత్వమనే భావం కార్మికులకు కలగకుండా చూడాలి. ప్రభుత్వం తన ఆర్థికసంస్థలలో ఎల్లప్పుడూ, మామూలు ఉద్యోగాలను కల్పించాలి.

అమెరికాలోని అతివాద అభ్యుదయశక్తులు, ఇలాంటి ప్రతిపాదనలను చేసేముందే ఒకఅంశం గుర్తించాలి. అలాంటి ప్రభుత్వచర్య ఏదైనా వర్గశక్తుల సంబంధాలలో తప్పకుండా భేదంవస్తుంది. కొందరు అతివాద కార్యకర్తలకున్న భ్రమలు—ఇలాంటి ప్రణాళికలు అమలుజరపడంవల్ల, వర్గశక్తుల సంబంధాలేమీ మారవనుకోవడం లాంటివి—మానుకోవాలి. అందరికీ పనులు కల్పించేబాధ్యత తనపై ప్రభుత్వం వేసుకున్నదంటేనే, అది ధనికులకూ. గుత్తవ్యాపారస్తులకూ మర్మాఘాతంకాగలదు. ఎందుకంటే, ఇలాంటి ప్రకటనకర్థమేమిటి? ఒక ప్రధానరంగంలో ధనికవాదం విఫలమయినది, అది ఏమాత్రం అభ్యుదయ సాంఘిక శక్తికాదు అనేకదా అర్థం.

పైగా కోరినవారికల్లా ఉత్పాదకమైన ఉద్యోగానికి ప్రభుత్వం భరోసా ఇవ్వగలిగితే, కార్మికవర్గపు సాంఘికస్థాయి సహజంగా బలపడు.

తుంది. ఇదొక్క ప్రభుత్వ సంస్థలలో పనిచేసేవారికేకాక. వ్యక్తిగత సంస్థలలో పనిచేసేవారికికూడ అనువర్తిస్తుంది. ఎందుకంటే వారిక నిరుద్యోగానికి భయపడ నవసరం లేదు. కాబట్టి ఆర్థికపోరాటాలలో వారి చేయికి సహజంగా బలం చేకూరుతుంది.

ఇదికాక, ప్రభుత్వమందరికీ ఉద్యోగాలకు హామినివ్వవలసి వస్తే, తాను కేవలం వ్యాపారసంస్థలలో జోక్యం తీసుకుంటే చాలదు. ఇక తానూ ఎక్కువ పెట్టుబడి పెడితే, వ్యక్తిగత ధనికరంగంపై కూడ ప్రభుత్వానికెక్కువ అధికారం ఏర్పడుతుంది. ఆఖరుకు సంపూర్ణంగా ఆర్థికరంగమంతటినీ ప్రభుత్వమే నడపవలసివస్తుంది. ధనికులకు చేతకాక పోయినా, దెబ్బకొట్టాలని విఘాతం కల్పించినా, ప్రభుత్వం కొంత పెట్టుబడిని పూర్తిగా తనచేతిలో నుంచుకొని, దాని ప్రవృత్తిపై నిర్ణాయక శక్తిని తనచేతిలో నుంచుకుంటుంది.

ప్రభుత్వ ఆర్థిక-జోక్యాన్ని ధనికవర్గాలు తీవ్రంగా వ్యతిరేకిస్తా రనడం సుస్పష్టం. ఇందువల్ల సంఘంలో వారిస్థానం రెండువిధాలా చెడుతుంది. ఇంతవరకు తాము పనిచేస్తున్న పనులను ప్రభుత్వం నిర్వహించడంతో, తాము కేవలం ఏదో ప్రభుత్వ ఏజంట్లుగా మారవలసి వస్తుంది. రెండవది, కార్మికవర్గం యొక్కస్థితి బాగుపడుతుంది. అతివాదులలో కొందరిదికాదని భ్రమపడినా, ఈ విషయంలో ధనేశ్వరుల కేమాత్రం సందేహంలేదు. కాబట్టి వారలాంటి ప్రభుత్వజోక్యాన్ని వ్యతిరేకిస్తారు—అంటే ఈ కార్యక్రమాన్ని అమలు జరపాలంటే, కార్మికులు, గుమాస్తాలు, రైతులు, మధ్యతరగతులు, మేధావులు మొదలైనవారిలో అసంఖ్యాకులు గట్టిగా దీనిని బలపరచాలి.

ఇలాంటి కార్యక్రమం అమలుజరిగితే, అమెరికా విదేశాంగ రాజకీయాలు యావత్తూ మారగలవు. స్వదేశంలో అందరికీ ఉద్యోగాలు కల్పించేబాధ్యతను తనపై వేసుకోవడంతో, అమెరికా ప్రపంచశాంతికెంతో దోహదరి చేస్తున్నదని, అంతకంటె శాంతిస్థాపనకు తాను చేయగల గొప్పపని వేరుండదని ట్రూమన్ సరీగ్గా చెప్పాడు.

ఆయుధ కార్యక్రమం

ధనికవాదవర్గాలు బ్రహ్మాండమైన యుద్ధోత్పత్తి విధానాన్ని అమలు పరిచే ప్రమాదమున్నదని మనం తెలుసుకున్నాము. అభ్యుదయదశను మరికొన్నాళ్లు సాగించేందుకిదొక్కటే ఆశ కల్పిస్తున్నది కాబట్టి, ఇలాంటి విధానం అమలుజరిపేందుకు వారు సులువుగా నిశ్చయించవచ్చును. అమెరికాలోని అతివాద, అభ్యుదయశక్తుల కార్యసరళి, ఇలాంటి ప్రయత్నాలన్నిటిపైన సరైన సమాధానం తయారుచేసి ఉంచుకొనవలెను. తామెంతవరకు మిలిటరీ తతంగాన్ని బలపరచుకోగలరో అది తొలినుంచే స్పష్టంగా, నిస్సందేహంగా నిశ్చయించుకోవడం మంచిది.

సంక్షోభం వచ్చేందుకు చాల ముందుగనే, అమెరికా ఆయుధ నిర్మాణాన్ని బ్రహ్మాండంగా పెంచడం, ముఖ్యంగా అది యుద్ధోత్పత్తి విధానం క్రింద తయారవడం—వీనిలో ఉన్న ప్రమాదాన్ని జనానికి స్పష్ట పరచాలి. మూడవయుద్ధం వస్తే, ఈ అణుబాంబుయుగంలో తమస్థితి మొదటి రెండుయుద్ధాలలో కంటె భిన్నంగా ఉంటుందని, యుద్ధప్రభావం తమమీద పడకుండా ఈసారి తప్పుకోలేరని అమెరికా ప్రజలను ఒప్పించడం మొట్టమొదట చేయవలసిన పని.

రెండవ ప్రపంచయుద్ధ సమయంలో అమెరికాస్థితి ప్రత్యేకమైనది. ఉత్పత్తికీ—జీవనస్థాయికీ అమెరికాలోనున్న విభేదానికిన్నీ, మిగత ప్రపం

చంలో ఉత్పత్తికీ-జీవనస్థాయికీ ఉన్న విభేదానికికిన్నీ అప్పటికే వ్యవధానం ఉండేది. అది రెండవయుద్ధంలో మరింత హెచ్చినది. ఇందువల్ల యూరోపు ఆశియా ప్రజలవలె, అమెరికా ప్రజలు రెండోయుద్ధాన్ని సమగ్ర యుద్ధంగా రుచిచూడలేదు. యుద్ధంలో తమ ఇళ్లల్లో తాముంటే, తమ పనులు తాము చక్కబెట్టుకుంటూ వచ్చిన అమెరికా ప్రజలు విమానదాడుల భీభత్సాలెలాంటివో చూడలేదు. తమ జీవనస్థాయి తగ్గకపోగా, పైగా కొంత హెచ్చినది. ఇందువల్ల, అమెరికాప్రజల యుద్ధానుభవం ఇంకో యుద్ధాన్ని వారు ప్రతిఘటించేందుకు సమర్థం కాదు.

కాబట్టి యుద్ధానుభవం వల్ల, అమెరికా ప్రజలు మూడోయుద్ధాన్ని ప్రతిఘటించబోవడం లేదని అభ్యుదయశక్తులు అవగాహన చేసుకోవాలి. యుద్ధంలో చాల అమెరికా కుటుంబాలు విషాదాక్రాంతా లయినమాట వాస్తవమే. కాని ఇది వైయక్తికమే కాని. సర్వసాధారణం కాదు. ప్రత్యక్షంగా పాల్గొన్న దేశాలకు మల్లే, అమెరికా యుద్ధఘాతాన్ని తినలేదు.

గతరెండు యుద్ధాలలోని అమెరికా ప్రత్యేక స్థితిని తీసుకొని, సున్నితంగా ఉపయోగించుకో వీలున్నది. రెండోయుద్ధానికి పూర్వంకూడ పారిశ్రామికంగా అమెరికా ఉన్నతస్థానా న్నాక్రమించింది. అలాంటి దిప్పుడు "యుద్ధోత్పత్తి" విధానాన్నవలంబిస్తే, సైనికంగా-శాస్త్రీయంగా పారిశ్రామికంగాకూడ ప్రపంచమంతటికి అమెరికా నాయకత్వం వహించ గలదు. కాబట్టి యుద్ధమంటే మిగతదేశాలకంటె అమెరికాకే భయం అత్యల్పంగా ఉండాలనికూడ వాదించవచ్చును. ఇప్పటికే అమెరికా ప్రపంచ అగ్రరాజ్యాలలో బలవత్తరమైనది కావున, మూడోయుద్ధం చేసి, విజయం సాధించి తానే ఏకైక అగ్రరాజ్యంగా తయారు కావాలనికూడ వాదించవచ్చును. ఇంకా ఇంత బహిరంగంగా మాట్లాడేందుకు, బాధ్యత

లవారిలో ఒక్కడూ స్సాహసించడం లేదుకాని, అమెరికాలో ఇలాంటి వైఖరులు బలంగా ఉన్నవన్నమాటను కాదనడం వీలుకాదు.

ఇలాంటి వైఖరులు బయటపడే సంక్షోభం వచ్చేదాకా అభ్యుదయ శక్తులు ఆగనక్కరలేదు, ఒక శతాబ్దిగా, రెండోయుద్ధ సమయంలోకూడ అగడ్తగా పనికివచ్చిన అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రాలిక ఈ ఆటం బాంబుయుగంలో రక్షకంగా పనికిరావు. తమ దేశంపై దాడిరావనే నమ్మకం సైనికనాయకుల కికలేదు. తన నివేదికలో జనరల్ మార్షల్ ఇలా చెప్పాడు. "ఆ సముద్ర మహావ్యవధులు యుద్ధతంత్రచరిత్రలో-బహుశా ఆఖరిసారి కావచ్చు-మనరక్షణలో ప్రధాన శక్తులుగా నున్నవి."

ఒకే ఒక దెబ్బలో, హఠాత్తుగా, విజయప్రదంగా అమెరికా, శత్రువుకిక ఎదురుదెబ్బతీయ వీలులేనట్టుగా కొట్టగలిగితే తప్ప, అలాశత్రు దురాక్రమణ శక్తిని నిర్మూలిస్తేతప్ప అమెరికా పరిశ్రమలు, ఆదాడినాపుకోలేవు. అలాంటి మెరుపుయుద్ధానికీ, మెరుపుముట్టడికీ కనీసం అవకాశ మున్నదా?—లేదనే అన్నిసూచనలు సూచిస్తున్నవి.

ఇది అగ్రరాజ్యాల కాలం. నేటి రాజ్యకూటములలో, ఏ రాజ్యాలేమిటిలోచేరినా, అమెరికా సోవియట్లు కలిస్తే, వానినెవరైనా దెబ్బతీయలేరు. అసలు యుద్ధప్రమాదమల్లా ఈ రెండు పెద్దరాజ్యాలూ కలబడతాయేమోననేదే. అలాంటప్పుడు సోవియట్ తిరిగి ఎదురుదెబ్బతీయ వీలులేకుండా అమెరికా ఒకేతూరి పడగొట్టగలదనేందుకు అవకాశమున్నదా?

గత రెండు యుద్ధాలలోను, యుద్ధంచేస్తున్న దేశాల పారిశ్రామిక శక్తిసంపదలే, అసలు వాని జయాపజయాలకు నిర్ణాయకములైనవి. వచ్చే యుద్ధాలలోకూడ అదేస్థితి ఉండగలదు. ఇందులో అమెరికాకు సోవియట్ కంటె గొప్ప అనుకూలత అలానే ఉంటుంది. వివరంగా దీనిని వివరించు

కుంటూపోవడం అనవసరం—అమెరికా, ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో సగం ఉత్పత్తి చేయగలదని మాత్రం మనమిక్కడ తెలుసుకుంటే చాలును.

రెండవయుద్ధం ఆరంభించేందుకు కొంతకాలంక్రితం, ప్రపంచ పారిశ్రామిక వస్తూత్పత్తిలో సోవియట్ భాగం దాదాపు నూటికి12వంతులని అంచనా వేయబడినది. ఆతర్వాత రష్యా యూరోపు భాగంలో యుద్ధ విధ్వంసనంమూలంగా పారిశ్రామికోత్పత్తి నిస్సందేహంగా తగ్గిఉంటుంది. అయితే మరొకవేపు ఆసియాప్రాంతాలలో ఉత్పత్తి తప్పక పెరిగేఉన్నది. తిరిగీ 1939 నాటి స్థితికి యూరోపు ప్రాంతాల ఉత్పత్తికూడ ఎక్కువ కాగలదు. ఇందుతోపాటు, తనకూ జర్మనీకీ మధ్యనున్న దేశాల పారి శ్రామికోత్పత్తికూడ తన పలుకుబడి నెరపగలదు. ఇలా కొన్నాళ్లలో రష్యాలోను, దాని పలుకుబడిలోఉన్న దేశాలలోను కలిసి పారిశ్రామిక వస్తూత్పత్తి ప్రపంచోత్పత్తిలో 15% ఉండవచ్చునని అంచనా వేయవచ్చును. ఇంతకంటె ఎక్కువే కావచ్చుకాని తక్కువమాత్రం కాదు. అంటే అమెరికా బలంలో రష్యాబలం మూడోవంతు ఉంటుందన్నమాట. కాబట్టి వచ్చే సంక్షోభ సమయంలో పారిశ్రామికంగా, సైనికంగా కూడ ఉన్న దుస్థితి అలాగే ఉంటుందని తోస్తుంది.

అయినా రెండుదేశాల పారిశ్రామికోత్పత్తినిమాత్రం పోల్చిచూస్తే చాలదు. మరిరెండు గమనించవలసిన ప్రధానాంశాలున్నవి.

పారిశ్రామికోత్పత్తీ మిలిటరీబలమూ ఒకటికాదు. జయించిన దేశం ఆ ప్రత్యేక యుద్ధరంగంలో బలవత్తరంగా ఉండాలికాని మంరెదులోనో కాదు అన్న మిలిటరీసామెత మొన్నటియుద్ధంలో రుజువైనది. సోవియట్ యుద్ధంమీద దురాక్రమణయుద్ధం సాగించాలంటే, దానిని సోవియట్ సరి

హద్దులలోనే గెలవాలి. ఆ రంగం అమెరికా యుద్ధస్థావరాలనుండి లక్షల కొలది మైళ్లకావల ఉంటుంది. ఇందుకు రెండో యుద్ధంలోకంటె విశాలమైన అధికజన ధనాంగబలం అవసరమైన పెద్ద సరఫరామార్గాన్ని ఏర్పరచవలసి ఉంటుంది. అంటే అసలు యుద్ధరంగంలోనికి అమెరికా మిలిటరీ బలంలో ఏ కొద్దిభాగమో మాత్రమే పంపవీలవుతుంది. ఇందుకోసమైనా మరేమిటి గాకున్నా అమెరికా సోవియట్ల బల తారతమ్యం 3: 1 గా ఉండదు.

అమెరికాలో జీవనస్థాయి అత్యున్నత స్థాయిలో ఉన్నది. అంటే మొత్తం ఉత్పత్తిలో కొంతమాత్రమే అసలు యుద్ధప్రయోజనాలకై ఉపయోగింపవీలవుతుంది. రెండోయుద్ధంలో ఆ భాగంమొత్తం నూటికి 44వంతులకు మించలేదు. సోవియట్‌లో జీవనస్థాయి చాల తక్కువ. ఇంతున్నా నాజీజర్మనీ జయించలేని సేనకు, తుదకు బెర్లిన్‌ను జయించిన సేనకు-కావలసినవన్నీ సరఫరాచేయగలశక్తి తనకున్నదని రష్యా మొన్నటియుద్ధంలో రుజువుచేసినది. అమెరికా యుద్ధోత్పత్తివిధానం ఆరంభిస్తే,సోవియట్ రెండోయుద్ధానికి ముందుచేసినపనినే చేస్తారు. మిలిటరీ ఉత్పత్తికి అతిప్రాధాన్యమిచ్చి పనిచేస్తారు, అప్పుడు లెక్కల్లో 1.3 అనే తారతమ్యం ఆచరణలో తలక్రిందులవుతుంది.

అమెరికా తనపారిశ్రామిక స్థానాలనుండి, వేలకొలదిమైళ్లలోఉన్న సోవియట్‌పై యుద్ధమే చేయవలసివస్తే, అప్పుడు పారిశ్రామిక బల తారతమ్యం లెక్కలకంటె భిన్నంకాగలదు. ఎంత పెరిగినా రష్యాపై మెరపు యుద్ధం, మెఱపు ముట్టడిని అమెరికా కొనసాగించలేదు. కాబట్టి అంతిమ ఫలితమెలాఉన్నా రష్యా తిరుగుదెబ్బ తీసేస్థితిలోనే ఉంటుంది.

నెపోలియన్ తాననుకున్నట్టు రష్యాను మెఱపు యుద్ధంలో ఆక్రమించలేకపోయ్యాడు. ఆప్రయత్నంలో ఆయన పొందిన నష్టాలే అతని

అంతిమ పరాజయానికి ప్రధాన కారణములైనవి. హిట్లర్ జర్మనీకూడ ఈ ప్రయత్నంలో విఫలమైనది, తూర్పు రంగంలోని విపరీత నష్టాలు మిగత అన్ని రంగాలలోని నష్టాలన్నింటిని చేర్చిన మొత్తంకంటె ఎక్కువైనవి. ఇవే ఆజర్మనీ అంతిమ పరాజయానికి ప్రధాన కారణమైనవి.

ఆటం బాంబు యుగంలోనైనప్పటికి, నెపోలియన్ ఫ్రాన్సు, హిట్లర్ జర్మనీ చేయలేని పనిని అమెరికా చేయగలగడం చాలవరకు అసంభవం. అమెరికా సోవియట్‌పై దాడిచేసిందంటే, ఆ యుద్ధంలో విమానదాడి బ్రహ్మాండంగా సాగుతుంది. కాని సోవియట్ యూనియన్ రెండు ఖండాలలోను ప్రధానమైన పెద్దరాజ్యం. దాని వైశాల్యం ఎక్కువ. అక్కడి పరిశ్రమలను వికేంద్రీకరించ వీలున్నది. కాబట్టి ఇలాంటి బ్రహ్మాండమైన దాడిలోకూడ రష్యా మిలిటరీశక్తి త్వరగా విచ్ఛిన్నమవుతుందనడం అసంభవం. మరి అలా వేగంగా, అతి వేగంగా ఆ బలం విచ్ఛిన్నం కాకపోతే రష్యాకు తిరుగుదెబ్బ తీసేబలం ఉంటుంది.

ఆటంబాంబు ఉత్పత్తికి కారణమైన శాస్త్రీయ పరిజ్ఞానం, రహస్యం కాదని నిపుణ వర్గాలలో అందరూ గుర్తిస్తున్నారు, బాంబులనెలా ఉత్పత్తి చేస్తారన్నదొక్కటే ఇంతవరకూ రహస్యంగా ఉంటే ఉన్నది. కొన్నేళ్ళలోనే సోవియట్ యూనియన్‌కూడ ఆటంబాంబులను ఉత్పత్తి చేయగలదని కూడ శాస్త్రజ్ఞులలో బాధ్యతగలవారు అభిప్రాయపడుతున్నారు.

ఈ క్షణానికేమో ఆయుధాల పోటాపోటీలింకా అంతగాలేవు. అవి ప్రమాదం. సంక్షోభం రాగానే బయలుదేరుతాయి. అంటే యుద్ధసమస్య స్పష్టంగా బయటపడేందుకు కొన్ని సంవత్సరాలు కావచ్చును. అప్పటికి అమెరికా, ఆటంబాంబులు తనవే ననేదశ దాటిపోతుంది. వచ్చేయుద్ధంలో,

సోవియట్ యూనియన్ భారీయెత్తున ఆటం బాంబులను ఉత్పత్తి చేయ గలుగుతుంది.

ఆటంబాంబుయుగంలో యుద్ధం మెరపుయుద్ధమై మెఱపువిజయాన్ని సాధించలేకపోతే—అవకాశమేమీ కనిపించదు—దాని ఫలితాలు అతి దారుణంగా ఉండగలవు. అమెరికా సోవియట్‌పై యుద్ధంతెచ్చి,సోవియట్ అమెరికాపై తిరుగుదాడి ఆటంబాంబులతో చేయగలిగితే, పూర్వమెన్నడూ లేనంత యుద్ధభీభత్సాలను అమెరికా ప్రజ అనుభవించగలదు. రెండో ప్రపంచ యుద్ధంలో యూరోపులో కలిగిన విధ్వంసనం, దీనిముందు దిగ దుడుపు కాగలదు. అమెరికా పట్టణాలు, పారిశ్రామిక కేంద్రాలు విధ్వంసనం కాగలవు. లక్షలాది జనం నాశంకాగలరు. ఏమాత్రం అతిశయోక్తిగా చెప్పకున్నప్పటికి, అలాంటి యుద్ధం నాగరికత సర్వనాశనానికి దారితీయ గలదని మనమెరుగుదుము.

జనరల్ మార్షల్ నివేదికనుంచే ఉటంకిస్తాము;

"యుద్ధతంత్రంలో వచ్చిన అభివృద్ధి మూలంగా, అమెరికా ఇళ్లూ, ఫాక్టరీలూ ప్రపంచ సంఘర్షణరంగంలోనికి ఈడ్వబడినవి. రెండో యుద్ధంలో విమానదాడుల నవి తప్పించుకొన్నవి........ మూడవయుద్ధంలో అవి తప్పించుకోలేవు. ఆయుధాలలో, టెక్నిక్కులో వస్తున్న అభివృద్ధి మూలంగా న్యూయార్కు, పిట్సుబర్గు, డిట్రాయిట్, చికాగో, సన్‌ఫ్రాన్సిస్కో లాంటి పట్టణాలు, ఇతర ఖండాలనుండి వచ్చే దాడులతో గంటలలో విధ్వంసం కావచ్చును."*

---

* జనరల్ మార్షల్ రిపోర్టు పుట 1-118

అంటే—దీనినే మరొకవిధంగా చెప్పవచ్చును—అమెరికా పట్టణాలలో జనాభా కేంద్రీకరణం చాల ఎక్కువ. పారిశ్రామిక కేంద్రీకరణం కూడ అధికం. దాని ఆర్థికజీవితం చిక్కగా అల్లుకొనిఉన్నది. వీటన్నిటి మూలంగా వచ్చే యుద్ధంలో ఆటంబాంబుదాడులకు అమెరికాయే ఎక్కువ గురికాగలదు.

అణుయుద్ధంలో సైన్యం ద్వారా జయించాలంటే ఒకేదెబ్బలో, శత్రువుకు తిరిగి దెబ్బతీసేశక్తి లేకుండా పడగొట్టాలి. నేటి రాజ్యకూటములలో ఇలాంటిదేదీ సంభవం కాదని వెంటనే ప్రజలకు నచ్చచెప్పడం అభ్యుదయ కాముకులు ప్రారంభించాలి. అసలలా ఒకేదెబ్బలో గెలవడం అసాధ్యం, అసంభవం.

అమెరికాపై ఎవరూ దాడిచేయ వీలులేనట్టుగా, తిరిగి తమపై తిరుగుదాడులు తప్పవనివారు భయపడేందుకు వీలుగామాత్రమే ఆయుధోత్పత్తి చేయుటకు అభ్యుదయశక్తులు అంగీకరించాలి. అంతేకాని అవి యుద్ధఆర్థిక విధానం క్రింద మారేలా చూడరాదు. అది అమెరికాయే యుద్ధానికి కాలుద్రవ్వేట్టుగా చేస్తుంది. దాని ఫలితం అమెరికాకూ, అందరి ప్రజలకూ కూడ అతిదారుణంగా పరిణమించగలదు.

విదేశాంగనీతి

ఆయుధోత్పత్తి కార్యక్రమమైనా అదొక్కటే ప్రపంచ శాంతికి హామీనివ్వలేదు: ఇందుకై విదేశ రాజకీయ కార్యక్రమ మొకటిఇవ్వాలి. అమెరికాలోని గుత్తవ్యాపారులూ, పెద్ద షాపుకార్లూ ఇప్పటికే కొత్తరకపు సామ్రాజ్యవాదాన్ని ఆరంభించారు. ఇందుతో అంతర్జాతీయ రాజకీయ విద్వేషాలు పెచ్చుపెరుగుతాయి. ఎందుకంటే ఈ సామ్రాజ్యవాదం ఇతర దేశాలలో అధికసంఖ్యాకుల ఆమోదం లేని అభివృద్ధి నిరోధకశక్తులను

బలపరుస్తుంది కాబట్టి ఈ విద్వేషాలు పెరుగుతాయి. సామ్రాజ్యతత్వం తప్పనిసరిగా, అమెరికా మిలిటరీ బలాన్ని పెంచక తప్పదు—దానిని యుద్ధోత్పత్తిక్రింద మార్చడానికీ చూడకతప్పదు. కాబట్టి మిలిటరీశాఖను బలపరచడం అవసరం లేనట్టి విదేశాంగనీతిని ప్రచారపరుస్తూ, యుద్ధోత్పత్తి పరిణామాన్ని అభ్యుదయశక్తులు వ్యతిరేకించాలి.

ఇందులో అభ్యుదయవంతమైన విదేశాంగనీతికీ, అభ్యుదయవంతమైన ఆర్థికరాజకీయ విధానానికీ సమానత ఉన్నది. అలాంటి విధానంలో సంక్షోభాన్ని అరికట్టేందుకు ప్రభుత్వం జోక్యం తీసుకున్నట్టయితే, ఇక యుద్ధోత్పత్తి విధానానికి దారితీసేట్టుగా ఆయుధ ఉత్పత్తి కొనసాగే అవసరమే ఉండదు. అలాగే విదేశాలలోని రాజకీయ ధోరణుల కనుకూలమైన విధానాన్నవలంబించి, సామ్రాజ్యవాద ధోరణిని వదిలిపెట్టినట్టయితే, అప్పుడు తనవిదేశ రాజకీయలక్ష్యాలకు ప్రోద్బలంగా యుద్ధోత్పత్తివిధానం అవలంబించవలసిన అవసరం ఉండదు. అయితే అమెరికా అతివాదశక్తు లెలాంటి విదేశాంగ విధానాన్ని ప్రచారం చెయ్యాలి?

అమెరికావైఖరి ఆశియా యూరోపులలోను, ఆఖండాలవైఖరి అమెరికాలోను మార్పులను తేగలదు. యూరోపులోని పారిశ్రామిక దేశాల రాజకీయధోరణి అతివాదులవైపే మ్రొగ్గుతున్నదని బ్రిటన్‌లో లేబర్‌పార్టీ విజయం సూచిస్తున్నది. చాల యూరోపు దేశాలలోని ప్రజలలో అధిక సంఖ్యాకులు, అతివాదధోరణినే బలపరుస్తారు. ధనికవిధానాన్ని తొలగించేందుకు వారు సుముఖులు—లేదా కనీసం తీవ్రంగా సాంఘికమైన మార్పులనుతెచ్చి ఆ ధనికవాద చర్యలను చాలవరకు పరిమితం చేయాలని వీరందరూ కోరుతారు.

కాబట్టి అమెరికా విదేశాంగ విధానం ఆ ప్రజావైఖరిని బలపరచకపోయినా, కనీసం వ్యతిరేకించకూడదని అమెరికా అభ్యుదయశక్తులు

కోరాలి. అధిక ప్రజామోదంతో యూరోపులో రానున్న మార్పులకు ఆటంకంగా అమెరికా అనంతబలాన్ని ఉపయోగించకుండా కార్మికులూ వారిమిత్రులూ, అభ్యుదయ వర్గాలవారందరూ తీవ్రంగా పనిచెయ్యాలి. ఇందుకోసం, అభ్యుదయవర్గాలు తమ విదేశాంగ విధానాన్ని రూపొందించుకోవాలి. యూరోపురాజ్యాలు ఆర్థికంగా, రాజకీయంగా స్వతంత్రాలని ప్రకటించాలి. సోషలిజం కానీ, ధనికవాద నిర్మూలనం కానీ, మరే ప్రధాన సాంఘిక- మార్పుకానీ ఏమైనాసరే తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకునే హక్కు యూరపియన్ రాజ్యాలకున్నదని వీరు చాటాలి.

అమెరికాసాయం లేకపోతే యూరోపులో ధనికవాదం నిలవలేదు. సోషలిజంవేపు నడుస్తున్న పురోగతిని ఆపవచ్చు, లేదా నిదానంగాసాగేట్టు చేయవచ్చు, కాని శాశ్వతంగా ఆగిపోయేట్టు చేయడం సాధ్యంకాదు. అభ్యుదయశక్తులీ పురోగతిని బలపరచాలి.

రెండు ప్రపంచ అగ్రరాజ్యాలైన సోవియట్ యూనియన్, అమెరికాలు రెండిటి ప్రక్కన స్వతంత్రమైన మూడవరాజకీయ కేంద్రం యూరపులో ఒకటి ఏర్పడడం—అది రష్యా నియంతృత్వపద్ధతి నవలంబించకుండా సోషలిజంవేపు పురోగమించడం—ప్రపంచ చరిత్రకూ, ముఖ్యంగా ప్రపంచశాంతికి ఎంతో ముఖ్యమైనది.

ఇలాంటి విదేశాంగ విధానం చేయవలసిన కనీస కర్తవ్యం, యూరపులో అమెరికా సామ్రాజ్య విధానం జోక్యం కల్పించుకోకుండా చూడాలి. అమెరికా విదేశాంగ విధానం అనుసరించేమార్గం ప్రతి అమెరికన్ జీవితానికీ సంబంధించినదని ప్రజలకు స్పష్టపరచాలి. యూరోపులోని అధికసంఖ్యాక ప్రజానీకం ఆశయాలకూ, అభిలాషలకూ వ్యతిరేకంగా ప్రవర్తించడమంటే, అప్పుడు భారీయెత్తున యుద్ధోత్పత్తి విధానం సాగించ

వలసివస్తుందని, అది ఆఖరుకు మేముముందు చిత్రించినరీతిగా అనేక దుష్ఫలితాలకు దారితీస్తుందని గమనించాలి.

యూరోపురో సర్వసామాన్యంగా కనిపించేవైఖరి, ధనికసమాజ నిర్మూలనం—లేదా కనీసం ధనికసమాజంలో ప్రధానమైన మార్పులు కొని రావడం—ఆశియాలో జాతీయ స్వతంత్రాన్ని అధికం చెయ్యడం, పారిశ్రామికాభివృద్ధి కవసరమన్నవైఖరి సర్వసామాన్యంగా కనబడుతున్నది. ఇందుకుముందు రావలసిన మార్పులివి: పాతకాలపు వలససామ్రాజ్య విధానం పోవాలి. దానికి తప్పనిసరిగా మిత్రమైన దేశీయభూస్వామ్య విధానాన్ని రూపుమాపాలి. ఇవిరెండూ పారిశ్రామికాభివృద్ధికి బద్ధశత్రువులుగా నున్నవి. ఆశియాలోని భూస్వామ్యశక్తులను బలపరచడం, అమెరికాకోర్కే ఆర్థికబహుళవ్యాప్తి కార్యక్రమానికి అననుకూలవాతావరణం కల్పిస్తోందని ఇక్కడి అభ్యుదయ అతివాదశక్తులు నొక్కిచెప్పాలి.

సామ్రాజ్యవాదమూ, దేశీయ భూస్వామ్య విధానమూ చేతులు కలుపుతున్నాయని కేవలం ఖండించినా, దూషించినా అంతమాత్రమే చాలదు. ఆశియాలో ఏ భాగంలోనైనా సరే, అభివృద్ధినిరోధక భూస్వామ్య శక్తులకు అమెరికా సాయపడకూడదని, అమెరికాలోని అభ్యుదయశక్తులు నొక్కిచెప్పాలి. యూరోపులోని విదేశాంగనీతి విషయంలో మనం చెప్పిన మాటలు ఆశియా యెడలకూడ సరిపోయేవే, రాజకీయ స్వతంత్రాన్ని, ఆశియా ప్రజానీకం సాధించాలని ఆతురపడుతున్నారు. భూస్వామ్య విధానాన్ని నిర్మూలించాలని కోరుతున్నారు. పరిశ్రమల నభివృద్ధి పరచుకోవాలని వాంఛిస్తున్నారు. ఈ వైఖరిని బలపరిచేందుకు, గట్టిపరిచేందుకు "యుద్ధఆర్థిక విధానం" ఏమాత్రం అవసరంలేదు. ఈ ఆశియా ప్రజావాంఛకు వ్యతిరేకంగా పనిచేయాలంటే, అప్పుడు అమెరికాకు యుద్ధ ఆర్థిక విధానం అవసరమవుతుంది.

భావి సంక్షోభం; యుద్ధానికి సోపానమా ?

సమాజం మార్పుదలకు మొదటిమెట్టా ?

వచ్చే సంక్షోభం మూడోయుద్ధానికో, లేదా సమాజవ్యవస్థలో పెద్ద మార్పునకో దారితీయకతప్పదు. దేశీయ ఆర్థిక కార్యక్రమం విదేశాంగ నీతివిధానం, ఆయుధ విస్తరీకరణవిధానం ఇవిమూడూ కలిసి ఒక సంయుక్త వైఖరికి నిదానమవుతాయి.

ధనికశక్తులకూ, అభ్యుదయశక్తులకూ ఇది సమానంగానే అనువర్తిస్తుంది. పూర్వమెన్నడూ లేనంతగా నేడు ఆర్థిక రాజకీయాంశాలు రెండూ పెనవేసుకొని ఉన్నవి. దేశీయ విధానమూ. విదేశాంగ విధానమూ కూడ అలాగే పెనవేసుకుని ఉన్నవి.

అమెరికా ప్రజలీ సంగతిని గుర్తించి, సమగ్రమైన స్వతంత్ర కార్యక్రమాన్ని దేశం ముందుంచకపోతే, ఇక తాత్కాలికంగా నిరుద్యోగ నివారణకై యుద్ధఆర్థిక విధానం అవలంబించడం మూలంగా మరో యుద్ధంలో లక్షలాది జీవితాలను కోల్పోయేందుకు సిద్ధమవాలి. తమఇళ్లూ వాకిళ్లూ, పట్టణాలూ పల్లెలూ విధ్వంసనమవుతుండగా చూడవలసి వస్తుంది.

అలాంటి తప సక్రమ కార్యక్రమాన్ని అవలంబింపజేసేందుకై పోరాడ్డం అంత సులభంకాదు. అమెరికాలో ప్రభుత్వం పలుకుబడి రానురాను బలపడుతూంది. అదింకా బలపడవచ్చును కూడ. ప్రభుత్వంలో తమకు తగినంత ప్రాపకం సంపాదించుకుంటేతప్ప అభ్యుదయశక్తులు విజయం పొందలేవు. అలా జరిగితే ప్రపంచ శాంతి చాలకాలంవరకు స్థిరంగా స్థాపించవచ్చును. అలా కాకపోతే, రెండో యుద్ధానికీ మూడో యుద్ధానికీ మధ్యనున్న వ్యవధానం, ఒకటవదానికీ రెండవదానికీ మధ్యనున్న వ్యవధానంకంటె చాల తక్కువ కావచ్చు.

ధనికవాదపద్ధతే ప్రధానమైన ఉత్పత్తివిధానంగాఉన్న యుగం. ఏ ఆటంకం లేకుండా ధనికవాదం అభ్యుదయ పథంలోనే నడిచిన యుగం-మొదటియుద్ధంతో అంతమయిపోయినది. అది తీవ్ర సాంఘిక రాజకీయ సంచనలయుగాన్ని ప్రాదుర్భవింపజేసింది.

రెండోయుద్ధంతో ఏ బలగమూ ముగియలేదు. యావత్ప్రపంచాన్ని వ్యాపించిన సాంఘిక సంచలన యుగమధ్యంలో ఆ యుద్ధం వచ్చింది. నేడు రెండవయుద్ధం గతించినది. అయినా మనమింకా ఆ సాంఘిక సంచలనయుగంలోనే ఉన్నాము.

అమెరికాలో ఆర్థికసంక్షోభం అలముకొన్నప్పుడు ప్రపంచం, చరిత్ర సంధియుగంలో నిలుస్తుంది. ముందేకాక సంక్షోభ కాలంలోకూడ అమెరికాలో ధనికులూ, గుత్త పెట్టుబడిదారులే నిర్ణాయక రాజకీయ శక్తిగా ఉన్నట్టయితే, విదేశాంగ, దేశీయ. ఆయుధ నిర్మాణాది విధానాలకు వారే కారకులయితే చరిత్ర, మూడవయుద్ధ మార్గాన్నిబట్టి నడుస్తుంది. ఆతర్వాత పశురాజ్యయుగం ప్రవర్తిల్లుతుంది.

అలాకాక అమెరికాలో అతివాద, అభ్యుదయశక్తులు ప్రధాన నిర్మాతలు కాగలిగితే ఒక్క అమెరికాలోనేకాక, యావత్ప్రపంచంలోను అభ్యుదయ దశకు నాందీ పాడబడుతుంది.

ఈ అభ్యుదయ కార్యక్రమాన్ని అమలుజరపడంకోసం పోరాడ్డం చాలకష్టం. నేడు ప్రతిదీ—అక్షరాలా ప్రతిదీ—పోగొట్టుకొనేదశలో మన మున్నాము. మన సర్వస్వం నేడు అటో ఇటో తెగిపోయే దశలో నున్నది. ఆ సర్వస్వాన్ని కాపాడుకోవలసినప్పుడు, మనమీ పోరాటంలో పొందే కష్టాలొక లెక్కలోనివి కావు.

---

318

అనుబంధం *

# రెండవ యుద్ధం తర్వాత అమెరికా

పారిశ్రామికంగా ప్రపంచంలో కల్లా బలవత్తరమైన రాజ్యం అమెరికా. ఒకేదేశంలో ప్రపంచోత్పత్తి ఇంత ఎక్కువభాగం కేంద్రీకృతంకావడం ఆధునిక చరిత్రలో ఎన్నడూలేనిది.

ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో దాదాపు సగపాలు నేడు అమెరికాదే. కేవలం ధనికదేశాల ఉత్పత్తినిమాత్రమే తీసుకుంటే సగంకంటె ఎక్కువ.

ఈ యుద్ధానికి ముందు అమెరికా ప్రపంచ ఆర్థికగతిలో గొప్ప పాత్రను నిర్వహించింది; ఇది ప్రధానఉత్పాదక ధనికరాజ్యంగా ఉండినది. అయినప్పటికి మిగతవానిలో అదికూడ ఒకటి.

యుద్ధంవల్ల ఏర్పడిన ప్రత్యక్ష పరోక్ష హేతువులవల్ల, అమెరికా ప్రధానమైన పెట్టుబడిదారీ దేశంగా తయారయినది. ఇందుకు రెండు పరస్పరాశ్రయాలైన కారణాలున్నవి.

రెండవయుద్ధానికిముందు తరతరాలుగా వస్తున్న అభివృద్ధిఫలితం ఒకటి,

---

* ఈ గ్రంథకర్తే రచించిన "సంక్షోభ జీవనం" అనే పుస్తకంలోని మొదటి అధ్యాయ సంగ్రహం—

మిగత ప్రపంచంకంటె అమెరికా పారిశ్రామిక ఆర్థికాభివృద్ధి నూరేళ్లుగా అతివేగంగా సాగుతూవచ్చినది. 1860 లో అమెరికా ప్రపంచోత్పత్తిలో మూడవస్థానం ఆక్రమించినది. బ్రిటన్ మొదటిదీ, ఫ్రాన్సు రెండవదిన్నీ—1870లో రెండవస్థానం చేరుకొన్నది, 1880లో బ్రిటన్‌ను కూడ దాటివేసినది. అప్పటినుంచీ ప్రపంచోత్పత్తి సూచికలో మొదటి స్థానం అమెరికాదే. 1860 నుండి దాదాపు 19వ శతాబ్దితుదిదాకా పరిస్థితెలా పరిణమించిందో మనం చూచాము. (చూడు 146 పుట) 1935-39సగటు లెక్కవేసి దానిని 100 అని భావిస్తే 1944లో అమెరికా పారిశ్రామికోత్పత్తి 235 అన్నమాట, *

ప్రస్తుతం యుద్ధసమయంలో అంత ఎక్కువగా లేకున్నా, శాంతి సమయంలోకంటె ఎక్కువే.

"మన మొత్తం సాలుసరి జాతీయోత్పత్తి 1939 నుండి 53% ఎక్కువైనది." †

1947 నాటికికూడ అమెరికా బయటిదేశాల పారిశ్రామికోత్పత్తి యుద్ధపూర్వోత్పత్తిలో 89% మాత్రమే.• అంతకుమించినా శరవేగంతో పోతున్న అమెరికా ఉత్పత్తినది అందుకోలేదు.

---

* అమెరికా అధ్యక్షుడు కాంగ్రెసుకుపంపిన రిపోర్టులు. రేనాల్ అండ్ హిచ్ కాక్, న్యూయార్కు, 1948-పుట 122.

† అదే-పుట 7

• మిత్రరాజ్యసమితి ప్రపంచ ఆర్థికసూచికలు—ఆర్థికశాఖ న్యూయార్కు, జూలై 1948, పేట-10.

యుద్ధంలోనుండి అమెరికా ఇలా పూర్వంకంటె బలవత్తరంగా బయటపడింది. దీని ఉత్పత్తి రెండు యుద్ధాల మధ్యకంటె, ఇప్పుడేకాక భవిష్యత్తులో చాలకాలంవరకు కూడ అత్యున్నత స్థాయిలో ఉండగలదు.

రెండోయుద్ధంలో పూర్వస్థితి మరింత హెచ్చినది. ప్రపంచోత్పత్తిలోను, ప్రపంచ ఆర్థికరంగంలోను ఆధిక్యం యూరోపునుండి అమెరికాకు సంక్రమించినది.

ఈ ఆధిక్యం ఏర్పడిన రోజుల్లోనే యూరోపులో అతి దారుణ సంక్షోభం రానున్నది. దానినివారు తమ ధనజనాంగ బలంతోనే తొలగించుకోలేరు. కాబట్టి యూరోపు భవిష్యత్తుకు అమెరికా నిర్ణాయక శక్తిగా పరిణమించినది.

కాబట్టి అమెరికా ఆర్థికవ్యవస్థ భవిష్యత్తు ఒక్క అమెరికాకు మాత్రమే చెందినదికాదు. యూరోపుపైనా యావత్ ప్రపంచంపైనా దీని నీడ పడగలదు.

ఇదిలా కొనసాగితే, ప్రపంచ చరిత్రగతిలో ఒక ప్రధానాంశం గూర్చి గడ్డుగా చెప్పవచ్చునుగాని 1920 తర్వాత రెండో యుద్ధంవరకూ నడిచిన సంఘటనలిలా ఊహించ నివ్వడంలేదు.

అమెరికాలో నూతన సంక్షోభంవస్తే, అందుమూలంగా యూరోపులోనేకాక, ప్రపంచంలోనే కొత్త పరిస్థితు లేర్పడగలవు, కాబట్టి ఆ సంక్షోభానికి దారితీసే ఆర్థిక, సైనిక, అంతర్జాతీయ, రాజకీయ అంశాలను మనం వివరించుకొనాలి.

## సంక్షోభ ప్రమాదం పోయినదా?

ఆర్థికంగా అగ్రరాజ్యంగా అమెరికా యుద్ధంలో ప్రవేశించినా, అదింకా సంక్షోభంనుండి పూర్తి విడివడి ఉండలేదు. 1929 సంక్షోభం అతి దారుణమైనది. 1939లో యుద్ధం ఆరంభమయినప్పుడు అమెరికాలో దాదాపు 9,300,000 నిరుద్యోగులున్నారు, ఈ దశకంలో అభ్యుదయ దశంటూ అసలొకటి రానేలేదు. వ్యాపారచక్రం తిరగలేదు.

గతయుద్ధం అన్నిటికంటె చాల ధననష్టం కలిగించినది. అయినా మిగతవన్నీ దుర్బలపడి యుద్ధంనుండి బయటికివస్తే అమెరికా చాల బలపడి బైటపడినది. పూర్వంలాగా నిరుద్యోగం దాదాపు లేనట్లే........ 1929_1939 మధ్యలాగాకాక, అమెరికా వస్తువులలో కొత్తవానికీ పాత వానికీకూడ మార్కెట్టు చిక్కినది. యుద్ధం ముగిసిన నాలుగేళ్లదాకా ఇంకా అమెరికాచేతిలోనే ఆ మార్కెట్టు ఉన్నవి.

యుద్ధానంతరం తీవ్రసంక్షోభం రాగలదన్న వారి మాటలనిది త్రోసి రాజనినట్లు కనిపించినది. ప్రారంభంకాకముందే సంక్షోభాన్నెదుర్కొనేందుకు సిద్ధపడమన్న వారిమాటలలోని స్థితికాదన్నట్లు కనిపించింది.

కాని నిజంగా సంక్షోభ ప్రమాదం తొలగినదా? 1929 సంక్షోభానికి, తర్వాత దాని కొనసాగింపునకు కారణమైన అంశాలన్నీ కేవలం యుద్ధం మూలంగానే అమెరికా ఆర్థిక, రాజకీయ జీవితం నుండి తొలగింపబడినవా?

తన పాతయంత్రాలతోను, కొత్తయంత్రాలతోను ఉత్పత్తి అయిన వస్తువులకు తగినమార్కెట్టు యుద్ధకాలంలో దొరకడమంతకష్టంకాలేదు. ఆయుధోత్పత్తి బ్రహ్మాండంగా పెరగడంవల్ల, అత్యుత్పత్తికి ఆస్కారమే లేదు. కావలసినంత ఉత్పత్తి చేయడమే మహాగొప్ప అయినది.

"1944 లో అమెరికా ప్రపంచం మందుగుండు సామాను ఉత్పత్తిలో, 2/5 వంతు ఉత్పత్తిచేసింది. అంటే తన మిత్ర రాజ్యాలన్నీకలిసి, లేదా తన శత్రురాజ్యా లన్నీకలిసి ఉత్పత్తి చేసినంత కంటె 50% ఎక్కువ" *

1944 లో అమెరికా యుద్ధోత్పత్తి, జర్మనీ రష్యా జపానుల మష్టి ఉత్పత్తికంటె ఎక్కువ. ఇంత బ్రహ్మాండమైన ఉత్పత్తికి తగిన మార్కెట్టును యుద్ధావసరాలు కల్పించినవి.

కాని యుద్ధానంతరం, యుద్ధోత్పత్తి బాగా తగ్గింది. మిలిటరీఖర్చు 10,11 మిలియన్ డాలర్లకు తగ్గిపోయింది. మరి యీ లోటును భర్తీ చేసినదేమిటి ?

రెండో యుద్ధసమయంలో నేర్చుకున్న "ప్లానింగు"ను శాంతి సమయంలో అనువర్తించడం వల్ల సంక్షోభం ఆటంకపరుపబడినదా ? రెండో యుద్ధకాలంలో మొదటి యుద్ధంలోకంటె ఎక్కువగా ప్రభుత్వం ఆర్థికజీవితంలో జోక్యం తీసుకున్నది. ఇందుకు కారణం మొదటి యుద్ధంలో అమెరికా ఒక్క సంవత్సరమే పాల్గొన్నది. మరిరెండో యుద్ధంలో సైనికరంగం బ్రహ్మాండంగా పెరిగింది. ఇందులో అమెరికా మూడున్నరేళ్లు పాల్గొన్నది. ఆయుధోత్పత్తి, అందుతోపాటు జనావసర వస్తువులను యథాప్రకారం ఉత్పత్తి చేయవలసి రావడం—వీనికోసం ఉత్పత్తి, ముడిసరుకులు, జీతాలు, ధరలు, విదేశవర్తకం మొదలయిన వానిని అదుపులో ఉంచుకునేందుకొక శాఖనేర్పరిచింది. కాని యుద్ధం ముగియగనే కంట్రోళ్లు తొలగినవి.

---

* "రెండవయుద్ధంలో ఆయుధోత్పత్తి" మిలిటరీ అఫెయిర్సు సంపుటిX, 1946 వసంతం నెంబరు 1, పుట-70.

కాబట్టి ఉత్పత్తి అత్యున్నత స్థాయిలోనుంచి, నిరుద్యోగాన్ని తక్కువస్థాయిలో ఉంచేందుకు కంట్రోళ్లు కారణం కాదు.

మరి యీ సమృద్ధికి కారణమేమిటి? మొదటి యుద్ధానంతర స్థితికంటె నేటిస్థితి భిన్నంగా ఉండేందుకు కారణాలేమిటి?

## అమెరికా అస్థిర సమృద్ధి

మొదటి యుద్ధం ముగిశాక అమెరికా ఆర్థికవ్యవస్థ శాంతికాలపు ఆర్థికవ్యవస్థగా మారినది.

మరిరెండో యుద్ధం తర్వాత 1945-49 కాలంలో, అమెరికా యుద్ధ ఆర్థికవ్యవస్థ యుద్ధవిరమణ (ట్రూస్) ఆర్థికవ్యవస్థగా మాత్రమే మారినది. ఇందులో 1947 దాకా ఉన్న పూర్వభాగంలో ఆయుధోత్పత్తి, మార్షల్ ప్లానుల అంగీకారం జరిగింది. రెండవభాగంలో తిరిగి ఆయుధోత్పత్తి ప్రధానంగా పరిణమించింది.

## కొత్త మార్కెట్టులు

మొదటిభాగంలో ఈ క్రింది అంశాలు మిలిటరీ ఉత్పత్తి తగ్గినందువల్ల ఏర్పడినఖాళీని భర్తీచేసినవి,

1. యుద్ధంలో వీలుకాని పెట్టుబడులను అత్యధికంగా వర్తకులు పెట్టారు. మామూలు సంవత్సరంలోకంటె ఇదిచాల యెక్కువ.

2, ఎగుమతులకు కావలసినంత అవకాశం ఉండినది. వీనిద్రవ్య విషయంలోమటుకు మాత్రమే మార్షల్ ప్లాను వచ్చేదాకా ఏ హామీలేదు.

3. యుద్ధంలో సంపాదించిన ఆదాయానికి తగినట్టి నిత్యోపయోగ వస్తువులను పౌరులు కొనలేక డబ్బుదాచారు. ఆ డబ్బువల్ల ఈకాలంలో వారి కొనుగోలుశక్తి హెచ్చింది.

ఈ మూడింటివల్లా కొత్తమార్కెట్టు లేర్పడినవి. కాని ఇవి కొంతకాలమే ఉండగలవని 47-48 కి తేలిపోయింది. కాబట్టి తిరిగీ 1920-40 ల మధ్యకాలంలోవలె, ఉత్పత్తికీ వినియోగానికి మధ్య అఖాతం ఏర్పడే ప్రమాదం వచ్చింది.

ఈ మూడింటిని ఒక్కొక్కటిగా పరిశీలింతాము.

పెట్టుబడి పెరుగుదల

యుద్ధపూర్వకాలపు దృష్టితోచూస్తే, 1947లో పెట్టుబడి బ్రహ్మాండంగా పెరిగిపోయినది. అధ్యక్షుని ఆర్థిక నివేదికలనుబట్టి ఇలా తెలుస్తున్నది: *

"యంత్రాలకు, పరికరాలకు, కొత్తగా కనిపెట్టినవానికిగా అయిన వ్యాపార ఖర్చు 1947లో 25 బిలియన్-డాలర్లు. 1946లో ఇది 21బిలియన్లు మాత్రమే....కొత్తపరికరాలకైన ఖర్చు1947లో 1946లో కంటె 40% ఎక్కువ. ఇందులో మూడోవంతు అధిక ధరలకు చెందినది. ఉత్పాదక యంత్రాలకు చెందిన యీ అధిక వ్యయం ఆర్థికవ్యవస్థకు ప్రోద్బలమిచ్చింది. ఈ యంత్రాల ఫాక్టరీల స్థాపన అన్నిశాఖలలోను ఎక్కువేకాని, ముఖ్యంగా నిత్యోపయోగ వస్తువులకు, రవాణాసౌకర్యాలకు, బట్టలకు-చెందిన శాఖలలో చాల ఎక్కువ. యుద్ధసమయంలో ఈ శాఖలలో, తగినంత ఆధునికాభివృద్ధి కన్పించలేదు."

ఈ ఆధిక్యత నిలాగే ఉంచగలమా అన్నదే విషమప్రశ్న. అది సందేహమేనని చెప్పితీరాలి. 1948 లో పెట్టుబడి హెచ్చుస్థాయిలోనే

* అధ్యక్షుని ఆర్థికనివేదికలు. పుట-22.

ఉంది. కాని 1948 పూర్వార్ధంలో మిలిటరీఖర్చు పెరుగుదల స్పష్టంగా కనబడసాగింది. పెట్టుబడి పెరుగుదల, మిలిటరీ ఖర్చు పెరుగుదలపై ఆధారపడినదని బయటపడినది.

ఎగుమతుల నిలువలు

మరొక అంశం, అమెరికా వ్యాపారంలో అనుకూలమైన నిలువలు. "1947 మొత్తంమీద వస్తువుల ఎగుమతీ, పనివారిఎగుమతీ, దిగుమతుల కంటె 11 బిలియన్ డాలర్లు ఎక్కువగా నున్నది. 1946లో ఇది 1.8 బిలియన్లుమాత్రమే."*

దీనినితెలిపే గ్రాపు క్రింద ఇస్తున్నాము.

వస్తు—శ్రమల ఎగుమతి దిగుమతులు




* అదే పుట-22.

ఇంత బ్రహ్మాండమైన ఎగుమతి నిలువలకు ధనం ఎక్కడనుంచి వచ్చింది ? కొంత అమెరికాప్రభుత్వ సహాయంవల్లను, మరికొంత దిగుమతిచేసే దేశాలకు అమెరికాలోఉన్న బంగారు, డాలరు నిలువలను జమకట్టుకోవడంద్వారాను ఈ డబ్బు వచ్చినది.

1947లో దాదాపు నెలకు బిలియన్ డాలర్లదాకా పెరిగిన ఎగుమతి నిలువలకు ద్రవ్యవిషయంలో స్థిరమైన ఏర్పాటులేదు. ఈయేడు విదేశాలు తమ బంగారు నిలవల్లో 4.4 బిలియన్‌డాలర్లు త్రోసివేసుకున్నారు. అంటే ఇది మార్షల్‌ప్లానులో తమకు ఏడాదికివచ్చే మొత్తంఅన్నమాట. కాబట్టి ఈనిల్వలు 1948 మొదటిభాగంలోని "8 బిలియన్ డాలర్లకు, 1946 తర్వాత అతి హీనస్థాయికి దిగిపోయినవి."

ఈ స్థితిమూలంగా ఈమార్కెట్టు తిరిగీ ఎంతమాత్రం భవిష్యత్తులో విస్తరింపవీలున్నదనే సంగతిని ఊహించవచ్చును.

నోట్లముమ్మరం

యుద్ధకాలంలో ఉత్పత్తి అధికంగా పెరిగినది. నిరుద్యోగం తొలగింపబడినది. పనిలో ఉన్నవారి ఆదాయం చెప్పుకోదగినంత పెరిగినది. ఉత్పత్తితోపాటు వినియోగించుకునేవారి ఆదాయం పెరిగినది. కాని వారిఖర్చు పెరగలేదు. యుద్ధావసర వస్తూత్పత్తి పెరిగి, పౌరులకు కావలసిన వస్తువుల ఉత్పత్తి—వారి ఆదాయానికి తగినంత పెరగలేదు. రేషనింగు, కంట్రోలు ధరలను విపరీతంగా పెరక్కుండా అరికట్టినవి. డాలరు నెమ్మదిగా మాత్రమే విలువను కోల్పోతున్నది. ఇందుమూలంగా పౌరుల ఆదాయంలో కొంతభాగం నిల్వచేయబడుతూ వచ్చింది.

యుద్ధం ముగియగనే ఉత్పత్తి బాగాతగ్గింది. 1946 లో అతిహీన స్థితికి వచ్చింది. అప్పటినుంచీ ఏ కొద్దిగానో పెరుగుతూ అదేస్థితిలోనే ఉంది.

## టోకు ధరలు — వస్తూత్పత్తి




## ఉపభోగ్యవస్తువుల ధరలు



కంట్రోళ్లు వగైరాలు పోయాక, వస్తువుల ధరలన్నీ బాగా హెచ్చాయి. ఉత్పత్తి పెరక్కుండా ధరల పెరుగుదలను ఎడమప్రక్కని చార్టు చూపుతుంది. (324 పేజీ)

ఈ ధరలతోపాటు పౌరావసర వస్తువుల ధరలుకూడ పెరిగాయి—దానిని రెండవచార్టు చూపుతున్నది (324) ధరలు యుద్ధకాలంలో నెమ్మదిగా పెరుగుతూరాగా, ఆ తర్వాత 1946 మొదట్లో గబాలున పెరగడం కనిపిస్తుంది.

ఈ నోట్లముమ్మరం ఆర్థిక వ్యవస్థనంతటిని కలచి పారవేయ గలదిగా తయారయినది. కారణం ఇందువల్ల ప్రజల్లో అన్నివర్గాలూ బాధపడరు. పౌరవస్తువుల ధరలెలా పెరిగాయో అలాగే అన్నివర్గాలవారి ఆదాయాలూ ఈ కాలంలో పెరగలేదు. పైగా దీనిఫలితం—ధనవంతులు మరింత ధనవంతులు కావడం, పేదలు మరింత నిరుపేదలు కావడం మాత్రమే.

మన కిక్కడ ఈ విషయం ఎంతవరకు పనికి వస్తుందంటే, నోట్లముమ్మరంవల్ల త్వరలోనే నిత్యోపయోగ వస్తువులమార్కెట్టు పడిపో గలదు అన్నది గ్రహించేందుకు మాత్రమే. ఎందుకంటే నోట్లముమ్మరం మూలంగా

1. నిజమైన జీతాలు తగ్గుతాయి.
2. యుద్ధకాలంలో దాచుకున్న డబ్బు ఖర్చవుతుంది.

నిజమైన ఆదాయం తగ్గుతుందనే విషయంలో అధ్యక్షుని ఆర్థిక నివేదికలలో ఇలా ఉన్నది:

"సగటున ఖర్చుపెట్టగల ఆదాయం—నేటి డాలర్ల లెక్కలో—1946 నుండి క్రమంగా పెరుగుతూ వచ్చింది. ఆరంభంలో 1,074

నుండి ఆఖరుకు 1264 డాలర్లు పెరిగింది. అంటే నూటికి 18 వంతులు పెరిగినది. అయినప్పటికి అసలు కొనుగోలుశక్తి దాదాపు నూటికి 8 వంతులు ఈ కాలంలో తగ్గిపోయినది" (పెద్ద అక్షరాలు నావి)

"....మధ్యరకం, తక్కువరకం నిఖరమైన ఆదాయాలుగల వారికిది చాలనష్టం కలిగించింది." *

ధరల పెరుగుదలతోపాటు కొన్ని శాఖలలోని కార్మికులు జీతాలను పెంచుకోగలిగారు. కాని "చాలమంది జీతాలు బాగా పెరిగినట్టు కన్పించినప్పటికి, ఈ యుద్ధానంతరం పెంపకాలలో చేరని లక్షలాది కార్మికుల ఆదాయాలు, తమజీవిత ప్రమాణం పెరగడంవల్ల నిజస్థితిలో బాగా తగ్గిపొయ్యాయి." •

అసలు ఆదాయాలెంతవరకు తగ్గాయి?

"జీతాలు పుచ్చుకునేవారందరి అసలు ఆదాయాలు 1946 నుండి నూటికి పదిపాళ్లు తగ్గిపోయినవి." †

అయితే ఈ తరుగుదల అందరికీ సమానం కాదు. గుమాస్తాలు-వృత్తి కార్మికులు వగైరాలు ఇతరులకంటె చాల దెబ్బతిన్నారు. "ఇదే కాలంలో ఈ వర్గం ఆదాయం 15% తగ్గిపోయింది." * *

---

* అధ్యక్షుని ఆర్థిక నివేదికలు పుటలు 2, 17.

• అర్ధసంవత్సర ఆర్థిక నివేదిక, పుట 34.

† నోర్సమ్మర్రం: ప్రమాదాలు. నివారణలు—లియో హెచ్. కేసర్లింగు ఆర్థిక సలహా సమితి ఉపాధ్యక్షుడు—వాషింగ్టన్ 1948, పుట, 347.

* * అదే—పుట 337.

జీతాలు తెచ్చుకునేవారి ఆదాయంలో 10% తరుగుదలే చాలు; మన ఆర్థిక వ్యవస్థనంతటిని ఇది కలతపరచగలదు.

అవసర వస్తువుల అమ్మకం పడిపోలేదంటే కారణం, ఆదాయం తక్కువ కావడంతోపాటు, ఆవస్తువులకై పెట్టే ఖర్చులింకా తక్కువ కాకపోవడమే. ఇందుకుమూలం యుద్ధకాలంలో సంపాదించిన ఆదాయాలను ఖర్చు పెడుతూండడం.

ఈ డబ్బు చాల యెక్కువనిలవ ఉన్నందువల్ల, అసలు ఆదాయాలు తగ్గడంవల్ల ఏర్పడిన లోటునది, చాలకాలందాకా భర్తీచేయగలదన్నట్టు కనిపించవచ్చును. కాని ఇది నిజంకాదు. నోట్లముమ్మరంవల్ల తమ అసలు ఆదాయం తక్కువైపోయి, బాధపడుతున్న పేదవారికి యుద్ధంలో దాచిన డబ్బు చాలతక్కువ. ఆ ఉన్నదానిలో చాలభాగం అప్పుడే ఖర్చయిపోయినది. లియోన్ కేసర్లింగు ప్రకటనలో ఇలాఉన్నది; "1946 లో నోట్లముమ్మరం ఆరంభమైనప్పుడు....తక్కువ ఆదాయం, ఒకవిధమైన ఆదాయంకల కుటుంబాలు, పందెంవేసుకుని ధరలు పరుగెడుతుండగా వానినందుకోలేక ఓడిపోయినవి...."*

2,000డాలర్లకు తక్కువ అదాయంగల కుటుంబాలలో, నాలుగోవంతుకు అసలాదాయం బాగా పడిపోయింది. ఇందులో 40% కుటుంబాలు ధరల పెరుగుదలతో బాగా దెబ్బతిన్నవి. వీరి ఆదాయం తగ్గడమూ, అందుతోపాటు ఈనోట్లముమ్మరం దెబ్బకు తట్టుకునేతాహతు వారి కేమాత్రం లేకపోవడమూ ఇందుకు కారణం.

"సంతృప్తికరమైన స్థాయిలో బతక వీలులేకపోవడం, ఇందుతోపాటు మరింత అప్పుల్లో మునిగిపోవడం—ఈ భౌతిక, మాన

* అదే—పుట 315-316.

సిక సమస్యలతో వారు తన్నుకుంటున్నారు. 1947లో 1000 డాలర్ల ఆదాయంకల కుటుంబాలలో నూటికి 57 వంతులున్నూ, 1000—2000 డాలర్లమధ్య ఆదాయంకల కుటుంబాలల్లో నూటికి 41 వంతులున్నూ తాము సంపాదించుకున్నదానికంటె ఎక్కువ ఖర్చుపెట్టారు—లేదా దివాలా తీశారు."

ఏతత్ ఫలితంగా, యుద్ధంలో దాచిన ఆదాయం చెప్పుకోదగినంత గల కుటుంబాల సంఖ్య తగ్గిపోతూ వచ్చింది. అర్ధసంవత్సర నివేదికలో ఇలాఉన్నది: "1947—48ల మధ్య ఏమాత్రం వెనకవేసుకున్న డబ్బూలేని వారిసంఖ్య నూటికి 24—27లదాకా పెరిగింది. బొత్తిగా నిలవలేనివారూ, లేదా 200 డాలర్లకంటె తక్కువఉన్నవారూ దామాషాన 38—42 దాకా ఎక్కువయ్యారు. 1948 ప్రారంభంలో 500 డాలర్లునిల్వలేని ఖర్చు దారుల సంఖ్య 55%కు హెచ్చింది.

ఇంతకూ సారాంశం. 1948 నాటికి సగానికిపైగా అమెరికా కుటుంబాలవారు నిల్వడబ్బును పూర్తిగనో, దాదాపు పూర్తిగనో ఉపయోగించి వేసుకున్నారు. ఆ డబ్బున్నన్నినాళ్లూ తమ అసలు ఆదాయం పడిపోయినప్పటికీ, తమ వస్తువినియోగ స్థాయి నలాగా ఉంచుకుంటూ వచ్చారు.

పౌరుల పరపతినిపెంచి పైఖాళీని భర్తీచేయాలన్న ప్రయత్నం జరిగింది. "పౌరుల పరపతి క్రమంగా పెరగడంవల్ల వారి కొనుగోలుశక్తి హెచ్చింది. ఈ పరపతి 1947 ఆఖరుకు 11,3 బిలియన్ డాలర్లు — అంటే—ఇది 1946 ఆఖరున ఉన్న దానికంటె 31 బిలియన్ డాలర్లు ఎక్కువ. 1941 సెప్టెంబరులో ఇది అత్యున్నత స్థాయినందుకొన్న సంఖ్యకంటె 3,2 బిలియన్ డాలర్లు ఎక్కువ." *

* అధ్యక్షుని ఆర్థిక నివేదికలు పుట, 20

క్రింద ఇచ్చినగ్రాఫులో ఈ పరపతి ఎలా పెరుగుతూ వచ్చిందో చూపబడినది.

1948 జూన్ ఆఖరుకు ఈ పరపతి 14 బిలియన్ డాలర్లకు పెరిగింది. ఈ సంఖ్య, అంతకు క్రిందటి సంవత్సరం కంటె 3 బిలియన్ డాలర్లు తక్కువ.

పౌరుల పరపతి






గతకొలది సంవత్సరాలనుండి, పౌరోపయోగ వస్తువుల మార్కెట్టులో సంక్షోభం ఏర్పడింది. జీతాలు తెచ్చుకునేవారి అసలు ఆదాయం మొత్తంమీద 10% తగ్గిపోయింది; పేదవారిస్థితి క్రమంగా అధ్వాన్నమైపోతూ వచ్చింది; యుద్ధకాలంలో వెనకవేసిన దాపుడుధనం తరిగిపోయినది. కాని ఇన్నిటికిగా కాస్త పరపతి మాత్రం హెచ్చింది. వీటన్నిటిమూలంగా మార్కెట్టులో చాల అస్థిరత ఏర్పడినది.

అధ్యక్షుని ఆర్థికనివేదిక ఈ క్రిందినిర్ణయానికి వచ్చింది: "ధరలు గబగబా పెరిగిపోవడంవల్ల పౌరుల వాస్తవమైన కొనుగోలుశక్తి తగ్గిపోయింది. దేశీయోత్పత్తిలో పౌరులు తమభాగాన్ని ఆ హెచ్చు ధరలతో కొనలేని స్థితికివచ్చారు...." *

ఆర్థికాభివృద్ధిని కేవలం దేశీయస్థితిగతులే నిర్ణయించేటట్టయితే, నోట్లముమ్మరం, అమెరికా సౌభాగ్యసంపదకు మహాప్రమాదకారి కాగలదు. ఎందుకంటే జనసామాన్యం కొనగలిగినప్పుడే వస్తువుల అమ్మకానికి వీలవుతుంది. యుద్ధకాలపు దాపుడుధనం, పరపతి వీనితో మాత్రమే వస్తువుల అమ్మకం ఎల్లకాలం సుస్థిరంగా ఉంచడం ఎన్నటికీ సాధ్యపడదు.

వస్తువుల మార్కెట్టులో కాస్త ఒడుదుడుకులేర్పడగానే, పెట్టుబడి తగ్గుతుంది—ఉత్పత్తి చేయబోయే వస్తువులు అమ్ముడుపోతాయన్న ఆశ ఉన్నప్పుడేకదా, ఎవరైనా వస్తూత్పత్తికై పెట్టుబడి పెడతారుమరి? జనం కొనుగోలుశక్తిని తగ్గించే నోట్లముమ్మరం ఒకవేపున కొనసాగుతుండగా వస్తువుల అమ్మకానికి వీలులేనిదశలో ఉత్పాదకవస్తువుల అమ్మకంకూడా తగ్గిపోగలదు.

* అదే—పుట, 21

నోట్లముమ్మరం మూలంగా పేదలు నిరుపేదలవుతారని, లక్షాధికారులు కోటీశ్వరులవుతారనీ చెప్పాము. పేదల అసలు ఆదాయాలు తగ్గిపోతాయి-దాచుకున్నదంతా అయిపోతుంది. కార్పొరేషన్ల ధనమేమో క్రమంగా పెరుగుతూ వస్తుంది. పన్నులు వేయకముందూ, వేశాకా కార్పొరేషన్ల ఆదాయాలను తెలియజేసే గ్రాఫు నిక్కడ ఇస్తున్నాము.

కార్పొరేషన్ల లాభాలు







ఈ ఆదాయాల అసలుస్థాయీ, ఇటీవల దాని అభివృద్ధి గతీ ఈ రెండూకూడ అద్భుతంగా కనిపిస్తాయి. పూర్వం 1929సంక్షోభం క్రిందటి కంటె నేడీ కార్పొరేషన్ల ఆదాయం మొత్తం జాతీయాదాయంలో ఎక్కువ భాగం ఆక్రమిస్తున్నది. కార్పొరేట్లలాభాలు ఇన్వెంటరీ విలువల అంచనాలు 8% (1929)నుండి 12.2% (1947)కు, 12.3% (1948 పూర్వార్ధం)కు పెరిగినవి." (25) *

---

* నోట్లముమ్మరం—పుట, 328.

నోట్ల ముమ్మరంకాలంలో కార్పొరేషన్లు విపరీతంగా హెచ్చు లాభాలు తీస్తున్నాయికాబట్టి, ఈ గతిని వారేమాత్రం ఆక్షేపించడం లేదు. 1948 లో నోట్లముమ్మరం విపరీతంగా పెరిగిపోతుంటే, దాని నదుపులో పెట్టేందుకై, ఆవగింజంత ప్రయత్నమైనా ఏమీజరగలేదు; ప్రజల కొను గోలుశక్తిని పెంచి, సంక్షోభ ప్రమాదాన్ని తగ్గించే ప్రయత్నంకూడ ఏమీ జరగలేదు.

ఇందులో ఆశ్చర్యపడవలసిన దేమీలేదు. యుద్ధం ముగిసీ ముగియక ముందే ధరల కంట్రోలుతోపాటు, ప్రభుత్వపు కంట్రోళ్లన్నిటికీ స్వస్తి చెప్పించిన అభివృద్ధినిరోధకశక్తులు ఏచర్యనూ తీసుకోనీయలేదు.

ఈ విషయంలో అభివృద్ధినిరోధకులకు అంత బలమెలావచ్చింది? ఇందుకు చాల కారణాలున్నవి.

క్రిందటి ఎన్నికలకుముందు సెనేటులోను, క్రింది సభలోనుకూడ వారికి సంఖ్యాధిక్యత ఉన్నది. న్యూడీలును తిరిగీ అమలుజరపాలంటే గట్టిగా అడ్డుపడింది వీరే.

ఇంకొక ముఖ్యకారణం, యుద్ధంమూలంగా ఏర్పడిన బ్రహ్మాండ మైన గుత్త వ్యాపారసంస్థల ఆర్థికశక్తి విపరీతంగా పెరిగిపోయినది.

యుద్ధానికి పూర్వంకూడ అమెరికా గుత్తవ్యాపార సంస్థల చేతిలో అనంతాధికారా లుండినవి. అవి యుద్ధంలో మరింత హెచ్చినవి.

రెండో యుద్ధకాలంలో పారిశ్రామిక కేంద్రీకరణ వేగంగా పురోగమించింది.

రెండో ప్రపంచ యుద్ధానికి పూర్వంకూడ, మిగత అన్నిదేశాలలో కంటె ఎక్కువగా అమెరికాలో పరిశ్రమల కేంద్రీకరణ—పెరుగుతూ

వచ్చినది—చాల సంస్థలు దీనిని అతితీవ్రంగా ఖండించారు, * కాని ఆపలేకపొయ్యారు.

మొదటి యుద్ధంలోకూడ దీని వేగం హెచ్చినది. సంక్షోభ ప్రారంభంలో మటుకు దెబ్బతిన్నది. యంత్రోత్పాదక పరిశ్రమలలోనే ఈ కేంద్రీకరణ ఎక్కువ గనుకనూ, ఆ పరిశ్రమలే బాగా దెబ్బతిన్నవి గనకనూ కేంద్రీకరణ వేగం కుంటువడినది. రెండో యుద్ధ ప్రారంభంలో తిరిగీ ఇది కొనసాగింది. మరి యుద్ధపురోజులలో విపరీతంగా హెచ్చినది.

అన్ని దేశాలలోను- యుద్ధకాలంలో ఉత్పత్తి ఎక్కువభాగం కేంద్రీకృత మవుతుంది. మనుష్య బలగాన్ని పొదుపుగా వాడేందుకై, యుద్ధోత్పత్తిని ఎక్కువచేస్తే, పౌరవస్తూపయోగాన్ని సాధ్యమైనంత ఎక్కువ స్థాలోనే ఉంచుతూ ఈపని చేస్తారు.

మరి అమెరికా శత్రుదాడికి అంచు పొంచులలో లేకపోవడంవల్ల, అక్కడి పరిశ్రమ విస్తరీకరణ బ్రహ్మాండ రూపంగా కొనసాగింప బడినది. ఒక్కొక్క కర్మాగారం ఓ ప్రపంచంలా ఏర్పరచడంవల్ల వానిని విరాడ్ రూపంలోఉన్న గుత్త వ్యాపారసంస్థలే నడపగల స్థితి వచ్చినది.

యుద్ధానికి పూర్వమూ, యుద్ధం ఆరంభదశలోను ఏర్పడిన పరిస్థితి ఏమిటి?

> "1931 నుండి 1942 దాకా ఉన్న కాలంలో, 50,000,000 డాలర్ల పెట్టుబడికల పెద్ద కార్పొరేషన్లు, మొత్తం వస్తూత్పత్తి పెట్టుబడిలో ఏమాత్రం భాగంపై పెత్తనంకలవో సూచించే లెక్కలు

---

* రెండోయుద్ధంలో ఆర్థిక కేంద్రీకరణ—

అమెరికా చిన్న పరిశ్రమల విచారణ కమిటీ నివేదిక-సెనేటర్ జేమ్సు ముర్రే సమర్పించినది—1946-పుట, 1.

దొరుకుతున్నవి. ఈ కార్పొరేషన్లు పారిశ్రామికాగారాలలో బ్రహ్మ రాక్షసులలాంటివి. ఇటీవల పెట్టుబడి ఎలా కేంద్రీకృత మవుతూ వచ్చిందో ఇవి సూచించగలవు. 1942లో ఇలాంటి మహారూపంలోఉన్న కర్మాగారాలు 205 మాత్రమున్నవి. 1931లో మొత్తం పెట్టుబడిలో 46% వీని చేతిలో ఉంటూవచ్చినవి. 1934లో వీని ప్రాధాన్యం తగ్గి 37%కు తగ్గిపోయింది. 1942లో ఒక్కమాటుగా 49% కి, ఈ సంఖ్య హెచ్చినది." *

యుద్ధకాలంలో జరిగిన అభివృద్ధిని గురించి ఈ నివేదిక చెబుతున్న దేమిటంటే, ఈ విరాడ్రూప కర్మాగారాలలో కార్మికులసంఖ్య క్రమంగా హెచ్చుతున్నది. "500గురు—అంతకుపైగా పనిచేసే పెద్ద కర్మాగారాల సంఖ్య వర్తకజనాభాలో అత్యల్పమే అయినప్పటికి, వాని ఆకారమూ, బలమూ కూడ అత్యధికం కాజొచ్చినది. 1944లో అమెరికాలోని కర్మాగారా లన్నింటిలో, ఈ పెద్ద సంస్థలు కేవలం 2%మాత్రమే ఉన్నప్పటికి, మొత్తం ఫాక్టరీ పనివారిలో నూటికి 62గురు వీనిక్రిందనే పనిచేస్తున్నారు.... ఒక్కటితప్ప మిగత యుద్ధపరిశ్రమలలో 10,000 అంతకుపైన పనివారుగలసంస్థలకు ప్రాముఖ్యం ఎక్కువయినది. మొత్తం వస్తూత్పత్తిని గమనించినట్టయితే, ఈ అల్పంగాఉన్న పెద్ద సంస్థలలో పనివారి సంఖ్యమొత్తం దేశంలోని కార్మికుల సంఖ్యలో 1939లో13% మాత్రమే—ఆ సంఖ్య 1944కు పూర్తిగా నూటికి 31 కి పెరిగిపోయినది." †

ఈ విస్తారమైన కేంద్రీకరణ యుద్ధకాలమంతటా అలాగే ఉన్నది. యుద్ధంలో కొత్తగా కట్టిన పరిశ్రమల మూలంగా, యుద్ధాత్పూర్వం

---

* అదే—పుట. 6

† అదే—పుట. 26.

కంటె అనంతరం, ఈ పెద్దసంస్థలలో కేంద్రీకరణ అత్యుచ్ఛస్థాయిలో ఉండుటకు కారణమయినది. సెనేటునివేదిక సరిగా అన్నది:

"యుద్ధకాలంలో నిర్మించిన ఉత్పాదక యంత్రాల పంపకాన్ని బట్టి. యుద్ధానంతరం వాని కేంద్రీకరణ ఆధారపడి ఉంటుంది.

"1939లో ఉన్న దేశంలోని ఉత్పాదక యంత్రాల నిర్మాణానికి 4 కోట్ల డాలర్లవరకూ వెచ్చింపబడినది. 1945 జూన్ నాటికి. 25 మిలియన్ల డాలర్ల విలువగల కొత్త యంత్రాలు పరికరాలు ఇందుతోపాటు చేరినవి. ఇందులో ఇంచుమించు 26 బిలియన్ డాలర్ల యంత్రసామగ్రి ఫెడరల్ నిధినుండి ప్రత్యక్షంగా తీసుకోబడినది. మిగత మూడవభాగం వ్యక్తిగతమైన పెట్టుబడి ద్వారా సమకూర్చబడినది.

"ఈ విస్తరీకరణ కార్యప్రణాళిక బ్రహ్మాండమైనది మాత్రమే కాక, ఈ కొత్త యంత్రసామగ్రికూడ సాధారణంగా అత్యుత్తమమైనది. ఈ 26,000,000.000 డాలర్ల యుద్ధకాల యంత్రాలలో 20,000,000,000 డాలర్ల యంత్రాలు ఉన్నపున్నట్టుగనేగాని, ఏ కొద్ది చిన్నమార్పులతోగాని శాంతికాలపు ఉత్పత్తికి మార్చివేయ వీలున్నదని ఈ నివేదిక అంచనా వేస్తున్నది....యుద్ధానంతరం శాంతికాలపు ఉత్పత్తి అవకాశాల విలువను చెప్పాలంటే, పై మొత్తంతోపాటు 1939 నాటికున్న మొత్తం పెట్టుబడి 40.000, 000,000 డాలర్లతో చేర్చాలి. అంటే మొత్తం యుద్ధానంతర్గం ఉపయోగించగల యంత్రసామగ్రి విలువ 60 బిలియన్ల డాలర్లన్న మాట. మొదటచెప్పిన 20బిలియన్ల డాలర్లలో వ్యక్తిగత పెట్టుబడి 8.5 బిలియన్లు, ప్రభుత్వం పెట్టుబడి 11.5 బిలియన్లుగా లెక్కించవచ్చును."

యుద్ధకాలంలోను. తర్వాతను ఈ కొత్త ఫాక్టరీలలో అత్యధికం ఎవరి కంట్రోలులోనున్నవి అనే ప్రశ్న వస్తున్నది. దీనికి సమాధానం ఆ నివేదికలోనే ఉన్నది:

"ఈ యంత్రసామగ్రి నెవరు కంట్రోలు చేస్తున్నారు; పెద్ద పెట్టుబడిదారులచేతిలో ఏమాత్రంఉన్నది. చిన్న షావుకార్లచేతులో ఎంతఉన్నది? దేశంలోని 250పెద్ద కార్పొరేషన్ల స్వత్వంపరిశీలిస్తే దీనికి సమాధానం దొరుకుతుంది. ఆ 250 పెద్ద ఉత్పాదక కార్పొరేషన్లలో 31 టిని అయిదు బాంకుగ్రూపులు చేతపట్టుకొని ఉన్నవి."

"ఈ 250 పెద్ద కార్పొరేషన్లూ చాలవరకు అమెరికా పరిశ్రమల్లో విరాడ్రూపమైన పరంపరాగత సంస్థలు............1939లో దేశీయోత్పత్తి యంత్రాలలో నూటికి 65పాళ్లు మొత్తం వీనిచేతిలోనున్నవి: వ్యక్తులు నడిపే కొత్త యుద్ధయంత్రాలలో నూటికి 79. వీనిని కేంద్రప్రభుత్వ నిధితోనే నిర్మించారు—ప్రధానమైన యుద్ధ వస్తువుల సరపరాలన్నిటిని చేస్తున్నవి. 1944 సెప్టెంబరు నాటికి నూటికి 78 యుద్ధసరఫరా కాంట్రాక్టులు వీనిచేతిలోనేఉన్నవి."

ఈ అంశం ప్రధానతను మరీ నొక్కిచెప్పవలసిన అవసరం లేదు.

రెండో యుద్ధసమయంలో ఇంత బ్రహ్మాండంగా వస్తూత్పత్తిని పెంచిన దేశం ప్రపంచంలోకల్లా ఒక్క అమెరికాయే. 1939 నాటికంటె 1947నాటికి 53% ఎక్కువవస్తువులను ఉత్పత్తి చేయగలిగినది. నిరుద్యోగ నిర్మూలనం కొంతవరకు దీనికి కారణమైనా, ప్రధాన కారణం యుద్ధసమయంలో అభూతపూర్వంగా నిర్మించిన కొత్త యంత్రాలే.

ఈ ఫాక్టరీలలో ఎక్కువభాగం మొదటనే విరాట్రూపంతో నిర్మిత మైనవి. కాబట్టి అమెరికా ఆర్థికవ్యవస్థలో ఎక్కువభాగం పెద్ద కార్పొరేషన్ల చేతిలోనే ఉన్నది.

యుద్ధానికి పూర్వం మొత్తం అమెరికా ఫాక్టరీలన్నీ ఉత్పత్తి చేసిన మొత్తం వస్తువులను, నేడీ పెద్ద కార్పొరేషన్లు మాత్రమే ఉత్పత్తి చేయగలుగుతున్నవి.

ఇదింతతో ఆగిపోలేదు.

## విలీనీకరణోద్యమం

యుద్ధం ముగియగనే ఈ పెద్ద కార్పొరేషన్లు, యుద్ధంలో తాము సంపాదించుకున్న ఆర్థికాధికారాన్ని విశాలపరుచుకునేందుకు, స్థిరపరుచుకునేందుకు కృషిచేశాయి. చాలవరకు కృతార్థత చెందినవికూడ. చిన్న చిన్న కార్పొరేషన్ల నెన్నిటినో తమలో విలీనం చేసుకున్నవి. కొన్నిటిని కొనివేసినవి. ఫెడరల్ ట్రేడ్ కమిషన్ రిపోర్టులో ఇలాఉన్నది:*

"విలీనీకరణం, స్వాధీనీకరణాలద్వారా 1940 నుండీ, పూర్వం స్వతంత్రంగాఉన్న వస్తూత్పాదక-గని పరిశ్రమ సంస్థల్లో 1800కు పైగా మాయమయినవి. ఇలా కలిపివేసుకోబడిన సంస్థల విలువ ఇప్పటికే 4.1 బిలియన్ డాలర్లదాకా ఉన్నది. అంటే 1943లో ఉన్న అన్ని కార్పొరేషన్ల మొత్తం విలువలో 5% అన్నమాట. దీనివల్ల ఆర్థిక వ్యవస్థలో గమనించదగిన మార్పువచ్చినది, 1943 వరకే మనకీ విషయాలలో లెక్కలు దొరుకుతున్నవి. విజయానంతరం ఈ విలీనీకరణోద్యమం బాహాటంగా సాగుతున్నది....

* ఫెడరల్ ట్రేడ్ కమిషన్ రిపోర్టు – (1947) పు 6

యుద్ధకాలంలో చిన్న సంస్థలను తమలో కలుపుకొనేందుకు పెద్ద కార్పొరేషన్లొట్టే ఆసక్తి చూపలేదు. అందువల్ల లాభం తక్కువ. యుద్ధావసర వస్తూత్పత్తికి కావలసిన నూతన పరికరాలను సామాన్యంగా ప్రభుత్వమే సరఫరా చేసేది. కాని విజయం కనుమాపు మేరలోనికిరాగానే, తిరిగీ పెత్తనం, పోటీలు తలసూపుతాయనగానే ఈ విలీనీకరణ, స్వాధీనీకరణలు ఆరంభమైనవి. యుద్ధానంతరం పెద్ద కార్పొరేషన్లకు కావలసినంత యంత్రరూపంలో లేని ధనమున్నది. దానినిఈ విలీనీకరణకు బాగా ఉపయోగించ వీలైనది.... 1945 నాటికి 62పెద్ద కార్పొరేషన్ల చేతిలోను, యంత్రరూపంలో లేకుండా ఉపయోగించ వీలైన ధనం 8.4 బిలియన్ డాలర్లవరకూ ఉన్నది. ఇది దాదాపు నగదురూపంలో నున్నది. ఈ మొత్తం, అమెరికాలో నున్న ఇతర వస్తూత్పాదక యంత్రాగారాలలో నూటికి 90 ని కొనివేసేందుకు సరిపడుతుంది."

ఇలా చిన్నవానిని కలిపి వేసుకోవడంతో, పెద్ద కార్పొరేషన్లు 1948 పొడవునా మరింత పెరుగుతూవచ్చినవి. ఇలా మాయమైపోయిన సంస్థల సంఖ్య 2,450 దాకా ఉన్నదని ఫెడరల్ ట్రేడ్‌కమిషన్ రిపోర్టు తెలుపుతున్నది. వీని ఆస్తి 5.2 బిలియన్ డాలర్లు. ఈ నష్టం పెద్ద కార్పొరేషన్లకు లాభమన్నమాట. *

ఇలా పెరిగిపోతూ వచ్చిన గుత్తవ్యాపారసంస్థలు యుద్ధానంతరం కూడ మరీ పెరగ సాగినవి. ఇందుమూలంగా పోటీ అనేదే నిర్మూలనమయ్యేలా కనిపింపచేస్తున్నదని ఆకమిషన్ రిపోర్టుతెలుపుతున్నది, †

---

* అదే—సంగ్రహం—పుట 5

† అదే—పుట 23

మెరికావారు స్వేచ్ఛావ్యాపారం, పోటీ అనే సిద్ధాంతాలు చెప్పేవారు. ౦రి ఇది ఆ సిద్ధాంతాలనే సవాలుచేస్తున్నది అని కూడ కమిషన్ రిపోర్టు ంటున్నది.

ఇలా ఒక వేపేమో పారిశ్రామిక పెత్తనం, విపరీతంగా కేంద్రీ ృత మవుతున్నది. లాభాలు ఆకాశ మంటుతున్నవి; మరొకవేపు నోట్ల ముమ్మరం వ్యాపిస్తున్నది—జీతాలు తీసేవారి అసలు జీతాలు తగ్గిపోతు న్నవి. జనాభాలో అత్యధిక సంఖ్యాకుల. యుద్ధాదాయపు దాపుడుధనం ాదాపు పూర్తిగా ఖర్చయిపోయినది—ఇదీ యుద్ధానంతరం జమా ఖర్చు పట్టీ. ఈ స్వదేశీయ పరిణామాలనే గమనించినట్టయితే అమెరికా ఆర్థిక వ్యవస్థ బాగా కదిలిపోయిన దన్నమాటే—సంక్షోభానికి దారితీస్తున్న దన్నమాటే.

కాని ఒక్క స్వదేశీయ పరిణామాలే ఇక నిర్ణాయకాలు కాలేవు.

## నేడు అమెరికా ఆర్థిక భవిష్యత్తుకు కీలకం - అంతర్జాతీయ పరిస్థితే

1948—49లోని అమెరికా పరిస్థితి, 1929 సంక్షోభానికి వెనుకటి హూవర్ కాలంతో పోల్చవీలున్నది.

ఈ పోలికలన్నీ దేశీయ ఆర్థిక స్థితికిమాత్రమే సంబంధించినవి. ఇవిమాత్రమే నిర్ణాయకము లయ్యేట్టయితే, సంక్షోభకారకశక్తుల పరిగణన మంత కష్టమయ్యేదికాదు.

కాని, ప్రస్తుతపరిస్థితిలో కేవలం దేశీయ పరిస్థితులకే పరిమితమైన వివరణం చాలదు. పూర్వమెన్నడూ లేనంతగా అమెరికా వ్యవస్థపై నేడు అంతర్జాతీయ పరిస్థితుల పలుకుబడి కనబడుతున్నది.

నేటి అమెరికా ఆర్థిక ధోరణిని పూర్వపు ధోరణులతో పోల్చి జోస్యం చెప్పడం, పొరబాటు నిర్ణయాలకు దారితీయక తప్పదు. ఆంతరంగిక ఆర్థికవ్యవస్థకూడ ఇరవైయేళ్ల తర్వాత అలాగే ఉండడం సంభవ కాదన్న దలాఉంచి, ప్రపంచంలో ఆమెరికాస్థితి అతి ప్రముఖమైన మార్పులకుకూడ లోనయినది.

సూక్ష్మంగా పరిశీలించకున్నా ఈ మార్పు స్పష్టంగా కనిపిస్తుంది 1929 సంక్షోభం శాంతి సమయంలో వచ్చినది. హూవర్ అధ్యక్షుడుగ ఉన్నకాలంలో ప్రపంచం శాంతంగా ఉన్నది. రూజ్వెల్టు అధ్యక్షుడయినప్పుడూ ప్రపంచంలో శాంతి ఉన్నది. యుద్ధం వస్తుందన్న మాట కూడ అప్పట్లో లేదు.

మొదటి యుద్ధంతర్వాత బాగా తగ్గించివేయబడిన మిలిటరీ బడ్జెటు 1929 సంక్షోభం వచ్చేప్పటికి మరీ అత్యల్పంగా ఉన్నది. దేశరక్షణ వ్యయం, ఏడువందల మిలియన్ డాలర్లకంటె కూడ తక్కువగానున్నది. హూవర్ కాలంలోను, రూజ్వెల్టు వచ్చేప్పటికీ ఈ ఖర్చు అమెరికా జాతీయాదాయంలో కేవలం 1%మాత్రమే ఉన్నది. కాబట్టి సంక్షోభ నివారణ ప్రయత్నాలకూ, మిలిటరీ ఖర్చుకూ సంబంధమేలేదు.

1920—29ల మధ్య అమెరికా ఎగుమతులు హెచ్చాయి. అమెరికా, పెట్టుబడినికూడ ఎగుమతిచేసినది. ఈ విషయంలో వచ్చినమార్పు పెద్దది. మొదటి ప్రపంచ యుద్ధానికీ 1929కీ మధ్యకాలంలో, ఇతర దేశాలు ఎగుమతిచేసిన పెట్టుబడి మొత్తమెంతో అంతా ఒక్క అమెరికాయే ఎగుమతి చేసింది.*

---

* ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో అమెరికా ఆర్థికమాల, నెం 23, అమెరికా వాణిజ్యశాఖ, 1943, పుట 3.

ఉత్పత్తిశక్తీ, ఉత్పత్తీ లెక్కవేసి వానితోపోలిస్తే వస్తువుల ఎగుమతీ, పెట్టుబడి ఎగుమతీకూడ చాలతక్కువ. ప్రపంచ ఆర్థిక సంక్షోభానికిముందు పెట్టుబడి ఎగుమతులూ, విదేశవాణిజ్యం నిలవలూ కేవలం ఏటా ఒక బిలియన్ డాలర్లకంటె మించవు.

ఇలా సైన్యంఖర్చూ, పెట్టుబడి ఎగుమతులూ కలిసి ఒకటిన్నర బిలియన్ డాలర్లకు మించలేదు. సంక్షోభసమయంలో మొత్తం జాతీయోత్పత్తి 103.8 బిలియన్లనుండి (1929లో), 1933 నాటికి 55.8 బిలియన్లకు తగ్గిపోయిందంటే, పై ఎగుమతులు అమెరికావ్యవస్థపై ఏమాత్రం ప్రాభవాన్ని చూపలేకపోయా యన్నది స్పష్ట మవుతుంది.

ఇది హూవర్ కాలంలోనూ, రూజ్వెల్టు కాలంలోనూ కూడ వాస్తవమైనది.

వాణిజ్య విస్తరణద్వారాను, మిలిటరీ ఖర్చును పెంచడంద్వారాను సంక్షోభాన్నెదుర్కొనాలన్న ఆలోచనే అప్పు డెవరికీ తట్టిఉండదు.

కాని ఈమధ్య పై అంశాలలో ప్రధానమైన మార్పులు వచ్చాయి. ప్రపంచ పరిస్థితి పూర్తిగా మారినది.

ప్రపంచంలో అమెరికా స్థితికూడ మారినది. అమెరికాకు బయట నున్న ప్రపంచమంతా నేడు గొప్పమార్పులకు లోనైనది. తీవ్ర సంక్షోభంతో అటమటిస్తున్నది. అమెరికావిడిస్తే ఒక్క సోవియట్ యూనియనే నేడు సంక్షోభాన్ని తను ఉపయోగించుకోవాలని ప్రయత్నిస్తున్నది.

మొదటియుద్ధం తర్వాతను, సంక్షోభ కాలంలోను ప్రపంచంలో మార్పు లప్పటికే వస్తున్నమాట నిజమే. కాని, అప్పటికి అమెరికా ఔన్నత్యం చాల తక్కువ.

నేటి పరిస్థితివేరు. నేటి మార్పు ఎంత తీవ్రమైనవంటే యూరోప్‌లోని అధికార తారతమ్యమేకాదు, ప్రపంచంలోని అధికార తారతమ్యమే దీనితో బాగా మారిపోగలదు.

కాబట్టి నేటిమార్పు అమెరికాకు చాల ముఖ్యమైనది, అందువల్లనే యూరోపు, ఆసియాల నలముకున్న సంక్షోభంలో అమెరికా ప్రతి రంగంలోనూ కల్పించుకున్నది.

ఈ జోక్యం పెట్టుబడి, ముడిసరుకులు, మెషీన్లు, ఆహారం—మొదలైనవాని ఎగుమతులరూపంలో కనిపిస్తుంది. అంతేకాక రాజకీయ, సైనికతంత్ర రూపాలనుకూడ ఇది వహించినది.

మన సైనిక—జోక్యం ఎంతవరకూ పోయిందంటే, తొట్టతొలిసారిగా, శాంతిసమయంలో అది అమెరికా ఆర్థికవ్యవస్థలోనే మార్పు తేగలిగినది.

రెండు ప్రపంచ యుద్ధాలలోనూ, యుద్ధఆర్థిక విధానం యావత్తు, ఆర్థికవ్యవస్థపై తనప్రాభవం నెరపినదన్నమాట వాస్తవమే. కాని, రెండు యుద్ధాల మధ్యకాలంలో గాని, సంక్షోభ సమయంలో కాని, సంక్షోభం తగ్గినప్పటికీ యూరపియన్ యుద్ధం ఆరంభమయ్యేప్పటికీ మధ్యనున్న సమయంలోకాని ఇలాంటి దెన్నడూ జరగలేదు.

ఇందువల్ల 1929 సంక్షోభం వచ్చేవరకు కన్పించే అంశాల వివరణంలో మిలిటరీ ఖర్చు ప్రస్తావనే మానివేయవచ్చును. కాని నేడది సాధ్యపడదు. భావిసంక్షోభ సంభావ్యతనుగూర్చి ఆలోచించే టప్పుడుకూడ ఉత్పత్తి, ధరలు, జీతాలు, లాభాలు, శాంతికాలపు మార్కెట్టులు—వీనిని మాత్రం వివరిస్తే చాలదు. మిలిటరీ ఖర్చు, విదేశాలకు చేస్తున్న సహా

యానికయ్యే ఖర్చు విపరీతంగా పెరిగిపోయ్యాయి. కాబట్టి వానిని ఉపే క్షించ వీలులేదు.

కాబట్టే అమెరికా ఆర్థికి భవిష్యత్తును గూర్చిన పాత వివరణలన్నీ పనికిరావు. అలాగే నేటి చాల ఆర్థికవేత్తల రచనలుకూడ పనికిరావు. కారణం వారు పాతకాలపు పోలికలమీదనే ఆధారపడుతున్నారు. మరి నేడేమో వట్టి ఆర్థికవివరణల పరిమితి బాగా బయటపడిపోయింది. ఆర్థిక, రాజకీయ, సైనిక పరిస్థితులన్నిటి సమగ్రపరిశీలన మాత్రమే భవిష్య త్తునుగూర్చి విశదీకరించగలదు.

## మార్షల్ ప్రణాళికా అమెరికా ఆర్థికవ్యవస్థా

అమెరికా ఆర్థికవ్యవస్థను, ప్రపంచస్థితి రెండు విధాలుగా మారు స్తున్నది.

ఒకటి, విదేశ సహాయం మార్షల్‌ప్లానూ; రెండు, కొత్త పునరా యుధీకరణ కార్యక్రమం.

మార్షల్‌ప్లాను సమర్థించేవారి వాదం సామాన్యంగా ఇలా ఉంటుంది: పరాజయం తర్వాత జర్మనీలోను, పశ్చిమ యూరోపులోను రాజకీయ శూన్యత ఏర్పడింది. సోవియట్ పలుకుబడిలో లేని యూరపియన దేశాలన్నిటి ఆర్థికస్థితీ బాగా కదిలిపోయినది. తమ ఆర్దిక పునరుజ్జీవనాని కవసరమైన ఆహారం, ముడిసరుకుల దిగుమతులకు తగినట్టు, ఎగుమతు లను చేసే స్థితిలో ఈ దేశాలు లేవు. ఇక బయటిసాయం లేకపోతే పారి

శ్రామిక యూరోపంతటా తీవ్రసంక్షోభం రాగలదు. ఆ సాయం ఒక్క అమెరికా మాత్రమే ఇవ్వగలదు. ఇలాసాయంచేయక అక్కడ సంక్షోభవే విషమరూపంతాలిస్తే, సోవియట్ పలుకుబడి విస్తరీకరణ కది అనుకూ పడగలదు. కాబట్టి అ దేశాలు కోలుకొని తమ కాళ్ళపై నిలబడగలిగేట్టు చేసేదాకా (ఇదంతా నాలుగేళ్ళలో జరుగుతుందని ఆశావాదుల అంచనా) మార్షల్ ప్రణాళిక ద్వారా అమెరికా యూరోపునకు సాయపడాలి.

మార్షల్‌ప్లాను యూరోపు భవిష్యత్తుకు అవసరమని, అమెరికా భవిష్యత్తుకూ అది అవసరమని చెప్పడం సరైనదే. ఈ సాయం లేక పోతే కొన్ని దేశాలు సర్వనాశనమైపోగలవు. అవన్నీ నిజమే కాని, అమెరికా ఆర్థికవ్యవస్థకు సమీప భవిష్యత్తులో ఈ ప్లాను సాయపడగలదని మాత్రం చెప్పలేము. ఈ విషయం స్పష్టపడేందుకు పూర్వ వివరణకు మరికొన్ని వాక్యాలు చేరిస్తే చాలును.

ఇంతదనుకా విదేశ వర్తకం, అమెరికా ఉత్పత్తిలో అత్యల్ప భాగంగామాత్రమే ఉన్నది. దేశీయోత్పత్తిలో విదేశవర్తకం 10%కు కూడ అమెరికా చరిత్రలో ఎన్నడూ పెరగలేదు. తాను ఉత్పత్తిచేసే వస్తువులలో నూటికి 90వంతులు స్వదేశంలోనే అమెరికా విక్రయిస్తూ వచ్చినది.

ఈస్థితి రెండోయుద్ధ కాలంలోకూడ మారలేదు; యుద్ధానంతరం కూడ మారలేదు; మార్షల్ ప్లానుతోకూడ ఈ పరిస్థితి మారబోదు.

ఇంకాచెబితే మొదటియుద్ధం ముగిసినవెంటనే ఉత్పత్తిలో ఎగుమతుల అంశం తగ్గినదికూడ. ఈ విషయమై మిత్రరాజ్యసమితి నివేదిక ఇచ్చిన లెక్కలు చాల విలువైనవి.

## అమెరికా ఉత్పత్తి—విదేశ వర్తకం

(నేటి డాలర్లు—వెయ్యి మిలియన్లలో)

| | మొదటి యుద్ధం తర్వాత | | | ఏటా సగటున |
|---|---|---|---|---|
| | 1919 | 1920 | 1919-20 | 1921—1939 |
| అమెరికా మొత్తం దేశీయోత్పత్తి | 81.6 | 94.7 | 176.3 | 84.3 |
| అమెరికా మొత్తం ఎగుమతులు | 7.9 | 8.2 | 16.1 | 3.6 |
| ఉత్పత్తికీ ఎగుమతులకూ దామాషా (నూటికి) | 9.7 | 8.7 | 8.1 | 4.3 |

రెండో యుద్ధం తర్వాత

| | 1946 | 1947 | 1946-1947కలిపి |
|---|---|---|---|
| అమెరికా మొత్తం దేశీయోత్పత్తి | 203.7 | 228.2 | 431.9 |
| అమెరికా మొత్తం ఎగుమతులు | 10.0 | 15.1 | 25.1 |
| రెంటికీ దామాషా నూటికి | 4.9 | 6.6 | 5.8 |

ఈ లెక్క లేమిటిని తెలియజేస్తున్నవి? మొదటి ప్రపంచ యుద్ధం ముగిసినవెంటనే అమెరికా ఎగుమతులు ఉత్పత్తిలో 10% కు, ఇరవయ్యో పడిలో 4.3%కు పడిపొయ్యాయి. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత చెప్పుకోదగినంత పెరిగినవి. కాని ఇటీవల అమెరికా యూరోప్‌కూ, ఆసియాకూ ఇచ్చిన సహాయ్యం అంతా కలిపినా, ఎగుమతుల మిగులు ఎంతో అధికంగాఉన్నా, 1946 లో ఎగుమతులు, ఉత్పత్తిలో 4,9% మాత్రమేఉన్నవి. 1947లో 6.6%కు పెరిగాయి. ఈ దామాషాన పెరిగితే మార్షల్‌ప్లానువల్ల పెద్దమార్పు వస్తుందనుకోవడం ఏమాత్రం వాస్తవదృష్టి

కాదు. ఇందుతో అమెరికా సంక్షోభాన్ని అరికట్టుతున్నారనే రష్యన్లు, కమ్యూనిస్టులమాటలు లెక్కలతో జతపడవు.

ఇంతకూ సారాంశమిది: మార్షల్ప్లాను అమెరికా మార్కెట్టునేమీ పెంచలేదు. ఇందువల్ల అమెరికా ఆర్థికవ్యవస్థలో నేటిఎగుమతుల మిగులు అలాగే ఉండగలుగుతుంది. ఇవి తగ్గడంవల్ల వచ్చే ప్రమాదం అరికట్ట బడుతుంది, అంతే. అదోమాదిరీ వ్యవధానాన్ని కల్పించి, ప్రపంచ ఆర్థిక వ్యవస్థనుండీ వచ్చే ప్రమాదాన్ని ఆపగలదు. ఇంతయినా ఉత్పత్తిచేసిన వస్తువుల్లో 99% దేశంలోనే అమ్ముకోవలసిన స్థితిలో మాత్రం ఏమీ మార్పురాలేదు.

## ధాన్యాదుల ఎగుమతులు

మార్షల్ ప్లానువల్ల అమెరికా వ్యవసాయానికి లాభం చేకూర గలదు. పూర్వంలాగా నేడు వ్యవసాయ సంక్షోభం వచ్చే ప్రమాదంలేదు. యుద్ధకాలంలో ధాన్యోత్పత్తి ఎక్కువయినది. ధర లెక్కువగా ఇప్పటికీ ఉన్నందువల్ల, వ్యవసాయ—ఆదాయం జాతీయాదాయంకంటె అధిక వేగంతో పెరుగుతున్నది. 1939 జాతీయాదాయంలో ఈ వ్యవసా యాదాయం, 7%గా ఉండినది. 1947కు 9.2%కుపెరిగినది. అయినప్పటికి వ్యవసాయం సంక్షోభానికి అతీతమని అర్థంకాదు. ఈ దశలోమటుకే పౌరులు విపరీత ధరలకు ధాన్యం కొనగలుగుతున్నారు. పైగా వీనిధరలు ఎగుమతులపై ఆధారపడినవి. ఈ అంశాన్ని క్రింది గ్రాపు (36 పుట). తెలియజేస్తున్నది.

ఎగుమతుల నిలా ఇంత అధికస్థాయిలోనే ఉంచసాధ్యమా? యూరోపు సంక్షోభస్థితి, రష్యా అనుసరించే విధానం, అమెరికా ఆర్థిక వ్యవస్థ ఈ మూడింటిమీదా ఇది ఆధారపడుతుంది. ఈ 1947 స్థాయి

ఆహారధాన్యం-ఉత్పత్తి, ఎగుమతులు




ఇలాగే ఉంచగలిగినప్పటికీ నోట్లముమ్మరం వల్ల మార్కెట్టులో ఏర్పడిన అస్థిరతను పోగొట్టగలదిగా మాత్రం ఉండదు.

అయితే, మరో కొత్తమార్కెట్టు, రంగంలోనికప్పుడే ప్రవేశిస్తున్నది. అమెరికా మిలిటరీఖర్చు పెరగడం వల్ల ఏర్పడిన మార్కెట్టిది.

అమెరికా సైనికపరిస్థితిలో మార్పు

రెండవ ప్రపంచ యుద్ధంవల్ల అమెరికాస్థితిలో రెండు ప్రధానమైన మార్పులు వచ్చినవి.

నేటిదాకా శాంతి సమయంలో అమెరికాలో పెద్ద సైనిక శాఖ ఎన్నడూలేదు. సైనికసన్నాహం ఏమీలేకనే ఈ దేశం మొదటియుద్ధం లోనికి ప్రవేశించినది. యుద్ధం జరుగుతున్న కాలంలోనే, సైనిక

సమీకరణ, ఆయుధోత్పత్తులను కొనసాగించినది. మరి ఆ యుద్ధం ముగియగనే తిరిగీ తన సైనికశాఖను దాదాపు పూర్తిగా తగ్గించివేసినది. తిరిగీ రెండోయుద్ధంలోనికి పూర్వసన్నాహం లేకనే ప్రవేశించినది. 1935-39 లలో అమెరికా సైనిక వ్యయం 11/2 బిలియన్ డాలర్లు మాత్రమే; అదేసమయంలో బ్రిటన్ 21/2 బిలియన్‌డాలర్లు, సోవియట్‌లో 8 బిలియన్లు, జర్మనీలో 12 బిలియన్ డాలర్లు సైన్యానికి ఖర్చుపెట్టారు.*

అయినప్పటికి యుద్ధం జరుగుతుండగా సైనికశక్తిని అత్యున్నత స్థాయికి కొనిపోగలిగినది. సముద్రపు కంచుగోడల నడుమ సైనికశక్తినీ పెంచుకున్నది — అనంత పారిశ్రామికశక్తిని సైనికబలంగానూ మార్చుకున్నది.

ఆ తర్వాతమటుకు కొన్ని ప్రధానమైనమార్పులు జరిగినవి.

(1) నేడు యూరోపులోను, ఆశియాలోను రాజకీయ శూన్యస్థలం ఉన్నది. యూరోపులోకల్లా ఒకే అగ్రరాజ్యమైన సోవియట్ యూనియన్ దీనిని తన పలుకుబడి విస్తరణకు ఉపయోగించు కుంటున్నది. ఒక్కగర్భిత సైనికబలంతో దీనినాపడం సాధ్యంకాదు: పారిశ్రామిక బలాన్ని, సైనికబలంగా మార్చుకునేందుకుండవలసిన వ్యవధిని తగ్గించుకోవాలి.

(2) అమెరికాపై ప్రత్యక్ష దండయాత్రకు మహాసముద్రాలు కోటగా నున్నవి. కాని ఇవెంతకాల ముండగలవు. ఆటంబాంబు లితరులూ క్రమంగా చేసుకోగలరు; విమానవేగాధిక్యత పెంచు కుంటున్నారు; ఇతర అస్త్రప్రయోగ సాధనాల సూక్ష్మత యెక్కువ అవుతున్నది.

* రెండోయుద్ధంలో ఆయుధోత్పత్తి. మిలిటరీ అఫేర్సు. సం 1. పుట. 7

ఈ స్థితిలో అమెరికా ఒకకొత్త సైనికస్థితి నెదుర్కొంటున్నది.

యుద్ధం ముగుస్తూనే కొంత మిలిటరీవ్యయం తగ్గించారు కాని 1947 ఆఖరుకు మరీ ఎక్కువ చేయనారంభించారు. ఇదిలాగే చాలకాలం ఎక్కువయ్యే అవకాశం కూడ ఉన్నది.

## నేటిసైనిక వ్యయస్థితి

నేటిది యుద్ధఆర్థిక విధానం కాకపోవచ్చు కాని, శాంతికాలపు ఆర్థికవిధానం మాత్రం కాదు.

నిజాని కిది యుద్ధవిరమణ ఆర్థికవిధానం. సైనికవ్యయం పూర్వ మున్న 11 బిలియన్ డాలర్లకంటె బాగా యెక్కువ చేయబడినది. (14.4 బిలియన్ డాలర్లు —అధ్యక్షుని అర్ధసంవత్సర ఆర్థికనివేదిక, 1948, పుట 38)

అమెరికా బడ్జెట్టులో నూటికి 30 వంతులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో యుద్ధానికి చెందినదే. వైమానికబల విస్తరణకై చేస్తున్న వ్యయం ఇకమీద మరింత పెరగగలదని తెలుతున్నది. "వైమానిక యుగంలో అస్తిత్వం" అనేరిపోర్టు ఈ విషయం వెల్లడిస్తున్నది. 1953 జనవరి 1 నాటికి ఇతరదేశాలు ఆటంబాంబులను తయారుచేసి, అమెరికావంటి దూరదేశానికికూడ వానిని కొనిపోయివేయగల విమానాలను తయారుచేయగలవని, ఆ దృష్టితో అమెరికా సైనికపునర్నిర్మాణం ఎలా గబగబా పెరగాలో ఈ నివేదిక వివరించింది.

ఇందులో చూపినంతకంటె కూడ ఈ వ్యయం అంతర్జాతీయ స్థితినిబట్టి పెరగడానికే అవకాశమున్నది.

ఇక మార్షల్‌ప్లాను ఖర్చు నాలుగేళ్ళలో ఆగిపోతుంది. అదే సమయంలో మిలిటరీఖర్చు పెరుగుతుంది. ఇందుతో అమెరికా ఆర్థిక భవిష్యత్తులో పెద్ద మార్పు వస్తుంది. సైనికవ్యయంలో మరొక అంశ మున్నది. అమెరికా తనసేననే కాక, పశ్చిమయూరోపు సేనలకూ కూడ ఆయుధాలిచ్చి పెంచవలసి ఉన్నది.

ఇలా ఈ అనంత మహావిరూపంతో ఉన్న సైనికవ్యయం ద్వారా అమెరికాలో సంక్షోభం రాకకు వాయిదాపడినది. కాని శాంతి సమయంలో ఇలా యుద్ధఆర్థిక వ్యవస్థ ఎన్నాళ్ళని పెరగగలదో, స్థిరంగా ఉండగలదో చెప్పలేము,

## నిరుద్యోగం లేనికాలంలో సైనిక ఆర్థికవ్యవస్థ

ఇలా సంక్షోభ ప్రమాదాలు అంతర్గర్భితంగా ఉండనే ఉన్నవి. అంతేకాక, ఈ సైనికవ్యయం పెంచుతున్న సమయానికి నిరుద్యోగం వ్యాపించలేదు. ఇదొక నూతనస్థితి.

ఇలా నిరుద్యోగం వ్యాపించనిదశలో ఈ నూతన సైనికవ్యయ విస్తరణ జరుగుతున్నది. కాబట్టే నోట్లముమ్మరం విస్తరించే ప్రమాద మున్నది.

ఈ వ్యయమిలాగే పెరుగుతూ, దీనినాపే కార్యక్రమమేదీ తల పెట్టకపోతే ఆర్థికమాంద్యం ఏర్పడవచ్చును. కాని మిలిటరీబడ్జెట్టు అధిక స్థాయిలో ఉన్నంతవరకు ఘోరమైన సంక్షోభం వచ్చే అవకాశం తక్కువ.

అయితే నేడు అమెరికాలో సంక్షోభవ్యాప్తికి చెందిన కారణాలు కేవలం దేశీయమైనవి కావు—అంతర్జాతీయ స్థితిలోని మార్పులనుబట్టి అవి బలపడగలవు—

* అభ్యుదయకాముల కర్తవ్యం

నేడు అమెరికా అభ్యుదయకాములు నిర్వర్తించవలసిన కర్తవ్యమేమిటి? వారిముందు రెండు దారులున్నవి.

ఒకటి: ఇలాగే సైనికవ్యయం హెచ్చుజేస్తూవస్తే విరాడ్రూపంతో ఉన్న గుత్తవ్యాపార సంస్థల అధికారశక్తులు మరింత పెరిగిపోతాయి. నోట్లముమ్మరం ఇలాగే పెరుగుతుంది; సాంఘిక వైరుధ్యాలు విజృంభిస్తాయి. ఈ ఆయుధీకరణ శాంతి ఆర్థికవిధానంగా మారిస్తే దారుణ సంక్షోభం విరుచుకపడుతుంది. ఇందులో యూరోపుదేశాలకు సాయపడ్డమనే అంశం ఉన్నమాట నిజమేకాని, ఆ సహాయం యూరోపులోని తటస్థ వర్గాలను దుర్బలపరచేందుకే పనికివస్తుంది. యూరోపునది రెండు శిబిరాల క్రింద విభజించి వేస్తుంది. లక్షలాది కార్మికులను కమ్యూనిస్టులవేపు తరిమివేస్తుంది. యుద్ధప్రమాదం ఎక్కువవుతుంది.

రెండవది: దురాక్రమణ ప్రమాదాన్నెదుర్కొ గలిగేంతమట్టుకే, సైనిక సన్నాహాలను చెయ్యడం అయితే ఈ ఆయుధోత్పత్తిని గుత్త వ్యాపార సంస్థలక్రిందకి పోకుండా, పూర్వంకంటే బలమైన "న్యూడీలు" నేర్పరచడం జరగాలి. పెద్ద పెద్ద కార్పొరేషన్లబలాన్ని విచ్ఛిన్నం చేయాలి. నోట్లముమ్మరాన్ని ప్రతిఘటించాలి. కొలదియేళ్లుగా నోట్ల ముమ్మరంవల్ల ఏర్పడిన ప్రధాన ప్రమాదాన్ని తొలగించేందుకై జాతీయాదాయాన్ని సరైన రీతిగా కొత్త పంపకాని కనుకూలంగా పని చెయ్యాలి.

ఈ రెండవ మార్గాన్నవలంబించినపుడే స్వతంత్రంగా, తన భవిష్యత్తును తాను నిర్ణయించుకొనేదిగా యూరోపు తయారయ్యేట్టు మార్షల్

* అదే పుస్తకం—సమాప్తిభాగం

ప్లానును, సైనిక వ్యయాన్ని నడప వీలవుతుంది. అక్కడి సాంఘిక వ్యవస్థకూడ అక్కడి పరిస్థితి కనుగుణంగా మారేందుకు అడ్డగించ రాదు.

ఈ మార్గాన్ననుసరించినప్పుడే శాంతిస్థాపన, అభ్యుదయవంత మైన యూరోపు స్థాపన సాధ్యమవుతుంది. యూరోపు సాంఘిక వ్యవస్థను మార్చి, అక్కడి సంక్షోభాన్ని పరిష్కరించి శాంతికి హామీ ఇవ్వడం సాధ్యపడుతుంది.

ఇందుకు అవకాశ మెంతమాత్రమున్నదని మనం ఆలోచించ రాదు. అవకాశముందో లేదో మనమీ రెండవ మార్గాన్ననుసరించాలి. అందుకై అహోరాత్రులూ పనిచెయ్యాలి.

---

3553

# కొన్ని పదాలు - వివరణ

అక్షరాజ్యాలు Axis Powers

రెండవ మహాయుద్ధంలో పాల్గొన్నదేశంలో జర్మనీ, ఇటలీ జపాను వగైరాలను అక్షరాజ్యాలని పిలుస్తారు. సోవియట్ యూనియన్, అమెరికా, బ్రిటన్ వగైరాల పక్షాన్ని మిత్రరాజ్యాలంటారు.

మొదట జర్మనీ ఇటలీ మైత్రిగా ఇది ఏర్పడినది. ఇందులో జపాను చేరినది, ఈ రాజ్యాలకు స్పెయిన్ హంగేరీలు వెనుకనే ఉన్నవి.

1939 మే 22 బెర్లిన్‌లో జర్మనీ ఇటలీలు సంధి చేసుకున్నవి. అదే దీనికినాంది. 1936 లో అబిసీనియా ఆక్రమణతో ఇటలీ జర్మనీల పొత్తుకు ప్రాతిపదికపడినది.

బాల్కన్‌లలో కూడ దీని నీడ పడినది.

అగ్రరాజ్యాలు Big Powers

రెండవయుద్ధం తర్వాత ప్రపంచంలోని ప్రధానరాజ్యాలను అయిదింటిని అగ్రరాజ్యాలంటున్నారు—అవి సోవియట్ యూనియన్, బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, చైనా. మొదటి మూడిండిని మాత్రమే అగ్రరాజ్యత్రయం అన్నప్పుడు గ్రహించాలి.

అణుయుగం Atomic Age

అణువును—ఆటంను—పగుల గొట్టి, అందులోనున్న అపారశక్తిని పరిశ్రమలకు, ఆయుధోత్పత్తికి ఉపయోగించడం ఆరంభమయిన ఈ నూతనయుగాన్ని అణుయుగం అంటున్నారు.

ఈ మహాశక్తిని విజ్ఞానవేత్తలు ప్రజా .క్షేమానికై ఉపయోగిస్తే, మహోజ్వల నూతన భవిష్యత్తు ప్రపంచం ముందున్నది. మారణాస్త్రాల కై ఉపయోగిస్తే మహాప్రళయం తప్పదు.

ఇందువల్ల ఈ అణువిచ్ఛిన్నంతో ప్రపంచ చరిత్రలో ఒక నూతన యుగం ఆరంభం అయిందన్నమాట.

అధికోత్పత్తి Over-production

ఆర్థికమాంద్యంవల్ల, కొనుగోలుశక్తి తగ్గిపోయి. గిరాకీలేక వస్తువులు అమ్ముడుపోక మూలబడినప్పుడు—ఉత్పత్తి ఎక్కువయిం దంటారు. ఉపయోగించవలసినంతకంటె ఎక్కువ ఉత్పత్తి అవుతూ వున్నదని దీనిఅర్థం కాదు. అమ్ముడుకాక నిలిచిపోతున్న వస్తువులున్న వన్నమాట.

ఎందుకీ అమ్ముడు పోకపోవడం జరుగుతుందో వివరంగా ఈ పుస్తకంలోనే ఉన్నది.

అంతర్జాతీయ కార్మికసంస్థ International Labour Organisation I. L. O.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం చేసుకున్న శాంతి ఒడంబడికలో భాగంగా ఈ సంస్థ 1919లో ఏర్పడినది, దీనికి సంబంధించిన నిబంధ నలు వెర్సైల్సు సంధి 13వ భాగంలోనున్నవి. ఇది నానాజాతి సమితికి చెందిన భాగంగా పనిచేస్తూ వచ్చినది. ఇప్పుడు మిత్రరాజ్యసమితి ఆర్థిక సాంఘికసమితితో సంబంధం ఏర్పరచుకున్నది. కాని ఇది స్వతంత్రంగానే వ్యవహరిస్తున్నది.

ఇందులో ప్రభుత్వ ప్రతినిధులు, యజమానులు, కార్మికుల ప్రతినిధులు కలిసి ఉంటారు.

ఈసంస్థ కార్మికులగూర్చి, ఉత్పత్తి నిరుద్యోగాలగూర్చి, దీర్ఘమైన విచారణలు జరిపి చాల లెక్కలు ప్రకటించినది. పని గంటలు కార్మికుల స్థితిగతులగూర్చి చాల విధులను ఆమోదించినప్పటికి, వీనిని అమలుజరిపే అధికారం ఈ సమితికి లేదు.

ఇందులో ప్రభుత్వ సభ్యులు, యజమానుల ప్రతినిధులు కూడ ఉండడంవల్ల, పూర్తిగా కార్మికుల యోగక్షేమ చింతనే దీనికి ప్రధానంగా ఉండదని యెంచి World Federation of Trade Unions అనే సంస్థ మరొకటి ఏర్పడినది.

పూర్వమీసంస్థ నానాజాతిసమితికి సమాన ఛాయాలో ఉండినది. ఇప్పుడు ఆర్థికసమితికి అనుబంధసంస్థ అవుతున్నది. సోవియట్ యూనియన్ ఈ సంస్థనెప్పుడూ బలపరచలేదు—ఇందులో ఆ ప్రభుత్వ ప్రతినిధి లేదు. దీనినిగూర్చి చార్టర్‌లో ప్రస్తావించలేదు.

అభ్యుదయ దశ

ధనికవిధాన విస్తరణ విపరీతంగా సాగుతున్న దశ. ఉత్పత్తి, అమ్మకం చక్కగాసాగుతూ, నిరుద్యోగం తక్కువగా ఉన్న దశ.

అమెరికా (సంయుక్త రాష్ట్రాలు) U. S. A.

వైశాల్యం 3,026, 789 చ॥ మై॥. జనాభా సుమారు 13 కోట్లు. ఇందులో 48 రాష్ట్రాలున్నవి. 2 ప్రాంతాలున్నవి. వాషింగ్టన్ రాజధాని. ఫెడరల్ రాజ్యాంగం, పరిపాలనాధికారం చాలభాగం రాష్ట్రాలది. ఇటీవల కేంద్రాధికారంబలపడుతున్నది. శాసనసభను కాంగ్రెస్‌అంటారు. ఇందులో

ప్రతినిధులసభ, పెద్దలసభ రెండు భాగాలున్నవి. రెండేళ్లకొకసారి 435 సభ్యులను ప్రతినిధులసభకు ఎన్నుకుంటారు. రాష్ట్రానికిద్దరు సభ్యుల చొప్పున పెద్దలసభకు ఆరేళ్లకోసారి ఎన్నుకుంటారు. ప్రతి రెండేళ్లకూ ఇందులో 1/3 సభ్యులకు ఎన్నిక జరుగుతుంది. అమెరికా ఉపాధ్యక్షుడే సెనేట్ అధ్యక్షుడు.

కార్యకర్తృత్వాధికారం అధ్యక్షునిది. నాలుగేళ్లకొకసారి పరోక్షంగా ఎన్నుకోబడతాడు. ఓటర్లు ఎలక్టార్లనెన్నుకుంటే, వారు అధ్యక్షుని ఎన్నుకుంటారు. కాంగ్రెస్ ఆమోదించిన బిల్లులను అధ్యక్షుడు త్రోసివేయవచ్చును. కాని తిరిగీ 2/3 వోట్లతో ఈ త్రోసివేత తొలగింపబడవచ్చును. ఇతనే మంత్రులను నియమిస్తాడు. వారు ఇతనికే బాధ్యులు. యుద్ధప్రకటన కాంగ్రెసే చెయ్యాలి. న్యాయశాఖకు ఉన్నతాధికారాలున్నవి. సుప్రీంకోర్టు ఏ చట్టాన్నైనా రాజ్యాంగానికి విరుద్ధమని నిర్ణయిస్తే అది తొలగించవలసిందే. ఇప్పటి అధ్యక్షుడు ట్రూమన్.

ఇక్కడ రెండు ప్రధానమైన పార్టీలున్నవి. డెమాక్రటిక్ పార్టీ, రిపబ్లికన్ పార్టీ—ఒకదానికీ మరొకదానికీ ఆట్టే భేదం ఉండదు. కమ్యూనిస్టు పార్టీ నాయకులను అరెస్టు చేశారు. నిర్బంధాలు అమలుపరచారు. సోషలిస్టుపార్టీ కూడా దుర్బలమే—ఈ దేశపు ఆర్థిక పరిస్థితులను గూర్చి ఈ పుస్తకంలో వివరంగా చర్చించబడినది.

నేడు ప్రపంచంలోని ధనిక రాజ్యాలకు అమెరికా నాయకత్వం వహిస్తున్నది. సోవియట్ యూనియన్‌పై కత్తిగట్టి పోరాడే ఉద్దేశంతో ఆయుధోత్పత్తి—ఆర్థికవ్యవస్థను నడుపుతున్నది.

ఇక్కడ ఈనాటికీ రంగువిభేదం విపరీతంగా ఉన్నది. తెల్లవారి వాడలలో నీగ్రో నివసిస్తే చావుతప్ప వానికి మరొకటి ఉండదు.

అరువు కవులు విధానం Lend-lease

రెండవ యుద్ధకాలంలో ఇతర మిత్రరాజ్యాలకు నగదు తీసుకొని కాక, ముడిసరుకులు వగైరా లెక్కకట్టుకునే ఏర్పాటుపై అప్పుగా అమెరికా సరకులను సరఫరా చేయుటకు ఈ అరువుకవులు విధానమే ప్రాతిపదిక.

అర్జెంటినా Argentina

దక్షిణ అమెరికన్ రిపబ్లిక్కులలో రెండవది. 10, 79, 000 చ॥మై॥, వైశాల్యం 1, 28, 00, 000 జనాభా, ఇక్కడ స్పానిష్ భాష మాట్లాడుతారు.

గోధుమ, మైదా, గోమాంసం, ఇతర వ్యావసాయిక వస్తువుల ఎగుమతి ప్రధానం.

1941 సెప్టెంబరులో నాజీ అనుకూలమైన కుట్ర సైన్యంలో జరిగింది. కాని దానిని అణచివేశారు.

ఆటం-బాంబు Atom bomb

నేడు ప్రపంచ ప్రజలందరిని భయభ్రాంతులను చేస్తున్న బాంబు. రెండవ ప్రపంచ యుద్ధంలో అమెరికా తొలుత అణువును పగులగొట్టి ఆ శక్తిద్వారా మొదటి ఆటంబాంబును తయారుచేసినది. దీనిని గత యుద్ధం ఆఖరురోజులలో హిరోషిమా (జపాను)పై వేశారు. అప్పటి నుండి ఈ బాంబులను అమెరికా విపరీతంగా తయారు చేస్తున్నది. సోవియట్ యూనియన్ కూడ ఈ బాంబులను చేస్తున్నట్టు తెలుస్తున్నది. కాని భయంకర మానవమారణాస్త్రమైన దీనిని నిషేధించాలని, సోవియట్ తోపాటు ప్రపంచ శాంతి కాముకులందరూ కోరుతున్నారు.

ఇటీవల కొరియా యుద్ధంలో అటంబాంబుల నుపయోగిస్తామని ట్రూమన్ అనీ అనకముందే ప్రపంచ ప్రజలు విపరీతంగా ఆందోళన చేశారు. వెంటనే ట్రూమన్ వెనుకంజవేశాడు.

ఈ బాంబును నిషేధించాలని ప్రపంచ శాంతిసమితి ప్రచారం చేస్తున్నది. కోట్లకొలది ఆ కోర్కెను బలపరుస్తూ సంతకాలు చేశారు.

ఆస్ట్రియా Austria

32,000 చ॥ మై॥ వైశాల్యం. జనాభా 68,00,000 మొదటి ప్రపంచ యుద్ధంతర్వాత జర్మనీతో కలిసింది. కాని మిత్రరాజ్యాలు ఒప్పుకోక వేరుగాఉంచారు. 1934లో డాల్ఫస్‌క్రింద ఒకరకమైన ఫాసిస్టు ప్రభుత్వం వచ్చినది. కాని డాల్ఫస్ ఈ ఘర్షణలో చంపబడినాడు. తర్వాత షూష్నిగ్ వచ్చాడు. దీనిని హిట్లర్ 1938 మే 12న ఆక్రమించాడు.

రెండవ యుద్ధంతర్వాత తిరిగీ విముక్తమైనది. సోషలిస్టు డాక్టర్ కరల్ రెన్నర్ అధికారానికి వచ్చాడు. 1945 నవంబరులో ఎన్నికలు జరిగాయి. పీపుల్సుపార్టీకి మెజారిటీ వచ్చింది. డా॥ ఫిగిల్ ప్రధాని అయ్యాడు. ఆస్ట్రియాకూడా జర్మనీవలె విభక్తమైనది.

అల్జీరియా Algeria

ఉత్తరాఫ్రికాలోని ఫ్రెంచి వలసప్రాంతం. 845 వేల చ॥ మై॥ వైశాల్యం 7,250,000 జనాభా—ఇందులో 10 లక్షలు ఫ్రెంచివారు. మిగతవారు అరబ్బులు. ఉత్తర దక్షిణ ప్రాంతాలుగా ఇది విభజింపబడినది, సర్వాధికారి ఫ్రెంచి గవర్నర్ జనరల్. వివిధ వ్యావసాయిక

పంటలు, పళ్లు, ఆసవం ఉత్తరప్రాంతంలో ఉత్పత్తి అవుతాయి. ముడి ఇనుము, ఫాస్ఫేట్సుకూడ ఇక్కడ దొరుకుతుంది.

ఇంటర్నేషనల్ యూనిట్ International Unit

1925-34ల మధ్య సగటున అమెరికాలో ఒకడాలరుకు కొనగల వస్తువులయొక్క, పనియొక్క ప్రమాణం.

ఇండోచైనా Indo-china

దీనినే వియత్నాం అనికూడ అంటారు. 281 వేల చ॥ మై॥ 2 కోట్ల 40 లక్షల జనాభా. ఫ్రెంచిసామ్రాజ్యం వలస. రెండవ ప్రపంచ యుద్ధంలో విషిప్రభుత్వం జపానుకు సైనిక స్థావరాలకిక్కడ ఆశ్రయ మిచ్చింది. జపానుపై విపరీతమైన అసంతృప్తి బయలుదేరినది. వితమిన్, హోచిమిన్ నాయకత్వం క్రింద ప్రజాసంఘటన నేర్పరచి దేశాన్ని విముక్తంచేయ సమకట్టినది. చాలభాగం విముక్తమైనది. మిగత ప్రాంతంలో బోదాయ్ చక్రవర్తిని తిరిగి రప్పించి, ఫ్రెంచి సామ్రాజ్య వాద ప్రభుత్వం స్వతంత్ర ప్రభుత్వమంటూ నామకః ఒక దాని నేర్పరచింది.

కాని హోచిమిన్ సేనలు, ఫ్రెంచి సామ్రాజ్య అధికారావశేషం లేకుండాచేసి, దేశాన్ని స్వతంత్రం చేసేందుకు పోరాటం సాగిస్తున్నవి. ఫ్రెంచిసేనలను చాలప్రాంతాల నుండి వెనుకకు నెట్టివేస్తున్నవి.

అయినా అమెరికా ఆయుధబలంతో ఫ్రెంచిప్రభుత్వం, విపరీతంగా ప్రజలపై తిరిగీ తమ బానిసత్వం నెలకొల్పేందుకు యుద్ధం కొనసాగిస్తున్నది.

ఇరాన్ Iran

దీనినే పర్షియా అనికూడ అందురు. అ, 28,000 చ॥మై॥ వైశాల్యం. కోటీ యాభై లక్షలు జనాభా, షా పెహ్లావ రాజు. ప్రాచీన నాగరికత గల దేశం. 1917 వరకు బ్రిటన్ రష్యాల పెట్టుబడికి ఆకరమైన, ఇరాన్‌పై కమ్యూనిస్టు విప్లవం తర్వాత, సోవియట్ తన హక్కులను వదిలివేసుకున్నది. 1917లో బ్రిటన్ సేనలు మరలింపబడినవి. రజాఖాన్ ఈ సమయంలో పైకివచ్చి జాతీయోద్యమంలో పాల్గొని 1923లో ప్రధాని అయ్యాడు. 1924లో రాజుగారయ్యాడు. చాల ఆధునిక సంస్కరణల నమలుపరిచాడు.

1914లో రజాషా ఫాసిస్టు పలుకుబడికి లోనుకాజొచ్చాడు. నాజీ ఏజంట్ల కార్యకలాపాలు ఇరానులో పెచ్చు పెరగసాగినవి. దీని నాపేందుకై ఇరాన్‌లోనికి బ్రిటిష్ సోవియట్ సేనలు 1941 ఆగస్టు 25న ప్రవేశించి ఆక్రమించినవి. 1941 సెప్టెంబరు 16న రాజు రాజ్యత్యాగం చేశాడు. కొడుకు అధికారానికి వచ్చాడు. బ్రిటిష్ సోవియట్లతో మైత్రి నెరపే మంత్రివర్గం ఏర్పరచాడు.

యుద్ధకాలంలో ఉత్తరాన సోవియట్ సేనలున్నవి—తర్వాత సోవియట్ సేనలు ఉపసంహరింపబడినవి—ఈ ఉత్తరప్రాంతం అజెర్బయిజాన్ వేరే ప్రభుత్వాన్నేర్పరచి, చాల వ్యవసాయ సంస్కరణల నమలుపరచినది.

అమెరికా బ్రిటన్‌ల కివి గిట్టలేదు. ఇరాన్ ముఖ్యంగా పెట్రోలు ఉత్పత్తి అయ్యేచోటు. ఆంగ్లో ఇరేనియన్ ఆయిల్ కంపెనీ నూనెబావులను గుత్తకు తీసుకొని వ్యాపారం నడుపుతున్నది. ఈ కంపెనీ షరతులు ఇరాన్‌కు చాల అన్యాయం చేస్తున్నవి. సోవియట్ సమాన స్వతంత్ర

శంగా ఈ నూనె గనులలో పనిచేసేందుకై చేసిన ప్రయత్నాలను క్కడి భూస్వామి వర్గాల, అభివృద్ధి నిరోధకుల ఆసరాతో బ్రిటన్ డగొట్టగలిగింది.

టూడే పార్టీ అతివాదశక్తుల బలంతో ఈ దేశం బ్రిటన్ అమెరి ాలకు బానిస కాకూడదని ప్రచారం చేస్తూవచ్చింది. ఈ పార్టీపై ారుణ దమననీతి అమలు జరపబడినది. అజెర్బయిజాన్ తిరిగీ ఇరాన్‌లో కలిపివేసుకొనబడినది.

అమెరికా పెట్టుబడిదారులు బ్రిటన్‌ను తొలగించి తాము ఇరాన్ నూనెపై పెత్తనం వహించాలని పన్నాగం పన్నసాగారు.

దేశప్రజలు చైతన్యంతో అసలీ నూనెగనులను జాతీయం చేయాలని పట్టుబట్టారు. అందుకు వ్యతిరేకించిన ప్రధాని హత్య చేయ బడ్డాడు.

ఆఖరున ఇరాను మజిలీసు (పార్లమెంటు) నూనెగనులను జాతీయంచేసి ఆంగ్లోఇండియన్ ఆయిల్ కంపెనీని కట్టిపెట్టమన్నారు. బ్రిటన్ యుద్ధనౌకలు, బెదిరింపులు ప్రజలను లొంగదీయలేక పొయ్యాయి.

కాని ఈలోగా ట్రూమన్ 1950 జూలైలో హారిమన్‌ను తన రాయబారిగా పంపి బ్రిటన్‌కూ ఇరాన్ ప్రభుత్వానికీ జారీచేస్తానంటూ బయలుదేరాడు, ఎలాగో ఇరాన్‌పై తమ పెత్తనం ఉంచుకునేందుకు అమెరికా—దాని చెప్పు చేతలలో ఉన్న బ్రిటన్ నేడు నానా బాధలు పడుతున్నవి. రాజీ కుదరలేదు. బ్రిటిష్ ఉద్యోగులను బహిష్క-రించింది ఇరాన్. మిత్రరాజ్యసమితికి బ్రిటన్ ఫిర్యాదు చేసింది.

ఈజిప్టు Egypt

మధ్యప్రాచ్యంలోనిది. రాచరిక ప్రభుత్వం, వైశాల్యం 3,48 వేల చ॥మై॥ జనాభా 960 లక్షలు. అరబ్బీభాష.

1841నుండి 1916వరకూ టర్కీనియమించిన ఖెడీవ్(వైస్రాయి) క్రింద అర్ధస్వతంత్ర దేశంగా ఉండినది. 1882 నుండి బ్రిటిష్ సేనల ఆక్రమణక్రిందికి వచ్చినది. 1914 డిసెంబరు 18న బ్రిటిష్ ధర్మకర్తృత్వంక్రిందికి వచ్చినది. ఖెడీవ్ అబ్బాస్ హిల్మీ ప్రవాసితుడయ్యాడు.

తర్వాత ఈజిప్టులో సర్వస్వతంత్రం కోసం జాతీయోద్యమం వ్యాపించినది. 1936 ఆగస్టు 26 న ఆంగ్లో ఈజిప్టు సంధి జరిగింది. ఈజిప్టు స్వతంత్రం గుర్తించబడినది. కాని బ్రిటన్ తన సేనలను 10,000ను, 400 విమానాలను సూయజ్ కెనాల్‌వద్ద ఉంచుకొనుటకు అంగీకరించబడినది.

ఇక్కడ ప్రధానమైనపార్టీ వాఫ్డిస్టుపార్టీ—సాదిస్టుపార్టీ రెండవది. సుడాన్ ప్రాంతంలో బ్రిటన్ అధికారం తొలగించాలని, ఈజిప్టుకు అన్యాయం కలిగించిన 1936 ఒడంబడికను రద్దుచేయాలని ఈజిప్టులో తీవ్రమైన ఉద్యమం వ్యాప్తమైఉన్నది.

ఈ విషయమై చాలసార్లు సంప్రతింపులు, వాదోపవాదాలు. ప్రకటనలు జరుగుతున్నవి. కాని బ్రిటన్ తన సేనల నుపసంహరించుకునేందుకు సంసిద్ధత చూపడంలేదు.

ఉత్పాదకశక్తి Productivity

ఒక కార్మికుడు యంత్రసహాయంతో ఉత్పత్తి చేయగలశక్తి. ఈ శక్తి వైజ్ఞానికాభివృద్ధిమూలంగా అధికతరమవుతూ వస్తున్నది. ఒక మనిషికున్న ఉత్పాదకశక్తి పూర్వంకంటె ఇప్పుడు అత్యధికమయినది.

త్పాదక వస్తువులు Productive goods

యంత్రాలు కొన్ని వస్తువులను తయారుచేస్తాయి. వానిలో మన త్యోపయోగమునకు అవసరమయ్యేవికాక, ఇతర అవసర వస్తువులను త్పత్తిచేసే యంత్రాలు వగైరాలకు ఉత్పాదక వస్తువు లంటారు,

పభోగ్య వస్తువులు Consumer goods

వస్తువులను ఉత్పత్తిచేసేవికాక, కేవలం ఉపయోగించుకునేందుకు మాత్రమే పనికివచ్చే వస్తువులు.

ఓవనిజం Owenism

రాబర్టుఓవన్ అనే ఆయన ఇంగ్లీషు మిల్లు యజమాని. ఈయన అందరికీ, కార్మికులకూ మిగతవారికికూడ సమానంగా హక్కు-భుక్తాల నేర్పరచి, ఉత్పత్తిచేయాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఊహాకల్పిత సామ్యవాద కర్తలలో ఈయన ఒకరు. ఈయన అవలంబించిన పద్ధతే ఈ పుస్తకంలో ఓవనిజం అని ప్రస్తావించబడినది.

కనడా Canada

3,695,000 చ॥ మై॥, జనాభా 11,200,000. 9 రాష్ట్రాల ఫెడరేషన్. పార్లమెంటులో జనసభ, పెద్దలసభ రెండు. సెనేట్ సభ్యులను గవర్నర్ జనరల్ ఇ-కౌన్సిల్ శాశ్వతంగా నియమిస్తాడు. పరిపాలనా ఎక్కువభాగం రాష్ట్రాల చేతిలోనే ఉంటుంది. కేంద్ర ప్రభుత్వానికి వీటో హక్కున్నది. 1938 లో దీనిపై తగాదా వచ్చినప్పటికి సుప్రీంకోర్టు, ప్రీవీ కౌన్సిల్ దాని నిలబెట్టినవి.

1938లో రాయల్ కమిషన్‌ను నియమించగా రాజ్యాంగ సంస్కరణల కొన్నిటి నాకమిషన్ సిఫారసు చేసింది. కాని కేంద్ర ప్రభుత్వాకెక్కువ అధికారాల నివ్వడం రాష్ట్రాలు కొన్ని అంగీకరించ లేదు అయినా యుద్ధసమయావసరాలు 1941లో తిరిగి సంప్రతింపులకు దారితీసి ఆదాయప్పన్ను వగైరాలు కేంద్రానికివ్వడం జరిగింది.

యుద్ధకాలంలోనే ఆర్థికంగా చాలవరకు అమెరికాతో కనడాకు ఎక్కువ సన్నిహితత్వ మేర్పడింది. సంయుక్త రక్షణసమితి కూడా ఏర్పడినది. బ్రిటన్ పలుకుబడి తగ్గిపోయినది. యుద్ధానంతరం అధినివేశం అనే మాటకూడ తొలగించివేస్తూ పార్లమెంటు ఒకచట్టం చేసింది. ఇంతవరకూ బ్రిటన్ అధినివేశంగాఉన్న కనడా, కేవలం కామన్వెల్తులో మాత్రం సభ్యదేశంగా ఉంటానన్నది.

రెండవ యుద్ధంలో, మిత్రరాజ్య పక్షంగా 1940 జూన్ 10 న ఇటలీపై యుద్ధం ప్రకటించి చేరినది. జపానుపై 1941 డిసెంబర్ 7 న యుద్ధం ప్రకటించింది.

ధాన్యమిక్కడ బాగా పండుతుంది. వ్యవసాయం యంత్రాలతో భారీయెత్తున్న కొనసాగింపబడుతున్నది. కలప కావలసినంత దొరుకుతుందిక్కడ.

కన్సర్వేటివ్ పార్టీ Conservative Party

ఇంగ్లాండులోని మితవాదపక్షం. దీనినే యూనియనిస్టు పార్టీ అని కూడ అంటారు. 18-19 శతాబ్దుల టోరీపార్టీలకిది వారసు.

స్వేచ్ఛా వ్యాపారవిధానాన్ని బలపరుస్తూ, సోషలిజాన్ని తీవ్రంగా నిరోధించేపార్టీ. సామ్రాజ్యవాదాన్ని బాహాటంగా బలపరుస్తుంది. గొప్ప ధనికులకు భూస్వాములకు ఇది పట్టుగొమ్మ.

కమ్యూనిస్టు పార్టీ Communist Party

ధనిక వ్యవస్థను నిర్మూలించి, సోషలిస్టు సమాజవ్యవస్థ నేర్పరచా నేడు దేశంతో పనిచేసేపార్టీ—ప్రపంచంలో వివిధ దేశాలలో ఈ పార్టీ ఎక్కడికక్కడ ఏర్పడి ఉన్నది. సోవియట్ యూనియన్‌లోను, చైనాలోను, తూర్పు యూరపు రాజ్యాలలోను ఈ పార్టీ నేడు సమాజానికి నాయకత్వం వహించి నడుపుతున్నది.

1948 లో మార్క్స్ ఏర్పరచిన లీగ్ ఆఫ్ కమ్యూనిస్టుs నాటి నుండి ఇది ఏర్పడినది.

ఈ పార్టీలన్నిటికి కూడలిగా కమ్యూనిస్టు (మూడవ) ఇంటర్నేషనల్ 1920 లో మాస్కోలో ఏర్పడింది. గత యుద్ధంలో రద్దుకాబడినది.

కమ్యూనిస్టు మానిఫెస్టో Communist Manifesto

1848 లో కమ్యూనిస్టు లీగు నేర్పరచినప్పుడు కరల్ మార్క్స్ ఒక ప్రణాళికను ప్రకటించాడు. దానికే కమ్యూనిస్టు మానిఫెస్టో అని పేరు. ప్రధాన కమ్యూనిస్టు సూత్రాలన్నీ ఇందులో ఉన్నవి. సమాజ వ్యవస్థ ప్రాచీన కమూనిస్టు పద్ధతినుండి ధనికవిధాన వ్యవస్థ వరకూ ఎలా మారుతూవచ్చిందో. ఇదెలా సామ్యవాద వ్యవస్థగా మారుతూందో ఇందులో వివరించబడినది.

ప్రపంచగతిలో ఇంత మార్పుకు కారణమైన, చరిత్రాత్మకమైన కరపత్రం మరొకటిలేదు.

కరల్ మార్క్స్ Karl Marx

కమ్యూనిస్టు సిద్ధాంత ప్రవక్త, జర్మనీలో ట్రియర్‌లో 1918 లో పుట్టాడు. 1883లో లండన్‌లో మరణించాడు. తత్త్వశాస్త్రంలో డైలెక్టికల్ మెటీరియలిజం, అర్థశాస్త్రంలో "సర్‌ప్లస్ వాల్యూ", (అదనపు విలువ)

సూత్రం, చరిత్ర వివరణంలో హిస్టారికల్ మెటీరియలిజం వీనిద్వా ఒక సునిర్దిష్ట తాత్త్విక సిద్ధాంతాన్ని రూపొందించినవాడు.

ప్రధానమైన రచనలు: కమ్యూనిస్టు మానిఫెస్టో, కాపిటల్, పావ ఆఫ్ ఫిలాసఫీ, జర్మన్ ఐడియాలజీ వగైరా

కొరియా Korea

మంచూరియా ప్రక్కనేఉన్న దేశం. 250లక్షలు దాదాపు జనాభా వైశాల్యం 85,000 చ॥ మై॥.

1910లో జపాను ఆక్రమించుకుని దీనిని గవర్నర్ జనరల్‌ద్వారా పాలించసాగింది. ఖనిజసంపద చాల ఎక్కువగాఉన్న దేశం.

రెండవ యుద్ధసమయంలో మిత్రరాజ్య సేనలిందులో ప్రవేశించి జపానును తరిమివేసినవి. జపాను ఓటమితర్వాత కొరియా, 38 పారలల్ ప్రాతిపదికగా ఉత్తర దక్షిణ ప్రాంతాలుగా విభక్తమైనది. ఉత్తర భాగాన్ని సోవియట్ సేనలు, దక్షిణభాగాన్ని అమెరికా సేనలు ఆక్ర మించాయి.

తర్వాత అటు ఒక ప్రభుత్వం. ఇటు ఒక ప్రభుత్వం ఏర్పడినవి. సోవియట్ సేనలు ఉపసంహరించుకోబడినవి. ఉత్తర కొరియాలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడి చాల సంస్కరణలను కొనివచ్చినది. దక్షిణాన అమెరికా కీలుబొమ్మ ప్రభుత్వం ఏర్పడినది. ఎన్నికలలో కమ్యూనిస్టు అభ్యర్థులనే అరెస్టుచేయడం, దారుణ నిర్బంధ విధానం పొడసూపినది. రెండు ప్రాంతాలను కలిపి ప్రజాప్రభుత్వం ఏర్పరచాలన్న ఉద్యమం కొరియన్ ప్రజల్లో పాతుకొన్నది.

అమెరికా మద్దతుపై 1950 జులైలో దక్షిణ కొరియా ఉత్తర కొరియాపై పడడంతో తీవ్రమైన యుద్ధం ఆరంభమైనది. అమెరికాయే తన మెజారిటీని పురస్కరించుకొని, తానే దక్షిణ కొరియాకు సేనలను పంపి, తర్వాతనేమో మిత్రరాజ్య సమితితో అంగీకరింప జేసినది. ఈ సంవత్సరం పొడుగునా అటూ ఇటూ సేనానివేశాలు సంచలించడం జరిగింది. మంచూరియా సరిహద్దులలోవరకు దిగి, అక్కడి పరిశ్రమలను ధ్వంసం చేయాలన్న అమెరికా ఎత్తుగడలను భగ్నం చేసేందుకై చైనా స్వచ్ఛందసేనలు ఉత్తరకొరియా సేనలతో భుజం భుజం కలిపి పోరసాగినవి.

ఇందాకా సర్వాధికారాంతో సర్వసేనానిగా ఉన్న మెకార్థర్ ఎలాగో చైనాపైనే ధ్వాడిచేయాలని ఉబలాటపడ్డంగమనించి, అమెరికా అధ్యక్షుడు దీనిని తొలగించాడు, కొరియా ఆటంబాంబు నుపయోగిస్తామని అనీ అనకనే ట్రూమన్ మాట ఉపసంహరించుకొనేదాకా ప్రజ లూరుకోలేదు. కొరియాలోని యుద్ధంలో చైనాప్రవేశమెంత న్యాయమో భారత ప్రభుత్వం గట్టిగా చెబుతూ వచ్చింది. సోవియట్ ప్రతినిధి (మిత్రరాజ్యసమితి) సూచనపై, ఇప్పుడు, అమెరికా సేనాధిపతి ప్రతినిధులూ ఉత్తరకొరియా ప్రతినిధులూ యుద్ధవిరమణకై సంప్రతింపులు కొనసాగిస్తున్నారు. తటస్థ ప్రాంతమేదన్న అంశంపై నేటికింకా (1951 సెప్టెంబరు నాటికి) సమాధానం కుదరలేదు.

గ్రేట్ బ్రిటన్ Great Britain

యునైటెడ్ కింగ్డం ఆఫ్ గ్రేట్ బ్రిటన్ అండ్ నార్తరన్ ఐర్లాండనీ అంటారు. సంక్షిప్తంగా యు. కె అనికూడ దీనినేఅంటారు. 94,277చ॥ మై॥ జనాభా నాలుగుకోట్లా 75 లక్షలు. ఇంగ్లాండు, స్కాట్లాండు,

వేల్సు, ఉత్తర ఐర్లాండు ఇందులో చేరినవి. బ్రిటిషు రాజ్యాంగం సం దాయానుగతమై వస్తున్నది. కొన్ని శాసనాలిలా చారిత్రకంగా వస్తున్న మాగ్నాచార్టా, పెటిషన్ ఆఫ్ రైట్సు, హెబియస్ కార్పస్ ఆక్టు, పా మెంటు ఆక్టు ఇలాంటివి.

రాజుగారికి హక్కులు అతి పరిమితమైనవి. ప్రభుత్వం పార్లమె టరీ పద్ధతిలో నడుస్తుంది. కామన్సు సభలో మెజారిటీఉన్న పార్టీ మంత్రి వర్గం ఏర్పరుస్తుంది. ఇప్పుడు (1951) లేబర్‌పార్టీ మంత్రివర్గ పరిపాలిస్తున్నది. అక్టోబరు (1951) ఆఖరున కొత్త ఎన్నికలు వస్తున్నవి.

బ్రిటన్‌కు చాల పెద్ద సామ్రాజ్యమున్నది. 1947 ఆగస్టులో ఇండియా, పాకిస్తానులకు పరిపాలనాధికారం ఇవ్వబడినది. మలయాలో నేటికీ స్వతంత్ర సంగ్రామం నడుస్తున్నది. మధ్యప్రాచ్యంలో జాతీయ శక్తులు విజృంభిస్తున్నవి.

కాని రెండవ యుద్ధంలో బ్రిటన్ బాగా దెబ్బతిన్నది. ఋణగ్రస్త మయి పోయినది. ఇందుతో నేడు ప్రపంచ రాజకీయాలలో అమెరికాకు వంతపాట పాడేదిగా తయరైనది.

లేబర్‌పార్టీ నాయకుడు అట్లీ ప్రధానిగా నేడున్నాడు, (అక్టోబరు 1, 1951)

ఇండియాను 150 ఏళ్లుగా జలగలా పీల్చి పిప్పిచేసిన బ్రిటిష్ సామ్రాజ్యవిధాన ఇరిత్ర విపులీకరించేందుకు కిక్కడ తావుచాలదు.

## గుత్త వ్యాపారసంస్థలు Monopoly Concerns

దేశంలోని వ్యాపార విధానమంతటిని కేంద్రీకరించే పద్ధతి నేడు ప్రబలుతున్నది. కార్పొరేషన్లు, ట్రస్టులు, కార్టల్సు వీనిద్వారా ఒకటి రెండు పెద్ద కంపెనీలేర్పడి యావత్తు ఉత్పత్తి వాణిజ్యాదులను తమ

గుప్పిటపెట్టుకుంటున్నవి. ఇవి అమెరికాలో నేడెక్కువగా నున్నవి. వీనినే మొనాపలీ కన్సర్నులు అంటారు.

గుత్తవ్యాపారవ్యవస్థ Monopoly Society

గుత్తవ్యాపార సంస్థలచేత ఆర్థిక జీవితమంతా పొదిగిన సమాజ వ్యవస్థ—నేటి అమెరికా వ్యవస్థ ఇదే.

చైనా China

వైశాల్యం 4,278,000 చ॥మై॥ జనాభా 45,80,00,00. 1911 విప్లవం మంచూ చక్రవర్తిని తరిమివేసి రిపబ్లిక్ చైనాను ఏర్పరచింది. మొదటి అధ్యక్షుడు మార్షల్ యువాణ్‌షీకైను (1915లో చనిపోయాడు) సన్‌యట్‌సేన్ ఎదిరించాడు. నాంకింగులో (దక్షిణం) రిపబ్లిక్ ప్రభుత్వాన్నేర్పరచాడు. ఆంతరంగిక కల్లోలం ఏళ్లతరబడి కొనసాగినది. రాష్ట్రంలో ఎవరికివారు రాజులుగా ఏర్పడి, పరస్పరం యుద్ధం చేసుకోసాగారు. 1913లో సన్‌యట్‌సేన్ కొమింటాంగ్ పక్షాన్ని, సోవియట్ సలహాదారు మెరోడిన్ సాయంతో పునర్నిర్మించాడు. 1924లో జంగ్‌కైషేక్ దక్షిణంలోని సేనానులను ఓడించాడు. 1926లో జనరలిస్సిమో అయ్యాడు ఆయన. 1928లో ఉత్తరంలో మిలిటరీని యితను ఓడించాక చైనా సంయుక్తమైనది. కాని 1929లో ఇందాకా తమతోఉన్న కమ్యూనిస్టులతో విడిపోయి జంగ్‌కైషేక్ షాంఘైలో వేలకొలదిమందిని చిత్రవధ చేశాడు, కమ్యూనిస్టులు సోవియట్ల పాలనను రెండు దక్షిణ రాష్ట్రాలలో ఏర్పరచారు. ఎన్నో సంస్కరణలను అమలు జరిపారు. జంగ్ వారిపై ఏడుతూర్లు దాడిజరిపాడు. 1934లో ఆ ప్రాంతాల నాక్రమించాడు. కాని కమ్యూనిస్టు సేన తప్పించుకొని పశ్చిమానికి మహాప్రస్థానం సాగించి జెబువాన్‌రాష్ట్రంలో తమపాలన నేర్పరచుకున్నది.

1931లో జపాన్ మంచూరియాను ఆక్రమించుకున్నది. 1932లో షాంఘైలో తీవ్రంగా జపానుతో పోరాటంవచ్చినది. జంగ్ కమ్యూనిస్టులతో సమాధానపడి దురాక్రమణ నెదిరించక జపానుతో రాజీ పడ జూచాడు. కాని 1927లో ఏదోసాకుతో జపాను చైనాపై పెద్దఎత్తున దాడి సాగించింది. నాంకింగును ఆ డిసెంబరులో ఆక్రమించుకొన్నది. చైనా ప్రభుత్వం చుంకింగుకు వెళ్లినది. కమ్యూనిస్టుపార్టీ కొమింటాంగుల మధ్య సమాధానమేర్పడినది. చైనాప్రజ ఏకైకదీక్షతో జపానుతో పోర సాగినది. ఆఖరున జపాను ఓడిపోయినది.

జంగ్‌కై షేక్ తొలినుండీ కమ్యూనిస్టులనెలా అణచి, తనపీడనను కొనసాగింతామా అనే చూస్తున్నాడు, వీరిమధ్య తిరిగీ తగాదాలేర్పడినవి. కమ్యూనిస్టు సేనల ప్రాంతంపై జంగ్ కై షేక్ యుద్ధం చేయసాగాడు. వారు నిరోధించారు. తత్ఫలితంగా దారుణమైన అంతర్యుద్ధం ప్రబలినది. అమెరికా ధన ఆయుధబలంతో, జంగ్ తన దుష్పరిపాలన కొనసాగించ లేకపోయాడు. లంచగొండితనం, పక్షపాతదృష్టి, నైచ్యం ఈయన పాలనకు చిహ్నాలుగా తయారయినవి.

1949 అక్టోబరులో కమ్యూనిస్టుపార్టీ జంగ్ సేనలను ప్రధాన చైనా భూమినుండి తరిమివేసి మావ్ సే టుంగ్ నాయకత్వంక్రింద నూతన ప్రజాతంత్ర చైనా రిపబ్లిక్‌ను ఏర్పరచినది. ఇందుతో అన్నిపార్టీల వారితో ప్రభుత్వం నెలకొన్నది.

నోట్లముమ్మరం, ఆర్థికదురవస్థ తొలగింపబడినది. సంస్కరణ లెన్నో అమలుజరుగుతున్నవి. జంగ్ ఫార్మోసా చేరుకొని అమెరికా భరణం తింటున్నాడు.

అమెరికా సామ్రాజ్యవాదులిప్పటికీ ఈ చైనాప్రభుత్వాన్ని గుర్తించక మొండిగా ఉన్నారు. ఇండియా, బ్రిటన్, తూర్పు యూరపురాజ్యాలు వగైరాలు గుర్తించినవి.

జంకర్లు Junkers

జర్మనీలో తూర్పు ప్రాంతం ప్రష్యాలో ఉన్న భూస్వాములను జంకర్లు అంటారు. వీరు చాలకాలంగా ఉంటూవచ్చారు. జర్మన్ ప్రజలను పీల్చిపిప్పిచేస్తూ, యుద్ధస్వాములూ, భూస్వాములుగా ఉన్న వీరిని గత యుద్ధంలో సోవియట్ సైన్యం విముక్తం చేసినప్పుడు ఈ ప్రాంతం నిర్మూలించివేసినది.

1918 లో కూడ జంకర్లు విపరీత వైశాల్యంగల భూభాగాని కధినాథులుగానున్నారు.

జపాను Japan

వైశాల్యం 1,48,800 చ॥మై॥. జనాభా 7కోట్ల40 లక్షలుదాదాపు. 1905లో రష్యాను ఓడించడంతో దీనిపై ఆశియావాసులకొక అభిమానం ఏర్పడినది. తర్వాత అతివేగంగా యూరపియన్ రాజ్యాలలా పరిశ్రమలను పెంపొందించుకొని, చౌకగాఉన్న శ్రమశక్తిద్వారా పశ్చిమ రాజ్యాలతో వ్యాపారంలో పోటీ చేయసాగినది.

తమ దేశంలో ఉత్పత్తిని తమ దేశమందరికి పంపకం చేయక, మార్కెట్టులకోసం ఇతరులను బానిసలుగా చేసుకోవాలనే సామ్రాజ్యవాద విధానానుగుణంగా చైనాపై దురాక్రమణ సాగించడంతో ఆసియావాసులి లోని స్వతంత్రకాముకుల క్రోధానలానికి గురిఅయినది.

యూరోపులో హిట్లర్ ముసోలినీల ఫాసిస్టు దురాక్రమణతో వీరికి కూడ నోరూరినది. ముగ్గురూ కమ్యూనిస్టు వ్యతిరేక సంఘటన నేర్పర

చారు. 1941లో మూడురాజ్యాల సంధిని చేసుకున్నారు. 1941 డిసెంబరు 7న జనరల్ టోజో ప్రధానిత్వంతో జపాను, అమెరికా, బ్రిటనులపై దాడి చేసినది. సోవియట్ ఆఖరునగాని జపానుపై యుద్ధం సాగించలేదు ఆఖరున మిత్రరాజ్య సేనలు జపాను నోడించినవి. వెంటనే అమెరికా జనరల్ మెక్కార్థర్‌ను సర్వస్వతంత్ర చక్రవర్తిలా చేసింది. జపాను నేలకూలినది. అక్కడి అభ్యుదయ శక్తుల నణచివేస్తూ. అభివృద్ధి నిరోధకుల కితను సాయపడి, తిరిగీ జపానుసేనను చైనాపై వ్యతిరేకంగా పునర్నిర్మింప జూచాడు. మెక్కార్థర్‌ను బర్తరఫ్ చేయడం జరిగినప్పటికి, అమెరికా ఎలాగో జపాను ఫాసిస్టు శక్తులను తమ కీలుబొమ్మలుగా ఉపయోగించుచుకుని, చైనా ప్రజాస్వామ్య శక్తులపై దెబ్బ తీయాలని చూస్తున్నది.

జపాను శాంతిసంధి ముసాయిదాను చైనా సోవియట్‌లతో సంప్రతించకుండా తయారుచేసి, 1951 సెప్టెంబరులో సంతకాలు అమెరికా వర్గం చేశారు. కాని చాల ప్రభుత్వాలు—భారత ప్రభుత్వంకూడ దీని నాక్షేపించినవి. ఫార్మోసాను చైనా ప్రాంతంగా గుర్తించాలని, సంధి తర్వాతకూడ జపానులో అమెరికా సైన్యాల నుంచడం తగదని ఈ దేశాలు ఆక్షేపిస్తున్నవి.

జర్మనీ Germany

21, 00, 000 చ॥మై॥, జనాభా ఆరున్నర కోట్లు. 1914—18 యుద్ధంలో కైజర్ పతనమైనతర్వాత రిపబ్లిక్‌గా ఏర్పడిన పునర్నిర్మాణ కార్యక్రమం సాగుతుండగా 1930 లో ఆర్థిక సంక్షోభం దేశాన్ని కదిపి వేసింది. సోషల్ డెమాక్రాట్లు కమ్యూనిస్టు ప్రాబల్య భయంతో తీవ్ర విధానాల నమలుపరచి సోషలిస్టువ్యవస్థ నేర్పరచలేకపొయ్యారు. 1933లో హిండెన్‌బర్గు హిట్లర్‌కు పాలన నప్పగించి చేజేతులతో ఫాసిస్టులకు దేశాన్నప్పగించాడు.

జర్మనీకి నియంతఅయి హిట్లర్ ప్రజాశక్తులపై కమ్యూనిస్టులపై, యూదులపై దారుణ హింసాకాండ నెరపాడు. వర్సైల్సు సంధిని భగ్నం చేయాలని, రూర్ ప్రాంతాన్నాక్రమించడంతో ఆరంభమైన ఈ దేశ దురాక్రమణ క్రమేణా ఆస్ట్రియా, జెకొస్లొవేకియా, పోలెండు ఇలా సోవియట్‌దాకా ప్రాకినది.

కాని మిత్రరాజ్యఐక్యత, ప్రజాసంఘటన అమేయశక్తిని కనబరచినది. స్టాలిన్‌గ్రాడులో సోవియట్ సేనలు ఇంటింటికీ, గోడగోడకూ, రాతిరాతికీ ప్రతిఘటన సాగించి హిట్లర్ సేనలపై మొట్టమొదటిసారి చావుదెబ్బతీసినవి. తర్వాత క్రమంగా బెర్లిన్ గుండెలోనికి సోవియట్ సేనా కరవాలం గ్రుచ్చుకొన్నది. హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడు.

జర్మనీ మూడు ప్రాంతాలుగా విభక్తమయింది. సోవియట్ ప్రాంతం అమెరికా ప్రాంతం, బ్రిటిషు ఫ్రెంచి ప్రాంతాలు—అందులో తూర్పు ప్రాంతం సోవియట్ ఆక్రమణకిందనున్నది. పశ్చిమ ప్రాంతం అమెరికా బ్రిటన్‌లక్రింద నున్నది.

పశ్చిమ జర్మనీని ఆయుధాగారంగా చేయాలని పశ్చిమ రాజ్యాలు ప్రయత్నిస్తున్నవి. తిరిగి దేశాన్నేకీభవింపజేసి రిపబ్లిక్కును ప్రజాతంత్ర శక్తులతో ఏర్పరచాలన్న ఉద్యమమే బలపడుతున్నది.

తూర్పు జర్మనీలో అతివాదపక్ష ప్రభుత్వంఏర్పడి పాలన సాగిస్తున్నది. పశ్చిమంలో అమెరికా బ్రిటన్‌లు బలపరచే ప్రభుత్వమున్నది.

**జాతీయోత్పత్తి National Produce**

దేశం మొత్తంమీద జరిగే ఉత్పత్తి మొత్తం ఎంతో దానిని జాతీయోత్పత్తి అంటారు.

జాతీయాదాయం National Income

మొత్తం దేశంమీద ఆదాయం ఎంత వస్తుందో దాన్ని లెక్కవేసి దానిని జనాభాకు సరిగా భాగించి, సగటున మనిషి కింత ఆదాయం అని లెక్కవేస్తారు.

జెకొస్లొవేకియా Czechoslovakia

అంతవరకూ ఆస్ట్రియా సామ్రాజ్యంలో ఉన్న జెకొస్లొవేకియాను థామస్ జి. మసారిక్ 1918 అక్టోబరు 18 న స్వతంత్రంగా ప్రకటించాడు. ఆయనే రిపబ్లిక్ మొదటి అధ్యక్షుడయ్యాడు. మూడుసారులు (1920, 1929, 1934) తిరిగీ ఎన్నుకోబడినాడు. 1935 డిసెంబరు 14 న అనారోగ్యంవల్ల అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చాడు. 1937 సెప్టెంబరు 1 న చనిపోయాడు.. అప్పటి కాయన వయసు 87, ఈయన గొప్ప తాత్త్వికుడు, రాజ్యాంగవేత్తా.

జెకొస్లొవేకియా వైశాల్యం 62,000 చ॥మై॥, జనాభా 150లక్షలు. (1938) సుడెటాణ్ ప్రాంతంలో జర్మన్లు 30లక్షలదాకా ఉన్నారు. వీరి ఆసరాతో హిట్లర్ ఆ ప్రాంతం తనకు రావాలని హంగామా చేశాడు. (1938 సెప్టెంబరు)

ఎలాగో ఎవరిని బలి చేసయినాసరే హిట్లరును సంతృప్తిపరచి, అతనిని తూర్పునకే దండయాత్ర వెడలచేయాలనుకున్న బ్రిటిష ప్రధాని ఛేంబర్లేన్ మ్యూనిక్ ఒడంబడికలో సంతకంపెట్టాడు. దీనితో సుడెటాన్ ల్యాండును జెకొస్లొవేకియా హిట్లరున కప్పగించవలసివచ్చింది. ఇందుతో పాటు హంగేరీ పోలెంపులలోని, అప్పటి అభివృద్ధినిరోధక ప్రభుత్వాలు కూడ, జెకొస్లొవేకియా ప్రాంతాలు తమకు కావాలన్నాయి. కొన్నిటినివ్వక తప్పలేదు.

అప్పటి అధ్యక్షుడు. డాక్టర్ బెనిస్ రాజీనామాయిచ్చి విదేశాలకు వెళ్లాడు. అభివృద్ధినిరోధకవర్గాలు అధికారంచేపట్టారు. నాజీలుఆగలేదు. 1939 మార్చి పదవతేదీ స్వతంత్రం కావాలంటూ జెకొస్లొవేకులు తిరుగు బాటు లేవదీశారు. ఇది సాకుగాతీసుకొని హిట్లర్ జెకొస్లొవేకియాను మార్చి 15న ఆక్రమించాడు. నిరోధమే లేకపోయినది. దేశం జర్మన్ల స్వాధీనమయింది.

దేశాన్ని జర్మన్లమయం చేయాలని హిట్లర్ చూచాడు. ప్రజలు క్రుద్ధులయ్యారు. విద్యార్థులీ నీచాలను ప్రతిఘటించారు, 1940 నవంబ రులో యూనివర్సిటీలను, కాలేజీలను జర్మన్లు మూసివేశారు. 1941 జనవరి 11 న దీనిని జర్మనీతో కలిపివేసుకున్నారు.

నాజీ దురాక్రమణలో జెక్కులు నానా బాధలుపడ్డారు. స్లొవేక్కులు కూడ ఆక్రమణ తర్వాత జెక్కులతో కలిశారు. క్రాందిశీక ప్రభుత్వం ఏర్పడినది. ప్రజలలో అతివాదపార్టీలు రహస్యంగా పనిచేస్తూ, పాలకు లను ప్రతిఘటించసాగాయి, నాజీలు వెట్టియెత్తి ప్రజలను, ప్రజానాయకు లను నానాహింస పెట్టారు. ఆఖరున సోవియట్ సేనలు జెకొస్లొవేకి యాను విముక్తంచేశాయి.

1946 మేలో జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీకి అత్యధిక సంఖ్య వచ్చినది. డాక్టర్ బీన్సు అధ్యక్షతక్రింద, కమ్యూనిస్టు ప్రధాని సంయుక్త మంత్రివర్గం ఏర్పరచాడు. సాంఘిక ఆర్థిక సంస్కరణలు చాల జరిగినవి. అసమానతను తొలగించే అవకాశాలు బలిసినవి, నేడు జెకొస్లొవేకియా కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యంక్రింద నూతన ప్రజాతంత్ర వ్యవస్థను ఏర్పరచుకొన్నది. సోషలిజంవేపు పరుగిడుతున్నది.

డాక్టర్ బీన్సు చనిపోయాడు, నేటి అధ్యక్షుడు, మంత్రివర్గ సభ్యు లందరుకూడ కమ్యూనిస్టుపార్టీ నాయకులే.

టునిస్ Tunis

దీనినే టునీసియా అనికూడ అంటారు. వైశాల్యం 48000చ॥మై॥ జనాభా 26లక్షలు, ఇందులో 108,000 ఫ్రెంచివారు, 94,000 ఇటాలియన్లు, 700 మాత్రేసు, 23.90,000 అరబ్బీమాట్లాడే స్వదేశీయులున్నారు.

ఫ్రెంచి ధర్మకర్తృత్వం క్రిందనున్న ఉత్తర ఆఫ్రికాలోని దేశం. అధికారమంతా ఫ్రెంచి రెసిడెంటు జనరల్‌దే, ఫ్రెంచి సేనానివేశాలిక్కడ ఉన్నవి.

ఈ దేశం బాగా పండుతుంది. ఫాస్ఫేట్ గనులు ఇక్కడ చాల ఉన్నవి.

ఇందులో ఇటలీవారున్నారుగనక తమకురావాలని ఇటలీప్రభుత్వం అంటూ వచ్చినది.

ఇక్కడ విపరీతంగా జాతీయభావాలు ప్రకోపిస్తూన్నవి. జాతీయోద్యమం చెలరేగుతున్నది.

ధనికవాదం Capitalism

ఉత్పత్తిసాధనాలు, పంపకం—అంటే ఆర్థివ్యవస్థ యావత్తూ సొంత యాజమాన్యంక్రింద ఉండగా, యజమానులు సొంత లాభాల కోసం వానినినడిపే ఆర్థికవ్యవస్థను ధనికప్రధానం, ధనికవాదం, పెట్టుబడిదారీ పద్ధతి అంటారు. తమ శ్రమశక్తి నమ్ముకునే కార్మికవర్గం ఈ వ్యవస్థలో తప్పనిసరి. వారి శ్రమవల్ల జరిగే ఉత్పత్తిలో అదనపు విలువ ద్వారా కోట్లుగడించి కుబేరులు దేశాలేలుతారని, ఇందులో ఏ ప్రణాళికాలేని అరాచకమైన ఉత్పత్తి తప్పదని సోషలిస్టులు విమర్శిస్తారు.

దీనిక్రింద క్రమంగా ధనం అల్పాల్ప సంఖ్యాకుల చేతిలోనే కేంద్రీకృతమై మిగత పాటకజనానికీ, వీరికీమధ్య అఖాతం పెద్ద దవుతుంది.

దక్షిణాఫ్రికా South Africa

బ్రిటిష్ కామన్వెల్తులోని దేశం, 4 7 2 వేల చదరపు మైళ్లు. 90,60,000 జనాభా, ఇందులో 20 లక్షలు తెల్లవారు. వీరిలో నూటికి 58 ఆఫ్రికన్సు అనే డచ్చి వికృతిని మాట్లాడతారు. మిగతవారు ఇంగ్లీషువారు యూనియన్ ఆఫ్ స్టేట్ ఆఫ్రికా 1950 లో ఫెడరేషనుగా ఏర్పడింది. ఇందులో కేప్, నేటాల్, ట్రాన్స్వాల్, ఆరంజి ఫ్రీస్టేట్లు ఉన్నవి.

స్వదేశీయులను, భారతీయులను మాలపల్లె వగైరా బిల్లులద్వారా అతి ఘోరంగా ప్రభుత్వం బాధిస్తున్నది. ఇక్కడే గాంధీజీ మొదటి సత్యాగ్రహం చేశారు. నేటికీ రంగువిభేదం దారుణంగా ఉన్నదిక్కడ

ప్రపంచంలో ఉత్పత్తిఅయ్యే బంగారంలో నూటికి 40 వంతు లిక్కడే ఉత్పత్తి అవుతుంది. వజ్రాల ఉత్పత్తిలోకూడ ప్రధానమైన దేశమిది.

నాజీపార్టీ Nazi Party

నేషనల్ సోషలిస్టుపార్టీకిది సంగ్రహనామం. 1919 లో డ్రిక్సర్ అనే జర్మన్ కార్మికుడు మ్యూనిచ్‌లో దీనిని స్థాపించాడు. జర్మన్ లేబర్ పార్టీ అని అప్పటిపేరు. దీనిలో 7వ సభ్యుడుగా హిట్లర్‌చేరి నాయకత్వం వహించి అసలు స్థాపకుని తొలగించివేశాడు.

నాజీపార్టీ 1933లో అధికారానికి వచ్చింది. ఇందులో సోషలిజం ఏమీలేదు. ధనికవిధానం భద్రపరుపబడినది. పైగా జర్మన్లు ఆర్యులని వారు ఇతరులందరిపై అధికారం నడపనర్హులనీ జాత్యహంకార సిద్ధాంతం

తెచ్చిపెట్టి ప్రపంచాధిపత్యంకోసం పరవళ్లుతొక్కిన పార్టీ—యూదులను చిత్రహింసపెట్టిన పార్టీ—

హిట్లర్ దీనికి నాయకుడు. అతనే ఉపనాయకులను నియమించడం మొదలు అన్నిటికీ సర్వాధికారి. సభ్యులు చెప్పినట్టు నడవాలి. 30 లక్షల మంది ఇందులో సభ్యులుండేవారు. రెండో యుద్ధంతో ఇది ఈ రూపంలో నశించినది.

నాజీ ప్రభుత్వం Nazi Government

నాజీపార్టీ నాయకుడు హిట్లర్ ఏర్పరచిన ప్రభుత్వం, హిట్లర్ సర్వాధికారాలుగల సర్వతంత్రస్వతంత్ర నియంత. 1933లో అధికారానికి వచ్చి, 1945 హిట్లర్ పతనంతో ఈ ప్రభుత్వం పతనమైపోయినది.

నానాజాతిసమితి League of Nations

1920లో మొదటి ప్రపంచ యుద్ధంతర్వాత శాంతిసంధి మొదటి భాగంలోని సూత్రాలప్రకారం స్థాపితమైనది. దీని స్థానం జెనీవా (స్విట్జర్లాండు) వివిధ దేశాలు దురాక్రమణ పాలు కాకుండా ప్రపంచ శాంతిరక్షణ కని ఇది ఏర్పడింది. దురాక్రమణపరులపై నిర్బంధాలు విధించేహక్కు దీనికున్నది. లేబర్ ఆర్గానిజేషన్. ప్రపంచ న్యాయస్థానం దీని అనుబంధ సంస్థలు. 54 సభ్యులిందులో ఉండేవారు. అమెరికా ఇందులోచేరలేదు.

1931 లో జర్మనీ ఇందులో చేరింది. కాని 1933లో హిట్లర్ రాకతో అది వేరుపడినది.

1932 లో మంచూరియాలో జపాను దురాక్రమణను ఈ సంస్థ ఆపలేకపోయింది. దాన్ని ఖండించినందుకే జపాను సమితిని విడిచిపెట్టింది. 1934లో సోవియట్ ఇందులో చేరింది.

1935 లో ఇటలీ అబిసీనియాపై దాడిచేయగా నానాజాతిసమితి ఏమీ చేయలేకపోయింది. ఇటలీ దీనిని విడిచిపెట్టింది. ఇందుతో దీని ప్రతిష్ఠ మంటగలిసింది. జర్మనీ, ఆస్ట్రియా, జెకొస్లొవేకియాలను కబళిస్తే ఇది నోరుమెదపలేదు, పోలెండుపై పడినా ఏమీచేయలేదు. మరి రష్యా తన రక్షణకై ఫిన్లాండును ఆక్రమంచనుండగా దానిని బహిష్కరించింది. అంతే. క్రమేణా సహజ మరణాన్ని పొందింది.

నేడు మిత్రరాజ్యసమితి ఆ స్థానాన్ని ఆక్రమించింది.

నోట్లముమ్మరం Inflation

ఉత్పత్తి మొత్తాని కవసరమెంతో దాని కనుగుణంగాకాక, భద్రతను గుర్తించక స్వేచ్ఛగా నోట్లను ముద్రించడంతో నోట్లముమ్మరం ఏర్పడుతుంది. దొరికే వస్తువులకూ, డబ్బుకూ మధ్య అఖాతం ఏర్పడ్డంతో డబ్బుకు విలువ తగ్గిపోతూంది. ధరలు పెరుగుతాయి. 1914-18లలో విపరీతంగా నోట్లముమ్మరం ఏర్పడింది. 1930లో ఆర్థిక సంక్షోభం రాగా దానినుండి కోలుకునేందుకు నోట్లముమ్మరాన్ని ఉపయోగింప జూచారు, కాని సాధ్యపడలేదు. నోట్లపై నమ్మకం తగ్గడంతో మరొక సున్నితమైన పద్ధతి వెదకసాగారు. ప్రభుత్వం బిల్లులు, టాక్సుబాండులు. జర్మనీలో ఇలాంటి పద్ధతినే నేడు తిరిగీ ధనికరాజ్యాలలోను నోట్లముమ్మరం విపరీతంగా పెరుగుతున్నది..

నోట్లముమ్మరం అత్యధికస్థాయికి వెళ్ళినది చాంగ్ కై షేక్ పాలన క్రింద చైనాలో, మోపెడునోట్లు మోసుకువెడితేగాని క్షౌరం చేసుకోను వీలులేదని చమత్కరించి చెప్పేవారు.

న్యూడీలు New Deal

1929 ఆర్థిక సంక్షోభాన్ని దాటుకునేందుకు సాధనంగా అమెరికా ప్రసిడెంటు రూజ్వెల్టు 1933లో ఈ ఆర్థికవిధానాన్ని ఏర్పరచాడు.

వ్యాపారంలో ప్రభుత్వజోక్యం ప్రధానమైనదిగా ఏర్పరచారు. ప్రభుత్వం—పనులద్వారా ప్రభుత్వం పారిశ్రామిక పునర్నిర్మాణం ఆరంభించింది. సులువుగా అప్పులిచ్చారు. కొనుగోలుశక్తిని పెంపొందించారు. డాలరు విలువ 40% తగ్గించారు. ప్రభుత్వ సహాయంతో వారంటుతో భారీయెత్తున గృహనిర్మాణం సాగించారు. ఇవికాక చాల ప్రభుత్వశాఖలను, సంస్థలను ఏర్పరచి పనిలేనివారికి ఆర్థిక కార్యక్రమమివ్వజూచారు. నిరుద్యోగ సహాయాన్ని పెంచారు, వాగ్నర్ లేబర్ వేజెస్ ఆక్టుద్వారా కార్మికులు సంయుక్తులు కా వీలు కల్పించారు.

ద్రవ్యంపై కంట్రోలును బాంకింగు ఆక్టు, సెక్యూరిటీస్ ఎక్స్ఛేంజి కమిషన్లు ప్రభుత్వంచేతిలో నుంచాయి. వాల్‌స్ట్రీట్ అధికారాన్ని తగ్గింపజూచారు.

మొదట ఈ న్యూడీలును తీవ్రంగా ప్రతిఘటించడం జరిగింది. ఇందులో కొన్ని భాగాలను అమెరికా సుప్రీంకోర్టు తొలగించింది.

నిరుద్యోగాన్ని నిర్మూలించకపోయినా, ఈ విధానం అ సంఖ్యను 170 లక్షలనుండి 70,1000 లోపుకు—దించివేసింది. ఏమైనా ఇందులో ప్రధానమైనసూత్రా లలాగే ఉంచబడినవి.

పంచవర్ష ప్రణాళిక • Five Year Plan

సోవియట్ యూనియన్ ఆర్థిక ప్రణాళికలు: మొదటిది 1927-32 రెండవది 1932—1935 మూడు 1938—42, వీనిద్వారా ప్రధాన పరిశ్ర

మలను విద్యుచ్ఛక్తి ఇతర వస్తూత్పత్తిని పెంచారు. దేశానికేంకావాలి—ఎంత కావాలి—ఉన్న ముడిసరుకులూ వగైరాలను సమగ్రంగా ఆలోచించి ఈ అయిదేళ్లలో ఈ పనులు చేయాలని ఒక ప్లానువేస్తారు. దానిని చక్కగా అమలు జరిపడంతో ఆర్థికస్థితి బాగుపడుతూ వస్తుంది. 1927—1938దాకా ఈ ప్రణాళికల మూలంగా సోవియట్ ఉత్పత్తి ఇలా పెరిగింది:

(పదిలక్షల టన్నులలో)

| | |
|---|---|
| బొగ్గు | 35—140 |
| ముడిఇనుము | 3—15 |
| ఉక్కు | 3—18 |
| నూనె | 11—30 |
| సిమెంటు | 11—66 |
| మోటార్లు | 0—170000యూనిట్లు. |

వ్యవసాయాన్ని యంత్రమయంచేసి, సమిష్టి యాజమాన్యంక్రిందికి తెచ్చి విపరీతంగా అభివృద్ధిపరిచారు. 1938లో 1913 కల పారిశ్రామిక వస్తూత్పత్తి తొమ్మిదింతలు పెరిగింది. ధాన్యోత్పత్తి 118%: పశుసంపద 104%. స్వయంసంపూర్ణత ప్రధానప్రాతిపదికగా విదేశవాణిజ్యం పరిమితంగా ఏర్పరచుకొని ఈ పంచవర్ష ప్రణాళికలు తయారయినవి.

రెండవ యుద్ధానంతరం కూడ ఈ ప్రణాళికలు యథాతథంగా సంపూర్తి చెందుతున్నవి.

పర్మనెంటు సెటిల్‌మెంటు Permanent Settlement

భూమి పన్నును వసూలుచేసేపద్ధతిని సెటిల్మెంటు అంటారు. అందులో కొందరు జమీందార్లకు మీరింత పన్ను కట్టాలి అని శాశ్వ

తంగా ఏర్పరచగా దానిని పర్మనెంటు సెటిల్‌మెంటు అంటారు. ఈపద్ధతి బెంగాలు, బీహారు, యు. పి. మదరాసు రాష్ట్రాలలో కొన్ని భాగాలకు చెందినది. దీనిక్రింద అవిభక్తభారతంలో 120 మిలియన్ ఎకరాల భూమి ఉండినది.

తర్వాత క్రమేణా ఈ జమీందారీలను రద్దుచేసేందుకు రాష్ట్ర ప్రభుత్వాలు చట్టాలు చేసినవి. నెమ్మదిగా జమీందారీలను రద్దుచేసే కార్యక్రమం సాగుతున్నది.

### పశ్చిమ యూరోపు Western Europe

యూరోపు భూఖండంలోని ఈ రాజ్యాలను పశ్చిమ యూరపియన్ రాజ్యాలంటారు—

జర్మనీనికూడ రెండవయుద్ధం ఆఖరున విభజించిడంతో ఇలా ఉన్నది:

| | | |
|---|---|---|
| పశ్చిమ జర్మనీ | డెన్మార్క్ | పోర్చుగీసు |
| ఫ్రాన్సు | స్విట్జర్లాండు | నార్వే |
| బెల్జియం | ఇటలీ | స్వీడన్ |
| హాలండు | స్పెయిన్ | బ్రిటన్ |

### పారిశ్రామిక మూలబలం Industrial Reserve Army

యంత్రాల ప్రాబల్యంవల్ల ఒకమనిషి ఉత్పత్తిశక్తి పెరుగుతుంది. ఒక నిర్ణీత ధనం పెట్టుబడిగా పెడితే పూర్వం వెయ్యిమంది కార్మికులు కావలసివస్తారనుకొండి, యంత్రప్రాబల్యం, సునిశితత్వం పెరిగేకొద్దీ అదే పెట్టుబడికే నూరుమంది సరిపోతారు. ఇందుతో, పనిచేయగల కార్మికులు పనిలేక ఉండిపోతూ వస్తారు,

ఇలాంటి నిరుద్యోగ కార్మికులనే మార్క్సు పారిశ్రామిక మూల బలం అన్నాడు.

పోలెండు Poland

1,50,000 చ॥ మై॥. రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు దీని జనాభా 3 కోట్ల 40 లక్షలు. రష్యా ప్రష్యా ఆస్ట్రియాల మధ్య ఇది 1772, 1793, 1795 లలో విభక్తమై స్వతంత్రం గోల్పోయింది. మొదటి యుద్ధంతర్వాత స్వతంత్రమైనది. దీనిలోని కారిడర్‌లో జర్మన్లెక్కువ. ఇక్కడ ఓటింగు తీసుకోబడగా ఎగువ శైలేషియా జర్మనీతో చేరతానన్నది. కాని తూర్పుజిల్లా పోలండులో చేరతానన్నది. పోలిష్ సర్వాధిపత్యంక్రింద డాంజిగ్ స్వతంత్ర నగరం చేయబడినది.

1926 లో మార్షర్ పిల్సుడస్కీ నియంత అయ్యాడు. కర్నల్‌స గ్రూపు అనే స్వాముల మిలిటరీ గ్రూపుతో ఇతను నిరంకుశ రాజ్యం చేశాడు,

ప్రతికక్షులు జైళ్లల్లో పడ్డారు. ప్రవాసితులైనారు. 1934 లో పోలెండు నాజీ జర్మనీతో రాజీపడింది. ఫ్రాన్సు మైత్రి సన్నగిల్లినది. ఇతను 1935 లో చనిపొయ్యాడు. తర్వాత స్మిగ్లిరిడ్జి అధికారం కొనసాగింది, రాజ్యాంగ చట్టం రద్దుచేశారు. 1937 లో నిరంకుశ పార్టీగా కర్నల్ క్రాక్ నాయకత్వంక్రింద నేషనల్ యూనిటీపార్టి ఏర్పడింది,

1938తో జెకొస్లావేకియా పోలెండుకు హిట్లర్ భాగమిచ్చిన 1939 సెప్టెంబరులో దానిపైపడ్డాడు. పోలెండు ఓడిపోయింది. రష్యా తనవేపు భాగాలను ఆక్రమించింది (పూర్వమవి రష్యాక్రింద ఉండినవి.) పోలిష్ కాందిశీక ప్రభుత్వం రాక్జివిక్జి క్రింద ఏర్పడింది.

తర్వాత యుద్ధం విజయవంతం కాగానే బ్రిటన్ అమెరికాల్ను అభివృద్ధినిరోధక ప్రభుత్వాన్నేర్పరచి సోవియట్ వ్యతిరేకతను రెచ్చ గొట్టాలని చూచారు.

నేడు నూతన ప్రజాస్వామిక ప్రభుత్వంఏర్పడి సాంఘిక వ్యవస్థను చక్కబరుస్తున్నది.

ఫాసిజం Fascism

ముసోలినీ నాయకత్వంక్రింద 1929 లో బయలుదేరిన ఇటలీ ఉద్యమం. ప్రజాస్వామికానికి, కమ్యూనిజానికి వ్యతిరేకత. నిరంకుశ నియంతృత్వ పాలనవాంఛ దీనికి మూలం. వర్గకలహం కూడదు. ముసోలినీదే సర్వదా న్యాయం. ఆయన మాట అందరూ వినాలి. హింస మంచిది. యుద్ధం గొప్పది. పౌరస్వతంత్రం కూడదు. ఇటలీ ప్రజలు గొప్పవారు. ఇవీ సిద్ధాంతాలు. నల్లషర్టులు వీరి యూనిఫారం. సామ్రాజ్య విస్తరణ ఆశయం. ఫాసిస్టు గ్రాండ్ కౌన్సిల్ ఈ పార్టీలో ఉన్నతాధికారం కలది. దీనిని ముసోలినీయే నియమించేవాడు.

గత యుద్ధంలో ఫాసిస్టు ముసోలినీ ఓడిపోవడంతో ఈ పార్టీ నశించింది. ఇలాంటి పార్టీలు బ్రిటన్ వగైరాలలోకూడ ఏర్పడినవి.

ఫ్రాన్సు France

212, 600 చ॥ మై॥ వైశాల్యం. 4 కోట్ల 20 లక్షలు జనాభా. రిపబ్లిక్కు. దీనికి పెద్ద సామ్రాజ్యముండేది. కాని ఇప్పుడు ఇండోచైనా లాంటి కొన్నిచోట్లనే ఉన్నవి. గత యుద్ధంవరకూ బ్రిటన్‌తో పాటు ప్రధానమైన అగ్రరాజ్యం గత యుద్ధంలో హిట్లర్ ఫ్రాన్సునాక్రమించాడు. కాని తిరిగీ రెండవరంగం ఆరంభమయ్యాక మిత్రరాజ్య సేనలు ఆ

దేశంలోని గెరిల్లాదళాల బలంతో విముక్తిచేసినవి. ఇప్పుడు ఫ్రాన్సు యూరపియన్ రాజ్యాలలో ప్రధానమైనవానిలో ఒకటి. అగ్రరాజ్య పంచ కంలో ఒకటి.

అల్జీరియా, ట్యూనిస్, మొరాకో, సోమాలేలాండు, జీబుట్, ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికా, మడగస్కర్, ఇండోచైనా, పుదుచ్చేరీ, యానాం, చంద్రనగర్ వీటిజనాభా 65మిలియన్లు. ఇండోచైనాలో నామకః బోదాయ ప్రభుత్వం స్వతంత్రమన్నపేర ఏర్పరచారు. కాని అక్కడి ప్రజలు వీత్మిన్ నాయకత్వం క్రింద స్వతంత్రానికై యుద్ధం చేస్తున్నారు.

భారతవలసల విషయమింకా రాయబారాలలోనే ఉన్నది.

ఫార్మోసా Formosa

తియివాన్ అని దీనినే అంటారు, చైనాకుచెందిన దీవులివి. మావ్సేటుంగ్ అతనిప్రజాస్వామికప్రభుత్వం చైనాలో ఏర్పడినతర్వాత, జంగ్కైషేక్ పారిపోయి ఈదీవుల్లో ఆవాసం ఏర్పరచుకున్నాడు. అమెరికా ప్రభుత్వం తన సేనలతో దీని నతనిక్రింద ఉంచి కాపాడు తున్నది.

దీనిపై చైనా ప్రజాస్వామిక ప్రభుత్వం తమ ప్రాంతం తమకు రావాలని కోరుతున్నది. అమెరికా సామ్రాజ్యవాదులు దానిని తమయుద్ధ కేంద్రంగా ఉపయోగించుకోవాలని చూస్తున్నారు.

ఫ్రెంచి విప్లవం French Revolution

భూస్వామ్య విధానాన్ని నశింపజేసి సమానత సౌభ్రాతృత్వం స్వతం త్రము అనే నినాదాలపై ఫ్రాన్సులో విప్లవం వచ్చినది—1789లో మానవహక్కులన్న అమెరికాస్వతంత్రయుద్ధనినాదం, ఇక్కడదారుణ పరిస్థితులుకలిసి ఈ విప్లవాన్ని విజయవంతం చేసినవి.

ఫిలిప్పైన్ దీవులు

1898-99 లో స్పెయిన్‌లో యుద్ధం తర్వాత అమెరికా దీనిని లాక్కున్నది. ఇవిగుంపుగా ఉన్న 7000 దీవులు. పదకొండు, 1000 చదరపుమైళ్లకన్న ఎక్కువ వైశాల్యం కలవి, మొత్తం వీనివైశాల్యం 1,14,000 చ॥మైళ్ల 140 లక్షలజనాభా:

1521 లో మాజెల్లాన్ వీనిని కనుక్కొన్నాడు. 16 శతాబ్దిలో స్పెయిన్ క్రింద ఉండినది.

ముఖ్యంగా ఉత్పత్తి అయ్యేవి: బియ్యం. కొబ్బరి, చెరకు, పొగాకు రబ్బరు. 1934లో అమెరికా నామకః వీనికి స్వతంత్రమిచ్చింది. ఇది తర్వాత స్వతంత్రమైనట్టు ప్రకటించారుకూడ. రెండోయుద్ధంలో జప్పాను ఆక్రమించింది. నేడు తిరిగీ అమెరికాక్రింద నామకః స్వతంత్రంగా ఉన్నవి.

బాల్కన్ దేశాలు

యుగోస్లేవియా, రుమేనియా, బల్గేరియా, గ్రీసు, ఆల్బేనియా. టర్కీలు యూరోపు రణరంగమని వీనికిపేరు.

ముఖ్యంగా వ్యావసాయక ప్రాంతం,

బిలియన్

పదికోట్లు.

బీవరిడ్జి ప్రణాళిక Beveridge Plan

సర్ విలియం బీవరిడ్జి, రెండో యుద్ధంతర్వాత సోషలిస్టుపద్ధతికాక, ప్రభుత్వజోక్యంతో పరిశ్రమల కొన్నిటినినడిపి ప్రతివారికీ ఉద్యోగం కల్పించేందుకొక ప్రణాళికను తయారుచేశాడు.

ఈ ప్రణాళికనుగూర్చి ఈ పుస్తకంలో ఆఖరున చర్చించారు.

బెల్జియం

11,775 చ॥ మై॥ జనాభా 8,300,000—క్రిక్కిరిసిన జనాభా. ప్రథమయుద్ధంతర్వాత 1936దాకా ఫ్రాన్సుతోనున్నది. తర్వాత తటస్థం. హిట్లర్ 1940 మే 10న ఆక్రమించాడు. లియొపాల్డు రాజు జర్మన్లకు లొంగిపొయ్యాడు. కాని మంత్రులు రాజును ధిక్కరించి క్రాందిశీక ప్రభుత్వమేర్పరచి మిత్రమండలివేపున పోరాడారు.

రెండోయుద్ధం ఆఖరున బెల్జియం స్వతంత్రమైనది. లియొపాల్డు 1951లో రాజ్యత్యాగం చేశాడు. అతని కొడుకును రాజుచేశారు.

**బోల్షివిస్టులు Bolshevists**

రష్యా సోషల్ డెమాక్రటిక్ పార్టీ 1903లో రెండుగా చీలిపోయింది. లెనిన్ నాయకత్వంక్రింద అధికసంఖ్యాకులు తీవ్రవిధానాన్నవలంబించాలని చెప్పారు. అల్పసంఖ్యాకులు మితవాద ధోరణి నవలంబించారు. కడకు లెనిన్‌పక్షం గెలిచింది. అధిక సంఖ్యాక పక్షం కాబట్టి వీరికి బోల్షివిక్కులని పేరు వచ్చింది. అల్ప సంఖ్యాకులను మెన్షివిక్కులన్నారు. రష్యన్‌భాషలో బోల్షిన్ స్తవో అంటే అధికసంఖ్యాక పక్షం. మెన్షిన్ స్తవో అంటే అల్పసంఖ్యాకపక్షం. సోవియట్ యూనియన్‌లో నేటికీ కమ్యూనిస్టుపార్టీని బోల్షివిక్‌పార్టీ అంటారు. కమ్యూనిస్టులకు మరొకపేరు బోల్షివిస్టులు.

**బోల్షివిస్టు విప్లవం Bolshevist Revolution**

1917 నవంబరు 7 న రష్యాలో వచ్చినవిప్లవం లెనిన్‌నాయకత్వం క్రింద బోల్షివికుపార్టీ విప్లవంనడిపి రష్యాలో శ్రామిక నియంతృత్వాన్ని ఏర్పరచింది. దీనినే అక్టోబరు విప్లవమనీ, నవంబరు విప్లవమనీ అంటారు.

ఈ విప్లవంద్వారానే మొట్టమొదటి సోషలిస్టు ప్రభుత్వం సోవియట్ యూనియన్ ఏర్పడింది.

దీనితోనే జారు నిరంకుశ పరిపాలన నిర్మూలితమైనది.

**బ్రిటిష్ అధినివేశాలు British Dominions**

బ్రిటిష్ కామన్వెల్తులోని సభ్యదేశాలకు అధినివేశాలు అని పేరు. ఇవి స్వపరిపాలితములవుతూ జార్జిరాజుకు విధేయంగా ఉంటవి. ఒక్క ఇండియామాత్రం 1950 జనవరి 26 న రిపబ్లిక్‌గా ప్రకటింపబడినది. అయినా కామన్వెల్తులో సభ్యదేశంగా ఉంటున్నది.

మిగతవి కనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజిలండు, పాకిస్తాన్, అల్‌స్టర్ ఒకభాగం.

**భూస్వాములు Land - lords**

భూమిపై సర్వాధిపత్యం వహిస్తూ, రైతులతో శిస్తు వసూలుచేస్తూ ప్రభుత్వానికి ఏదో నిర్దిష్టమైన పన్ను కడుతుంటారు. వేలయెకరాల

పొలం వీరిక్రింద ఉంటుంది. సేద్యంచేసే రైతుకు భూమిపై ఏహక్కూ వీరిక్రింద ఉండదు.

ఇండియాలోని జమీందారులు, జాగీర్దార్లు, సంస్థానాధిపతులుకూడ ఈ వర్గంలోనివారే.

భూస్వామ్య విధానం (ఫ్యూడలిజం)

భూ స్వాముల పరిపాలనగల సంఘవ్యవస్థ. ఇందులో వ్యవసాయం ప్రధానంగా ఉంటుంది. భూమి భూస్వాములక్రింద కేంద్రీకృతమై ఉంటుంది. 1789లో ఫ్రెంచి విప్లవం వచ్చేవరకూ ఈ వ్యవస్థే యూరోపులో ఉన్నది క్రామ్వెల్‌క్రిందనే ఈ వ్యవస్థకు ఇంగ్లాండు స్వస్తి చెప్పింది.

ఆధునిక పరిశ్రమలవ్యాప్తితో భూస్వామ్యవిధానంపోయినా, ఇంకా దీని శిథిలావశేషాలు చాల దేశాలలోనున్నవి. ఇండియాలో మరీ ఎక్కువగా ఈ అవశేషాలు కనిపిస్తాయి.

మలయా

బ్రిటిష్ వలసదేశం. ధన సమృద్ధమైన దేశం. జనాభా 45 లక్షలు దాదాపు, ప్రాంతం 51వేల చ॥ మైళ్లు.

దీనిని రెండవ ప్రపంచ యుద్ధంలో జపాను ఆక్రమించుకొన్నది. తిరిగీ ఇది జపాను పరాజయంతో బ్రిటన్‌క్రిందికి వచ్చినది.

అక్కడిప్రజలు తమకు స్వతంత్ర ప్రతిపత్తి కావాలని కోరడంతో బ్రిటన్ దారుణ నిర్బంధవిధానం కొనసాగిస్తున్నది. ఇప్పుడు గెరిల్లా దళాలు మలయాఅంతటా బ్రిటన్‌తో యుద్ధం కొనసాగిస్తున్నవి.

ఇందులో ఉత్పత్తిఅయ్యే రబ్బరు, సత్తు. 1934లో ప్రపంచం మొత్తంమీద ఉత్పత్తిఅయ్యే సత్తులో 35 వంతులిక్కడే అయ్యేది. బ్రిటిష్‌వారిక్రింద చాల తోటలున్నవి.

మంచూరియా

చైనాలోని ఒకరాష్ట్రం. 4,60,000 చ॥ మైళ్లు మూడుకోట్లు జనాభా. 1931 సెప్టెంబరు 18న జపాను మంచూరియాను ఆక్రమించసాగింది.

మంచూరియాను జెహోరురాష్ట్రాన్ని కలిపి జపాను 1932 ఫిబ్రవరి 18న, మంచూకో అనేపేర కొత్తరాజ్యాన్ని నెలకొల్పింది. 1911 లో చైనా నుండి తరిమివేయబడిన మంచూ వంశం పూయిని అధ్యక్షుడుగా ప్రకటించారు. జపానుకీలుబొమ్మగా ఈప్రభువూ ప్రభుత్వమూ ఉండేవి.

రెండవ ప్రపంచ యుద్ధంలో ఆఖరున సోవియట్ సేనలు మంచూరియాను విముక్తంచేసినవి, తర్వాత ఈ ప్రాంతం జంగ్ కై షేక్ స్వాధీనమైనది.

మావ్ సే టుంగ్ నాయకత్వంక్రింద కమ్యూనిస్టు సేన మంచూరియాను విముక్తం చేసింది. నేడీరాష్ట్రం యథాపూర్వంగా చైనా నూతన ప్రజాతంత్ర రిపబ్లిక్కులోని భాగంగా ఉన్నది.

దీని సరిహద్దులోనున్న కొరియాలోనే 1948 లో యుద్ధం చెలరేగినది. మంచూరియా రక్షణకై చైనా సేనలు పోరాడుతున్నవి. 1951 జులై ఆఖరున ఇప్పుడా యుద్ధసమాప్తికై మంతనాలు సాగుతున్నవి.

**మిలియన్**

పది లక్షలు.

**మెరపుయుద్ధం** Blitzkrieg (Lightning War)

ఒక్కఊపున మెరపులా శత్రువుపై విరుచుకపడి చావుదెబ్బతీసే పద్ధతిని మెరపు యుద్ధమంటారు. హిట్లర్ యుద్ధపద్ధతి నిది సూచిస్తూ వచ్చింది. 1939–41వరకు యూరోపు రణరంగా లన్నిటా నాజీసేన ఈ పద్ధతినే అవలంబించింది. విమానాలద్వారా బ్రిటన్‌పైకూడ 1940 లో ఆరంభించినా ఈవిధానం ఫలవంతంకాలేదు.

1941లో రష్యాపైచేసిన ఈ దాడికూడ ఇలాగే భగ్నమైనది.

**మెరపు విజయం** Blitz Victory

శత్రువు తిరుగుదెబ్బ తీసేందుకు ఏమాత్రం అవకాశం ఈకుండా మెరపుదాడితో ఒకేతూరి శత్రువును పడగొట్టి సాధించే విజయం.

**మెరపు దాడి** Blitz Attack

అకస్మాత్తుగా గభాలున శత్రువు తయారుకాకముందే అతను తెప్పరిల్లుకునే అవకాశం యివ్వకుండా చేసేదాడి.

మొదటి ప్రపంచ యుద్ధం First World War

1914నుండి 1918వరకు జరిగిన యుద్ధం బ్రిటన్, ఫ్రాను, రష్యా, ఆఖరున అమెరికా ఇటలీ మొదలైన మిత్రదేశాలు కైజర్ జర్మనీతో యుద్ధంచేశాయి. ఆఖరున రష్యాలో విప్లవంవచ్చి సోవియట్ రష్యా యుద్ధంనుండి విరమించుకున్నది.

ఈ యుద్ధంలో జర్మనీ ఓడిపోయింది. విజయానంతరం వర్సైల్సు సంధిద్వారా శాంతి సమాధానం ఏర్పడింది.

మొరాకో Morocco

దాదాపు 213,000 చ॥మై॥, జనాభా సుమారు 7,00,000. ఆఫ్రికా వాయవ్యమూలలో ఉన్నది. దీనికోసం యూరపియన్ రాజ్యాలు చాల కాలం పోట్లాడుకుంటూ వచ్చారు. జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సుల మధ్య తగాదాలు వచ్చాయి. బ్రిటన్ 1904లో ఫ్రాన్సు పలుకుబడి నిక్కడ అంగీకరించినది. జర్మనీ తనపెత్తనంకోసం బయలుదేరింది. 1911లో యుద్ధం తప్పనట్లు కనిపించినా ఆఖరున జర్మనీ ఫ్రెంచి సంధి జరిగి ఫ్రెంచి మొరాకోగా తేలింది.

1912తర్వాత మూడుభాగాలుగా విభక్తమైంది. ఫ్రెంచి ప్రాంతం, స్పానిష్‌ప్రాంతం, తటస్థటాంజీర్ ప్రాంతం. ఫ్రెంచిప్రాంతమే దాదాపు మొరాకోఅంతా.

1940 జూన్‌లో తటస్థ ప్రాంతాన్ని స్పెయిన్ ఆక్రమించింది. స్పానిష్ సేనాని సర్వాధిపత్యం వహించాడు. 1941 లో బ్రిటన్ స్పెయిన్‌తో ఒకఒడంబడిక చేసుకుంది. టాంజీర్ ప్రాంతాన్ని సేనావారంగా చేయనని, బ్రిటిష్ ప్రజలకు రక్షణ ఇస్తానని స్పెయిన్ ఒప్పుకుంది

సుల్తాను పేరుకుఉన్నా అసలు ఫ్రెంచి రెసిడెంటు జనరల్‌దే ఫ్రెంచి ప్రాంతంలోని అధికారమంతా.

బెర్బర్లు అనేవారు ఇక్కడిప్రజలు వీరు మొరెబిఅనే అరబిక్ వికృతి భాషను మాట్లాడుతారు.

1938 సెప్టెంబర్ 29లో మ్యూనిచ్‌లో జర్మనీ. బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీలు చేసుకున్న ఒడంబడిక. జెకొస్లొవేకియాలోనిసుడెటాన్ జర్మన్ జిల్లాను జర్మనీకి ఈ ఒడంబడిక ద్వారా అప్పగించడం జరిగింది. హిట్లరును సంతోషపెడుతూ వస్తూన్న ఛెంబర్లన్ విధానానికి తలమానికం—దీనితో అక్టోబరు 1తేదీ హిట్లర్‌సేన జెకొస్లొవేకియాలోనికి ప్రవేశించింది. ఇంతతో తృప్తిచెందక 1939 మార్చిలో హిట్లర్ ఈ ఒడంబడికనుకూడ భగ్నంచేసి మిగత జెకొస్లొవేకియాను ఆక్రమించాడు.

యుద్ధోత్పత్తి విధానం

ఆర్థిక వ్యవస్థనంతటిని యుద్ధాన్ని దృష్టిలోఉంచుకొని శాంతి సమయంలో అందుకనుగుణంగా నడిపించడం.

యుద్ధానికి అనుకూలంగా పారిశ్రామిక, వ్యావసాయిక ఉత్పత్తిని ఒక ప్రణాళికకు అనుగుణంగా నడిపించడం.

రీచ్‌స్టాగ్ Reichstag

జర్మనీ పార్లమెంటుకు పేరు.

యూరోపు భూఖండం

దీవులుకాక యూరోపు భూ ఖండమంతా.

ఫ్రాన్సు, జర్మనీ, స్పెయిను, పోర్చుగల్, స్విట్జర్లాండు, ఆస్ట్రియా, హాలెండు, డెన్మార్కు, నార్వే, స్వీడెన్, ఇటలీ, జెకొస్లొవేకియా, గ్రీసు, బల్గేరియా, పోలెండు, రుమేనియా, లిథుయేనియా, లాట్వియా, ఇస్తోనియా, ఫిన్లాండు, సోవియట్ యూనియన్‌లోని యూరోపియన్ భాగం వేరుగానే పేర్కొంటూ ఉంటారు.

రెండో ప్రపంచ యుద్ధం

1939 సెప్టెంబరు 3వ తేదీ బ్రిటన్, ఫ్రాన్సులు జర్మనీతో యుద్ధం ప్రకటించడంతో ఆరంభమయింది.

అసలు దీనికారంభం 1931లో జపాను మంచూరియా నాక్రమించడంతో. 1935 ఇటలీ అబిసీనియా నాక్రమించింది. 1938 జర్మనీ జెకొస్లొవేకియా ఆస్ట్రియాను ఇలా వరుసగా మింగుతూ 1939 సెప్టెంబరు

1న పోలెండుపైపడ్డం తర్వాత ప్రపంచ యుద్ధంగా మారింది. పెరల్ హార్బర్‌పై జపాను దాడితో అమెరికా. జర్మనీ 1940 జూన్‌లో దాడి చేయడంతో రష్యా, ఇందులో చేరాయి.

సోవియట్ యూనియన్, అమెరికా, బ్రిటన్, చైనాలు ముఖ్యంగా ఒకవేపు,—హిట్లర్‌జర్మనీ, ఇటలీ, జపాను ముఖ్యంగా మరొకవేపు యుద్ధంలో పాల్గొన్నాయి.

ఆఖరున సోవియట్ అమెరికా, బ్రిటన్ చైనాలు ఇతర ఆక్రమిత ప్రాంతాలలోని ప్రజాసైన్యాలు చేరి ఫాసిజాన్ని పరాజితం చేశాయి.

1945లో మిత్రరాజ్యాలు గెలిచాయి. విజయోత్సవాలు జరిగాయి.

"రెండువందల కుటుంబాలు"

ఒకొక్క దేశంలోను కొన్ని ముఖ్యమైన కుటుంబాలు పూర్తిగా ఆర్థిక రాజకీయ జీవితాన్ని తమ గుప్పిట పట్టుకోవడం జరుగుతుంది. బ్రిటన్‌లో మూడువందల కుటుంబాలు, జర్మనీలో రెండు వందల కుటుంబాలు ఇలా సర్వశక్తివంతమైన అధికారం కలిగి అన్నిటినీ ఆక్రమించి ప్రజాపీడనను సాగించేవి. వీనినే "రెండు వందల కుటుంబాల" పాలన అని ఈ పుస్తకంలో ప్రస్తావించబడినది.

లిబరల్ పార్టీ Liberal Party

18, 19 శతాబ్దులలోని విగ్‌పార్టీలో ఏర్పడిన ఇంగ్లాండులోని రాజకీయ పక్షం. ఒకప్పుడు రెండవ పార్టీగా ఉన్నదికాని, మొదటి ప్రపంచ యుద్ధంతర్వాత కన్సర్వేటివ్‌లకు లేబర్‌పార్టీకి మధ్య అణచివేయబడింది. నేడుకూడ దీనికంతప్రాబల్యంలేదు. సోషలిజం కమ్యూనిజమంటే గిట్టదు. స్వేచ్ఛావ్యాపారం కావాలంటుంది. దామాషా ఓటింగు పద్ధతి నంగీకరిస్తుంది. లాయడ్ జార్జి ఈ పార్టికి చెందినవాడే. రెండో యుద్ధంలో 1940జూన్‌లో చర్చిల్ ప్రభుత్వంలో వీరూ చేరారు.

లెనిన్ Lenin

మార్క్స్‌తర్వాత ప్రఖ్యాతకమ్యూనిస్టు సిద్ధాంతవేత్తా,నాయకుడూ. 1870 ఏప్రిల్ 22 జననం. కాలేజిటీచరు కొడుకు, లాయరయ్యాడు.

కార్మికోద్యమంలోచేరి ఉల్యినాఫ్ అనేపేరును లెనిన్‌గా మార్చుకున్నాడు. ఖచ్చితమైన మార్క్సిస్టు. రష్యన్ సోషలిస్టు పార్టీలో అతివాద వర్గానికి నాయకత్వం వహించి 1903లో బోల్షివిక్ (కమ్యూనిస్టు)పార్టిని నిర్మించాడు. 1907_1917లల్లో పారిస్, వియన్నా, జూరిచ్‌లలో ప్రవాసిగా ఉన్నాడు. 1914 లో సామ్రాజ్యవాదాన్ని సోషలిస్టులు బలపరచడాన్ని ఖండించాడు. 1917విప్లవ సమయంలో రష్యాకు తిరిగివచ్చి, విప్లవాన్ని విజయవంతంగా నడిపి శ్రామిక నియంతృత్వం ఏర్పరచి మంత్రివర్గానికి అధ్యక్షుడయ్యాడు. సామ్రాజ్యవాదులందరు కలిసి అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టగా 1921కల్లా విజయవంతంగా కమ్యూనిస్టుపార్టీ బయలుపడినది. మూడవ ఇంటర్నేషనల్‌ను స్థాపించాడు.

1922లో సోషల్ రెవల్యూషనరీపార్టికి చెందిన ఒక స్త్రీ లెనిన్‌ను కాల్చి గాయపరిచించి. ఆతర్వాత చాల బలహీనపడ్డాడు. పైగా నిరంతర శ్రమా కలిసి 1923 లో చాల జబ్బుపడ్డాడు. 1924 జనవరి 21 న మరణించాడు.

ఈయన శరీరాన్ని అలాగే రసాయన ద్రవ్యాలద్వారా భద్రపరచి మాస్కోలోని లెనిన్ సమాధిలో ఉంచారు. ఆయనపేర పీటర్సుబర్గును లెనిన్‌గ్రాడ్ అంటారు, ఆయన దేహాన్నిప్పటికీ వేలకొలది వెళ్లి దర్శించి వస్తుంటారు.

ఈయన సిద్ధాంతాలు: మార్క్స్ చేసిన సంఘమీమాంసనీయన అప్పటివరకు వచ్చిన మార్పులతో రంగరించి విప్లవమార్గాన్ని చూపాడు. ధనికతత్త్వం సామ్రాజ్యతత్త్వంగా ఎలా మారుతుందో వివరించాడు. సంస్కరణవాదాన్ని తుత్తునియలు చేసి విప్లవపథాన్ని అనుగమించాలన్నాడు. ఎప్పటికప్పుడు మార్క్సిజాన్నెలా సజీవ జీవనజ్యోతిగా, మార్గదర్శిగా చేయాలో చూపుతూ వచ్చాడు. శ్రామికనియంతృత్వ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టిచూపాడు.

ఈయన రచనలు లెనిన్ రచనలన్న పేర చాల సంపుటాలుగా ప్రకటితమైనవి. సామ్రాజ్యతత్త్వం, రాజ్యాంగయంత్రం, ఏం

చెయ్యాలి, ఒకడుగు ముందుకూ రెండడుగులు వెనక్కూ, అతివాద కమ్యూనిజం ఒక శిశురోగం, మొదలైనవి ఈయన పుస్తకాలు.

లేబర్ పార్టీ Labour Party

బ్రిటిష్ సోషలిస్టుపార్టీ, రెండవ ఇంటర్నేషనల్‌లో సభ్యత్వం కలది. 1924 లోను 1929 లో మైనారిటీలో ఉన్నా ప్రభుత్వాన్ని నిర్మించింది. 1931 లో మాక్డనాల్డు కన్సర్వేటివ్‌లే ఎక్కువగా ఉన్న ప్రభుత్వానికి ప్రధానిగా ఉన్నాడు. అతనిని పార్టీలోనుంచి తొలగించారు. యుద్ధకాలంలో సంయుక్త ప్రభుత్వంలో ఈపార్టీ పాల్గొన్నది.

తిరిగీ 1945 ఎన్నికలలో లేబల్‌పార్టీకి కావలసినంత మెజారిటీ వచ్చింది, అట్లీ ప్రధాని అయ్యాడు. తిరిగి 1950 లో జరిగిన ఎన్నికలలో కూడ లేబర్‌పార్టీకి అధిక సంఖ్య వచ్చి ప్రభుత్వాన్ని అట్లీ ప్రధానిగా ఏర్పరచగలిగిగాడు. విదేశాంగ విధానంలో వీరుకన్సర్వేటివ్ విధానాన్నే అవలంబిస్తున్నారని దేశంలో పెద్ద పరిశ్రమలను జాతీయం చేయాలన్న తమపాలసీని అతినెమ్మదిగా అమలుజరప జూస్తున్నారని అతివాదులు విమర్శ చేస్తారు.

మలయా వగైరాలలో స్వతంత్రోద్యమాలను యథావిధిగా అణచివేయజూస్తున్నారని వలస ప్రజల విమర్శ.

ఇప్పుడు అమెరికాకు తోకగా తయారవుతున్న బ్రిటిషు విధానాన్ని లేబర్‌పార్టీ అవలంబిస్తున్నందన ఆ పార్టీలోనే అతివాదులు బెవాన్ నాయకత్వం కింద తీవ్రంగా అధిక్షేపిస్తున్నారు.

వస్తూపయోగం Consumption

ప్రజల కొనుగోలుశక్తినిబట్టి వారు వస్తువుల నుపయోగిస్తారు. వస్తూపయోగం వృద్ధిచెందాలంటే జీవనస్థాయి పెరగాలి. అందుకు అసలు జీతాలు పెరగాలి. నోట్లముమ్మరం తగ్గాలి, ధరలు కంట్రోలు చెయ్యాలి.

ప్రజల వస్తూపయోగం పెరిగితేనే పారిశ్రామిక వస్తువులకు గిరాకీ, అమ్మకం పెరుగుతుంది.

వాగ్నర్ ముగ్రేబిల్లు

అమెరికాలో కార్మికుల యజమానుల సంబంధాలను గురించి తయారుచేసిన బిల్లు—

విప్లవం Revolution

మార్క్సు వివరించిన చరిత్రగతి ప్రకారం సంఘంలో రెండువర్గాలు ఏర్పడతాయి. ఒకవర్గం ఉత్పత్తిసాధనాలను తనచేత నుంచుకొంటుంది. ఉత్పత్తి సంబంధాలే వర్గాలనేర్పరుస్తాయి. కొంతకాలానికి పీడితవర్గం బలం చేకూర్చుకుని, ఇక ఈ పీడన నోర్చుకొనలేక ఒక్కసారిగా తన సంకెళ్లను విడగొట్టుకొనేందుకు విశ్వరూపం తాల్చి విదిలించుకుంటుంది. అప్పుడే విప్లవాలు వస్తాయి. తర్వాత ఈ పీడితవర్గం అధికారానికి వస్తుంది. ఇలాగే యజమానులు, బానిసలు. భూస్వాములు, రైతులు వీరిమధ్య వర్గపోరాటాలు నడిచి విప్లవాలు వచ్చాయి. నేటి పారిశ్రామిక విప్లవంతర్వాత ధనికవర్గానికీ. కార్మికవర్గానికీ మధ్య వర్గపోరాటం సాగుతున్నది.

ఇందులో పెట్టుబడి కొందరి చేతులలోనే కేంద్రీకరింపబడడం ధనికవర్గం అత్యల్పసంఖ్యాక వర్గమవుతుంది, మధ్యతరగతులు కూడ క్రమంగా కార్మికులలో కలిసిపోతారు. కార్మికులు సోషలిస్టు విప్లవం నడిపి ఉత్పత్తి సాధనాలను సంఘపరం చేసి సోషలిస్టువ్యవస్థ నేర్పరుస్తారు.

క్రమపరిణతికాక, ఒక్కమారుగా వచ్చే పెద్ద మార్పు విప్లవమన్నమాట.

విప్లవ ప్రతిఘాతకులు Counter Revolutionaries

విప్లవసమయంలో పీడిత శ్రామికవర్గం వేపు చేరక, సంఘం మార్పున కంగీకరించక అభివృద్ధి నిరోధకవర్గాలతో చేరి పనిచేసేవారు.

వెర్విర్‌ట్ షాప్టు

నాజీపాలనకాలంలో వాడుకలోకి వచ్చినమాట. దీనిఅర్థం యుద్ధ ఆర్థికనిధానం అంటే ఖచ్చితంగా ఉండదు, దీనిని శాంతిసమయంలో

అమలుజరిపారు. సరిగా మాటలకర్థం రక్షణఆర్థిక విధానం అని. కాని అలా అంటేచాలదు. యుద్ధదృష్టితో ఆర్థిక విధానాన్నంతటిని నడపడమే ఇది. దీనికి సరైనపదం ఆంగ్లోశాక్సన్ రాజ్యాలలోలేదు. జర్మనీలో యుద్ధం రావడానికి ఎన్నో ఏళ్లముందే ఆర్థికవ్యవస్థ పూర్తిగా దురాక్రమణ యుద్ధానికి అనుగుణంగా నడపబడింది. ఇట్టి ఆర్థికవిధానాన్ని వెర్విర్ట్ షాఫ్ట అంటారు—

**సమగ్రయుద్ధం** Total War

పారిశ్రామిక, ఆర్థిక, సాంఘిక, రాజకీయాది జీవితరంగాలన్నిటిని వ్యాపించిన యుద్ధం, దేశీయ సహజ ధన జనాంగబల సంపత్తినంతటిని సమీకరించి చేయవలసిన యుద్ధం.

**సయాం**

దూరప్రాచ్యంలోని దేశం. దీనినే థాయిలాండు అని కూడ అంటారు. ఆగ్నేయాశియాలో బర్మాకు ప్రక్కగానున్న దేశం. నామకః స్వతంత్రంగా ఉన్న రాచరిక ప్రభుత్వం ఉందిక్కడ.

**సంఘ వైషమ్యాలు**

సంఘంలో శ్రమశక్తి నమ్ముకునేవారు, అలా ఇతరులశ్రమనుపయోగించుకొని ఉత్పత్తి సాధనాలను తమ చేతనుంచుకొని ధనాన్ని సేకరిస్తూ, లాభాలు గడించేవారు అనే వర్గాలున్నంతవరకు పరస్పరం వారిమధ్య వైరుధ్యాలు, వైషమ్యాలు తప్పవని సోషలిస్టులమతం.

**సాంఘిక శాసననిర్మాణం**

సంఘంలో సామరస్యాన్ని నెలకొల్పేందుకై చేసే శాసనాలను సాంఘిక శాసనాలంటారు—వారి తయ్యారీ సాంఘికశాసన నిర్మాణమన్నమాట.

**సామ్రాజ్యవాదం** Imperialism

పెట్టుబడిదారులు తమకు కావలసిన ముడి సరుకులకోసం, తాము ఉత్పత్తిచేసే సరుకులకు మార్కెట్టుకోసం ఇతర దేశాలను తమకు వలసలుగా చేసుకొనజూస్తారు. అందుకై వారు యుద్ధాలను రెచ్చగొట్టి

దేశాలను దురాక్రమిస్తారు. ఈ ధోరణినే సామ్రాజ్యవాద మంటారు. తా మాక్రమించుకున్న దేశాలలో పరిశ్రమలనుపెంపొందనీకుండాచూస్తారు. ఈ పోటీలో విభిన్న సామ్రాజ్యవాదాలకు పోటీవచ్చి వీరిమధ్య తీవ్ర యుద్ధాలు చెలరేగుతాయి.

ప్రథమ మహాయుద్ధం ఎలావచ్చిందో. అలాగే రెండవయుద్ధంలో కొత్తగా బయలుదేరిన నాజీఫాసిస్టు సైనికశక్తులు తమకు వలసలకోసం దురాక్రమణ యుద్ధాన్ని కొనసాగించారు.

నేటికీ బ్రిటన్, ఫ్రాన్సు, పోర్చుగల్, డచ్చి సామ్రాజ్యాలు వలస లను పీడిస్తూనే ఉన్నవి. తమ ఆర్థిక సామ్రాజ్య విధానాన్ని అమెరికా అమలుజరుపుతునే ఉన్నది.

పీడిత అస్వతంత్ర ప్రజానీకం సంఘటితమై సామ్రాజ్యవాదంతో పోరాడుతునే ఉన్నది.

సిలోన్

ఇండియాకు దక్షిణాగ్రంలోనున్న దీవి. పోర్చుగీసు, డచ్చివారి తర్వాత ఈ దీవిని బ్రిటిష్‌వారు స్వాధీనం చేసుకున్నారు. 1796 లో దీనిని మదరాసు రాష్ట్రంలో చేర్చారు. కాని 1802లో ఇండియానుండి వేరుచేసి క్రౌన్‌కాలనీగా చేశారు. 1931 లో రాజ్యాంగ సంస్కరణలు జరిగినవి, రెండవ యుద్ధంతర్వాత దీనికి అధినివేశ ప్రతిపత్తి నిచ్చినట్లు ప్రకటనలు జరిగినా ఇది ఇప్పటికీ బ్రిటన్‌కు లోబడిన వలసదేశమే.

ఇంగ్లాండులో సగంవైశాల్యంకల దీవి. 53లక్షలు దాదాపు జనాభా. ఇందులో సింహాళీయులు, తమిళులు ప్రధానజాతులు.

ఈ దీవిలో అయిదింట నాలువంతులు అటవీ ప్రాంతం. బియ్యం వీరు దిగుమతి చేసుకోవాలి. కాఫీ తేయాకు తోటలలో భారతీయులు కూలీలుగా పనిచేస్తున్నారిక్కడ.

భారతీయులను తొలగించాలని. తరిమివేయాలని, పౌరహక్కులు వారికివ్వగూడదని అక్కడ కొత్తగా ఏర్పడిన ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిస్తున్నది,

సోవియట్ యూనియన్

యూనియన్ అఫ్ సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్కు అనే పేరునకు సంక్షిప్తరూపం-వైశాల్యం 9,127,000 చ॥మై॥ జనాభా 19 కోట్ల 30 లక్షలు దాదాపు.

1917 నవంబరు 7 విప్లవం వచ్చాక రష్యన్ సోషలిస్టు ఫెడరేషన్ సోవియట్ రిపబ్లిక్కు ఇందులో చేరినవి.

సోవియట్ యూనియన్ చరిత్ర లెనిన్ స్టాలిన్ల చరిత్రతోను కమ్యూనిజం చరిత్రతోను అనుబద్ధమై ఉన్నది.

1936 లో స్టాలిన్ రాజ్యాంగచట్టం అమలులోనికి వచ్చినది. సోవియట్లన్నీ ప్రజలతో ప్రత్యక్షంగా ఎన్నుకోబడతాయి. సుప్రీం సోవియట్ అత్యున్నత శాసననిర్మాణసంస్థ. ఇందులో రెండు సభలు. యూనియన్‌కౌన్సిల్ (ప్రతి 3 లక్షలమంది కొకప్రతినిధి) రెండవది జాతులసమితి (ప్రతి రిపబ్లిక్కుకూ 24 గురు సభ్యులు) ఒక అధ్యక్షుని, ప్రతి రిపబ్లిక్కు 12 సభ్యులను ఈ కౌన్సిల్ ఎన్నుకుంటూ అలాగే మంత్రివర్గాన్ని ఎన్నుకుంటుంది. స్టాలిన్ మంత్రివర్గానికి అధ్యక్షుడు.

ఆర్థికవ్యవస్థ సోషలిస్టుపద్ధతికి చెందినది. పరిశ్రమలు సంఘానికి చెందినవి. ఉత్పత్తి పంపకాలు దేశం మొత్తంమీద ప్రణాళికాబద్ధములై నడుస్తాయి, వ్యవసాయం సమష్టివ్యవసాయ క్షేత్రాలద్వారా యాంత్రికమై నడుస్తుంది. ఒకరిని పనికిపెట్టుకొని పీడించి లాభం సంపాదించే వీలులేదిక్కడ.

రెండవయుద్ధంలో హిట్లర్ సైన్యాలను చావుదెబ్బతీసిన సోవియట్ తదనంతరం ఉత్పత్తి వినియోగాలను ప్రణాళికలద్వారా అత్యుత్తమ పద్ధతిలో నడుపుతూ ప్రజల జీవనస్థాయిని పెంచుతున్నారు. శాంతి సౌభాగ్యాలకోసం అహోరాత్రులూ శ్రమిస్తున్నారు.

స్పెయిన్ Spain

1,95,000 చ॥ మై॥ వైశాల్యం. జనాభా 2 కోట్ల 40 లక్షలు అఫ్రికాలోని భాగాలతో కలిపితే మరి 40 లక్షలెక్కువ.

1921 దాకా రాచరిక ప్రభుత్వం. అందులో 1925 నుండీ దాదాపు జనరల్ ప్రైమోడివెలరా నిరంకుశ నియంతృత్వం క్రింద ఉన్నది. 1931 ఏప్రిల్‌లో నియంతృత్వం తొలగింపబడి రిపబ్లిక్ ఏర్పడింది. అల్ఫోన్సోరాజు దేశం వదలిపెట్టాడు. 1936 ఫిబ్రవరి ఎన్నికలలో అతివాదులు గెల్చారు. ప్రజాసంఘటనకు 277 స్థానాలు, మితవాదులకు 132 స్థానాలు మధ్యపక్షులకు 32 వచ్చాయి. 1436 మే॥న అజనా అధ్యక్షుడయ్యాడు. సోషలిస్టులు, కమ్యూనిస్టులు లేకుండా రిపబ్లిక్ ప్రభుత్వాన్నేర్పరచాడు.

భూసంస్కరణలు వగైరాలను ప్రభుత్వం అమలు జరిపింది. భూస్వాములు అభివృద్ధినిరోధకులు దీన్ని నిరోధించారు.

1936 జులై 18 న అభివృద్ధినిరోధక బలంతో జనరల్ ఫ్రాంకో ప్రభుత్వంపై తిరుగుబాటు చేశాడు. జర్మనీ ఇటలీ ఫాసిస్టు శక్తులతనికి ప్రోత్సాహ ప్రోద్బలాలిచ్చాయి. స్పెయిన్ అంతర్యుద్ధం మూడేళ్లు జరిగింది. సమష్టి రక్షణకు సమాయత్తం కావాలన్న ప్రజావాణిని బ్రిటన్ ఫ్రాన్సులు వినలేదు. ఆఖరుకు 1939 మార్చిలో ఫ్రాంకో గెలిచాడు. మిలిటరీ నియంతృత్వం ఏర్పరచాడు. గత రెండవ ప్రపంచయుద్ధంలో అక్షరాజ్యాలకతడు ప్రాపుగానున్నాడు. బాహాటంగా యుద్ధంలోకి దిగకున్నా, ఇతని వైఖరిని చూచి మిత్ర రాజ్యాలు ఇతనితో మైత్రిని నెరపలేదు.

కాని తిరిగీ ఇప్పుడు (1951) ఫ్రాంకో స్పెయిన్‌ను అట్లాంటిక్ రాజ్యాలకూటమిలో చేర్చాలని అమెరికా రాయబారాలు నడుపుతున్నది. బ్రిటన్, ఫ్రాన్సులుకూడ ఇందుకు విముఖంగా నున్నవి. సోవియట్ మీది ద్వేషంతో ఫాసిస్టు బిడ్డడైన ఫ్రాంకోతో సంప్రతింపులు నడిపేందుకు చేతులు కలిపేందుకు అమెరికా సిద్ధపడింది.

## స్పెయిన్ అంతర్యుద్ధం

1936జులైలో స్పానిష్‌మొరాకోలో జనరల్ ఫ్రాంకో తిరుగుబాటు చేయడంతో ఆరంభమయింది. స్పెయిన్‌లోని సైనిక స్థావరాలన్నీ

దాదాపు రెండవరోజే తిరుగుబాటుచేశాయి. తిరుగుబాటుదారులు దక్షిణం లోను, వాయవ్యంలోను అధికారం లాక్కున్నారు. ప్రజాసంఘటన ప్రభుత్వం ఉత్తర మధ్య తూర్పు భాగాలలో తిరుగుబాటు నణచివేయ గలిగినది. ఫ్రాన్సును ఆయుధాలకై ప్రభుత్వం కోరినది. కాని ఫ్రెంచి ప్రభుత్వం నిరాకరించింది. మరిజర్మనీ ఇటలీలేమో ఫ్రాంకోకు ఆయుధా లంపుతూ వచ్చినవి. ఈబలంతో కేవలం దేశభక్తిమాత్రమే ఆయు ధంగాకల మిలిషియాను ఇతను మాడ్రిడ్‌కోటవాకిలివద్దకుతరమగలిగాడు. దేశదేశాలనుంచి స్వచ్ఛంద సేవకులెందరో కలిసి అంతర్జాతీయదళాన్ని ఏర్పరచి స్పెయిన్ ప్రజాప్రభుత్వ పక్షన నిలిచి పోరాడారు. వీరిలో రాల్ఫ్‌ఫాక్స్, కాడ్వెల్‌లాంటి మహా మేధావులు రచయితలు ఉన్నారు.

2 1/2 సంవత్సరాలు ఫ్రాంకో మాడ్రిడ్‌నుముట్టడించాడు. జర్మనీ టాంకులను, ఫిరంగులను, విమానాలను, సైనిక నిపుణులను ఫ్రాంకోకు పంపినది. ఇటలీ లక్షసైనికులను పంపింది. యుద్ధసమయంలో అంతర్జా తీయ దళం 30వేలవరకు పెరిగింది. రిపబ్లిక్కునకు రష్యా టాంకులను విమానాలను పంపి సాయపడినది. కాని మిగత ప్రజాస్వామిక రాజ్యా లనేవి రిపబ్లిక్ ప్రభుత్వానికి సాయపడక తటస్థ విధానంపేర ఫాసిజానికి స్పెయిన్నుబలిచేసినవి. అరాచకవాదులు ప్రభుత్వంతో విభేదాలుచూపారు. తీవ్రవాద ప్రభుత్వంపోయి మితవాద ప్రభుత్వం ఏర్పడింది. అయినా ఫ్రాంకో దురాక్రమణ ఆగలేదు.

1937లో బిల్బోతోపాటు బాస్కో ప్రాంతాన్ని ఫ్రాంకో ఆక్రమిం చాడు. 1938లో అతని సేనలు టెరూల్‌నుండి మధ్యధరా సముద్రాన్ని చేరి రిపబ్లిక్ స్పెయిన్‌నుండి కటలోనియాను వేరుపరచివేశాయి. 1938 డిసెంబరు 24తేదీ ఫ్రాంకో కటలోనియాపై పెద్దయెత్తున దాడిజరిపాడు. ఆఖరుకు రిపబ్లిక్ బలం శిథిలమయి మూడువారాలలో బార్సిలోనా పతన మయినది. 1939 ఏప్రిల్ 4వ తేదీ మాడ్రిడ్‌పట్టణం, మధ్యరంగం ఫ్రాంకోకు లొంగిపోయినది.

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | AAL02D199 | **Date** | 4/1[illegible]/2121 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | CI, ii, vi, xvi, 10, 142, 144, 314, 401 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared** | K. Yameema | **Scanned** | Lakshmi |
| **BOOK SIZE** | H 7.3 W 5.1 | **Pages** | 470 |

